# పొక్కిలి
## (తెలంగాణ కవిత)

(నూట ఇరవై తొమ్మిది మంది
తెలంగాణ కవుల ప్రాంతీయాత్మ)

ప్రచురణ : స్పృహ సాహితీ సంస్థ,
కోదాడ, నల్లగొండ జిల్లా - 508 206

కవర్ పేజి
లోపల పేజీల చిత్రాలు : లక్ష్మణ్ ఏలే

ప్రచురణ కాలం : మే, 2002

ప్రతులు : 2000

ప్రతులకు : జూలూరు గౌరీశంకర్
జర్నలిస్ట్
నయానగర్, కోదాడ - 508 206.
నల్గొండ జిల్లా.

వెల : 100 రూపాయలు

ముద్రణ : సాయితేజ ఆఫ్‌సెట్, కోదాడ

ఫోన్ : 08683 - 50699

# తెలంగాణ జీవిత చిత్తరువు 'పాక్కిలి'

తెలుగు సాహిత్యంలో తెలంగాణాకు జరిగిన అన్యాయాన్ని ప్రశ్నించడం వరకే సాహిత్యకారులు ఆగిపోవడం లేదు. తమ స్వరాన్ని వినిపించడానికి తగిన కార్యాచరణతో ముందుకు వస్తున్నారు. వివక్షను నిరసించడం వరకే నిలిచిపోలేదు. తమ అస్తిత్వాన్ని, ఉనికిని బలంగా చాటడానికి సమీకృతమవుతున్నారు. ఈ ప్రయత్నాల్లో భాగంగానే రూపుదిద్దుకున్న బృహత్తర కవిత్వ సంకల నమిది. తెలంగాణా సాహిత్యచరిత్రలో ఇది ఓ కీలకఘట్టం. ఇది తెలంగాణ కవిత్వ సంరంభం. వెల్లువెత్తిన కవిత్వ కదలికి సంకేతం. తెలంగాణా కవుల సమూహగానానికి ప్రతిఫలనం. నిజానికి తెలంగాణా జీవితంలో, సంప్రదాయంలో పోరాటం, కవిత్వం విడదీయరాని భాగం. ఇవాళ తన అస్తిత్వం కోసం, ఉనికి కోసం ఎలుగెత్తి నినదిస్తున్న తెలంగాణా వాసి పోరుకేకలే దీనికి తార్కాణం. తెలంగాణాలోని మారుమూల పల్లె ప్రాంతాల్నించి విస్తారంగా వస్తున్న కవిత్వమే ఇందుకు నిదర్శనం. తన లోపలి దుఃఖాన్ని, కోపాన్ని, ఆక్రోశాన్ని కవిత్వంగా మలచడానికి ప్రతిస్థాయిలో తెలంగాణా కవులు చేస్తున్న ప్రయత్నానికి ఈ సంకలనమే సాక్ష్యం.

ప్రాంతీయ స్పృహ పెరిగిన నేపథ్యాన సాహిత్యం మరింత నిర్దిష్టతను సంతరించుకుంది. అనివార్యమైన పరిస్థితులలో ఓ వెతుకులాట మొదలయింది. తెలుగు సాహిత్యంలో తన అడుగుజాడల్ని చెరిపివేసే ప్రయత్నాల్ని తెలంగాణా కవి గుర్తించాడు. సాహిత్యచరిత్రలో తన భాషనీ, మాటనీ, అవహేళన చేసిన ఉదంతాల్ని తలచుకొని ఇవాళ తెలంగాణ కవి ఉడికిపోతున్నాడు. తొలినుంచీ తెలంగాణా కవిత్వం తనదైన దారిలో ప్రయణిస్తోంది. తెలంగాణా సాయుధపోరాటకాలం నుంచీ తెలంగాణా కవిత్వానిది వైవిధ్యమైన నడకే. అయితే మధ్యలో వచ్చిన కోస్తాకవుల ప్రభావం ఇక్కడ లేదనలేం. ఈ ప్రభావం అప్పుడూ, ఇప్పుడూ ఉంది. కానీ తనమీద ఇతరేతర ప్రభావాల గురించి ఇవ్వాల్టి కవి స్పృహతో ఉన్నాడు. అన్యప్రభావాల్ని వదిలించుకొని తనదైన కంఠస్వరంతో కవిత్వాన్ని ఆలపించేందుకు గొంతు సవరించుకుంటున్నాడు.

ముఖ్యంగా భాష, వ్యక్తీకరణలకి సంబంధించి ఈ ప్రాంతకవులు ఇటీవలి సంవత్సరాల దాకా అనవసరమైన భారాన్ని మోయాల్సివచ్చింది. ఇది కేవలం కవిత్వ ప్రక్రియకి మాత్రమే పరిమితం కాలేదు. మొత్తం తెలంగాణా సాహిత్యంపైనే ఈ ప్రభావం ఉంది. కోస్తా సాహిత్య ప్రమాణాలతో ఈ ప్రాంతసాహిత్యాన్ని అంచనా వేసే పద్ధతి మొత్తం తెలంగాణా సాహిత్యానికే హాని చేసింది. దశాబ్దాల తరబడి తెలంగాణా సాహిత్యం మార్జినలైజ్ కావడానికి ఇదే కారణం. అయితే తెలంగాణా సాహిత్య ప్రమాణాలు, కోస్తా సాహిత్య ప్రమాణాలు వేరుగా ఉంటాయా? కచ్చితంగా వేరే. ఈ రెండు ప్రాంతాల భాషలు వేరు. సాహిత్యంవేరు. వాటి నేపథ్యాలు వేరు. అయినప్పటికీ తెలుగు సాహిత్యమంతా ఒకటే అన్నారు. చివరకు కోస్తావారి సాహిత్య ప్రమాణాలతోనే ఇతర ప్రాంతాల సాహిత్యం మంచి చెడ్డల గురించి మాట్లాడుతూ వచ్చారు. ఆరకంగా తమ ప్రాంతం నుంచే గొప్ప కవిత్వం, గొప్ప కథ వచ్చిందని కొందరు కోస్తా సాహిత్యకారులు నిర్ధారణ చేశారు. తమ మాండలికాల్లో వచ్చిన రచనల్లోనే సాహిత్యాంశ బలంగా ఉందని, ఇతర ప్రాంతాల మాండలికాల్లో పస లేదని వాదిస్తూ వచ్చారు. అక్కడితో ఆగక మాండలికాల వాడకానికి సంబంధించి ఇతర ప్రాంతాలవారిని కోస్తా సాహిత్యకారులు నిర్దేశించారు. ఈ కారణంగా సాహిత్యచరిత్రలో తెలంగాణా అన్యాయానికి గురయింది. దీనికి గల మూలాల్ని మూడు కోణాల్నించి చూడాలి. 1. ఆంధ్ర ప్రాంతంతో తెలంగాణ విలీనం కావడం. 2. సాహిత్యంలో కోస్తా ప్రమాణాల్ని తొలినుంచి ధిక్కరించే అవగాహన ఏర్పడకపోవటం 3. సాహిత్యోద్యమాల క్రమంలో ప్రాంతీయ నిర్దిష్టతల్ని పట్టించుకోకపోవడం. ఈ మూడు అంశాలు కలగలసి తెలంగాణా ప్రాంత సాహిత్యపు ఔన్నత్యాన్ని, ఉన్నతిని దెబ్బతీశాయి. ఇతరులు తెలంగాణ సాహిత్యాన్ని నిర్లక్ష్యం చేయడానికి కారణమయ్యాయి.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక విద్యా, సాంస్కృతిక రంగాల్లో ఆంధ్రులు పెద్దన్న పాత్రను పోషిస్తూ వచ్చారు. సాహిత్యరంగంలోనూ ఇదే ధోరణి. కవిత్వరంగం ఇందుకు మినహాయింపు కాదు. ఇక్కడే కవిత్వానికే పరిమితమై మాట్లాడుకుంటే చాలా విషయాలు అర్థమవుతాయి. 1930లలోనే తెలంగాణ కవుల్ని ఆంధ్రవారు అవహేళన చేశారు. చిన్నచూపు చూశారు. ఇక్కడ కవిత్వమే లేదన్నవారికి సమాధానంగా సురవరం

ప్రతాపరెడ్డి గోలకొండ కవుల ప్రత్యేక సంచిక తీసుకొచ్చారు. విలీనం తర్వాత తొలినాళ్ళలో తెలంగాణా కవులకు, వారి కంట్రిబ్యూషన్‌కు ఎలాంటి గుర్తింపు లభించింది? పెద్దగా ఏం లేదనే చెప్పాలి. తెలంగాణా సాయుధపోరాటం ఇతరప్రాంతాల వారికి కూడా స్ఫూర్తిని ఇచ్చింది. తెలంగాణా మీద ఇతరులు రాసిన కావ్యాలకి, కవిత్వానికి వచ్చిన పేరు ఈ ప్రాంతంలో రాసిన కవులకు రాలేదు. ఎందువల్ల? మనం 'విశాలాంధ్ర'లో భాగమై ఉండటం వల్ల. తెలంగాణా సాహిత్యకారుల్లో జైళ్ళకు వెళ్ళినవారు, నిర్బంధాలకు గురయినవారు అనేకమంది ఉన్నారు. కానీ వారి గురించి చెప్పుకోరు. వారి కవిత్వం గురించి మాట్లాడరు. 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అన్న దాశరథి కృష్ణమాచార్యపై నిన్నమొన్నటి వరకు నిర్లక్ష్యమే చూపారు. ఇప్పటికీ శ్రీశ్రీ వర్ధంతి సభలు నిర్వహిస్తారుగానీ దాశరథిని స్మరించుకునేవారే కనిపించరు. కాళోజీని కవిగా గుర్తించడానికి ఇప్పటికీ అభ్యంతరాలే. ప్రైవేట్ టాక్స్‌లో 'ఆయన ఉద్యమకారుడేగానీ కవి కాడని' చాలామంది విమర్శకులు అన్నారు. ఎందువల్ల? ఏ ప్రమాణాలతో కాళోజీ కవిత్వం గురించి ఇలా అంటున్నారు?

కోస్తా ప్రాంత విమర్శకులు, కవులు చూసే కవిత్వ ప్రమాణాలు వేరు. ఆంగ్ల భాషా సాహిత్యాల ప్రభావం ఆంధ్రులపైన అధికం. సంస్కృత భాషా సాహిత్యాల ప్రభావం కూడా ఎక్కువ. వారి సాహిత్య సంస్కారం తెలంగాణ సాహిత్య సంస్కారానికి భిన్నమైంది. దీంతో కవిత్వాన్ని, ఇతర ప్రక్రియల్ని ఆంగ్ల సాహిత్య ప్రమాణాలతో విశ్లేషించే పనికి పూనుకున్నారు. తెలంగాణాకు వస్తే ఉర్దూ సాహిత్య సంప్రదాయంతోనే వారికి సంబంధం ఎక్కువ ఆంగ్లంతోగానీ, సంస్కృతంతోగానీ ఇక్కడి సాహిత్యకారులకు పెద్దగా సంబంధం లేదు. తొలినాళ్ళ కవిత్వంలో గ్రాంథికభాష, ఉర్దూభాష ప్రభావాలు కనిపిస్తాయి. వీటితోపాటుగా తొలి నుంచీ ఇక్కడి కవి తనదైన భాషలో రాయడానికే ప్రయత్నించాడు. కవిత్వం కన్నా పాటనే సాధనంగా ఎంచుకున్నాడు. ఆ పాటలోనూ బలమైన కవిత్వం పలికించాడు. ఇక్కడి కవిత్వంలో గేయపద్ధతి ఉంది. ఆంధ్ర ప్రాంతంలోని వచన కవిత్వానికీ, ఇక్కడ వచ్చిన కవిత్వానికీ భేదం ఉంది. ఆంధ్ర వారి వచన కవిత్వపరిధిలో ఇక్కడి కవులు పూర్తిగా ఇమిడిపోయే అవకాశం ఎప్పుడూ లేదు. అయితే వచన కవిత్వప్రభావంతో ఇక్కడి కవులు కూడా అదే మార్గాన్ని అనుసరించకపోలేదు. కానీ తనదైన భాషలో, తనదైన వ్యక్తీకరణ

పద్ధతి తెలంగాణ కవులకు ఉంది. దీన్ని కొంతకాలం విస్మరించినా మళ్ళీ తమదైన కవిత్వమార్గంలోనే ప్రయాణించేందుకు తెలంగాణ కవులు తపన పడుతున్నారు. కనుకనే తెలంగాణ కవిత్వమార్గం ఎప్పుడూ భిన్నమైందే. ఈ మార్గం ఇప్పుడు మరింత నిర్దిష్టంగా కనిపిస్తోంది.

కవిత్వ వస్తువులోనూ, అభివ్యక్తిలోనూ, శైలీ శిల్పాల్లోనూ ఈ భిన్నత్వం దాదాపు దశాబ్దకాలంగా వస్తున్న కవిత్వంలో స్పష్టంగా చూడొచ్చు. స్థూలంగా చెప్పుకోవాలంటే తెలంగాణ కవిత్వ ప్రయాణంలో అయిదు దశలు కనిపిస్తాయి. 1. నైజాంకి వ్యతిరేకంగా ఇక్కడ పోరాటం ఆరంభమవడానికి ముందున్న దశ. ఈ దశలోని కవిత్వం తీరుతెన్నుల్ని అర్థం చేసుకోడానికి గోలకొండ కవుల ప్రత్యేక సంచికను చూడాలి.

(ఇటీవలి కాలాన ఈ సంచిక ప్రస్తావన లేకుండా ఎవరూ తెలంగాణ కవిత్వం గురించి మాట్లాడటం లేదు. కానీ ఆ కవిత్వం ఎలా ఉందో ఎక్కువమందికి తెలియదు. కనుక దాన్ని ఇవాళ పునర్ముద్రించడానికి ఎవరైనా ప్రయత్నిస్తే మంచిది) 2. తెలంగాణా సాయుధపోరాట కాలంలో వచ్చిన కవిత్వం. నాడు నిజానికి పాటదే ఆధిక్యం. కానీ కవిత్వం కూడా వచ్చింది. తెలుగునాట ప్రత్యేకించి తెలంగాణలో పోరాటస్ఫూర్తితో తొలిసారి వచ్చిన కవిత్వమిది. ఇది 1946 నుంచి 56 వరకు వచ్చింది. 3. ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ విలీనమయిన 1956 నుంచి 1969 వరకు ఉన్న దశ ఒకటి. మనకు కనిపించే సాహిత్యచరిత్రను అవలోకిస్తే ఈ కాలాన కవిత్వచర్చలన్నీ ఆంధ్ర ప్రాంతం నుంచి వచ్చిన కవిత్వానికి పరిమితమైనట్టు కనిపిస్తుంది. అసలు ఈ దశలో తెలంగాణ కవిత్వం తీరుతెన్నుల్ని తెలుసుకోడానికి తగిన పరిశోధన జరగాలి. 4. 1969నుంచి 1990 వరకు ఉన్న దశ ఒకటి. విప్లవ కవిత్వ ప్రభంజనం ఊగించి శాసించిన కాలమిది. కవిత్వంలో తనదైన బాణీలో తెలంగాణ జీవితాన్ని ఆవిష్కరించే క్రమానికి ఈ కాలంలోనే పునాది పడింది. అంతేగాక తొలుత ప్రత్యేక తెలంగాణాను కోరుతూ మాండలికంలో కవిత్వం రాయడం ఈ కాలంలోనే ఆరంభమైంది. 5. 1990 నుంచి తెలంగాణలో ప్రాంతీయ స్పృహ బలపడింది. వస్తు రూపాల్లో తెలంగాణ కవిత్వం కొత్తరూపు దాల్చింది. ఈ విధంగా 1946 నుంచి ఇప్పటివరకు తెలంగాణ కవిత్వంలో అయిదు దశలున్నాయి. అనేక

మలుపులున్నాయి. అర్ధ శతాబ్దం పైపడిన ఈ కాలంలో వచ్చిన తెలంగాణ సాహిత్యం, కవిత్వం మీద జరిగిన పరిశోధనలు అరుదు. కొన్ని మంచి పరిశోధనలు జరిగినా వాటికి ప్రచారం లభించలేదు. ముఖ్యంగా ఈ సుదీర్ఘకాలపు ప్రయాణాన తెలంగాణ కవిత్వం గురించి సరైన అధ్యయనం జరిగితేగానీ చాలా విషయాలు వెలుగులోకి వచ్చే అవకాశం లేదు.

సరిగ్గా ఇదే కాలాన ఆంధ్రలో మహాకవుల గురించి, మహా కావ్యాల గురించి విస్తారంగానే చర్చ జరిగింది. కవిత్వంలో ఎవరెవరి స్థానాలు ఏమిటన్న అంశంపై చర్చోపచర్చలు సాగించారు. కానీ ఈ చర్చల్లో తెలంగాణ ప్రస్తావన నామమాత్రం. వీటితో తెలంగాణ కవిత్వానికీ, కవులకీ ఎలాంటి సంబంధం లేదు. పీఠాధిపత్యం కోసం తెలంగాణ కవులు ఎప్పుడూ పోటీపడలేదు. తమదైన పద్ధతిలో రాసుకుంటూపోయారే తప్ప స్థానాల కోసం తగువులాడలేదు. అయితే పాలకుల ఆశ్రయం కోసం వెంపర్లాడిన కవులు తెలంగాణలో లేకపోలేదు. కానీ వారు తాము మహాకవులమని ఎప్పుడూ చెప్పుకోలేదు. తమను ఎవరో ప్రమోట్ చేయాలని ఆశించలేదు. కవిత్వాన్ని శాసించాలని ప్రయత్నించలేదు. మాటకీ, చేతకీ అంతరం లేకపోవడమన్నది ఈ తరహా కవుల్లోనూ కనిపిస్తోంది. అంటే పాలకపక్షాల వైపు నిలిచి కూడా విప్లవవాదుల మని చెప్పుకోలేదు. క్రూరమైన ఎమర్జన్సీని సమర్థించిన శ్రీశ్రీని సైతం తర్వాత కాలంలో విరసం తన భుజాల మీద మోసింది. కానీ తెలంగాణలో తమ పక్షాన నిలవని కవుల్ని ప్రజలు ఎప్పుడూ ఆమోదించలేదు. అలాంటివారిని ఇక్కడి కవులు, సాహిత్యకారులు తమలో భాగమని చెప్పుకోలేదు. 'మనవాడు కదా పోనీలే' అన్న ధోరణిని ప్రదర్శించలేదు. ఈ కవిత్వ సంకలనం కూడా అందుకు మినహాయింపు కాదు. తెలంగాణను విచ్ఛిన్నం చేసిన ఐక్యతవాదాన్ని ఈ సంకలనంలోని కవులు ఎవరూ సమర్థించడం లేదు. 'విశాలాంధ్ర' గురించి మాట్లాడే తెలంగాణా కవులకి ఈ సంకలనంలో స్థానం ఇవ్వలేదు. తమవాడు తప్పు చేసినా గట్టిగా నిలదీసే తత్వం తెలంగాణలో ఉంది. కనుకనే రెండు నాల్కలతో మాట్లాడే కొందరు తెలంగాణా కవుల్ని తమ అక్కున చేర్చుకోవడానికి ఎవరూ సిద్ధంగా లేరు.

తమదైన అనుభవాన్ని తమదైన భాషలో, తమదైన శైలిలో చెప్పడం ఇవాల్టి తెలంగాణ కవుల విశిష్టత. నిజానికి ఇక్కడి కవి సమూహాలు ఎప్పుడూ తమ అనుభవాన్నే పలవరించాయి. తమది కాని అనుభవాన్ని అరువు తెచ్చుకోడానికి ప్రయత్నించలేదు. భాషకు సంబంధించిన మొహమాటాలు ఇదివరలో ఉండేవి. కానీ ఇప్పుడు తమ భాషలో రాయాలన్న తపనే అందరిలోనూ కనిపిస్తోంది. నూటా ఇరవై ఐదు మందికి పైబడిన తెలంగాణ కవులు రాసిన కవిత్వం ఈ పుస్తకంలో ఉంది. కాళోజీ, వరవరరావు, చెరబండరాజు, దేవరాజు మహారాజు వంటి ప్రముఖుల్ని మొదలుకొని, నిన్నమొన్ననే కవిత్వం రాయడం ఆరంభించిన వారి దాకా ఈ సంకలనంలో ఉన్నారు. తెలంగాణ ఆత్మను ఆవిష్కరించిన కవిత్వాన్ని సంకలనం చేయడమే తన ఉద్దేశంగా సంపాదకుడు జూలూరు గౌరీశంకర్ చెప్పారు. ఈ కవిత్వంలో తెలంగాణాకు చెందిన బహుముఖ పార్శ్వాలు ఆవిష్కృతమయ్యాయి. తెలంగాణ నుంచి కవిత్వం ఉధృతంగా వచ్చిన విప్లవ సాహిత్యోద్యమ కాలం నుంచి ఇప్పటివరకు వస్తున్న ఈ కవిత్వంలో వస్తు, రూపాలన్నిటా వైవిధ్యం ఉంది. దాన్ని ఈ సంకలనం పట్టి చూపుతుంది. ప్రతి కవీ తెలంగాణ జీవనరీతుల్ని తనదైన పద్ధతిలో కవిత్వీకరించాడు. యాభైలకి పూర్వం తెలంగాణ ఎలా ఉండేదో ఇప్పుడు ఎలా ఉందో చెప్పడానికి కవులు ప్రయత్నించారు. తమ బతుకును ఛిద్రం చేస్తున్న శక్తులపై నిరసన బాణాల్ని ఎక్కుపెట్టారు. భౌగోళికంగా తెలంగాణ ఎలా ఉండేదో, వలసవచ్చినవారు తెలంగాణని ఎలా విచ్ఛిన్నం చేశారో శక్తిమంతంగా చెప్పారు. ఇప్పుడు తెలంగాణా పల్లె ఎలా ఉందని ప్రశ్నిస్తే అన్నవరం దేవేందర్ ఇలా అంటాడు.

"కనుకొనలి నుంచి రాలుతున్న సముద్రం
తెలంగాణ పల్లె
ఇది కన్నీళ్ళ కోనేరు
ఒకవైపు ఉడుకుతున్న నెత్తుటి సంగీతం
మరోవైపు రివ్వుమంటున్న బులెట్ల వాన
ఊగుతున్న ఉరితాళ్ళ చప్పుడు
బక్కచిక్కిన బతుకుల్లో ఆత్మహత్యల సన్నివేశాలు"

ఇదీ తెలంగాణ పల్లె దృశ్యం. బీభత్సం రూపుగట్టిన విషాద భీకరం సన్నివేశం. పల్లె ఇలా ఎందుకు ఉంది? ఆంధ్రలో మాదిరిగా ఇక్కడ పచ్చని పంటపొలాలు లేవు. ఎందుకని? పక్కనుంచే రెండు నదులు పోతున్నా గుక్కెడు నీళ్ళ కోసం అల్లాడాల్సిన పరిస్థితి ఎందుకు దాపురించింది? కరువుతో తల్లడిల్లే దుస్థితి ఏమిటి? తెలంగాణాలోనే బావులు, చెరువులు ఎందుకు ఎండిపోతున్నాయి? ఇక్కడి రైతులు, చేనేత కార్మికులే ఎందుకు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు? వలసవచ్చిన వాళ్ళకు అగ్గువకు భూముల్ని అమ్ముకొని, తమ భూముల్లోనే తాము కూలీలుగా ఎందుకు మారాల్సి వచ్చింది? తమ ఊళ్ళోనే తాము పరాయివాళ్ళయిపోతున్నారెందుకు? తమ ఊళ్ళో నుంచే తమను వెళ్ళగొట్టే పరిస్థితుల్ని తెచ్చిపెట్టిందెవరు? తెలంగాణ కవులు ఇలా అనేకానేక ప్రశ్నల్ని సంధిస్తున్నారు. అన్ని రంగాల్లో తెలంగాణాకు జరుగుతున్న అన్యాయాన్ని గురించి నిలదీస్తున్నారు. తెలుగువారంతా ఒక్కటే అంటున్న సమైక్యతావాదుల్ని ఉద్దేశించి

"మన నేల ఒకటే మన జాతి ఒకటే అయితే
బతుకులొక్క తీర్గ ఎందుకులెవ్వురా అయ్య"

(నందిని సిధారెడ్డి) అని ప్రశ్నిస్తున్నారు.

తాగునీరు లేదు, సాగునీరు లేదు. మంచినీళ్ళకోసం మైళ్ళకు మైళ్లు పోవాల్సిరావడం పరమ విషాదం. తమ పక్కనుంచే కృష్ణా, గోదావరి నదులు పోతున్నా తమ పంటపోలాలు ఎడారులుగా మారే పరిస్థితి. ఇలాంటి స్థితినే
"దగాబడ్డ నేల కమ్ముకుంటున్న కరువు ఎక్కిళ్ళ మధ్య / కొన ఊపిర్లు నరుక్కుంటుంది."
(కందుకూరి దుర్గాప్రసాద్) అంటూ ఈ ప్రాంత వాస్తవికతను చెబుతున్నాడో కవి.

కడుపు చేతబట్టుకొని వలస వచ్చినవాళ్ళు ఆశ్రయం ఇచ్చినవాళ్ళ కడుపు గొట్టడం ఎక్కడి నీతి? "ఇసూటు రమ్మంటే ఇల్లంత నాదంటివి / తిన్నింటి వాసాలు లెక్కెడితివి / తాతలిచ్చిన సారెడు భూమి పైసగ్గొంటివి.. కాలువ నీళ్ళు నీకు వారె / కళ్ళనీళ్ళు నాకు మిగిలె" (కోట్ల వెంకటేశ్వరరెడ్డి) అంటూ వలసవాదుల నైచ్యాన్ని చెబుతున్నారు.

తెలంగాణ ప్రజలది శాంత స్వభావమే. కానీ అవమానించేవాళ్ళ దగ్గర అణగిమణిగి ఉండేందుకు మనసు అంగీకరించదు. ఈ విషయాన్నే శ్రీ దాస్యం లక్ష్మయ్య ఇలా చెబుతాడు "మాకెవ్వల సొమ్ము అక్కర్లేదు / మాయి మాకు దక్కితె సాలు / మా ఆరాటంల అలజడి ఉన్నది / అన్నాలమై పోయిన మొత్తుకోలున్నది / బొండిగల నిండా బాధలున్నయి / నడిమిట్ల పెత్తనం దొరికిచ్చుకొని చెలాయిచ్చెటోల్లకాడ / అణిగి మనిగి పడ్డది సాలు / మాకు సోయి లేదనుకోకుండ్రి / గంగి గోవుల మనుకోకుండ్రి / అనుభవాలు మాకు అన్ని నేర్పినయి / లొల్లిని షురువు జేత్తే / తొవ్వ జూసుకోవాలె / తోక ముడుచుకోవాలె"

అదే సమయాన ఈ వలన దోపిడీకి వ్యతిరేకంగా పోరాటానికి వెనుదీయమని చెబుతున్నారు. తెలంగాణ నేల ప్రాశస్త్యం గురించి చెబుతూ
"ఈ భూమిలోంచి ఎక్కడ పిడికెడు మట్టి తీసుకున్నా
ఒరిగిన వీరుల కనుగుడ్లే కదలాడుతున్నాయ్!
నుజ్జునుజ్జయిన జీవుల ఆత్మకతలే విన్పిస్తున్నాయ్" అని పగడాల నాగేందర్ అంటాడు.
పోరాట సంప్రదాయం తెలంగాణలో భాగం. త్యాగాలకు వెరవని ధీరత్వం తెలంగాణ స్వభావంలోనే ఇమిడి ఉందని చెప్పడమే నాగేందర్ ఉద్దేశం.
వివక్షను, అన్యాయాన్ని ప్రశ్నించడం వరకే తెలంగాణ ప్రజ పరిమితం కాదు. ఇప్పటివరకు జరుగుతున్న అన్యాయాన్ని నిలదీయడానికి ఇవాళ సంఘటితమవుతున్నారు. తమ గోసను చెప్పుకోవడంతో పాటు న్యాయం కోసం పోరాడుతున్నారు. కలసి ఉందామంటూ ఇప్పటివరకు చెప్పిన కబుర్లని ఇక కట్టిపెట్టమంటూ

"నువ్వు చూపిస్తున్న దృశ్యంలో
బొమ్మని కాను
నువ్వు ఆడిస్తున్న మాటల్లో
మాటని కాను
నేను మాట్లాడిస్తానింక
నేను ఆడిస్తానింక

నీ కాగితాల మీటల కింద
నిక్కి నీలిగి కూర్చుండను" (అఫ్సర్) అని చెబుతున్నారు.

పెద్ద మనుషుల ఒప్పందం జరిగిన నాటి నుంచి తెలంగాణవాసుల్ని మభ్యపెట్టేందుకు అన్నిరకాల కుట్రలుసాగాయి. ఐక్యంగా ఉందామని చెబుతూ తెలంగాణాకు తీరని అన్యాయం చేసిన పాలకులు ఇప్పటికీ అదే భాష మాట్లాడుతున్నారు. కనుకనే కలిసుందామ్‌రా!' అంటూ తెలంగాణకు చేస్తున్న అన్యాయాన్ని ప్రసేన్ తన కవిత్వంలో ప్రశ్నించారు.

ఈ సంకలనంలో ప్రతి కవిత గురించి వివరంగా చెప్పుకోవచ్చు. కానీ అందుకు ఇది సందర్భం కాదు. అయితే మొత్తం కవిత్వంలో ఉన్న భిన్న కోణాల్ని చూద్దాం. 1. విప్లవ సాహిత్యోద్యమ ప్రభావంతో వచ్చిన కవిత్వం ఇందులో ఉంది. తెలంగాణ పల్లెలపై పోలీసు పంజాను, రాజ్యహింస భీతావహ స్వరూపాన్ని వ్యతిరేకించే కవిత్వం ఉంది. ఇది దెబ్బయిల కాలం నుంచి ఉంది. ఎనభైల్లో ఎక్కువగా ఉంది. ఆ కవిత్వమంతా ఈ సంకలనంలో లేదు. కానీ అందుకు ప్రాతినిధ్యం వహించే కవితలు కొన్ని ఇందులో ఉన్నాయి. 2. విశాలాంధ్రలో విలీనం వల్ల తెలంగాణ ఎన్నిరకాలుగా నష్టపోయిందో చెప్పే కవిత్వం ఉంది. పెద్ద మనుషుల ఒప్పందంగానీ, ముల్కీ నిబంధనలుగానీ ఎప్పుడూ అమలులోకి రాలేదు. పాలకుల విధానాలు తెలంగాణకు తీరని అన్యాయం చేశాయి. దీన్ని నిరసించే కవిత్వం ఉంది. 3. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక తెలంగాణ భాషా, సాహిత్యాలు, సంస్కృతులు, ఆచార సంప్రదాయాలు తీవ్రమైన వివక్షకు గురయ్యాయి. ఈ వివక్షను ప్రశ్నిస్తూ తెలంగాణ ఆత్మగౌరవాన్ని చాటే కవిత్వం ఇందులో ప్రధానం. 4. దశాబ్దకాలంగా ఉదారవాద ఆర్థికవిధానాలు, గ్లోబలైజేషన్ కారణంగా తెలంగాణ పల్లె ప్రజల బతుకులు ఛిన్నాభిన్నమవుతున్నాయి. రైతులేగాక ఇతర వృత్తుల వారు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ విషాద సన్నివేశాలు, ఇందుకు గల మూలాలు ఈ కవిత్వంలో కనిపిస్తాయి.

ఇక్కడే మరో విషయం గమనించాలి. విప్లవోద్యమానికి సంబంధించి 1980 నుంచి 1990 వరకు ఉన్న పరిస్థితి ఒకటి. 1990 నుంచి ఇప్పటి వరకు ఉన్న

పరిస్థితి మరో రకం. ఈ రెండు దశాబ్దాల కాలంలో వచ్చిన మార్పుల్ని ఆకళింపు చేసుకోవాలి. విప్లవోద్యమం వల్ల తొంభైల నాటికి తెలంగాణ గ్రామాల్లో పెత్తందారుల దౌర్జన్యాన్ని చాలావరకు నిర్మూలించగలిగారు. కానీ ప్రజల జీవనపరిస్థితుల్లో మౌలికంగా మార్పు రాలేదు. పైగా బతుకులు మరింత దుర్భరమయ్యాయి. తొంభైల ఆరంభంలో మొదలైన సరళీకృత ఆర్థిక విధానాల నేపథ్యంలో వ్యవసాయ రంగం, చేతివృత్తులు తీవ్రంగా దెబ్బతిన్నాయి. గ్లోబలైజేషన్ తెలంగాణ ప్రజల జీవితాల్ని మరింత సంక్షోభంలోకి నెట్టివేసింది. గతంలో తెలంగాణ రైతు ఆహార పంటలకే ప్రాధాన్యం ఇచ్చాడు. కానీ ప్రభుత్వం వాణిజ్య పంటలను ప్రోత్సహించడంతో, అలాగే కోస్తా రైతుల ప్రభావంతో వాణిజ్య పంటలవైపు మొగ్గు చూపారు. ఆశించని ఫలితాలు ఇవ్వనందున అప్పుల పాలయికుంగిపోయిన రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ అమానవీయ ఘట్టానికి తక్షణ శత్రువులు కనిపించే అవకాశం లేదు. మారిన పరిస్థితులకు అనుగుణంగా విప్లవోద్యమం తన వ్యూహాల్ని నిర్మించుకోలేదు. ఇది దాని పరిమితి. సూత్రరీత్యా వేరు తెలంగాణను ఆమోదించినా, అందుకోసం ప్రజా ఉద్యమాన్ని నిర్మించే కర్తవ్యాన్ని చేపట్టలేదు. ఇదీ ఆ ఉద్యమ పరిమితి. కానీ కవులు ఈ పరిమితికి లోబడలేదు. తెలంగాణ కవుల ఎజెండాలో ప్రాంతీయ అస్తిత్వం కీలకం. అందువల్లనే రాజ్యహింసను వ్యతిరేకిస్తూ కవిత్వం రాసినవారు కూడా తర్వాత తెలంగాణ అస్తిత్వం కోసం, కోస్తా వలసవాదుల దోపిడీని నిరసిస్తూ కవిత్వం రాస్తున్నారు.

ఇక్కడే మరో వాస్తవాన్ని గుర్తించాలి. కోస్తా వలసవాదుల దోపిడీ గత పది, పన్నెండేళ్ళ కాలంలోనే మునుపటి కన్నా విపరీతంగా పెరగింది. వేలాది ఎకరాల తెలంగాణ భూముల్ని కొనడం, పరిశ్రమల్ని స్థాపించడం, తెలంగాణలో విద్యాలయాల్ని స్థాపించడం, రియల్ ఎస్టేట్ మొదలైన లాభదాయకమైన వ్యాపారాల్లోకి కోస్తావారు చొచ్చుకురావడం తొంభైల ఆరంభం నుంచి మరీ ఎక్కువయింది. ఇలా వారు తెలంగాణలోని విభిన్న రంగాల్లోకి చొచ్చుకువస్తున్న కొద్దీ ఆ మేరకు తెలంగాణవాసులు నష్టపోయారు.

ఇక్కడ ఆత్మహత్యలకి, బతుకుల్లో దైన్యానికి వ్యవసాయం మొదలైన రంగాలకు సంబంధించిన పాలకుల విధానలే కారణం. కోస్తా వలసవాదులతోపాటు ప్రభుత్వం

వ్యవసాయరంగానికి సంబంధించిన విధానాలు కూడా తెలంగాణ రైతులు దెబ్బతినడానికి దారితీశాయి. కానీ మూలాల్లోకి వెళ్ళి చూస్తే ఇక్కడి నేలపై పాదం మోపిన వలసవాదులే మొదటి నేరస్తులుగా కనిపిస్తారు. ఒకవైపున గ్లోబలైజేషన్ కారణంగా విచ్ఛిన్నమవుతున్న బతుకులు, మరోవైపున ఈ వలసవాదుల దోపిడీ, వారు చేసే అవమానాలు ఈ స్పష్టత ఉన్నందునే తెలంగాణ కవిత్వంలో ఆగ్రహం, ఆవేశం, ఆక్రోశం, నిరసన బలీయంగా వ్యక్తమవుతున్నాయి. 1990–92 వరకు తెలంగాణ కవిత్వంలో ఉద్యమానికి, రాజ్యహింసకు సంబంధించిన కవిత్వం అధికం. తర్వాతి కాలంలో ప్రాంతీయ స్పృహతో అస్తిత్వం కోసం, ఉనికికోసం కవిత్వాన్ని బలమైన అభివ్యక్తిగా మార్చుకోవడం కనిపిస్తోంది. తరచి చూస్తే కనిపించే కోణాలు ఇంకా అనేకం. విభిన్నకులాలు, విభిన్నవృత్తులు, విభిన్న రంగాలవారి జీవన పరివేదనలు, సంఘర్షణలు ఈ కవిత్వంలో వ్యక్తమయ్యాయి. సిద్ధార్థ, ఎం.వెంకట్, అన్వర్, స్కైబాబా, షాజహానా, అనిశెట్టి రజిత, నాళేశ్వరం శంకరం, పప్పుల రాజిరెడ్డి, దెంచనాల, అల్లం నారాయణ, జూకంటి జగన్నాథం, గోపగాని రవీందర్, ఉదారి నారాయణ, కోట్ల వెంకటేశ్వరరెడ్డి, వంశీకృష్ణ, పులిపాటి గురుస్వామి, మోతుకూరి అశోక్‌కుమార్, దర్భశయనం, యెన్నం ఉపేందర్, వేముగంటి మురళీకృష్ణ, పి.విద్యాసాగర్, వేణు సంకోజు, పొట్లపల్లి శ్రీనివాసరావు, తుమ్మల దేవరావ్, ఎద్దుకొమ్ము జెట్టయ్య, హనీఫ్, జవేరియా, చెరుకు సుధాకర్ ఇంకా మరి ఎందరో కవులు తమ విలక్షణమైన కంఠస్వరాలతో తెలంగాణ కవిత్వాన్ని సంపద్వంతం చేశారు. ఇలా ప్రతి ఒక్కరిని పేరుపేరునా చెప్పాల్సిందే. అలాంటి విలక్షణత, వైవిధ్యం ఈ సంకలనం నిండా తొణికిసలాడుతోంది.

తెలంగాణ కవి ఇప్పుడు తనదైన భాషలో రాయడానికి తంటాలు పడుతున్నాడు. కానీ అందరికీ ఇది సాధ్యం కావడం లేదన్నది వాస్తవం. దీనికి కారణాల గురించి చర్చించుకునే ముందు కవిత్వంలో తెలంగాణ భాషకు సంబంధించిన కొన్ని విషయాల్ని అవలోకిద్దాం. ఆంధ్రలో భావ కవిత్వానికి, అభ్యుదయ కవిత్వానికి మూలాలు పాశ్చాత్య సాహిత్యంలో, రష్యా మొదలైన దేశాల పరిణామాల్లో ఉన్నాయి. కానీ అదే కాలాన తెలంగాణ కవిత్వానికి ఇక్కడి నిర్దిష్ట, సామాజిక, సాంస్కృతిక అంశాలే మూలాలు. అంతేగాక పద్యరూపంలో, పాట

రూపంలో ఇక్కడ కవిత్వం ఉండేది. అయితే భాషకు సంబంధించి వస్తే తెలంగాణ మాండలికాన్ని పద్యాల్లో కూడా వాడారు. సురవరం ప్రతాపరెడ్డి సీసపద్యాల్ని తెలంగాణలోని పాలమూరు మాండలికంలో రాసిన దాఖలాలున్నాయి. పద్యానికి సంస్కృత భాషే అక్కర్లేదని చెప్పడానికి ఈ ఉదాహరణ చాలు. ఇంకా చాలామంది కవులు తెలంగాణ భాషలోనే కవిత్వం రాశారు. కానీ భాష కారణంగా కూడా అనాడు తెలంగాణ కవుల్ని ఆంధ్ర సాహిత్యకారులు చిన్నచూపు చూశారు. విశాలాంధ్రలో విలీనం తర్వాత భాషకు సంబంధించిన చర్చ ఎక్కువగా సాగింది. తెలంగాణ భాష పట్ల చిన్నచూపు అధికమయింది. స్వరాష్ట్రంలోనే రెండో తరగతి పౌరులుగా బతకాల్సిన దుస్థితిలోకి తెలంగాణ ప్రజలు నెట్టబడ్డారు. తమది కాని భాషలో చదువుకోవాల్సి వచ్చింది. ఎప్పుడయితే వాడుకభాష పేరిట విద్యావిధానంలోకి కోస్తాలోని రెండున్నర జిల్లాల భాష ప్రవేశించిందో నాటి నుంచే తెలంగాణ భాషా, సాహిత్యాలకు హాని జరిగింది. నేటికీ అది కొనసాగుతోంది. తెలంగాణలో ఇంట్లో మాట్లాడేది ఒక భాష. బళ్ళో చదువుకునేది మరో భాష. అందుకే తెలుగే అయినా తెలంగాణ వాళ్ళకు అది పరాయి భాష అయ్యింది. రాన్రాను తమ మాతృభాషకు తాము దూరం కావాల్సిన దుస్థితి తెలంగాణవాసులకు ఏర్పడింది. అలా రెండు తరాలు గడిచిపోయాయి. విశాలాంధ్రలో విలీనం తర్వాత తెలంగాణలో కవిత్వం రాసేవాళ్ళు తమది కాని భాషలోనే రాయాల్సి వచ్చింది. దిగంబర కవిత్వోద్యమంలో చెరబండరాజు, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి తెలంగాణకు చెందినవారే. మిగతా ముగ్గురు ఆంధ్ర ప్రాంతం వారు. కానీ దిగంబర కవిత్వంలో తెలంగాణ భాష ఛాయలు మచ్చుకయినా కనిపించవు. ఎందుకని? అప్పటికే తెలంగాణ కవులు తమ భాషకు ఛాయలు మచ్చుకయినా కనిపించవు.ఎందుకుని? అప్పటికే తెలంగాణ కవులు తమ భాషకు తాము పరాయివాళ్ళయ్యారు. ఇది చదువుకోవడం వల్ల వచ్చిన దుస్థితి. అంతేగాక వచన సాహిత్యంలో ఆంధ్ర ప్రాంతం వారి రచనలకే ఆదరణ లభించింది. సినిమాల్లోనూ ఆ రెండున్నర జిల్లాల భాషనే ఉంది. ఇలా తెలంగాణలో మాట్లాడటం, రాయటం నామోషీగా మారిన కాలంలోనూ మాండలికంలో కవిత్వం రాసినవారు తెలంగాణలో ఉన్నారు. డెబ్బయిల్లోనే నిజామాబాద్‌కు చెందిన పంచరెడ్డి లక్ష్మణ మాండలికంలో కవిత్వం రాశారు. తర్వాత దేవరాజు మహారాజు, తెలిదేవర భానుమూర్తి, టి.కృష్ణమూర్తి యాదవ్ మొదలయినవారు తెలంగాణ మాండలికంలో

కవిత్వం రాశారు. వీరి తర్వాత దళిత ఉద్యమ నేపథ్యంలో నల్లగొండ, మెదక్ ఇతర జిల్లాల కవులు తెలంగాణ భాషలో కవిత్వం రాయడం మొదలుపెట్టారు.

తొంభైల్లో తెలంగాణ భాషలోనే కవిత్వం రాయాలన్న తపన పెరిగింది. ఈ సంకలనంలోని కవిత్వంలో అందుకోసం కవులు ఆరాటపడిన దాఖలాలు పుష్కలంగా ఉన్నాయి. అయితే తెలంగాణ డిక్షన్ ఉందిగానీ తెలంగాణ భాషలోనే మొత్తం కవితను రాసినవారు తక్కువమందే. కేవలం తపన, కోరిక ఉన్నంతమాత్రాన ఇవాళ తెలంగాణభాషలో కవిత్వం రాయడం సాధ్యంకాదు. ఎందుకంటే ఇప్పటికే జరగాల్సిన నష్టం జరిగిపోయింది. తెలంగాణ భాషలో రాయాలంటే ఆ భాషలో మాట్లాడాలి. ఆ భాషలో జీవించాలి. కానీ మనది కానీ భాషలో చదువుకుంటున్నాం. మన భాష వినిపించని సినిమాల్ని చూస్తున్నాం. మనవి కాని పాటలు వింటున్నాం. మన భాషతో పెద్దగా పరిచయం లేని రచనలే ఎక్కువగా చదువుతున్నాం. ఇన్నిరకాలుగా మనది కాని భాషతో దైనందిన కలాపాల్లో మునిగివున్నాం. కనుకనే సజీవమైన తెలంగాణ భాష తొణికిసలాడే కవిసమయాలు తక్కువే.

ఇప్పుడు గత పదేళ్ళుగా టీవీ ఛానెల్స్‌లో వినిపించే భాష కూడా ఆంధ్ర వాళ్ళదే. సినిమాల్లోనైనా, టీవీల్లోనైనా పనిమనుషులు, కూలీలు, ఆటోవాళ్ళు, రిక్షావాళ్ళు, దుర్మార్గులు, కసాయివాళ్ళు, జోకర్లు తప్ప ఇతరులు తెలంగాణ భాషను మాట్లాడరు. ఈ విధంగా తెలంగాణ భాష మనది కాని భాష అయ్యింది. మరి ఇవాల్టి కవి తెలంగాణ భాషలో కవిత్వం రాయలేడా?

పల్లె జీవితానికి దగ్గరా ఉన్నవారు ప్రయత్నిస్తే తెలంగాణ భాషలో రాయడం అసాధ్యం కాదు. పల్లెల్లో ఇంకా తెలంగాణ భాష కొంతవరకు సజీవంగానే ఉంది. టీవీ చానెల్స్ ఆదివాసీ గూడెల్లోకి సైతం చొచ్చుకోపోయి భాషా సంస్కృతుల్ని విచ్ఛిన్నం చేస్తున్నా భాషను కాపాడుకునే అవకాశం మిగిలే ఉంది. పల్లె జీవితానికి దగ్గరగా ఉన్నవారు తెలంగాణభాషలో రాస్తున్నారు. అందుకు ఈ సంకలనంలో ఉన్న కవిత్వమే దాఖలా. కవిత్వ నిర్మాణంలో మౌఖిక కథన పద్ధతులున్నాయి. దేశి, మార్గ కవితా రీతులు కనిపిస్తాయి. సంభాషణ పద్ధతి ఉంది. కొందరు కవులు ఎరుకల వాళ్ళు ఎరుక చెప్పినరీతిలో కవిత్వం చెప్పారు. ఉక్రోషం ఆపుకోలేక

శాపనార్థాలు పెట్టే మహిళ కంఠస్వరాన్ని అనుసరించి కవిత్వం చెప్పిన వారు కూడా ఇందులో ఉన్నారు. ఈ కవిత్వంలోని సుగుణం ఏమిటంటే హితబోధలు లేవు. ఇక్కడ కవి ఔట్‌సైడర్ కాదు, ఇన్‌సైడర్. ఈ కవిత్వమంతా ప్రత్యక్షసాక్షి కథనంలా ఉంటుంది. ఫస్ట్ పర్సన్ సింగ్యులర్ స్వగతంలా ఉంటుంది. అందుకే ఈ కవిత్వంతో తాదాత్మ్యం చెందడం యాదృచ్ఛికంగా జరిగే ప్రక్రియ.

గత అర్ధశతాబ్ద కాలంలో తెలంగాణ కవిత్వాన్ని ఒక్కచోట చేర్చి సంకలనంగా తీసుకురావడం ఇదే ప్రథమం. ముఖ్యంగా తెలంగాణ అస్తిత్వాన్ని, ఉనికిని, ఆత్మగౌరవాన్ని చాటుతూ కవిత్వ సంకలనం తీసుకువచ్చేందుకు జరిగిన తొలి ప్రయత్నమిది. 1940ల నుంచి ఇప్పటివరకు తెలంగాణ గురించి తెలంగాణ భాషలో రాసిన కవులు వందలమంది ఉంటారు. ఆ కవిత్వాన్ని అంతా సేకరించడం, పుస్తకాలుగా తీసుకురావడం అంత సులువుకాదు. ఈ సంకలనం విషయానికి వస్తే అత్యధికభాగం కవిత్వం ఇటీవలి సంవత్సరాల్లో వచ్చింది. చాలా కవితలు ఈ సంకలనం కోసం రాసినవే. సంకలనాలు అన్నాక పరిమితులుంటాయి. ఈ సంకలనం కూడా అందుకు మినహాయింపు కాదు. ఇది సమగ్రం కాదు కానీ సమకాలీనతకు ప్రతిబింబం. ఈ విషయాల్ని దృష్టిలో ఉంచుకొని ఈ సంకలనాన్ని చూడాలి. ముఖ్యంగా నల్లగొండ జిల్లాలోని కోదాడకి చెందిన "స్పృహ" సాహితీ సంస్థ జూలూరు గౌరీశంకర్ నేతృత్వంలో ఈ సంకలనాన్ని ప్రచురించడం ఆహ్వానించదగ్గ పరిణామం. సాహిత్యానికి పెద్ద పెద్ద నగరాలు మాత్రమే కేంద్రాలు కావు. మామూలు ప్రాంతాలు సైతం చారిత్రక ఘట్టాలకు కేంద్రాలవుతాయి. ఆవిధంగా ఇప్పుడు కోదాడ నుంచి ఈ బృహత్తరమైన తెలంగాణ సంకలనం రావడం హర్షించదగ్గ అంశం. ఒక చిన్న సాహితీ సంస్థ ఇందుకు పూనుకోవడం, దీని బరువు బాధ్యతల్ని భుజాల మీద వేసుకోవడం అభినందనీయం. తన శక్తికి మించిన పని అని భావించకుండా ఈ సంకలనం తీసుకురావడం కోసం గౌరీశంకర్ పడిన శ్రమ చిన్నదేం కాదు. అనేక ఎదురీతలమధ్య, సవాళ్ళ మధ్య ఈ సంకలనం తీసుకువస్తున్న గౌరీశంకర్‌ను అభినందించకుండా ఉండలేను.

**- గుడిపాటి**

# నేటి నిజం - నేటి విజం

సాదారణంగా ఇట్లాంటి సంకలనాలకు సంపాదకత్వం వహించటం కానీ, సంపాదకుడి మాట రాసి అందరినుంచి సానుకూల స్పందనను పొందటం అంత తేలికైన విషయం కాదు. అలాగే సంకలనానికి సమగ్రతను చేకూర్చటము, సంపాదకుడి ఒక్కడి వల్లనే సాధ్యమయ్యే పనీగాదు. సంపాదకుడిగా ఈమాటలు ఏదో నేరకచేసానులే అనే దృష్టితో రాస్తున్నదికాదు. కవుల నుంచి అనూహ్యస్పందనవచ్చి ఈ సంకలనానికి ఓనిండుదనం వచ్చింది అయితే నాముందు రెండు ప్రశ్నలు ఉన్నాయి. 1. ఈసంకలనాం నేనే ఎందుకు తేవాలి? 2. ఫలాన ఆయనే ముందుమాటెందుకు రాయాలి?

ఈ రెండు ప్రశ్నలతో పాటుగ్గా మీకు కలిగే సందేహాలు, మీకున్న అభిప్రాయాలు, అభ్యంతరాలు.... ఇట్లాంటివన్నింటినీ క్రోడీకరిస్తే ఆ...అన్నిటికీ సమాధానమివ్వగలిగిన శక్తి నాకు లేదనుకుంటాను. అసలిట్లాంటి సంకలనాలు తేవటం ఎప్పుడైనా... ఎవరికైనా సాహసమే అనేక ప్రతికూల పరిస్థితులను ఎదుర్కోని, ఎదుర్కోవలసి ఉంటుందని తెలిసీ, ఈ పనే చేయకతప్పటంలేదు.
ఇందులో అందరి సందేహాలకు సమాధానాలు దొరకవు. ఈ సంకలనంతో ఎందరికి ఎన్ని పేచీలున్నాయో నాకూ అంతకు మించిన పేచీలున్నాయి. అయినప్పటికినీ ఈ సంకలనం రావటం ఒక అనివార్యత.
ఎందుకంటే-

"పగిలిన తెలంగాణ కవికంఠమిది"

1934లో ఎప్పుడో ముదుంబై రాఘవాచార్యులు నిజాం రాష్ట్రంలో ఆంధ్రకవులు పూజ్యం అని ఒక వ్యాసంలో ప్రస్తావిస్తే సురవరం ప్రతాపరెడ్డిగారు 354 మంది కవులతో గోలకొండ కవుల సంచికను ప్రకటించి చూపారు. నిజానికి ముదుంబై రాఘవాచార్యులు వాస్తవమే మాట్లాడారు. సురవరం దాన్ని తప్పుగా అర్థంచేసుకొని అభిమానంతో ప్రత్యేకసంచిక తెచ్చారు. నిజాం రాష్ట్రంలో ఆంధ్రకవులు ఉటానికి వీల్లేదుకదా! ఆయన ఉద్దేశ్యం నిజాం రాష్ట్రంలో కూడా ఆంధ్రకవులు లేరేమోనన్న బెంగకదా! నిజాం రాష్ట్రంలో తెలంగాణ కవులుంటారు. లేదా నైజాం

కవులుంటారు. ఆంధ్రకవులెట్లా ఉంటారు? ఈ వినిర్మాణాన్ని మీరు క్షమిస్తారని అనుకుంటాను.

1934 నుంచి 2002 దాకా గడిచిన 68ఏళ్ల కాలగమనంలో సాహిత్యం, కవిత్వం సమస్తాంధ్రము సమగ్రాంధ్రము, అయిపోయి స్వర్ణాంధ్రాం దాకా వచ్చేసి ప్రాంతీయ ప్రత్యేకతల్ని కప్పెట్టి ఒకరో ఇద్దరో పలువురో మహాకవులయిపోయారు. మధునాపంతులుకిచ్చిన గౌరవం వానమామలైకి ఇవ్వలేకపోయారు. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుకిచ్చిన ప్రముఖస్థానం వట్టికోట ఆళ్వారుస్వామికి ఇవ్వలేకపోయారు. కొక్కుకిచ్చిన ప్రాధాన్యం మరో తెలంగాణ రచయితకు ఇవ్వలేకపోయారు. మొన్నటికి మొన్న రేగడివిత్తులు ఏకైక బహుమతి గెలుచుకున్న నవలగా నిలబడుతుంది. నిలబెట్టబడుతుంది. మరో నవలేదో అనామకంగా మిగిలిపోతుంది.

తెలంగాణ ఆంధ్రాకాలనీకాదుగద, అవునుగద, మరి.... ఈ వలసని ఎదుర్కోవాలంటే ఈ వలసనక్కలకు రాచరికం దక్కకూడదనుకుంటే... ఇట్లాంటి సంకలనాలు ప్రతి గడప నుంచీ రావాలి. తెలంగాణ బొడ్రాయి సాక్షిగా ఊరూరా కవి సమ్మేళనాలు జరగాలి. వామపక్షాల కప్పదాట్లసాక్షిగా విశాలాంధ్రలు కనుమరుగై మహాతెలంగాణ అవతరించాలి. వారి చారిత్రక తప్పిదాల సాక్షిగా తెలంగాణ తన సంస్కృతి తక్కువదని చిన్నబుచ్చుకోకుండా సగర్వంగా తలెత్తుక తిరగాలి.

వాస్తవానికి ఈ సంకలనంలోని కవిత్వం చదివాక నా సంపాదక మాట అనవసరమేమోననిపిస్తుంది. నామాట కంటే కవులమాట శక్తివంతమైనందుకు ఈ సంకలన సంపాదకుడిగా, తెలంగాణా వాసిగా గర్విస్తున్నాను. మళ్లీ మొదటికొస్తే నిజాం రాష్ట్రంలో ఆంధ్ర కవుల్ని వెతకపూనటం ముదుంబైవారి అమాయకత్వమన్నా కావాలి. స్పష్టంగా ఆధిపత్య భావమైనాఅయిఉండాలి ఆనాటి వ్యాఖ్యనుంచి ఈనాటిదాకా కొనసాగుతున్న సాంస్కృతిక ఆధిపత్యానికి నిరసనగా వెలువడుతున్న ఈ 'పొక్కిలి' ఇపుడు మీ చేతుల్లో ఉంది. గోలకొండ కవుల సంచిక వెలువడటానికి, ఇప్పుడీ సంకలనం వెలువడ్డానికి మధ్య దరిదాపుగా ఏడుదశాబ్దాల కాలపరిణామం ఉంది. వలసవాదం దీని నెత్తిమీద రుద్దిన సంస్కృతి, రాజకీయాన్ని ఫలితంగా

తనకు ఏర్పడ్డ నష్టచరిత్రను ఇపుడు మననం చేసుకోంటోంది తెలంగాణ.

పోలీసు చర్యలు, సాయుధ తిరుగుబాట్లు, 1969లు, ఇంద్రవెల్లులు, సిరిసిల్లా, జగిత్యాలలు,... . ఈగడ్డమీద ఏమూలచిందిన నెత్తురైనా ఈ 10జిల్లాల మొకానికంటాల్సిందే. ఈ తెలంగాణ గట్లమీన కొబ్బరిచెట్లు లేక, పచ్చపచ్చటి ఆకుమళ్ళు లేక, అడుగడుక్కీ పారే సాగర్ కుడికాలువలులేక, ఎంత అలమటించిందో... ఏ గొరకొయ్యలు పొడిచిన వేళ అడ్డెడుజొన్నలు తొక్కుకునేందుకు ఏ తల్లులు నిద్రలేచారో ఉలిక్కిపడి... ఏ వరిబువ్వల కోసం ఎన్ని పసిపిల్లల కండ్లు అన్నం మెతుకులయ్యాయో ............. ఆ పిల్లల కండ్లే ఈ సంకలనంలోని అక్షరాలు.

సంపాదకుడిగా మరీ కవిత్వమైపోతున్నానని అనుకోకండి. అసమ అభివృద్ధి చరిత్రంతా అయితే కవిత్వం గానో....లేక కన్నీటిగానో...లేక ఏడుపుగానో...లేక ఏర్పాటు వాదంగానో.. అనిపిస్తే ఎవరుమాత్రం ఏం చేయగలరు? ఇపుడీ తెలంగాణ కవులు తమగతాన్ని నెమరేసుకుంటూ చిన్న రాష్ట్రంగా తనదైన సంస్కృతితో నిలబడాలని ఆకాంక్షిస్తున్నారు. సచివాలయాలముందు ఈపుస్తకాన్ని ప్రతిరోజూ ఆవిష్కరించాలనుకుంటున్నారు. ప్రత్యేక రాష్ట్రం వచ్చేదాకా. . . . .

ప్రతిరాజకీయ ఆకాంక్షకు అది చేరబోయే గమ్యానికి మధ్య ఎన్నో అవాంతరాలు, ఆటంకాలు ఎదురుకావచ్చు. ఆ ఆకాంక్ష నెరవేరే దాన్ని నెరవేర్చే దాన్ని ప్రజాసమూహం దాని సంవేదనలను బలీయంగా నిలుపుకుంటేచాలు, ఈ కవులు చేస్తున్న పని తెలంగాణ ప్రజ తన సంవేదనలను సునిశితం చేసుకునేందుకు పురికొల్పుతున్నది.

సంపాదకుడిగా ఈ సంకలనం తేవడం వెనుక రెండు ప్రధాన లక్ష్యాలున్నాయి. దిష్టిబొమ్మ, నాతెలంగాణ, పాతాళగరిగె, గోస, తొవ్వ, ఎన, తెగినపోగు, ముల్లుగర్ర, గాలికట్ట, మనిషెళ్లిపోతుండు లాంటి అనేక సంకలనాలను చూసినప్పుడు ఇందుకు భిన్నంగా ఉన్న స్వప్నలిపి, రహస్తంత్రి, చిలుకలువాలిన చెట్లు, వెలుతురు పిట్టలు, అమభూతిగీతాలు, నీటిపుట్ట, తుఫానుతుమ్మెద లాంటి సంకలనాల శీర్షికలు చూసినప్పుడు ఆయా కవిత్వాలు చదివినప్పుడు ఒక ప్రధానమైన

తేడా కొట్టొచ్చినట్లు కన్పించింది. ఇది ప్రాంతీయ ప్రత్యేకతల్ని బట్టే తప్ప రాలేదని, ఈ తేడా ఆధిక్య న్యూనతలను పెంచుతుందని మనకర్థమౌతుంది. ప్రధాన స్రవంతి సాహిత్యంతో ఒక ప్రాంతం కవులు వెనుకబడిపోయారేమోనన్న భావనను కలిగిస్తుంది. ఈ భావన హేతురహితమైనదని మనకర్థమౌతుంది. మెయిన్‌స్ట్రీమ్ కవిత్వం ఈతెలంగాణ పాయలను ఏకవిత్వ జీవనదుల్లోనూ కలవనివ్వడం లేదని, అలాగని విడిగా కవిత్వంగా పరిగణించబడడం లేదని అర్థమౌతున్నప్పుడు "ఒక్క భాదగాదు " అన్పిస్తుంది. తెలంగాణ కవులను విడివిడి సంపుటాలుగా కాక ఒక సంఘటిత సంకలనంగా, స్వరంగా, చూసినప్పుడు ఆకవులలో కలిగే ప్రాంతీయ ఏకత్వ భావనలో ఎంతశక్తి ఉందో తెలిసొస్తుంది. ఇది ఒక కారణం.

ఇక రెండోది

వీరతెలంగాణను వలసవాదులు వార తెలంగాణగా చిత్రిస్తే, రాజ్యం దీన్ని 'వార్' తెలంగాణ గా అంది. తమతమ ప్రయోజనాల్లోంచి చూస్తూ తల్లి తెలంగాణాను కించపరుస్తున్నప్పుడు, ఇది మా తెలంగాణ, ఇది నాతెలంగాణ, ఇదిమన తెలంగాణ.... ఇది జన తెలంగాణ, ... ఇది నిజ తెలంగాణ..... విశాలాంధ్ర కాదు విషాదాంధ్ర కాదు, మాకు మహా తెలంగాణ కావాలంటే నైజాం ఏలుబడిలో వున్న ప్రాంతమంతా మా కిందికే ననుకొన్న రెండే రెండున్న జిల్లాలు ఒంటరివైపోతాయి. అంటే ఒక రాజకీయ ఆకాంక్షగా ప్రత్యేక తెలంగాణ తన రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక విముక్తిని కోరుతున్నప్పుడు ఇక్కడి కవులంతా ప్రాంతీయ వైషమ్యంతో నిమిత్తం లేకుండా అవసరమే అయితే వైషమ్యంతో కూడా తన రాష్ట్రాన్ని తానుసాధించుకోవటం కోసం నడుంబిగించాలన్న ఒక సంకల్పాన్ని ఇవ్వడం కోసం ఈ 'పొక్కిలి'లో ఇందరి కవుల్ని ఒక చోట చేర్చాం.

ఈ రెండు ప్రధానలక్ష్యాలతో పాటుగా మరోలక్ష్యం కూడా ఈ సంకలనానికి ఉంది. అది నేటివిజమ్ అన్న భావన. ఇది భారతీయ సాహిత్యవిమర్శలో ఇటీవలికాలంలో తలెత్తిన సరికొత్త భావన. ఇందులో ప్రధానంగా యూరోకేంద్రక దృక్పథాలనుంచి సాహితానుశీలన జరగటాన్ని ప్రతిఘటించటం, అంటే వలస పాలకులు అలవాటు చేసిపోయిన వలస పాలనకు లొంగిపోయిన మానసిక

దౌర్బల్యాల్లోంచి సాహిత్యాన్ని చూడటం వదిలిపెట్టమని నేటివిజమ్ ఘోషిస్తోంది. దీనికి ప్రధానంగా ఇద్దరు కారకులు. ఒకరు రామచంద్రనెమడే, రెండవ వారు జి.యస్. దేవి.

మన సాంస్కృతిక వనరుల కోసం మన పెరళ్లలో వెతుక్కోవాలి తప్ప పరలోగిళ్లముందు పడిగాపులు కాయనక్కర్లేదని చెప్పిన యు.ఆర్.అనంతమూర్తి సాక్షిగా కవిత్వం, కథ, నవల అన్ని సాహిత్య ప్రక్రియలు వలసవాద ప్రక్రియలుగా అందునా మొదట బ్రిటిష్ ఆంధ్రా ప్రాంతానికి, ఆతర్వాత తెలంగాణ ప్రాంతానికి బట్వాడా అయ్యిఉండటం వాటి నుంచి ఈ ప్రక్రియలను విడిపించుకోవటం కొత్త ప్రక్రియావిష్కరణకు , లేదా దేశీయమైన సంస్కృతిలోంచి వచ్చిన ప్రక్రియలను ఆధునీకరించుకొనో, ఉత్తరాధునీకరించుకొనో ఉపయోగపెట్టుకోవటం మంచిదని భావించటం కారణంగా ఈసంకలనాన్ని తేవటం జరుగుతుంది. భాషంటే సాంస్కృతిక వ్యవస్థ. అందువల్ల ఒక సాంస్కృతిక ఆత్మగౌరవం కోసం తెలంగాణా కవులందరూ నడుంకట్టాలని ఈసంకలనం ఆశిస్తున్నది.

నేటివిజమ్ గూర్చి భారతీయ సందర్భంలో మాట్లాడేటప్పుడు ఆంగ్లీకరించబడిన సామ్రాజ్యవాద వ్యతిరేకత, సంస్కృతీకరింపబడిన భారతీయతా ఈ రెండూ వెనుకబడిన ప్రాంతాలకు సమానంగానే శత్రువులవుతాయి. తెలంగాణ సందర్భంలో చూసినప్పుడు భాషంటే కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరులు పాక్షికంగా అందించిన ప్రామాణిక భాషనే ఒక బ్రహ్మపదార్థాన్ని సృష్టించి, ఒకే రాష్ట్రంగా పిలువబడే భిన్నయాసలు మాట్లాడే ప్రాంతాలకు అందించామని, అదొక్కటే తమ ఆధిక్యతను నిలబెడుతుందని ఇంకా నమ్ముతున్న వారికి ఈ 'పొక్కిలి' ఒక ప్రతిఘటన, ఒక సవాలు.

ఏ భాష ఎవరికి ప్రామాణికం? నీభాషను నా నాలుకతో నేనెట్లామాట్లాడుతాను? నీలాగే నేనెందుకు మాట్లాడి, నీవ్యాకరణాన్ని నేనెందుకు అనుసరించాలి? నా భౌగోళిక పరిస్థితులు వేరు, నా నేల వేరు, నా నాగరికత వేరు, అయినప్పుడు నన్ను నీలామార్చనూలేక, నన్ను నాలాగే మిగలనీయక నా మీద నెరపిన రాజకీయ, సాంస్కృతిక కుట్రకు విరుగుడుగా ఈ కవులు తమ యాసను

నూరుతున్నారని ఈ సంకలనం సాక్ష్యమిస్తుంది.
నేటివిజమ్ అన్న భావనకు బలాన్నిస్తోంది.

ఈసంకలనం ఇచ్చే సాంస్కృతిక నినాదం నేటినిజం - నేటివిజం.

సంపాదకుడిగా ఈసంకలనంలో చేర్చిన కవిత్వాన్ని, కవులను నేను విశ్లేషించటం లేదు. సంకలనం కోసం కవిత్వం పంపమని కోరగానే కవిత్వంతో పాటు వందలాది ఉత్తరాలు నాకు చేరాయి. వాటిని విడిగా ఒక సంపుటిగా ప్రచురించేంత ప్రాధాన్యం ఉన్న ఉత్తరాలవి. ఎందుకు ఈకవులు ఈసంకలనానికి ఇంత సానుకూలస్పందన ఇచ్చారనేది ఆలోచిస్తే సంపాదకుడిగా నేను శ్రీభాగ్‌నుంచి బషీర్‌బాగ్ దాకా చూడమంటాను.

సంపాదకులు తాను సంకలించిన సంకలనంలోని కవిత్వపు పంక్తుల్ని పేర్కొని వాఖ్యానించి రకరకాల బహురూపుల ఏషాలు యెయ్యొచ్చుగాక. కానీ ఇప్పటికే ఈసంకలనం గురించి ఎక్కువ మాట్లాడాను. మాట్లాడవలసిందే. నేను కాదు. కవులు, ప్రజలు.

కోదాడ

13 మే, 2002

సంపాదకుడు

**జూలూరు గౌరీశంకర్**

# దండాలు

పొక్కిలి వెలువడటానికి ముందుగా నాలుగైదు నెలల నుంచి ఈ సంకలనం తేవడానికి నాకు తెరవెనక నుంచి సహకరించి, నన్ను ప్రోత్సహించిన మిత్రులు ఎందరో. . . . ఈ సంకలనం మొదలు పెట్టిన దగ్గరనుంచి ధైర్యాన్ని ముందు పెట్టుకునే అడుగువేశా. ఈ పుస్తకం ఈ రూపం తీసుకోవడానికి తెలంగాణ అన్ని జిల్లాల నుంచి అనూహ్యంగా స్పందించిన కవుల స్పందనకు ఎలా కృతజ్ఞతలు చెప్పినా సరిపోవు.

నైతికంగా నాకు మద్దతు నిచ్చి నా పక్కన నిలబడ్డ గుడిపాటి, గింజల ర్యాం (రమణారెడ్డి) కృషి మరవలేనిది. ఈ పుస్తకం రూపం పోసుకోవడానికి ప్రూఫులు చూసి నాకు సహకరించిన కోదాడ ఇ.వి.ఆర్. కళాశాల తెలుగు లెక్చరర్ ముదుంబ లక్ష్మణాచార్యులు, కథా రచయిత, జూపూడి రాధాకృష్ణ లకు కృతజ్ఞతలు.

డి.టి.పి. పని మొదలు పెట్టాలంటే, పుస్తకం అచ్చు వేయాలంటే ప్రధానంగా డబ్బు కావాలి నా దగ్గర డి.టి.పి. పూర్తయ్యే నాటికి ఒక్క పైసా లేదు. సవాళ్ళ మధ్య తెస్తున్న పుస్తకానికి ఆర్థిక సంకెళ్ళు అడ్డం ఎన్నెన్నో వచ్చిపడ్డాయి. బాధెందుకు పడతావురా. . . నీ పనికి ఏ అడ్డంకులూ ఉండవు. పుస్తకాన్ని అచ్చు వేయించడానికి నాకు ధైర్యం చెప్పి ముందుకు నడిపించిన నా చిన్నప్పట్నుంచి స్నేహితుడు, జ్యూవెల్ ఆఫ్ ఇండియా అవార్డు గ్రహీత, కోదాడలో ఇ.వి.ఆర్., స్నేహ, కిడ్స్ విద్యాసంస్థల అధిపతి గింజల ర్యాం (రమణారెడ్డి) లేకుండా వచ్చేదికాదు. సురవరం ప్రతాపరెడ్డి చేతులందుకోవడానికి గింజల ర్యాం చేసిన ఈ సాయం మరువలేనిది.

ఈ పుస్తకానికి కవిత్వం పంపడంలో, కవుల్ని కదిలించడంలో వేణు సంకోజు, నాళేశ్వరం శంకరం, నందిని సిధారెడ్డి, బన్న అయిలయ్య, పొట్లపల్లి శ్రీనివాసరావు . . . ఇంకా అనేకమంది పడ్డ తపన అంతా ఇంతా కాదు. సైలెంట్ మందుపాతర గుడిపాటి చేయాల్సిన పనంతా చేశాడు. నేను ఏ పని తలపెట్టినా ధైర్యంగా నిలబడే సీతారాం, వంశీ, ప్రసేన్, అఫ్సర్ లను గుర్తుచేసుకోకుండా ఎలా ఉండగలను?

నేను తలపెట్టిన ఈ సంకలనం ముందు పడుద్దా? సంకలనం మంచిగొస్తదంటరా? సరే చూద్దాం? కానీలే అంటూ నా వెనుక, నా మిత్రుల

వద్ద కుండపోతగా తిట్ల పోతలు గుప్పించి నన్ను మరింత ఉత్సాహపరచిన మిత్రులందరికి పేరు పేరున దండాలు.

కోదాడ నుంచి కేక వేస్తే భాగ్యనగరంలో విని, ఛిద్రమైన తెలంగాణ "పొక్కిలి" నేలను తన కుంచెతో సజీవంగా గీసి, అందమైన కవర్ పేజిని అందించిన తెలంగాణ గర్వించదగ్గ ఆర్టిస్ట్ లక్ష్మణ్ ఏలే అన్నకు వందనాలు.

మా కోదాడలోని సాయితేజ ప్రెస్‌ను దాదాపు నా ఆధీనంలోకి తెచ్చుకొని వారి వ్యాపార పనులన్నీ పక్కనేసుకొని కూడా నాకు సహకరించిన మిత్రుడు, జర్నలిస్ట్ అక్కిరాజు సంపత్‌కుమార్ కు ధన్యవాదాలు.

పుస్తకం పనులు వేగంగా జరగాలన్న యావతో వేగంగా పనిచేసే డి.టి.పి. ఆపరేటర్ సుంకు శ్రీనివాసరావు పై అనేక సార్లు తెగిన కోపంతో తిట్లు కురిపించినా చకచకా పనిచేసినందుకు థ్యాంక్స్.

నాలుగు నెలలుగా ఇంటిని అప్పుడప్పుడు పట్టించుకుంటూ నాకు నేనుగా పొక్కిలైపోతుంటే నాకు ధైర్యమిచ్చిన నా జీవిత భాగస్వామి "సత్యవతి" కి ప్రత్యేక కృతజ్ఞతలు.

తన ఆఖరి శ్వాసను తెలంగాణా పద్యంగా ఊపిరూదిన తెలుగు విశ్వవిద్యాలయం అసిస్టెంట్ ప్రొఫెసర్ "మద్దెల శాంతయ్య"కు బాధతో. . .

చనిపోవడానికి కొద్దిరోజుల ముందుకూడ సంకలనం తొందరగా తెమ్మని కోరిన అన్న "ప్రొఫెసర్ జనార్ధన్‌రావు" కి జోహార్లు.

సంపాదకుడు

# పొక్కిలికి తొవ్వ

# తెలంగాణా 2002

## పొలి

కదులుతున్న ఉరికంబం నావూరు
సూర్యచంద్రుల్ని వెలేసిన ఆకాశం నాది
నా చుట్టూ వీచే గాలి
అధికారం విసిరిన ఉచ్చు.
ఇరుసు విరిగి కుప్పకూలి
చెల్లాచెదురైన బండి
విరిగిన చక్రాల మధ్య
తెగిన కాళ్ల మధ్య యెప్పుడూ వో రక్తప్రవాహం
నెత్తురేదో చెమటేదో కన్నీళ్లేవో తెలియని యేరు
ఉరికంబం కదులుతోంది మూలుగులతో.
వొళ్లంతా వొకనెగడు
నాలుకలు చాచిన బతుకు వాంఛ.
నరాలతీగల్లో నిప్పులవాగు

2

మరదసాల పిట్టగోడలు
సిగ్గుపడ్డాయి నేను పుట్టినప్పుడు.
యే భాషలో యేడ్వాలో నవ్వాలో తెలియక
కళ్ల కింద నవ్వుని పాతుకుంది అమ్మ.
మతం పేరుపెట్టాలో
ఆదర్శం పేరుపెట్టాలో తికమకపడి
తెల్లారేదాకా కునుకు లేదు నాన్న కళ్ల మీద-
పురిట్లోనే యిద్దరికి సంధి కొట్టాక
నాతో సంధి కుదుర్చుకుంది చావు.
యిప్పుడో అప్పుడో కుప్పకూలే కోమట్లగూడెం
గుడిసె తడికలోంచి ఆ మురికిచేతుల పొడుగుగోళ్ల భూతం

యిప్పటికీ నన్ను వెంటాడుతోంది
క్షణానికో రూపం మార్చుకుని-
మూడు పదుల ముచ్చట్లూ తీరలేదు
మాయముంతలో దాచిన కన్నీళ్ల నిప్పులూ ఆరలేదు
యెన్నెన్ని రాత్రుళ్ల జాగారం తర్వాత
కన్నువిప్పిందో నా పల్లె దేహం..
చావుభయ్యంతో అమ్మగావుకేకలు ఊరంతా.
కాళ్లూచేతులూ రాక్షసంగా పట్టుకుని
ఆమె బాధనంతా అదిమిపెట్టాలని నలుగురి తాపత్రయం
ఊళ్లోలేని డాక్టర్ల కోసం
నాన్న పేదకాళ్ల ఉరుకులూ పరుగులూ
నా నాటు ప్రపంచం ఎలా తెల్లారిందో చూశావా?
మంత్రసాని నల్లచేతుల్లో చివరికో నెత్తుటిముద్ద
సాయిబుల పేరూ మా పెబువు పేరూ కలిపి పెట్టమని
కిరస్తానమ్మ గొంతెమ్మకోర్కె.
తురకల ఇంట్ల పుట్టడం గొప్పకాదులే,
అవునూ నువ్వు యెన్నో నెంబరూ?
-యెవరో వెటకారంగా నవ్వుతున్నారు గాలిలో!
చూపులతో స్నానిస్తున్న పిచ్చితల్లికి యేమీ తెలియదు
పొమ్మన్లేక పెట్టే పొగలూ ముంతపొగలూ
కన్లేక కన్న తల్లికడుపుకేం తెలుసు?
యీ బిడ్డయినా లోకం చూస్తాడా లేదా అన్న
నిరంతర భయం వెంటాడే పల్లెతల్లికేం తెలుసు?

3

అన్ని పల్లెటూళ్లూ అందంగా వుండవు
పచ్చలహారం వేసుకున్నట్టు వొయ్యారంగా వుండనే వుండవు.
మంచుతెరల మేలిముసుగులో దాక్కున్న నీలికొండలూ
కొండల చివరాఖర్నించి ఎదుగుతూనో రాలుతూనో వెళ్లేసూరీడు
పిండిలా కురిసే వెన్నెల్లోంచి యెడ్లబండి ప్రయాణాలూ
చుక్కల లెక్కింపులూ ఇవేవీ లేవు.

నా పల్లె యెప్పుడూ జ్వరపీడిత దేహం
యే పొద్దయినా వొక్కటే దృశ్యం
వొక మలేరియా వ్యాధిపీడితుణ్ని
తొట్టిలో కూర్చోబెట్టుకుని
పట్నం వేపు పరుగుతీస్తున్న యెడ్లబండి.
తిరిగి సాయంత్రానికి అదే శరీరాన్ని శవంగా మార్చుకుని
తిరుగుముఖం పట్టిన విషాదపేటిక.
ఆ శవం దుప్పటితీస్తే
అమ్మ ముఖం కనిపిస్తుందేమోనని
యెప్పుడూ ఓ భయం
నా దేహంలోకి జెర జెర పాములా పాకుతుంది.

4

నోటికందుతున్న ముద్ద
నాలుకలోంచి గొంతులోకి దిగేదాకా భయమే!
ఎత్తిపోసుకుంటున్న గళాసులోని నీళ్ల ధారని
మధ్యలోనే యెవరో తెంపేసుకుని
వాళ్ల గొంతుల్లోకి వొంపేసుకుంటారనీ భయమే!
అన్నీ నా నోటిదాకా వచ్చి వెళ్లిపోయినవే మరి.
చివరికి స్వాతంత్రం కూడా!
నా పంద్రాగస్టు
ఓ పెద్దవెక్కిరింత కాదూ!
అందరూ మూడురంగుల జెండాలు ఎగరేస్తున్నప్పుడు
నా శరీరంవొకే వొక్క నెత్తుటి రంగులో తలకిందులుగా
ఏ చెట్టుకొమ్మకో వేలాడుతోంది

5

యెప్పుడూ ఓ నల్లబూటు కాలు నా శరీరాన్ని
కసిదీరా నలుపుతూ వుంటుంది
నీకు తెలిసో లేదో కానీ
నా కలలోకి అది వొక వెయ్యికాళ్లదేహంగా మారి గంతులేస్తుంది.

ఖాకీరంగుల కీకారణ్యంలో బందీని.
నా భాష నాకు నిషిద్ధం
నా రాత నాకు నిషిద్ధం
అధికారం మూసలో నేనొక బొమ్మని
తుపాకుల కొనమీద ఉరేసిన ప్రాణం నాది
చెమటతో తడిపి నెత్తుటినేలలో పొదిగిన విత్తు నాది కాదు
గాలిలా కాపలా కాసి
ఆకాశమంత కన్నుతో కాచుకుని
పెంచుకున్న ఏ మొక్కా నాదికాదు
నా దేహాన్నంతా తనలో దాచుకుంటున్నట్టుగా
కాసిన ఏ కాయా నాది కాదు
ఏదీ నాది కాదు
అన్నీ వాడివే!
నా బతుకంతా వాడికి రాసిచ్చినట్టు
నా వూపిరీమీదా, నా శరీరం మీదా
నా మనసుమీదా అన్నిటిమీదా వొక ఉక్కుబూటు.
పరాయీకరణ కతలు నువ్వెన్ని చెబుతున్నావ్,
నాది కత కాదు
బతుకు
చిన్నప్పట్నించీ నాది కాని బతుకు

6

కాలికింద చీమప్రాణంలో
చిటుక్కుమన్న బతుకుతీపి
చెట్ల భుజాల మీద ఆరేసిన
నిండుప్రాణాల నెత్తుటిమంటలు
అణగిపోయిన దేహాలకు
నలిగిపోయిన కంఠాలకు
పోరాటం సిద్ధాంతం కాదు, బతుకు పాఠం!
విరిగి శకలాలవుతున్న ఆకాశాల్ని కళ్లకింద వొత్తిపెట్టి
నమ్ముకున్న నేలచెక్కని అప్పులకో వడ్డీలకో

రాయని కాగితాల కింద బతుకంతా వెట్టి.
వొక్క నమ్మకమే
నిప్పులాంటి వొక్క మాటే బతుకంతా.
విలాసాల బండి ముందు బేగారీ పరుగులు
గడీల నిలువెత్తు గోడల మధ్య పగిలిన కన్నీళ్లు
గొంతుగోడల్ని చీల్చలేని కేకల ఉరుకులు.
మాయలు తెలియవు
మంత్రాలు తెలియవు
రెండు కత్తుల కౌగిలింతలు తెలియవు
బాంచన్...వొకే మాట ఇన్నాళ్లూ!
సహనం ఆత్మఖననం చేసుకున్నాక
బతుకు వో పోరాటం
పచ్చాపచ్చని పైరు కింద
ఈ శవాల గోడేమిటన్న కొమరన్న
గొంతుమీద తుపాకుల కంచె.
యిప్పటికీ బందగీ శవమ్మీద పడి యేడుస్తున్నాయి పల్లెలు.
ప్రశ్న మళ్లీ పుట్టింది
నేలమీద వీచే గాలి ప్రశ్నగుర్తుల కొడవళ్లని
తిప్పుతూ ఊళ్లని చుట్టింది
వొంగివాడిలిపోయిన బానిసదేహాలు
నిటారుగా నిల్చున్నాయి
రావుగారి ఇంటిముందు రాత్రిపగలు కాపలాల్లేవు
పుట్లకొలదీ వడ్లు దంచిపోటు వేయడాల్లేవు
గుట్టలకొద్దీ వంటకట్టెలు పగలగొట్టేది లేదు
కనులెర్ర జేయడాలూ పండ్లు పటపటకొరకడాలూ
చింతబరిసెలతోటి వీపు చితక్కొట్టడాలూ లేవు.
యిప్పుడు బానిస
ఆకలినాలుకల ప్రళయం.

7

గెలిచానో ఓడానో తెలీదు
నెత్తురోడాను పోరాడాను
ఉరికంబాల్ని వెక్కిరించాను
కాళరాత్రి పూసిన కటికచీకట్ని తుడిచాను
ఆయుధాల్ని ఎదిరించాను
దేవిడీల లెవీల కుట్రలన్నీ ఛేదించాను
1920కీ 1944కీ మధ్య ఎన్ని బేగారీ పరుగులు...
గుండెనిండా కడవెండి
నను కన్న నా నేలని
వొంటినిండా హత్తుకున్నాను
రాజకీయాన్నీ మతాన్నీ కలిపికుట్టిన దారం
నాకు ఉరితాడు పేనింది
కళ్లల్లోని ఎర్రజీరల్ని కూడా
చీల్చిచెండాడం చూశాను
అప్పట్నించే నా పల్లె అంటే ఎరుపు
నా ప్రతి అడుగూ ఎరుపు
నా ప్రతి మాటా ఎరుపు
నేనే నిషిద్ధమయ్యాను
నా అడుగుల కింద గూఢచారినేత్రాలు మొలిచాయి

8

వేట మొదలైంది
గోడల్లో కత్తులు
వీధుల్లో తుపాకులు
ఎర్రజీర కనిపించినచోటల్లా కార్చిచ్చు.
కాలిగోళ్లకి మేకులు
అరిచేతుల్లో సూదులు
దేహం వాడిచేతుల్లో పిండిముద్ద
'యమబాధ'ల నరకానికి తెరిచిన దారి
వూళ్లకి వూళ్లేనెగళ్లు

అడివి దారి అప్పుడే తెలిసింది

9

పచ్చని పైరుకింద నిద్రలో తూగే పూవు కాదు
పోరాటాల పురిటిగది నా పల్లె.
ఎప్పుడూ బాలింత తిరుగాడుతున్న ఇంట్ల పుట్టే వాసన
నా పల్లె నిండా.
రచ్చబండల మీద చుట్టపొగలు
గాలిలో మేఘాలు కాదు
లోకాన్ని చుట్టివచ్చే పొద్దుటి మంచుపొగల్ని చీల్చే
నునువెచ్చని కిరణాలు
కోలాటం చప్పుళ్లలో వున్నట్టుండి మాయమైన కొడుకు గొంతు
అసోయ్ దూలా పూనకం పట్టిన ఆలమ్‌తో
వడివడిగా అడుగులేస్తూ యెటో వెళ్లిపోయిన బిడ్డ పరుగులు
ఊరినిండా.
పదారేళ్ల యవ్వనం నా పల్లెకి శాపం
ఏ బిడ్డడికీ పదారేళ్లు రాకూడదని
శాపం పెట్టుకుంటోంది ప్రతి తల్లీ.
మూతిమీద సన్నటి మీసం రేఖ కనిపిస్తే భయం.
అది శరీరాన్ని కట్టిపడేసే సంకెల.
ఖాకీ కళ్లల్లో అనుమానాల ముళ్లు
యవ్వనం అంటే మెరుపుల కల కాదిక్కడ
నోరు తెరిచిన జైలు.

10

గోడల్ని ఎరుపెక్కించిన 70లు.
మనసుమారుమూలల్ని వెలిగించిన చీకట్లు
చీకటి నీడల మధ్య గంభీరస్వరాలు
ముఖం కనిపించని చరిత్రపాఠాలు
కొత్త చదువు మొదలైంది
మునేరు నీళ్లల్లో ప్రతిబింబం మారింది
దర్గా దాటించిన వంతెన

కొత్త అర్థం వెతుక్కోమంది
దేహమంతా వొక సెలయేరై
సహజస్వచ్ఛంగా పరవళ్లుతొక్కింది
అక్షరాలుమెదణ్ని చిత్రికపడతున్నాయి
గొంతులో గడ్డ కట్టిన మాట
పాటలోకిఎగసి పారుతోంది
గలగలా గోదావరిలా.
ఘల్లు ఘల్లు గజ్జెల సింగారం
ఊరినిండా వాడనిండా.
ఊరూ వాడా వొకేసారి నిద్రలేచాయి
తురకవీధుల అజాపిలుపుల్లో గొంతుమారింది

11

అన్నీ పసికట్టేవాడు శత్రువే!
అందరికంటే ముందు నిద్రలేచి
గుప్పిట్లోసూర్యుణ్ని అదిమిపెట్టాలనుకుంటాడు శత్రువు
దిక్కుల మీద రెండుపాదాలూ మోపి
చుక్కల మీసాలు తిప్పుతాడు
అందరికంటే ముందే రూపం మార్చుకుంటాడు శత్రువు
అదనుచూసి వేషం..ఎప్పుడూ పేదవాడిపైనే ద్వేషం!
పల్లెమీద పగవాడినీడ పడింది
ఇప్పుడూ ఎప్పుడూ వాడికి పల్లెమీదనే ద్వేషం
యంత్రంలా నిద్రపోయే పట్నం మీద మమకారం
యంత్రంలా కదిలే మెదిలే మసలుకునే మనుషులమీదనే మమకారం

12

యంత్రనగరి వాడి కల.
మరే ఆలోచనా మేలుకోనివ్వని ఉక్కు శరీరాలూ
మాటల్ని నిషేధించి మీటల్ని సృష్టించే
బంగారుయుగం వాడి కల.
నిజం అంటే ద్వేషం

మనిషి అంటే ద్వేషం
మానవత్వం నిషిద్ధవస్తువు
అక్షరాలు దిద్దిస్తాడు
పుస్తకాల్ని నిషేధిస్తాడు
మెదణ్ని 'తెల్ల'పురుగు తొలుస్తుంది
తెల్లదేహాలు నిస్సిగ్గుగా
నల్లసమూహాల మధ్య సంచరిస్తాయి
డాలర్ల ముంగిట్లో వేలంపాటలు పెడతాయి
ఇప్పుడో అప్పుడో వూడిపోయే
చెక్కతలుపుల మీద వేలకు వేల
అప్పుల తాఖీదులు
నిండుప్రాణాల్ని వేలిముద్రకింద కొట్టుకుని వెళ్లిపోతాయి
'తెల్ల'పురుగుకి ఏ మందూ పనిచేయదు
దానికి అన్నం పెట్టిన ప్రాణమే రుచి.
శిఖరాగ్రాల మీద రాసుకు పూసుకు తిరగే హైటెక్‌భుజాలకు
కన్నీళ్ల వుప్పదనం తెలుసా?
పల్లె గుండెకింద ఎండిపోతున్న తడి చెలమలూ తాకవు

13

పెదవి విప్పకూడదు
కాలు కదపకూడదు
కళ్లకింద తడిని చంపెయ్
మోచేతినీళ్లమీద బతికేవాడికి
యేం చూసుకుని పొగరు?
వొంగి వొంగి దండాలతో వొంగిపోయిన వెన్నెముక
నిటారుగా ప్రశ్న గుర్తు కాకూడదు
నదుల్నిమింగేస్తారు
వున్న వూరుదాటించి
పక్కవూరికి నీళ్లని తరుముతారు
కరెంటుస్థంభాలు దిష్టిబొమ్మలవుతాయి
ఇంట్లో చీకటి

పల్లెలో చికటి
పొలంలో ఎడారి కమ్ముకొస్తుంది
ఆకాశం పొగమబ్బులతో విషాన్ని చిమ్ముతుంది
అయినా పెదవి విప్పకూడదు

14

ఏది వద్దంటే అది చేసే పసితనపు అమాయకత్వాన్ని నేను
మాట్లాడొద్దంటే మాట్లాడతా
మూలకూర్చోమంటే నిటారుగా నిలబడతా
వింటూ వింటూ బొమ్మలా వుండమంటే వూర్కోను
చూస్తూ చూస్తూ విగ్రహంలా నిలబడమంటే వూర్కోను
కాసేపు బొమ్మలా నిలబడితే నా వొళ్లు తిరగబడ్తుంది
నా మాటే వినదు
నిన్నేం వింటుందిక?
నిన్నేం చూస్తుందిక?

15

నువ్వు చూపిస్తున్న దృశ్యంలో
బొమ్మని కాను
నువ్వు ఆడిస్తున్న మాటల్లో
మాటని కాను
నేను మాట్లాడిస్తానింక
నేను ఆడిస్తానింక
నీ కాగితాలూ మీటల కింద నిక్కి
నీలిగి కూర్చుండను

16

ఎప్పుడో పుట్టిన ప్రశ్నకి సానబడుతున్నా
కొడవల్లిక్కిలా.

# అన్నవరం దేవేందర్

## నాగటి సాల్లలో కన్నీరు

ఎండిన డొక్కల్నుంచి రాలిన స్వేదం
గుండె గాయాన్నుంచి చిమ్మిన నెత్తురు
ఉబికిన నేత్రాలు రాల్చిన కన్నీరు
నేల నలు చెరుగులా
నాగేటి చాల్లలో ధారలవుతున్న సన్నివేశం

ఆకలి వధ్యశిలపై మృత్యువు
ఎండిన పేగుల్ని శిల్పీకరిస్తున్న నేపథ్యం
పురుగుమందులు పుట్టలు పుట్టలుగా
పరుగుల్ని చంపలేకున్నా
మనుషుల్ని చావు ఊబిలోకి దించడం
సహకార అప్పు నోటీసు
రైతు మెడలో ఉరిత్రాడై
మృత్యువును క్రీడించమంటుంది

వినీలాకాశంలో ఎంతకూ రాలని మబ్బు తునకలు
రానున్న రాకాసి చిత్రాన్ని చిత్రీకరిస్తున్నాయి
కరెంటు కోతతో ఉన్న రెండు కోంద్రలు ఎండినప్పుడు
రైతు పొట్టమీద అప్పు కరాళ నృత్యం చేస్తుంది
కాలిన మోటరు రాగివైరు రైతు పాడెకు త్రాడవుతుంది

వెన్నుముకలను అంగట్లో వేలం వేసిన
ఈ పరాధీన భారతం రుణభూమిలో ఇంకి
క్లింటన్ 'అడె' అంటె ముందుకు
దంకెల్ 'శెరి' అంటె వెనక్కు
అయ్యా బాంచెన్ అన్న రీతిలో పులకరిస్తుంది

కన్నీటి ప్రవాహంతో నిండిన
నాగేటి చాల్లలో
నెత్తుటి ముద్దులు కురుస్తున్నాయి
బక్కరైతు గుండెల్లో బడబాగ్ని పేలింది
కరువు రైతు కన్నుల్లో
మోదుగుపూలు విచ్చుకున్నాయి
అయ్యా బాంచెన్ అన్న రీతిలో పులకరిస్తుంది

## మావూరు

ఊరు ఊరంతా ఇంపుసొంపుగాలేదు
ఇరిగి పోయిన పెంట పొనుక
తూట్లుపడ్డ వడ్ల బోరెం
కూలిపోయిన పిడికెల కుచ్చె
చెదలు పట్టిన పాతగుమ్మి
పగిలిపోయిన కురాటికుండ
పనికిరాని ఉపకారి
అరిగిపోయిన ఇసుర్రాయి
ఎండిపోయిన శాదబాయిలు
కూలిపోయిన దొరల గడీలు

* * *

మొన పోయిన గడ్డపార, మొండి కొడవండ్లు
కాకదిన్న కర్రు మీద దెబ్బలేదెబ్బలు
కమ్మరోల్ల వాకిట్ల కాల్చిన బొగ్గుల వాసనలేదు
కొలిమిల మంటల్లేక కూర్పాట్ల పడుతున్న కమ్మరి అంజయ్య

* * *

ఎలుగటి నాగలిచెక్కే పెద్దబాడుష అటుకెక్కింది
పెద్ద కర్రం నొగలు చేసే పెద్దేగి కర్ర ఏది?
గొర్రు, గుంటుకలు బండిగీరెలు చేపిచ్చుడే మరిచింద్రు
ట్రాక్టర్లు, మిషన్లు ఊరు నిండినయి
వడ్ల మల్లయ్య వాకిట్ల చెట్లు మొలిచినయి.

* * *

మొండి తుమ్మలు, మొండితుమ్మలు, మొండితుమ్మలు
ఊర చెర్ల సర్కారు తుమ్మలు లేచినయి
మైసమ్మ కాడిమోతుకు చెట్టు ఎండిపోయింది
వారెవ్వా! పడావుపడ్డ పటేండ్ల పెరండ్లు
ఇగుర్లు లేని చింత చెట్లు
బతుకులన్ని ఎండి ఎరగప్ప అయినయి
అన్నవర్‌బొండిగల జీవునం తకపెకలాడుతంది.

# అన్వర్

## ఉత్తరం

కొడుకా!
గా పట్నం కాడనే సల్లంగుండు కొడుకా!
పెండ్లి సేసుకోకపోతివి
గా గడ్డం గీకకపోతివి
గీ ఉత్తరం ముక్కొంచిందని
అగమాగంగొచ్చెవ్ కొడుకో!
కొత్త సాలొత్తాందని
సంకురాతిరి పండుగొత్తాందని
ఉరికురికొచ్చెవ్ కొడుకో!
ఊర్లె ఓ పండుగలేదు
ఒక పెండ్లి సంబరం లేదు
ఊరి సెరువును సూడక
పంటపొలాన్ని సూడక
గుడికాడికెల్లక సానారోజులైంది కొడుకా!
ఊరు దెయ్యం పట్టినట్టున్నది
పాతబత్తీ గొడవలైనప్పుడు
నువు సెప్పినట్టున్నది కొడుకా ఊరు!
ఊరు దింపుడుగళ్ళం లెక్కున్నది
పొద్దుటికి రాతిరికి తేడా లేకుంటున్నది కొడుకా!
మేం సావలేక బతకలేక
మంచిగనే ఉన్నం కొడుకా!
కొడుకా!
నీ బాంచెన్ కొడుకా!
నీ కాళ్ళు పట్టుకుంటం
నీ తల్లిమీదొట్టు కొడుకా!
అగమైతేమాయే
గిప్పటికి మాత్రం అడనే వుండు కొడుకా!

గీ సందుల నువు ఊరికి రావద్దు కొడుకా!
రావద్దు కొడుకా!
రావద్దు!



# కొన్ని అనుమానాలు - మరికొన్ని అనుమానాలు

బతుకు పరాయిదేశం పాలైనా బాగుండు
ఈ మట్టి మీద మమకారం లేకున్నా బాగుండు
గింతటి శరీరంలో మనసులేకున్నా బాగుండు
గింతకు మధ్యతరగతిని కాకున్నా బాగుండు

నాలుగు అడుగుల సొంత నేలైనా లేని నా దేశంల
అడుగడుగునా అనుమానాలే - చెకింగ్‌లే!

నాలుగు మెతుకుల కోసం అందర్నీ
అనుమానించే వుద్యోగం చేస్తున్నవాడికి
మన శరీరం మీద చెయ్యేసే మర్యాద వుందిక్కడ
బస్సులకెల్లి ఆటోలకెళ్ళి అడావుడిగా దించేసి
అణువణువు గాలించే చనువుందిక్కడ
సంచిలో ఏముందో జేబులో ఏముందో
పేపరు మీద రాసిన రాతలో ఏముందో
ప్రశ్నించే బెదిరించే అధికార ముందిక్కడ.

గడ్డం ఎందుకు పెంచామో
ఎక్కడి నుంచొస్తున్నామో ఎక్కడికి పోతానమో
అనుమానిస్తున్న చూపులకు
మన ఐడెంటిఫికేషన్ చూపించుకోవాలి.

ఎట్లాగు తప్పించుకుంటాం
మధ్యతరగతి వాళ్ళం గదా!
చాన్నాళ్ళుగా అలవాటు పడ్డాం గదా!

నాలుగడుగులు ముందుకేసి కాసేపాగి
మనలాగే నిలబడ్డ అందరి గుసగుసలు విందాం
నిన్న రాత్రంతా వాడంతా ఒకటి చేసిడ్లంట
ఇంట్లపన్న పోరగాల్లను వాళ్ళతో తీసికెళ్ళిండ్లంట
నగరానికి వాళ్ళొచ్చిండ్లంట

* * *

వీళ్ళు వాళ్ళ కోసం రోడ్డు మీదు మనుషుల్ని
ఇండ్లల్ల వస్తువుల్ని ఆగమాగం చేత్తాంటే
ప్రజల కండ్లల్లో అసహనం రగులుతాంది.



# అనిశెట్టి రజిత

## తల్లి కుండ

ఎవలింట్లయినా బువ్వకుండ
ఉన్నదంటే సాలు
బువ్వబెట్టె తల్లికి నిమ్మలముంటది
నట్టింట్ల తల్లి ఉన్నదంటే సాలు
బువ్వకుండ వున్నట్లే.

గాతల్లికి బూమి జాగలుండయి
సర్కారు నౌకరీలుండయి
తెచ్చి పెట్టే మొగోడుండడు
తిని. . . తిట్టి కొట్టిపోయే మొగడుంటడు
కని. . . ఇంట్ల పిల్లగాల్లున్నరంటె సాలు
తల్లికి దీరగుంటది
గా తల్లికి సదువులు రావు
సోకులు తెల్వయి
ల్యాత బొక్కల నాటి సందే
రెక్కలిరుసుకునుడు తప్పిరాదు
పసిపోరిగుండంగనే పేరు కొసకు
అవ్వను జేర్చి పెద్దవ్వను జేసి
బతుకు బరువు నెత్తికెత్తుతరు
అయ్యింట్లయినా అత్తింట్లయినా
బుక్కెడు బువ్వకోసురంగా పేదరాలు
రికామిలేని గానుగెద్దుగోలె కలెదిరుగుతది
కైకిలికి బోయి కడుపుకింత
గాసం సంపాయిత్తది
అరిగోసలు వడ్తది.
గామె కన్న పొల్లగాండ్లను కాసుకునే
తల్లి కోడయితది
గామె పెద్ద గద్దోలె

కొంపను పొదవుకునే రెక్కల గూడైతది
సీకటింట్ల సీకటిని తరిమె
సిన్న బుడ్డిదీపమయితది
ఎగిలి బారంగ ఎక్కచ్చే ఎండపొదయితది
గామె ఇంటిల్లి రాజుల ఆకలిమాపే
బువ్వంబల్ల కుండయితది
గాల్లందరి దూపనారిపే మంచినీల్ల
సుక్కయితది
పొయిమీనికి ఎక్కేకుండ
దిగేకుండ గా తల్లి
ప్యాదల బత్కుబాల బండిని తోలే
కొండంత అండ
నిండుకుండ తల్లి

# అమ్మో నల్లముగుల్జేసిందే!

వోమ్మో ఇగరాయే మబ్బుల్ల నల్లమొగుల్జేసిందే
అని కేకలు బెడితె నువు పూలుకుమ్మరిచ్చినట్లు నవ్వలేద
యేందమ్మ అని సిన్నబోలె మబ్బుల్లు మొగ్గల్లు
వొక్కటే గాదు బిడ్డాని సగజెప్పినవు గాదమ్మ
రాతిరంత వొక్కపోతన ఆన ఎత్తిపోత్తాంటె
సీకట్ల సిటారుమనె సుక్కలు నట్టింట్ల రాలినట్టు
నువు నేను జల్లులు జల్లులు చిలకరిచ్చినట్టు
ముచ్చట్లు కలుపుకొని కిసకిస నవ్వులు ఇసిరిపోయలేద. . .

వో తల్లీ మనం ఎకసెక్కాలాడుకుంట
పరాశికాలు ఊదుకుంట మత్తడిబడ్డ చెర్ల తీర ఉరుకులాడలేద
గట్టి సాయిత గట్టిన సావాసగాల్ల తీర
తల్లిబిడ్డలం సంబురాలు పంచుకోలేద
అమ్మో! నేను నా బాటబట్టి పనిమీద పొయ్యేట్యాలకు
నువు కమ్మని సద్దిమూటలు కట్టియ్యలేద
శాన దూరాలల్లకు పేగు తెంపుకోనిపొయ్యే నా పాట్లు తలంచుకోని
నీవు బీరిపోయి కూసోలేద. . .
గందుకే తల్లీ గీడ దూరంగ ఆమెడల యెడంగ
చెట్లకింద గుడారాలల్ల యేడున్నా సంత
నాకండ్లల్ల నీ బొమ్మె కదులాడుతది
ఉసురు ముసురై కమ్ముకుంటది
మనాదిబట్టి గుండెల్ల గుబులు పొగలేస్తది
సప్పట్లు మోగినట్టుగ మన అల్లిబిల్లి కయ్యాలు నామతి కొస్తయి
గా యాదిలన్ని కెలికినట్లైతయి
మామ్మేం జేత్తాందో
సిన్నబోయి కూసున్నదో సిర్రుబుర్రులాడ్తాందోనని
తలపోసుకుంట
గప్పుడు ఆదేడ కూలబడి ఒడిబాసిన కూన తీర
దిక్కులు కలెజూసుకుంట నట్టడ్విల సిక్కుబడ్డట్టు ఎక్కిక్కిబడ్త
బెంగటిల్లిన దుడ్డెలేర మొత్తుకుంట గాయిరి గాయిరైత. . .

మాయ్మకు కండ్లమీన కునుకున్నదో లేదో
కడుపుల సల్లబడ్డాందోలేదో
నల్లమొగులల్ల సందమామ రీతిగున్నదో
వరద గూడేసినట్టు మసక గున్నదో
ఎర్రమొగుల్జేసినట్టు ఏడుత్తున్నదోనని
మాట నిమ్మలమేనో మన్నివదలి పోయిందోనని
నాకు అగులు బుగులు బుట్టి తల్లీ ఆగం గొర్రెనయిత
వో తల్లీ. గిప్పుడు ఊరూరన ఏడబడ్తే ఆడ
నల్లమొగుల్లు గబ్బిలాలోలిగె  జాడకొస్తానయి
ఇగ ఎడబాయని ఆనే ఆనబడ్తది
గాడ నువ్వు గీడ నేను మనసోంటోల్లం
ఎవ్వల్లమైన సుత ఏడ్వద్దె
ఏడ్సే మబ్బులను తడిసె బూవిని తడుమాల్నె
నీల్లు నింపాలె బూమిని దున్నాలె
ఎవల్ల కాడగాల్లమె యవుసం జెయ్యాల్నె
దీర గుండమ్మ! ఇగ పచ్చని పంట చేండ్లు
పైరగాలి పాటలు పాడ్తయి
మన ఊసుల్ని ఊటపాటలు తోడి మోసుకొస్తయి
గట్క గంజి తాగ్గుంట
వరన్నం ముద్దలు తినిపించుకుంట
అవ్వబిడ్డలం మల్లమల్ల పానంగ కల్సుంటం
గద్దె సిలుకలమై చేన్లల్ల కిలకిల పార్లాడుతుం
పజ్జొన్న కంకులమై పాలుపోసుకుంటం
కట్టం సుకం కలె గలిపి పంచుకుంటం
దీర గుండమ్మ!

# అమ్మంగి వేణుగోపాల్

## తెలంగాణా

మొన్న కల
నిన్న పీడకల
ఈనాడు
ఉరి పెట్టుకున్న సత్యం
నా
తెలంగాణా

## అంబల్ల జనార్ధన్

# తల్లి గడ్డ

తెలుగు బీజం, మరాఠీ గడ్డపై మొలిచింది
యశోదమ్మ గారంగానే చూసినా
కుచేల సంతాన పాట్లు, ఇక్కట్లు
ఏ అటుకుల పుణ్యమో
సరస్వతీ దేవి కరుణించింది,
కొన్ని కఠిన పరీక్షలు పెట్టి
లక్ష్మీదేవి కూడా అనుగ్రహ హస్తం చూపింది
కుటుంబ అప్పుల శకలాలు
ఒక్కొక్కటిగా తెగిపడ్డాయి
జీవిత నావ నడక సాఫీ అయింది.
చెవిలో తల్లిగడ్డ హోరు
తనగడ్డకు తరలాలని తహతహ
అల్లుకున్న భవబంధాలు
'స్వజలం' వదల ఇచ్ఛగించని పిల్లచేపలు
వాటిని తల్లిచేప ఒడిలోకి అప్పగించి
నిండిన కడుపుతో, ఎండిన మనసు తడపాలని
'తన' గడ్డకు పయనం
మమతల తొలకరి జల్లు
తన్మయ హృదయం!
ఆ తర్వాత
చతికిలబడ్డ మమకారపు పొంగులు
పొడ చూపిన స్వార్థపు పొరలు
భగ్గుమన్న ఈర్ష్యాద్వేషాలు
అనురాగాల ఎండమావులు
క్షణభంగురమైన ఆనందం
బీటలు వారిన మనఃక్షేత్రం

భారమైన హృది
దేవకీదేవి నీడ నుండి యశోదమ్మ ఒడిలోకి
తిరుగు పయనం తప్పదేమో?



## అలీ

# పాన్ మరక

పదిమంది కలిసేచోట
కదలని నౌకలా నాపాన్ డబ్బా
ఉద్యోగ నిరుద్యోగానికి మధ్య
త్రిశంకు స్వర్గంలా నా పాన్‌డబ్బా
పాతికేళ్ళునిండిన నా డబ్బా
ఏ సిల్వర్‌జూబ్లీ ఉత్సవానికీ నోచుకోలేదు
చేతులాడించే ఉత్తమొండెంలా డబ్బాలో నేను
ఇక్కడ నా చేతులాడితేనే
ఇంట్లోపిల్లల చేతులు కంచాల్లో కదుల్తాయి
ప్రతిరోజు ఎంతో మందికి
నోళ్ళు పండిస్తుంటాను - కాని
నా బతుకే పండట్లేదు

నేనమ్మిన కింగ్‌సైజ్ సిగరెట్టే
నా గరీబీ బీడీ వైపు చీదరింపుగా చూస్తుంది

"అబ్బా. చారానె హైతో దేవ్‌నా"
"నైహై బేటా! కల్‌దేతాంఁవ్"
ఎన్నిరాత్రుళ్ళు నా అసమర్థత కన్నీళ్లై కారిందో -
చిల్లులు పడ్డ కుండకు - నా బేగం
గుడ్డతో పూడ్చుతుంటే
చిల్లులు పడ్డ నా జేబు గుర్తుకొస్తుంది
నాకు జీతంతో కూడుకున్న సెలవు దినాల్లేవు
ఊచల్లేని జైలు గదిలో ఖైదీలా
డబ్బాలో నేను -
ఫ్రేంలో బంధింపబడ్డ నా పట్టా
బూజు పట్టిన గోడకు

పాత క్యాలెండర్‌లా వేలాడుతుంది
ఇంటర్వ్యూలకైతే పిలుస్తారు
తీరా నా పేరు 'అలీ' అని తెల్సుకొని
చిత్తుకాగితంలా విసిరేస్తే
ఎండుటాకులా మిగిలిపోయాను
'బోడిగుండు' - పిలకగుండు పోటీలో
చతికిలబడ్డవాణ్ణి నేను -
"హోగయా తేరా ఏజ్‌బార్
తేరి జిందగీ హోగయీ బర్బాద్"
మూగబోయిన గోడలమధ్య
నాలుగు దిక్కులా ప్రతిధ్వనిస్తుంటాయి
వాడికి సాంబల్ మసూరి. . .
అదే నాకు - ముతకబియ్యం కరువైనాయి
వాడి షికార్లకు మారుతీకార్లు
నా అవసరానికి సైకిల్ కూడా దూరపుకొండే
అంగ్‌పే షేర్వానీ - ఘర్‌మే పరేశానీ!
అలీ గల్లీ కొచ్చిచూడు. . .
సోరుప్పు రాలే గోడలు -
సిమెంటు అతికిన ఉప్పుదేరిన కుండలు -
పగిలిన కవేలి కప్పులు -
ఇమ్మిచ్చిన అఱ్ఱలు !
దిల్‌కే ఉప్పర్ థర్మామీటర్ రక్కేదేఖో
ఓ కిత్‌నా దర్ద్‌బతాయేగా
మేరే పేవన్‌కే ఊతర్ కప్‌డోఁనే
ఈద్ ఖుషియాఁతో లాతేహైఁ
మేరే ఘర్‌కే అందర్ ఝూంకేతో దేఖో
అలీహై బద్‌నసీబీకీ బద్‌హూ
"ఏయ్. . . . డబ్బోడా!
నాల్గు సిగరేట్ డబ్బీలీ బే"
మీసాలు మెలేస్తూ నిషాలో

డబ్బామీద సోలిన రౌడీలు. . .
"ఒరే. . . డబ్బా నా కొడకా!
దో డబ్బీ సిగరేట్ దేవ్‌రే"
రాక్షసభటుల లారీల బెదిరింపు. . ..
"పైసే బాద్‌మే దేతాఁ అలీ భాయ్"
ఓ బేరోజ్‌గార్ బతిమాలుపు. . .
అంతే. . .

ఆ రోజుకు నాకు వచ్చే
ఆమ్‌దాని ఫాతెహా. . . . .!

ఎవడో చస్తాడు
"బంద్ చైరా"
ఎవడి పదవో వూడుతుంది
"బంద్ చైరా"
అకస్మాత్తుగా సైరన్ మోగి
కర్ఫ్యూ డిక్లేర్ అవుతుంది
"బంద్ చైరా"
రోజులకు రోజులు
'కట్టుదిట్టం'గా పస్తుండక తప్పదు
నా పెట్టుబడి ధరల పేటిక ఆకాశానికంటించి
నా కొచ్చే కమీషన్ను పాతాళానికి తొక్కి నన్ను
I.T.C జలగలా జుర్రుకుంటుంది
నా డబ్బాపక్కనే హోల్‌సేల్ ధరను
రిటేల్‌గా అమ్మే పెద్దకొట్టోడి ముందు
నా బేరమంతా క్యూ కడుతుంది

ఈ దేశపు గోడమీద
ఉమ్మేసిన పాన్ మరకలా
నేనిలా. . .

# అల్లం నారాయణ

## జగిత్యాల పల్లె

ఆకాశం అప్పుడోటి ఇప్పుడోటి ఉల్కల్ని రాలుస్తూ
మబ్బులు ఉరుకులు పరుగులతో
వెన్నెల నురుగుల్లో
మొక్కజొన్న కర్రలు మంచుబరువుకు తూగుతూ
భూమి నిర్దయగా బీటలు, గెచ్చులు
గుడిసెల కప్పులు నిశ్చలంగా, ఉసూరుమంటూ
'బొయ్'మనే చల్లగాలి
ఊరు మాటుమణిగి అణిగి వుంటుంది
కప్పు చిరిగిన గుడిసెలో గుండెచెదిరిన ముసలమ్మ
ఎడతెగని నిట్టూర్పుల్లో రాత్రి ఎంతకూ ఒడవక
ఊరకుక్క నాభి పెకలెంచి మొరుగుతున్నది
నిశ్శబ్దంలో జోగుతున్న పల్లె
అంతే అట్లా ఒక గంట
నాలుగు వ్యాన్ల నిండా ముసుగుదొంగల్లాగా
లాఠీలు, తుపాకులు మోసుకుంటూ ముష్కరులు
వీధులను విచ్చలవిడిగా తొక్కేస్తూ
దొంగ రహస్యాలను బహిరంగపరిచే
అజ్ఞాత వీరుల కోసం
గుడిసెల చూర్లకిందికి గాజుకళ్ళు చొప్పిస్తారు
పందిళ్ళు విరుగతయ్ బీరపాదులతో సహా
సన్నీలు శరీరాలమీద దిగుతయ్
బట్టలు ఇగ్గేసి బజారుపాలు చేస్తారు
ఎవరి ఒళ్ళూ మిగలకుండా నెత్తురుకారుస్తది
ఎవడో ఒక అభాగ్యుడు
పండ్లు గిలకరించి మూలుగుతడు
ముసలివాడొకడు నెత్తురు వుముస్తూ తిడుతడు

ఊరు పీనుగల పెంట
ప్రతాపం చల్లారుతున్నది
రాత్రి మన్నుతిన్న మంజేరుగున్నలా
నిశ్శబ్దంగా కదలక మెదలక వుంటుంది
నక్షత్ర స్థగిత ఆకాశం
బరువుగా వంగి రోదిస్తుంది తెల్లవార్లూ
తెల్లవారుతుంది
అజ్ఞాతసూరీడు
విరిగిన, పగిలిన
చిరిగిన, చిట్లిన గుడిసె కప్పుల మీదుగా
కిరణాలు ఝుళిపిస్తూ
తూర్పున రంగుల్కొంటడు
దొంగ రహస్యాలు బహిరంగపరిచే వాళ్ళ కోసం
ఇద్దరు యువకులు
'చద్దులు' మోసుకుపోతుంటారు
తూర్పుదిశకేసి వడివడిగా నడుస్తుంటారు.

# దారి

ఓ దొర నువుపోతున్నవు నాదరి నాకు సూపవా
ఓ దొర
కట్టవోతె బట్టలేదు ఉండబోతె గుడిసెలేదు -
గట్కలేదు గంజిలేదు ఇంట్లసారెదు గాసం లేదు
ఓ దొర
పిల్లండ్ల సిన్నవాళ్ళు ఆకలయితె అడగనోళ్ళు
సుట్టు నిలిసిన పులులమజ్జెన ఒక్కదాన్ని యిడిసిపెట్టి
ఓ దొర
మామసూపు ఆనదాయె పొద్దు పొడుపు సూడదాయె
ఓ దొర
ఎదురుసూత్తె ఎక్కడుంటవు? కలవరిత్తె ఎప్పుడత్తవు!
ఓ దొర
అత్తకండ్ల కంటి నీల్లు ఆరిపోని ఎఱ్రమంటలు
బాదలను బాపబోతివా, బందనాలు తెంపబోతివా
ఓ దొర
ఉన్న కోంద్ర కొత్తు జేత్తి సత్తపదుత పొలంజేత్తి
నచ్చలేటుకు భూములేలని దొరల భూముల కల్పుకొనిరి
ఓ దొర
మల్లు మామ ఎల్లుమామ మమ్ములందర కుప్పజేసి
సంఘాలు బెట్టినారు కూలి సమ్మె జేయించి నాము
ఓ దొర
సంఘమిడిసి నేను లేను తోడు నీడ సంఘమేను
కలుత్తున్నం వేయికిలోల్లం నీదు లాటనే నడిచ్చిపోదుం
ఓ దొర
(తప్పనిసరి పరిస్థితిలో వూరువిడిచి పోతున్న భర్తనుద్దేశించి
భార్యమాటలు)

# ఆకుపత్ని శ్రీరాములు

## భళెరా! తెలంగాణ - వీరుడా పదుబిరానా

అబ్బింది ఆంధ్రులకీ
అంగ్రేజీ తర్బియతు
అన్నతమ్ములను చీల
దీసె దాని ఖాసియతు
అది ముదిరిపోతె
మనకు లేదు భాయి ఖైరియతు

అప్నాహై
తెలంగాణ!
ఉరోబై
ఛీన్‌కే లేనా!!

ఏమి చెప్పాలి పన్నేం
డేల్లనాటి ఒప్పందం
రామరాజ్యాన్ని అధిగ
మించెను వాక్కుల చందం
నామమాత్రానికి అది
నడువసాగే ఛూ మంత్రం

ఏటికిరా? భాషమోజు
ఏది లేదు నికాలసు
పూటకు లేనోరికి అర్తి
భాషకెవడురా వారసు
మాటల్తో వినదుపైని
మంత్రాంగము తల బిరుసు

చూడుమదో! నీ పిల్లలు
కూడి కార్యక్షేత్రంలో

వీడిరి ప్రాణాలు బళ్ళు
విప్లవ మైదానంలో
తోడు పడదాం స్వతం
త్రోద్యమ బలిదానంలో

తరతరాల నుండి మనం
పరుల బాగ నమ్ముటచే
'సర్' బిరుదులకై మగసిరి
స్వాభిమాన మమ్ముటచే
పరదాస్యం తప్పదాయె
పదు పరాక్రమించుటకై
జనమెక్కువయ్యెననీ
జాతి నరం గొడుతుంటే
అసంఖ్యాకు లాంధ్రులు మన
గడ్డపైన దిగుతుంటే
ఊరుకోలేవుగదా
ఉన్నదూడి పోతుంటే

జేవి, పి.వి. గారు లక్ష్మిదేవి పూజలున్నారు
పేద తెలుగు తల్లిమాట
పెడచెవి బెడుతున్నారు
పోలీసులు జైయనంగ
పెద్ద మంత్రులైనోరు

మురువకురా! బ్రహ్మన్నా
మరతుపాకులున్నవనీ
"మరిపిస్తా" తెలంగాణ, మాట చెల్లనేరదనీ
కుమిలి కుమిలి అదొకసారి రగులుతుంది గప్పుమనీ
రావోయి రైతుకూలి
రాష్ట్రము నీదైన దాకా
రక్తపు మడుగుల్ల నుండి

రాజమండ్రి జైలుదాకా
పట్టణాలె కాదు పల్లె
పల్లె నుండి ఢిల్లీ దాకా

భళిరా తెలంగాణా
వీరుడా పదుబిరానా

# కరువు దీరే కయిత

ఏ అవిసిన దృశ్యం సోకినా
బొచ్చె గుద్దుకునేద్చే ఆర్తే ఇది.
ఏ కాసిని చినుకులు
నా నాలిక్కొసన చిల్లాడినా
దేహం దేహమంతా దరువయ్యే జాతరే ఇది
దేహ దేహమంతా కడుపురింపే సందడే ఇది!

సేండ్లూ. . . సెల్కలు
ఎక్కడా పనే
తలకెత్తుకున్న మట్టినే తలపోత
పొలాల దున్నీ దున్నీ
మెత్తగాళ్ళ దుక్కిటెద్దునై నడక
దున్నీ దున్నీ బతుకుని పండిచ్చుకుంటున్న నడన
గుండెను దిటవు జేసుకొంటున్న నడక
నడిచే తోవళ్ళ ముళ్ళో. . . రాళ్ళో. . .
విరిగి . . .కండ్లళ్ళ గిర్రన నీళ్ళు దిరిగి
హో!. . . వెన్న పూద్దునా
పూలు పోద్దునా

పనేనా. . .
ఊళ్ళూ చేలూ
ఎక్కడా ఆడే
ఓకట్రెండు పంజ కట్టల కోసం
పాట పాడీ, పైరు పాడీ
గంగెద్దులాట
పశువునోట్లో తల పెట్టి . . .ఆట
ఒక కాలు రెండు కాళ్ళు. . .
పశువునమాంతం పాణం మీదకు తెచ్చుకొని

అంతా ఊపిరి బిగబట్టి. . .
ముఖాన రక్తం
రక్తం జడితిచ్చి . .
హో పాడి నిద్దునా
పంట నిద్దునా

ఆటేనా. . . ఆటతో పాట
రందిడిసి రంగులద్దీ
పూవునీ చెట్టునీ పూదిచ్చే బతుకమ్మ ఆట
బతుకు చుట్టూతా భరోసా పాట
బతుకమ్మ నాడీ ఆడీ
బతుకంతా పాడీ పాడీ
బతుకులు కలబోసిన పాటల వాసన
ప్రాణం తీపులు పుట్టే కమ్మటి సత్తుపిండి వైనాల వాసన
కమ్మటి మనిషి వాసన
హో! కాలిపోదునా
కాగి పోదునా

ఆటా పాటా
ఆ నడుమ బతుకు నారబోసుకునే ఎందుగలు
ఇంకా ఈ జాగల ఎన్నెన్ని పండుగలు
ఏమన్నా. . . పండుగున్నా
ఏడ గోస పుచ్చుకున్నా

పెయ్యంత సిటసిట పుట్టే జాగే ఇది
ఏ కాసిని రవ్వలు నా కంట బడ్డా
పాణం పాణమంతా పీరీల గుండమయ్యే అడ్డే ఇది
పాణ దాహమంతా కరువుదీరే కయితే ఇది.

ఆశారాజు

## అంతా క్షేమమే కదా...?

ఇళ్ళన్నీ ఖాళీగానే ఉన్నాయే
ఊళ్ళు వదలి వెళ్ళిన వాళ్ళింకా తిరిగి రానేలేదే
పొలం దగ్గర మట్టిపెళ్ళల్ని చూస్తూ
చెట్టును వదలి చెల్లాచెదురైన పక్షుల్ని చూస్తూ
మోకాళ్ళమీద తలపెట్టుకుని
ప్రాణాల్ని చూపుల మీద వేళ్ళాడదీసి
అలసిపోయిన తండ్రింకా కన్నీళ్ళలో మునకలు తీస్తూనే ఉన్నాడే
వాకిట్లో సొమ్మసిల్లిపడిపోయిన తల్లింకా తేరుకోనేలేదే
కడుపుకోత క్షణం చావనివ్వదు
అరక్షణం బతకనివ్వదు
ఏ ఇంట్లో చూసిన దీపంలేదే
ఎక్కడ విందామన్నా అలికిడి వినబడదే
అంతా స్మశానంగా మారినా
ఇక్కడ బతుకంతా క్షేమమేనంటున్నది నిజమేనా?
ఎక్కడ మనిషి కనబడినా లాఠీలతో మాట్లాడుతున్నారే
రాత్రయినా, పగలైనా ఒకటిగానే ఉంది
ఒకరినొకరు చూసుకోటానికి వీల్లేదు
ఒకరి మాట ఒకరికి అర్థం కావటానికి అవకాశం లేదు
జైళ్ళూ ఖాళీ లేవు పోలీసు ఠాణాలు ఖాళీల్లేవు
సంకెళ్ళు చాలటం లేదు వ్యాన్లు చాలటం లేదు
కుటుంబాలకు కుటుంబాలే మాయమవుతున్నా
జన జీవితమంతా ప్రశాంతంగానే ఉంటుందన్నారేంటీ?
నాగలి భుజాన మోసుకుని వెళ్తున్నా
పలుగూ పారా చేత్తో పట్టుకున్నా
ఆయుధాలతో తిరుగుతున్నారని హింసిస్తున్నారు
చంకలో పసిబిడ్డనెత్తుకున్నా సోదా చేస్తున్నారు

చద్దన్నం మూట కట్టుకుని నడుస్తున్నా
మూటవిప్పి మట్టిలో చల్లి అన్నాన్ని కెలికి చూస్తున్నారు
మూత్రానికెళ్ళినా అనుమానపడుతున్న ఈ వాతావరణంలో
ఘర్షణ లేదంటున్నారు నిఘా లేదంటున్నారు
మరి ఈ పోలీసు క్యాంపులెందుకు?
బెటాలియన్లకు బెటాలియన్లను పంపి
పల్లెల మీదా ప్రజల మీదా ఈ దాడులెందుకు?
రాత్రనకా పగలనకా ఈ గాలింపులెందుకు
ఏదీ లేనప్పుడూ ఏమీ కానప్పుడూ
ఆకు కదిలితేనే ఈ ఉలికిపాటెందుకు?

# ఈ మట్టెన్నడూ నిద్రపోలేదు. . .!

ఎన్నిసార్లు గీసినా
పోలీసు బొమ్మే వస్తుంది
ఎటువైపు తిప్పినా
ఏ గీతను చెరిపేసి సరిదిద్దినా
తుపాకి ఆకారమే కనిపిస్తుంది
దూరాన్నించి చూసినా
దగ్గరకెళ్ళి గమనించినా
తెలంగాణా యిప్పుడు ఇనుప టోపీగా మారిపోయింది
ఇక్కడ ఏ రాత్రయినా సరే
పల్లెల మీద  దించిన పంజరంలా వుంటుంది చీకటి
బాయొనెట్‌తో పొడిచిన గుడ్డికన్నులా వుంటుంది వెన్నెల
వలలో చిక్కుకుని గిలగిలా కొట్టుకుంటున్న
రెక్కలు విరిగిన పక్షుల్లా వుంటాయి చుక్కలు
చీకటి ముద్దలు ముద్దలుగా రాలి తూట్లు పడుతున్నట్టు
నేలంతా బూట్ల నాడాలు గుచ్చుకున్న గుర్తులు
నిశ్శబ్దంలో ఆకు రాలినంత శబ్దంగా
ముళ్ళకంచె మీద పడిపోయి చినిగిన వస్త్రం
గాలికి ఊగుతూ తల్లడిల్లుతున్నట్టు
రాయి విసిరిన చోటు నుంచి
నీటి ప్రకంపనాల వలయాలు ఏర్పడినట్టు
భయంతో భయం భయంగా బతుకుతున్న జనం
ముఖమ్మీద పాములు పాకుతున్నంత క్రూరంగా
గొంతు మీద సాగిపోతున్న కవాతు
పిచ్చికుక్కలు దిండుని కోరలతో లాగిలాగి పీకేసినట్టు
కనిపించిన ఆడవాళ్ళని చెరుస్తున్న కసాయి కమెండోలు
అది ఏ ఊరైనా కావచ్చు ఊరి మధ్యనున్న ఏ కూడలైనా కావచ్చు
హింసించి అనుభవించి నిస్సహాయురాలిని పారేసిన
ఏ ఊరు శివారులోని పొదల చాటునున్న ఏ కాలువైనా కావచ్చు
పారా మిలిటరీ జవానుల కోసం

పోలీసు బెటాలియనుల కోసం
ఇప్పుడు ఈ గడ్డ
బహిరంగ రాక్షస మానభంగాలకు వేదికయ్యింది
ఎంత ప్రయత్నించి గీసినా
రగులుతున్న అగ్ని పర్వతమే వస్తుంది
చరిత్రలో ఎన్నడూ ఈ మట్టి నిద్రపోలేదు
ఎన్నిసార్లు చూసినా చుట్టూ సాలెగూడు పోలీసులే!
ఎన్ని పోరాటాల ఫలితమో
తెలంగాణా దేహం నిండా బుల్లెట్ల గాయాలే!

# ఈవూరి శ్రీనివాసరెడ్డి

## బద్రం బిడ్డా

డొక్కలు ఎండి, బీళ్ళువారిన బీటల నోళ్ళు
పల్లెటూళ్ళు పచ్చడి మెతుకులు
గుడిసెలు రాల్తున్న తాటాకులు
ఈత చాపల్ని చుట్టుకున్న మట్టికుండలు
ఈడుబోయిన చేనులా నేనూ నావూరు
పోరాటం బతుకంతా పోరాటం
తలరాతల్ని తాకట్టు పెట్టి
రాతిచిప్ప కూటికై కడతేరని చెలగాటం
చెలక కళ్ళల్లో పగిలి
కంప చెంపల్ని చీల్చుతూ
గాయమైన పక్షిలా గాలెంట దొర్లుతూ
పట్టెడు నూకల కోసం పట్నాలను దాటినం
ఇది దగా పడ్డ నేల
బలిసిన దున్నలు కొమ్ములతో కుమ్మిన దుబ్బ
ఓ ట్లేసినం ఒంగి దండా బెటినం..................
తూటాల కెదురెళ్ళి ప్రాణాలు యిడిసినం
మా బువ్వతో పెరిగిన బొర్రలు
ఎండిన డొక్కలపైనే జెండా లెగరేసినై
రెండు కాలువలు మూడు పంటలు
మా కన్నీళ్ళను గేలిచేసుకుంటూ మాముందే పొగరు నురగలు
మా పొలాలెన్నో బీళ్ళు జనం నోళ్ళలో ఫ్లోరిన్ నీళ్ళు
మబ్బు మన్నుకాళ్ళకి మొక్కి
ఒళ్ళు నాగళ్ళు జేసి పచ్చపట్టెళ్ళు గీసి నార్లు బోస్తె
మబ్బుకేడ్పురాదె మన్నుకి చెమటలేదె
బావులు చెరువులు కాంట్రించి మొకానూస్తే
తుమ్మ కొమ్మ శవాలై తూర్పుకు వేలాడినం
ఆలి మెడమూసి అప్పుసప్పు జేసి

గొప్పమందని తెచ్చి చెలకల్ల గుప్పినా
పురుగు సావని పత్తి     కొమ్మలిరిగిన మిరప
నమ్ముకున్న మమ్మ్మ నట్టేట ముంచినై
లంచాలు దిగమింగి నకిలీల పెంచిన్రు
పేదోని ఉచ్చుకై కంచాలు బట్టిన్రు
కరెంటు బిల్లంటె కళ్ళు తిరుగుతుండె
భూమి శిస్తు బెంచి బుడ్డ దించిన్రు
పలక బట్టాల్సినోడు పలుగు పారబట్టె
పాలు మరిసిన పిల్ల పసుల పాలాయె
ఇరిగిన రెక్కలన్ని లెక్కకురావాయె
ఉల్లిగడ్డకు పోతె పొట్టు రాకపాయె.
అప్పులోళ్ళెంటబడి  చెప్పు దెబ్బలు గొడితె
దూడ తల్లుల్ల గూడ కబెళాల కమ్మితిమి.
పిరికెడు బువ్వకు బుడ్డదాని పాలకు
ఊళ్ళ కూళ్ళు దాటి జిల్లాలు దాటి
మండుటెండల్లోన తారులా పారినం
గొర్ల గుంపులెంట కుక్కలై తిరిగినం
తీగల్ల షాకులేదు కల్వల్ల చెమ్మలేదు
లిఫ్టులని, డాములని దంబాలు గుప్పించి
రోడ్లేయిస్తమని రోజు పనిస్తమని
ఒంగి దండాలు బెట్టి ఓట్లకు నోట్లు గుప్పి
డబ్బాలు నింపుకొని డొక్కలో తన్నింద్రు
నమ్ముకున్నోడే సవితి కొడకా అంటే
వాడెంటనే పడి మేమేడ సస్తము
తిప్పలెవరికి జెప్తె ఏమోరగ బెట్టిన్రు
ఈ దుమ్ములో దమ్మేందో జూపుతం
మా కతలు చెప్పాలంటె అచ్చరాలు నెత్తురు పూసుకోవాలె
మా కవిత రాయాలంటె కాగితాలు కన్నెర్రజేయాలె
మా బత్కుని జూపాలంటె వేలాడే పిస్సులకి ఊపిర్లు పోయాలె
మా కోసం ఎవడొచ్చిండు ఎవరేడ్పు నేనిన

ఏడుపు ఏడుపే ఒకడు గుక్కబడితే కన్నీళ్ళు ఎదుటి
కళ్ళలో వూరతాయా?
మా వాళ్ళ కళ్ళు అట్టాసూడు అన్నీ హిందూ మహా సముద్రాలే
అట్లాసు పటంల మాజాగా ఎతుక్కుంటాం.
ఇస్తరి మాదె, బువ్వమాదె చేతులు వాడియా?
ఈ గడ్డను దున్ని పిడికిళ్ళు ఏసి బిగిపిడికిళ్ళు పండించిన
గుప్పెట నాది
ఏట్టికి ఏట్టి నిర్వచనాలము మేము
ఇప్పుడు మా మట్టికోసం పతిన
మా మట్టిపై మా పాదాలు
మమ్ము తుడిచేసే పరాధిన ఆనవాళ్ళను చెడిపేస్తాం
జై తెలంగాణా, జైజై తెలంగాణా . . .

# డా॥ ఉదారి నారాయణ

## ధోకా బాదల్

ఇంతకాలం
ఆకాశం ఆసుపత్రిలో
వడదెబ్బకు చికిత్స పొందుతున్నావనుకున్నాం
కానీ. . .
పారిపోయిన ఖైదీలా
తప్పించుకు తిరిగి
కరువు దెబ్బ కొడతావనుకోలేదు
నీ నటనా చాతుర్యంతో
మా మోడుబతుకుల్ని చీల్చి
నీటికోతతో
మా కూకటి వేళ్లను కూల్చివేసి
మనిషి కంటె గొప్పగా నటిస్తావనుకోలేదు.
ఇక్కడ ఏకదలికను చూసినా
ఏ ప్రాణి గొంతు నిమిరినా
తప్పు చేసిన బ్రహ్మచారిలా
అవనత శిరస్కులయ్యాయి
భూమిలోని విత్తనం
కడుపులోని పిండం నీ దగాకోరు తనానికి జడిసి
ధరిత్రిని తాకడానికి జంకుతున్నాయి
సూర్యుడు కూడా మా మీద యుద్ధం ప్రకటించి
గ్రీష్మశరాలు విసురుతున్నాడు
మీ ఇద్దరు చేతులు కలిపితే
ఇక మిగిలేది నిర్జల ప్రపంచం మాత్రమే.
చేనులో పిల్ల మొక్కలు
చెరువులో తల కప్పలు
కవాతు చేస్తున్న జవాన్లలా నిల్చున్నాయి.
ఒక్కరోజైనా వాగుతల్లి

ఒంటి నిండ తలస్నానం చేసింది లేదు
ఒక్కనాడైనా
గంగ పుత్రులు రంగ రంగ వైభవంగా
తెరచాపల తిరునాళ్ళు జరుపుకున్నదీ లేదు
గడిచిన దినాల్లో
ఒక్క మెతుకును రెండు పూటలు తిని బతికాం
ఒక్క నీటిబొట్టును
కన్నీళ్ళతో కలిపితాగాం
ఇప్పుడు అవికూడా 'చవితి' చంద్రుడిలా అయిపోతే
మేము పట్టాలు తప్పిన బోగీలలా పడిపోతే
సంచలన మృత్యువు తప్ప చేసేదేమీ లేదు
ఇప్పటికే
జీవన్మరణ రంపపుకోతలో
విషాదం పొట్టులా రాలి మిగిలాం
నీ వడగళ్ళ దెబ్బలకు
మా తలల్ని రక్తమయం చేస్తాం
కలల్ని జలతర్పణం కావిస్తాం
కానీ. . .
మా తలరాత మీద ఒక్క నీటి చుక్క రాల్చి
మా బతుకుల్ని నీ జలధారతో పునీతం చేసిపో.

# పురుగు కాటేసిన మనిషి

అందరికి చావు ఒక్కటే అయినా
అందరినీ ఒకేలా తీసుకెళ్ళదు
కొందరి చావు సంచలనమవుతుంది
కొందరి చావు నిషిద్ధ శవమవుతుంది
కొందరి చావు హంతకుని చుట్టు
గిరికీలు కొడ్తుంది.

చెమట చేతుల్తో పురివేసి
దారప్పోగుతోలోకాన్ని నాగరికం చేసి
దోసెడు నీళ్ళతో
ప్రపంచాన్నంతా పచ్చపచ్చగా చేసి
ఇంద్రధనస్సుల్ని వెదజల్లిన వాడా!
శూన్యాస్తమయాల సంధ్యల మధ్య
రేపటి నీ ఉదయాన్ని
ఉరితాడుకు వేలాడదీసిన వాడా!
కరెంటు పురుగు
మోటారు బావిని మాడ్చేసి
కరెన్సీ పురుగు జీవితాన్ని మసి చేసి
కలల పుష్పాలను మృత్యు బావిలోకి తోసేసి
నిన్నో ఒంటిపోగు దారాన్ని చేసి
ఒక్క విషపు చుక్కతో
నీ జీవితానికి తెరదించిన వాళ్ళూ. . .
ఉల్లి పొరల్లాంటి నీ సంతానం
నీ చుట్టూ దుఃఖం దుప్పట్లు కప్పేసినా

నీ ఉదయంతోనే
ఊపిరి పీల్చుకుంటున్న జనం
రెప్పల్ని కూడా నీ కోసం తడవనివ్వరు

ఒక్క గింజతో బతుకెడు మెతుకులిచ్చి
పురుగు కాటేసి చచ్చిన
హాలికుడా! హరిత స్వాప్నికుడా!!
నేడు నా జాతి 'బరిబత్తల' ఎందు కయ్యిందని
సొమ్మసిల్లిన సోమాలియాను ఎందుకు చేశారని
ప్రశ్నిస్తే. . . .

## కాస్త మాట్లాడుకుందాం!

ముఖంమీది చమటచుక్కలు
నేరాన్నిరుజువుచేశాక
రహస్యమెందుకు!
శ్వాసలు నడుస్తున్నచోటే
పెదాలు విప్పుకుందాం
కర్రుమొనకు కపాలంచెప్తున్న
కధలగూర్చి చర్చించుకుందాం
రోకలి గోరుచుట్టకోసం సిద్ధమైంది
యుగాల ఉక్కుపాదాన్ని
పంటిమొనపైభరిస్తూ
మృత్యుకుహురంలో సగం చొరబడ్డవాణ్ణి
ఇకభయంలేదు
నిజంచెప్పు?
నన్ను దగా చెయ్యలేదా!
నా దేహాన్ని చలిమంటలోమాడ్చలేదా!
నా నేలని ఎడారికప్పగించలేదా!!?...
నేడు నా తెలంగాణ
రక్తరాగాల వీణ
నా పల్లెతల్లి
వల్లకాడుకు కన్నతల్లి
ఉడుకునెత్తుటిమంటకు
తోలుసంచిచిట్లుతున్నది
అంతరాంతరాల్లో దగ్ధమవుతున్న
అగ్నిపర్వతాన్ని ఎవడార్పగలడు
బాసలు చేసిన చోటే
మోసపువల విసురు తున్నావ్
నువ్వెంతదాచినా
నిజం నిప్పైరాజుకుంటునే ఉంది
ఇహనన్ను

విధూషకున్ని చెయ్యడం
అంతసులభంకాదు
ప్రవాహంసైతం
బలత్కారంనుంచి తప్పించుకునే
పసిమొగ్గప్రయత్నంలా ఉంది
మరినేనో. . . .

# ఎన్. వేణుగోపాల్

## పావురాల కువకువ

జీవితాన్నెట్లా మలిపేస్తావు?
నేలనెట్లా చెరిపేస్తావు?

మా ఊరు జీవకళలూటలూరే పోరు·
ఎన్నెన్ని నిఘాల కపటాన్ని దాచి
నా నగరపు దారుల్ని వలల దారాల్ని చేస్తావు?
ఈ భూమి రేణువు రేణువూ మా పాదాల్ని ముద్దాడింది
మా రక్తంలో పోట్లైత్తే జీవధాతువిది
మా మనసులో హోరెత్తే జీవధాతువిది
ఎన్నెన్ని తూటాల క్రౌర్యాన్ని వెదజల్లి
నా తల్లి ముఖం మీద గాట్లు పెడతావు?
చెమటా నెత్తురూ కన్నీళ్ళూ
గడ్డకట్టిన ఆ ముఖం మీదనే
కాలాన్ని జయించిన
రెండు నేత్ర నక్షత్రాల్ని చూడు
చీకటి రాజ్యాన్ని పరిచి
మనిషి మనిషికీ భయాల గదులు కేటాయించి
నిశ్శబ్దపు జెండా ఎగరేయాలనుకున్నావు గదూ
గోడల మధ్యనే పదునెక్కుతున్న గొంతుల్ని విను
మా ఊరి గాలిలో అల అల పైనా
గలగలలాడే ఉజ్వల నినాదాల్ని చూడు

స్థూపాలు కూలగొడుతున్నప్పుడు
జీవితాల్ని పగల గొడుతున్నప్పుడు
నువ్వెప్పుడయినా కూలిపోయిన బురుజులు చూశావా
శిథిల భవనాల గూళ్ళలోంచి
రవరవలాడే జీవనరావం

పావురాల కువకువ విన్నావా?
నిషిద్ధ నగరం అంచుల నుంచి
భవిష్యత్ స్వప్నాల రెపరెప కన్నావా?
మా నేల జీవకళాలూటలూరే గడ్డ
నాగటి కర్రు తాకితే చాలు
ఈ నేల చేతులు చాపి
కవిత్వాన్నిస్తుంది జీవితాన్నిస్తుంది
పోరాటాన్నిస్తుంది విజయాన్నిస్తుంది

## అబిడ్స్, ఫిబ్రవరి 3, 85

ఎన్నెన్ని దమనకాండల్ని
చూసిందీ అబిడ్స్!
ఎన్నెన్ని పోరాట శిఖరారోహణల్ని
చూసిందీ అబిడ్స్!
ఎన్ని తరాలుగా
దారితోచని నెత్తురంత
ఈ సర్కిల్‌లో దుర్మార్గపు లాఠీలకంటిందో!
భూమిని చీల్చుకుని విస్తరించిన
ఊడల మర్రి కసాయి నీడకు,
భూస్వామ్య దౌర్జన్యం చీకటిని
వెలిగింపజేసిన
రైతాంగ యోధుల నెత్తురుకు,
విలీనమనే మారణహోమానికి,
విరమణ పేరిటి పాదాభివందనానికి,
సుషుప్తిని జడిపింప జేసిన
విద్యుదాఘాతానికి,
తెలంగాణ గడ్డమీద మళ్ళీ పూచి
దేశాన్ని పరిమళింపజేస్తున్న
ఎర్రెర్రని మోదుగుపూలకు,
ఎన్ని దురంతాలకు
మరెన్ని ప్రతిఘటనలకు,
ఎన్ని గాయాలకు
మరెన్ని రక్తసిక్త సుర్యోదయాలకు
మౌన సాక్షి ఈ అబిడ్స్!
ఈ కూడలి లోనే
లాఠీ విసిరిన ఆ సాయంత్రానికి
నినాదాన్ని వీచిన
ఆ రాత్రి జవాబు చెప్పింది
సిమెంట్ పిడికిట్లో చిక్కుకుని చచ్చిన

స్వేచ్ఛావిహంగాన్ని
విసురుతున్న
'శాంతిదూత'ను విగ్రహం చేసిన
ఈ చౌరస్తా లోనే
దారి తెలిసిన బాట సారుల
కదుములు కట్టిన దేహాలు
ఆ రాత్రి
హైదరాబాద్ ఆకాశం మీద
ఉద్వేగభరిత నక్షత్రాలయి ప్రజ్వరిల్లాయి

ఒక్క క్షణం లోయలో
వాళ్ళు కనుమరుగయిన మాట నిజమే
కాని చూడు -
మరుక్షణం వాళ్ళు
శిఖరం శిరసున ఎర్రజెండా అయ్యారు

కటకటాల వెనుక
మూసేయబడ్డ సగం ఆకాశాన్ని తలచుకుని
కళ్ళు చెమర్చిన మాట నిజమే
వృథాందోళన మానవీయమే
కాని చూడు
నలుపెక్కిన ఆకాశం
నగరవీథుల్లో
సంధ్యారాగమయి
ప్రవహించింది
అలవాటయిన కొలమానాల
లాలిత్యపు శరీరాలు
రక్తమోడిన మాట నిజమే
కాని చూడు
కాగితపు పులి
కంట్రోల్‌రూమ్‌లో గాయాలు నాక్కుంటోంది

భాగస్వామ్యం
సిద్ధాంతంలోనే కాదు
నిర్మాణంలోనే కాదు
పోరాటంలో వస్తుందని
చావుబతుకుల కత్తి అంచుమీదనే
మన ఆదర్శాల పరీక్ష అని
నా చెల్లుళ్ళు నిరూపిస్తున్న వేళ
అది చైతన్య కెరటాల హేల

లోకాన్ని ముంచెత్తబోయే ఉప్పెన
మనింట్లో మొదలయ్యే వేళ
ఆ ఉప్పెనలో మనమూ
భాగమనుకుంటున్న వేళ
నురుగయి విరిగిపోయే అలలో
కనబడేది
వెల్లువయ్యే ప్రళయతరంగమే
అది
ఆశకు సంకేతం

అబిడ్స్
ఆ సాయంత్రపు దౌర్జన్యానికి కాదు
ఆ రాత్రి వికసించిన
ఉత్తేజానికే సంకేతం
ఇవాళ్టి దుర్మార్గానికి కాదు
రేపటి విజయోత్సవానికే కేతనం

## ఎం. వెంకట్

# దుగిట్ల

దిగులు కమ్మిన దుగిట్లో
సీకటి తెడల పాయ
దిగిరాని గుట్టకింద
జడలు కట్టిన కన్నీరు
మెట్లకు సున్నాలేసిన సేతుల్లో
తెగిన మొలతాళ్ళ జాతర

గోదు కమిలిన నేల మీద
నెత్తుటి ఊడల మర్రి
సెలక తప్పిపోయి
శవం కుళ్ళి పోయి
పసుపుకొమ్ముల నేల
పాదెకొమ్ముకేలాడె

పెళపెళా విరిగిపడుతున్న గుబులు
పదంగావుకేకె
ఊరు దాసుకుంది
పిట్టకీసుమంటలేదు

సేతుల్లేని సప్పట్లు జొరబడె
కాముంట్లో కలల బొక్కలు
రగతం మరకల తలలు బోనం కుండలు
రూపుకట్టని పిండానికి
మోయలేని గుండె

సావణంలో సెట్లకిందికి
శవాలుపోతున్నయిదేవా
ఎనకటికి భూమి తలగొట్టుకొని ఏడిస్తే

టొడిపె కట్టిన నీ గుట్టకు
ఇప్పుడు మొందాలు తప్పిన చిలకల దండ

గొర్ల మొక్కగోస దీసె
డొక్క మీద దోలుసప్పుడు దేవా
మనున్న కన్నీళ్ళు మసులుతున్నయి దేవా

ఏరేసిన నేలమీద
పారేసినట్టి పుట్టితిమి
ఊపిరి ఊదిందెవరో దేవా
అలిపిరే మిగిలింది

గూడు పెట్టుకుని కూసుంది ఊరు
ఆవును అవగింజై ఆదుకుంటుంది
మతి మీదేమొ పొక్కులు పొడిసె
కొత్త దేవండ్ల కొలువాయె దేవా

# పొన్నపువ్వు

సూడబుద్దాయె
సూపు కాని కాలాన్ని కూడగట్టుకున్న దాన్ని
వొంట్లో ఎన్నెల దడ
రగస్యం గడ్డ కట్టిన రాళ్ళవాన
కండ్లు రెప్పలు పెరగని మునిజాన

ఎన్నిసార్లని ఎదురొచ్చినా
కొమ్మల్లేని చేతులతో కొలవనీయదు
మట్టాసన లేని మతిని మాట్లాడనీయదు
ఏమంట దొరికిందో సజ్జ కంకుల మీద
ఇంద్ర దనుసులా రిబ్బెన.
పొద్దుమీద సోమరిపోతును జేసి
కంటి ఎనకాల కలల్ని కుదుతుంది.

గీ కుమ్మున పెట్టే రోజుల్ని
యాడ కూసోని జేస్తుందో
తోవ దొరకనీయని మంత్రెగత్తె

పదమెత్తుకుంటె
గాలికి రంగులద్దే పొన్నపూల సొరం.

తుమ్మకాయ కాటుక మధ్య
రెండు ఎన్నెల సెరువులు.
తలుపు సాటుకు పాయలు గట్టుకొని పారుతున్నయి.

పట్ట గొలుసులతో పట్టుకపోతుంటె
సూడబుద్దాయె పావురంగా
ఇరగబండిన నవ్వు
ఇమిడిన దీపం
అకుపచ్చ ఆకాసాన్ని

## నాత్రి

మతి నీడ కింద
నల్లగా తాగుతున్న నాత్రిని
కండ్ల వొంటరి కాన్పుల్లో
కల గిచ్చి సూస్తుంది

కనుగుడ్ల ఎనక నీరు
కడుపులో పడుతున్న సప్పుడు
గాలి మడిసి పీకతో మూల్గుతుంది.
నాత్రి తుమ్మ మండై మీదికొరిగింది
మతి నిండా నల్లమేకల మంద.

అల్లిచ్చి అల్లిచ్చి
ఎయ్యిన్నొక్క గడపకు ఎదురొస్తి
నూకల మూట దొరకలేదు.
పొద్దుని ఎప్పటికని నవలను

మూడు తొవ్వల మీన
సీకటి పాదం.
సీకటి పాదం కింద
నిలబడ్డ నీడ
నీడ మెదన
కండ్లు రాలిన గవ్వల పేరు.

పాతాళం మీద పగబట్టిన
గిరక మీది తాడు
పొలం సివరగ పిట్టగొంతు
వరాలు కొండ చిలువల్లా పడుకొన్నాయి
అర్థం వొచ్చిన అవు అమ్మని నెమరేస్తుంది.
ఎత్తి పగిలిన సీకటి
సీకటి వొడ్డెంట నల్లగ

ఆకుపచ్చ రగతం
పడమటింట్ల నిండి లేసి
పిడికల గూళ్ళో దాసుకొని
సీమకోళ్ళని లేపిన సీకటి
మోదుగుల్లో ఊగుతూ
మెంకెన చెట్టు మీదికి పాకుతున్న సీకటి
ఎంపలపూవు ఎతికినా
తంగెడపూవును తగిలినా సీకటే

చెట్టు పుట్టా చెవుల్లోకి
జీర్ణపేగు జారుతున్న సప్పుడు
అలికిడి నాత్రికి గుండె

మొరం కింద సీకటివాగులో దూపగొన్న నేను
వొంటరి కొలువులో
కండ్లు జీడిగింజలై పగులుతుంటి
మళ్ళీ నాత్రి  ఏటి సప్పుడు.

## కొన్ని కోపాలు - కోపపు వాక్యాలు

## కవులూ మీరెటంట

గిప్పటిదాకా పోగేసుకున్న
నివురును సిల్లాకొల్లాం సేయాలే
పంచ వలసు పొలిమేరలదాకా పొరద్రోలాలె -
కవులంటే ఉన్న నాలుకలు
ఎవళ్ళకు వాళ్ళు సిట్లగొట్టుకొని
చరిత్రకిచ్చిన కళ్ళు కవులు
బిడ్డల బరిబాతల అందాలు కవులు
కండ్ల నుంచి రాల్తున్న బతుకు సిత్రాలు కవులు
కవులూ -
తెలంగాణా కన్నీళ్ళ పక్కన నిలుస్తారా?
మోచేతి కింద నీళ్ళకు దోసిలవుతారా??
చెకుముకి రెండు తలల మధ్య
రాజుకుంటున్న నిప్పులు తెలంగాణ కవులు
ఎవని మెతుకుల కోసం వాడు
ఎవని మట్టికోసం వాడు
కలాలు దూస్తున్న కవుల్ని జూసి
తల్లి తెలంగాణ గుడ్లల్ల నీళ్ళలో
నదుల గోడలు కూలుతున్నాయ్
(సురవరం ప్రతాపరెడ్డి చేతులందుకొని ముందుకు సాగుతూ ప్రతిన బూనుతున్న కవుల చేతులకు కరచాలనాలతో. . )

# సమ్మక్క-సారక్క జాతర

సమ్మక్క సాచ్చీకంగా
సారక్కమీదొట్టు
కొడుకు జంపన్న చేతిల
అవసరాల్ని తీర్చే కఱ్ఱ
మా ఇంటెనకముసలోని మూల్గులాగా
గొంతు కడ్డం బడుతున్న గంజిమెతుకులు
సవాసం చేస్తూనే సోదరుడే కొట్టిన
దెబ్బకు ఈమట్టంతా
భాదల,గాయాల,గోసల మంటలు
మంట మీన పెనం తెలంగాణ

నీజాతరలో పగిలిన కొబ్బరికాయల్లో
ఈమట్టి కంట్లోతప్ప
మిగిలినవన్నీ నోళ్లుఎండిన నాలుకలే -

నూకలన్నం, జొన్నరొట్టెల మీదొట్టు
సమ్మక్కా ఒక్కసారిచూడు
సారక్కా ఒక్కసారి పలుకు

కొట్లాట న్యాయమైందైతే
సోంతోనితోనే పెనుగులాట
మీ పారం

మూగభాషకు చేతులిచ్చిన
పోట్లాటల అక్షరమాలిక మీరు
మీరు పోరాటానికి పెద్దబాలశిక్ష
ఆత్మాభిమానానికి జనవ్యాకరణం

మీరెక్కల కిందే తిరుగుబాట్లు
పొదిగి బషీర్‌బాగ్‌లు
బిడ్డలకోసం రాజ్యం కుర్చీని
అల్లకల్లోలం సేసిన తల్లులుమీరు

మనం ఎప్పటి భాంచగాళ్లమో
మీరు నిప్పుపెట్టాకనే దారి

తల్లులారా
ఈ పోరగాళ్లను వలసలమీద
పేలే ఫిరంగుల్ని సేయవా

నీ బిడ్డ గొంతుసైన
నాడాల వంతెనను ఏంసేయాలో
తల్లులా మీరేసెప్పాలే -
ఇపుడు నీదగ్గరికొచ్చేటోళ్లను
వలసలవ్యతిరేక జాతర్లకు మళ్లించవా -

ఈ మట్టితడిసేందుకు
కోపపువడగండ్లు కురవనీ -

గుక్కపట్టిన బిడ్డనోటినుంచి
తల్లిస్తన్యాన్ని దూరం చేసాడెవడో -

# ఎవళ్ళురా అడ్డొచ్చేది

వస్తదంటవా!
'ఏందే గీ అనుమానం'
వాళ్ళిస్తరంటవా!!
'చవ్వా! గీళ్ళు వాళ్ళా గిసిచ్చేదేందే'
' . . . ..
. . .
దూత్తెరికి . .
ముయ్‌రా నోరు
మాటజారితే కింద పగుల్తది
చికాకులో వున్నా చీరుత బిడ్డా
అడ్డొచ్చేదెవడురా!
అడుక్కోవాల్సింది ఎవణ్ణిరా!!
మన సెమటల పూత
మన కట్టాల తోట తెలంగాణ -

# తెలంగాణ కంచం

నా కంట్లో దుమ్ము
నా నోట్లో మట్టి
జీవితాలు ఎట్టి
ఈ బతుకులు ఎట్లుండాలో సెప్పినోడా
తెలంగాణ ఎవని చేతిలో
చివికి, సితికిందో ఇప్పినోడా
ఈ మట్టి మీన పరాయి పదాన్ని
పసికట్టి ప్రకటించీనోడా
మా సెమటలతో కన్నీళ్ళు సప్పరిస్తం -
గాయాల్నే పాడిన జనార్ధన్
తెలంగాణ జాతి గీతం
నిన్ను తలుసు కుంటే
ఎర్ర సెలకలు పులకరిస్తయ్
కపటంలేని నీ నవ్వులు మొగిలిపూలు
భాంచెన్ దొరా పదాల కుంచెవు నువ్వు
జొన్నరొట్టెల సెలికాడా
తుడుం మాటాల విలుకాడా
పగిలిన గుడిసె గుండెల ఎర్రమట్టి గీతలు
నువ్వో ఎట్టి విముక్తి ఉద్యమం
పచ్చిగా ఏదీ దాసుకోని తెలంగాణ కంచం

(తెలంగాణ కోసం పరితపించిన మేధావి, వక్త, క్రియాశీలక కార్యకర్త, కాకతీయ యూనివర్సిటీ ప్రొఫెసర్ జనార్ధన్ రావుని తల్సుకొని)

# ఎన్నవెళ్ళి రాజమౌళి

## తెలంగాణాత్మ

పేగు తెంచుక పడ్డారు
పాలు లేక చచ్చేరు!

పసికందులై -
పాలు త్రాగలేకున్నారనుకున్నాను
నా తెలంగాణ తల్లి
కందిపోతుందని -
కలత మీలో ఉందని తెలువదు
పాలుత్రాగని మిమ్ము చూచి
ఒడిజేరిన తెలంగాణేతరులు
నన్ను 'అందేరా' జేసి. . .
ప్రాలు త్రాగడమే కాక,
లేగ -
పాలకై ఆవు పొదుగు
గ్రుద్దినట్లు కాక,

కోడెల మర్మాంగాన్ని,
మంగనిలో వత్తినట్లు
పాలు రాకున్న -
పళ్ళతో కొరికారు!
ఆగాట్లకు
గద్దలా ఒదిగాను.
కన్న కొడుకులు మీరు
పాలురాక గ్రుద్దినా!
పాలెక్కువై గ్రుద్దినా!
కడుపుల పెట్టుకునేదాన్ని
ఎందుకంటె!
చెట్టు చేమ పెంచేది

మీరు –
గుట్ట గూడు కాపాడుకునేది
మీరు –
ఖనిజమైనా, కాలువైనా
మీకే అయితే!
నా కళ్ళల్లో నీళ్ళు తుడుచేది
మీరు –
పాలువచ్చినన్ని రోజులు త్రాగి
చచ్చినంక –
నన్ను త్రొక్కి వెళ్ళేవాళ్ళు
నన్ను అన్యాయం చేసారు.
పాలిచ్చింది వాళ్ళకు
అర్థించేది మిమ్ము!

నా ఆర్థనాదాలు విన్నా. . .
పాలియ్యలేదని
నాపై పగనా!
పాలు త్రాగని మీకు
నాధరికి రాను
జవసత్వాలు లేకనా!

ఏమైనా. . .
ఉభయులం అన్యాయానికి
గురైనామూ

నాపై కోపమొద్దు
బిడ్డల్లార
పాలురాకున్నా
రక్తమైనా –
మీరు త్రాగితే నయం!
ఆరోగ్యం కుదుట పడ్డంక
రేపటి భవితకైనా

పాలు ఇచ్చే భాగ్యం
కలుగుతుందేమో!

రక్తం త్రాగిన మీరు
బ్రతికి భవిత ఉద్భవానికి
కారకులైతారేమో!
లేకున్న -
ఆ తెలంగాణేతర రాబందులు
ఎముక, తోలు లేకుండా
అణువణువు
నన్ను -
ఆహారంగా స్వీకరిస్తారు.
పుట్టి పెరిగిన మమకారం
మీదైతే!
ఉట్టి తెంచుకపోయే
అహంకారం వాళ్ళది!
ఇప్పుడికైనా
ఆదరణ చూపి
తెలంగాణ ఏర్పాటు చేస్తే -
ఈనాడు కాకున్నా
ఏనాడైనా. . .
పూర్వస్థితి
పొందకపోతానా!

## ఎస్. రఘు

# తెలంగాయాలు

తల్లిపాలు దొరకని శైశవ రోదనల
నేపథ్య స్వరాల్లోని
కరువుగీతాల పల్లవి తెలంగాణ!

ఎండిన పైరుల మీదుగా తేలివచ్చే
పచ్చిగాయాల గొంతుల్లోని
ఎర్రెర్రని ఉద్యమగీతం తెలంగాణ!!

. . . . . .

వెన్నుని విల్లులా వంచేసి
స్వేదపు అత్తరును పిండుకున్న
రాచరికం!

బానిసత్వమే
శాశ్వత కులవృత్తిగా మార్చిన
దొరతనం!

బానిస కింద
బానిసలా మసిగుడ్డైన
తరతరాల బూజు బతుకులం!!
ఉల్లంఘనాలు
స్వేచ్ఛా భరతావనికి పునాదిరాళ్ళు!
'పెద్ద మనుషుల' ఉల్లంఘనాలు
తెలంగావనికి సమాధిరాళ్ళు!!

బకాసూరుల్ని, బ్రహ్మరాక్షసుల్ని
గెలిచాం!
వలస రాక్షసుల చేతుల్లో

ఓడిపోతున్నాం!!
తెలంగాయాలకు ఒక కారణం
తెలుగోడే?
ఇక్కడ ఇంటిదొంగ
ఈశ్వరుడే!!

. . . . . . .

ఎండిపోయిన
కన్నీటిచారికలాంటి నేలమీద
ఆంధ్రారాజకీయ వ్యాపారగాలుల్లో
ఎండుటాకుల్లా రాలిపడుతున్నాం!
కళ్ళెదుటి
కాళ్ళకింది భూమి
కోల్పోతున్న నిరాశ్రయులం!

కదలని పసి కాగితప్పడవులు
తడవని పంటపొలాల్లో
బతుకు శిథిలనౌకతో
గుక్కెడు నీళ్ళకోసం
కన్నీటి జీవనదిలో కొట్టుకుపోతున్నాం!

సాంస్కృతిక వృత్తుల్ని మింగేసిన
అజీర్ణపు అమానవులు
కార్పోరేట్ మేడల్లో గీసుకుంటున్న
పారిశ్రామిక కాలుష్యవాడల లే-అవుట్లం!

కల్తీ విత్తనంలోంచి
మొలకెత్తిన హత్యాత్మ
ఇప్పుడు
హైటెక్ దోపిడీవీధుల్లో
దారికాచిన ప్రతీకార ఆయుధం!

సహనం నెత్తుటిమరకలా హెచ్చరిస్తుంది!
ఆత్మగౌరవం ఎదురుదాడికి సన్నద్ధమవుతుంది!!
పదిజిల్లాల్తో పచ్చగా
పది కాలాలు వెచ్చగా బ్రతుకుదాం!
ఒకప్పుడు
గాలానికి దొరికే చేపపిల్లలం
ఇప్పుడు
ఏ వలలో పడని తిమింగలాలం!!
ప్రాంతీయ సామ్రాజ్యవాదుల గుండెల్లో
శత్రు జలాంతర్గాములం!!

. . . . . . . . . .

రాజకీయ నిరుద్యోగుల
రంగుల ప్రపంచం కాదీ తెలంగాణ.
రగిలిపోయిన తెలంగాణాయోధుల
నెత్తుటి శ్వాసల వీలునామా ఈ తెలంగాణ!!

# ఏనుగు నరసింహారెడ్డి

## బతుకమ్మ కల

చెట్లు పిట్టల దుప్పట్లను తీయనే లేదు
చెరువు కమలం పెదవులతో నవ్వనే లేదు
చల్లగాలి పల్చనై పైకెగరనే లేదు
మేం
తంగేడు పూలమీద
మంచుచుక్కల్ని తుడిచే
వేకువ తుమ్మెదల మయ్యే వాళ్ళం
మేమలా మూటగుట్టలమీంచి
మూలబాయి డొంకల్లోకి పరుగుపెడితే
పొద్దటెండపెట్టిన తొలిముద్దుకు
ఎర్రజెల్కల్లో గునుగు
రంగు రంగులుగా పులకించేది
బతకమ్మ దాపకం చీరలో
జరీ అంచునైపోదామని
ఒళ్ళంతా కళ్ళు చేసుకొని
ఎదురొచ్చేది రెళ్ళుగడ్డి
ఒదిగి ముద్దై ఒడి చేరేవి
రిల్లలు రిల్లల గడ్డి చేమంతులు
దసరా సెలవుల్ని సోంపూవుకు అంకితం చేసి
గుట్టల్ని అల్లుకున్న నల్లమబ్బుల్ని తరిమేస్తూ
బోటి గుండుమీద ఆనందం జెండాల్ని పాతినప్పుడ
బతుకమ్మ పండగ
అక్కలకు బదులు మాకే
రెండు వారాల ముందు మొదలయ్యేది
పూలవేటతో బాటు
ఏ గుట్ట చెలమలోంచి ఏ·నీరొచ్చేదీ
ఏ గుహాముఖంలో కుందేలు కుర్చుంది

ఏ కొండచరియల నడుమ
కొలను కోవెలలో
ఏ జలదేవత కొలువుందీ
ఎలా కనిపిస్తుందీ
ఏం వరమిస్తుందీ. . .
యావలు కలలై
రాత్రిళ్ళు కనికరిస్తే
కొండ కొసమీద
దేవకాంతలు ప్రత్యక్ష్యమై
బంగారు బతుకమ్మను బహుకరిస్తే
చెరువులో వదిలేయ మనసురాక
ఊగిసలాడుతూ మెలుకువలో కొచ్చేవాళ్ళం
ఎంగిలి పువ్వుకూ చద్దుల బతుకమ్మకూ
పూలగుత్తుల వంతెన కట్టి
పాటల రహదార్లను పరిచాకనే
కొత్త పెండ్లిపిల్లలు
పిండారబోసిన వెన్నెల్లో ఆటల ఆరిందలయ్యింది
చుక్కలు చంద్రుడిపై మక్కువ పడ్డట్లు
బతుకమ్మలు చెరువుగట్టుకు బారుగడితే
వూరు
సమస్త లౌక్యమూ మరిచిపోయి
నీలాకాశపు సాయంతనంలో సేదీరేది
అత్తగారిండ్ల కొత్త చీకాకుల మీద
పట్టుచీరల పరవశాల్ని తొడిగినట్లు
పాటలో పాటగా పరవళ్ళు తొక్కేవి
కాలిగజ్జెలు, కొత్త గాజులు
కట్టమీద చుట్టుకాముడు నడుమ
బతకమ్మ పగడమై మెరిస్తే
ఆట సూదంటు రాయిగా మారేది
సీతమ్మ శోకంలో శోకం పెట్టే చప్పట్లు

వలిగొండ వలిరాజుల వైభోగాన్ని నింగికెత్తే రాగలయులు
పేదల దుఃఖానికి చరమగీతాలు పాడిన
వైతాళికులకు హారతులు
వాళ్ళు జోరుగా పాడితే
మా పటాకీలు మరింత జోరుగా
వాళ్ళు పాడడం అపితే
వెక్కిరింతగా
గాలి చెక్కిలిగా చెంపల్ని తాకినప్పుడు
నాచువాసన ముక్కుల్ని ముంచినప్పుడు
రేయినల్లని రెక్కల్ని విప్పినప్పుడు
ఆటమాత్రం ఆగేది
పాట బాటెల్ల సాగేది
దూరంగా కొండనింగిని కలిసేచోట
సృష్టిలోతుల్ని కొలవాలని పండిన గోరింటల పరువం మీంచి
నీట వాలి లోనికి జారేది బతుకమ్మ
అలలు పాదాలకు గొలుసులు కడుతుంటే
జలస్పర్శకు జంకి
నిలువుగానో అడ్డంగానో
తలలూపి
తప్పని వీడ్కోలు పాటలో తరలిపోయేది
పోయే పోయే గౌరమ్మా
పొన్నగంటి గౌరమ్మా
తాదులోతు నీళ్ళల్లో
తరలిపోయే గౌరమ్మా
మల్లొచ్చే పండుగాకు
మళ్ళీ మళ్ళీ రావమ్మా

## భూమి పుత్ర

నేను లేనట్టే
చాపకింద నీరు అస్తిత్వాన్ని తూర్పారబట్టి
సుతారంగా తెలుపుతుంది
అంతా వుండీలేనట్టే
నేల నుదుట పసిరిక చెరిపిన జ్ఞాపకం
తలమీద శిలావర్షపు వాస్తవం
మూసీ బిక్క చచ్చి
అపార్ట్‌మెంట్ల పక్కటెముకల్ని తేలుస్తూ
యేటి ఇసక ఎగిరే పళ్ళమై
బాల్య జ్ఞాపకం సమాధి శయ్యల్ని పేరుస్తూ
పరాయీకరణ
తిండి గింజల రాజ సింహాసనాలు
ఎవరి వేటకో కాంక్రీటు మహారణ్యాలు
చారెడు నేలకూడ కొనలేం
భూమ్యాకాశాల నడుమ పరుచుకున్న
ఏ సున్నం పెట్టెలోను ఇమడలేం
ఈ నేల నాది
నేల సమాధి చేయబడ్డది
పొరలు పొరలుగా పరచుకున్న
భూమి పుత్రుల జ్ఞాపకం సమాధిచేయబడ్డది
నా ఊళ్ళో నన్ను నేను పరిచయం చేసుకుంటాను
వింతదైన్యంలో
నా చంచల పల్లెలో
నా చిక్కడ పల్లెలో
నా లస్కర్‌లో
నా ఉప్పల్‌లో
నన్ను నేను పరిచయం చేసుకుంటాను
కొండ చరియల నడుమ కోనేటిలా
ఏడంతస్తుల మేడల నడుమ

నా ఏడడుగుల నేలలో
గూనపెంకల చవుడుమిద్దెల పూరిగుడిసెల
కింద నేను
నా నాటి ఊరి తీరుగురించి
స్ఫటిక మనస్తత్వాల్ని గురించి
ఏదీ చెబితే ఎవరూ వినరే?
పరాయీకరణ సాంద్రమయాక
నేటివ్ మాటలేమిటంటున్నట్లున్నారు. . .

# ఏ. పరమాత్మ

## యాది మర్వకుండ్రి

కండ్లకున్న రంగద్దాల్దీస్కోండ్రి
కండ్లవడ్తయ్ మా బత్కులు
ఊరు ఊర్లెర్కన్నెవుంది
ఊరి బయట్నే మా ఇండ్లున్నయ్
గయ్యాలైనా గియ్యాలైనా
మా బత్కులు
పొగజూర్న కుమ్మరామ్లేనాయె
రగిలే కమ్మరి కొల్మిలేనాయె
ఎండవానకు బండవార్న
గీ మొండి తన్మకు
పెయ్‌మీన అంగెక్కడ్డి
మండే మీ కండ్ల లెక్క
గీ గింజల్ ధరల్ మండవట్టె
కై కూలి వెంచుర్రని
కొద్వలి పట్కున్నందుకు
బరిక్కంప కానూన్లతోని
కచ్చీర్ల సుట్టు తిప్పవడ్తిరి
మా బత్కులు పేపర్లకిచ్చి
మీ బత్కులు పండిచ్చుకోవడ్తిరి
గీ ఒకూల్నాలి బతుకుల్ల
ఆకల్దీర్సిందెవల్లు
ఆష్కాలు ఆడకుండ్రి
అప్పుల్జెయ్య కుంటుంటున్నమా
ఆర్కల్ దున్న కుంటుంటున్నమా
ఎలచ్చన్ల ముందు యేమేమి జెప్తిరో
జెరోపాలి యాజ్జెస్కోండ్రి
యేడు మీదేడు పడంగనె

యాది మర్శిగ్రనుకుంటరా
యాడేశ్న గొంగడి లెక్క
ఆడనె వదుంటరనుకుంటరా
పులుల్లెక్క మర్లవడెటోల్లమే గని
పిల్లుల్లెక్క తోక ముడ్సెటోల్లంగాం
పూటకు గతిలేనోల్లమే గని
మీ లెక్క
నియ్యత్ లేనోల్లంగాం.

# ఐలేని గిరి

## తెలంగానం

ఈ నినాదం ఎందుకు బలపడతోంది
నిన్నటికీ నేటికీ ఈ గాలిలో ఇంత మార్పేమిటీ!

పనికోసం వెంపర్లాడే పదిరెట్ల జనానికి - నిధులున్నా నీళ్ళున్నా
వెనుకబాటు తనం ఓ వేధించే ప్రశ్న

భూమిలోకి భూమి కుంచించుకుపోయి
వృత్తం అంచులమీద లక్షలాది జనం
భూమిని వదల్లేక - ఆకాశాన్ని అందుకోలేక -
తాగునీరేదీ! సాగు నీరు నిన్నటి మాట

విచ్చని పత్తిగింజలా తడిలేని వరిమడిలా
ఆశను వేలాడేసుకుంటున్న జీవితం
పరాన్నబుక్కును ప్రశ్నిస్తోంది!
మా వనరుల మాటేంటని! వాటిపై నీ హక్కేంటని?

ఇసుకను దేవుకపోతే వొట్టిపోయిన వాగుల బతుకులు
మట్టితో కడుపుబ్బి ఎండిన చెరువుల బతుకులు
మార్కెట్టు మాయలో - విత్తనం, పంట, బావీ, చెరువూ
అన్నీ బర్బాద్ అయిపోయినయ్ - బతుకులు చితికి పోయినయ్
గంటెడు నీళ్ళకోసం కరెంటు బిల్లు కాడిమోతైంది
కూలిపోతున్న వ్యవసాయానికి కూలీ బతుకు గూడా కష్టమే!

వివక్షత రాజ్యమేలుతున్నపుడు ఇంకా విషాన్ని మింగడం కష్టం
ఈ ప్రాంతంపై హక్కుకోసం - అధికారం కోసం
నినాదం బలపడుతోంది
ఈ పూట గడవడం కోసం గాదు
ఈ బతుకు బలపడటం కోసం
ప్రశ్నలు చిక్కబడుతున్నాయి

# ఒద్దిరాజు ప్రవీణ్ కుమార్

## దుఃఖ భాష

దుమ్ము రేగిన దారినిండా తల్లిపేగు తండ్లాట
నెత్తుటి మరకలను మోసుకొచ్చిన అక్షరం సాక్షిగా
అదెప్పుడూ గుర్తు తెలియని శవమే
ప్రేమ సంతకాలు మోసిన తెలంగాణ గుండె నిండా
భయం గుబులు
విషాదం దుఃఖం విస్తరించీ
నెగెళ్ళై కమ్ముకుంటున్నంతలోనే
గుండె మీదికి విసురుకున్న వలసవాదపు నెత్తుటి పంజా
సమయం ఏదైనా కావొచ్చు
సందర్భము, సంక్లిష్టత పునరావృతం –
తలాపున నదులున్నా
పొలాల నవ్వులు నగుబాటైన వైనం
సమూహం కలల పంటకు మసిపూసిన ఇంటి దొంగలు
ఉడుకెత్తిన నెత్తుటి పొంగుకు
నెర్రెలు బారిన నేల యిచ్చిన కౌగిలింత
నడిచిన అడుగులను విప్పిచూస్తే ప్రాణం వదిలిన పచ్చి జ్ఞాపకం
కదలని స్తన్యం శరీరమో, శవమో
భయం గొలిపే చావు దుఃఖం
పిట్టకు పెట్టిన పిండాలను మోస్తున్న
తెలంగాణ పుండు మీద
ఆయుధ కౌగిలి పురిటి వాసన

# కందుకూరి దుర్గాప్రసాద్

## "కంచై రాలుతున్న కన్నీరు"

ఎరిత్రియా, ఇండోనేషియా ఏదోఒకటి,
పేపరు హెడ్డింగయి నడ్డిమీద కూలితే
నాగరికతకోసం ఉలికిపడటం కాదు...
వేకువను చూడడమంటే!
రెప్పలవెనుక గూడుకట్టుకున్న...
చీకటి తగలబడటమే...
ఉదయమవ్వడమంటే!!

* * *

కాళ్ళకిందే...
దగాబడ్డనేల
కమ్ముకుంటున్న కరువుఎక్కిళ్ళమధ్య
కొన ఊపిర్లు నరుక్కుంటుంది

ఇక్కడ ఎండకునోరారిన
ఏబండనడిగినా చెబుతుంది...
తరాల జలస్వప్నం
తనముందే ఈడ్చుకుపోబడిందని...
కన్నీళ్ళను దోచుకునేదారుల్లో
ఎదురుచూపులు...
ఏనెరాళ్ళై తిరిగొచ్చాక
చెమ్మగిల్లడమే...
చైతన్యమనుకోవడంలో అర్థంలేదు!

అదృశ్య ఆర్తనాదాలమధ్య...
మరణం పునరావృతమవడం చాలు!
కాకిచావని కరెంటుతీగమీద
కనికట్టు వ్యవసాయం

అంతర్జాతీయ మార్కెట్ పాదాలముందు
కలుపుమొక్కలా రాలిపడటం చాలు!!

డొక్కలో కుబుసాల్ని రాలుస్తున్న
కత్తి జాడల్ని పెకిలించడం
వేర్పాటువాదం కాదు
దశలవారీ ద్రోహమని తెలియక
ఆనకట్టల నీడలకు . . . .
కాళ్ళూ చేతులూ కరగబోసి
దిష్టిబొమ్మలుగా మిగిలినోళ్ళం. . .

సాటిలైట్ సర్వే చేస్తున్న స్వార్ధం
బాధల్ని నెమరువేస్తున్న. . . .
బొందల గడ్డమీద సైతం,
భగవంతుల్ని పొదుగుతుంటే. .

గాయాలతో గొంతుపూడుకుపోతున్న బతుకు
గునపాల్ని కలవరించకపోతే ఎలా!

# కందుకూరి రమేష్ బాబు

## రైలు కిటికి

దీర్ఘమైన చూపులాంటి రైలుకూత
చీకటి చిట్లిన మద్దుల దృశ్యమాల

భుజాన్ని కోస్తో చల్లగాలి
సెలవంటో ఒంటరి తాటిచెట్టు
అలజడిగా మెరుపులు - అంతా నా వెతల్లోకే?

మనసులానే అచ్చం
ఒకింత నా పక్క రహదారి పరిగెడుతుంది.
ఓ మారు కారు, రెండు దీపాలు పరిగెడుతున్నాయి
ఇదీ పరుగేనా?

పచ్చని చెట్లు,కొన్ని పిల్లలు
దగ్గరై కన్నీటిలా వాల్తాయి
బుగ్గమీదికి జారి, ధారలు గట్టి
లోలోకి కనుమరుగైతాయి

జాజు సున్నం గోడల మా పాతిల్లూ
బీబీనగర్. . నీ కడుపులో చూసానే తల్లీ
ధన్యున్ని!

చెట్లతోపులో ప్రిదిలిన ఉరుము
చెవిలోన రైలు పట్టాల స్మృతి
ధగ్ధప్రేమై హత్తుకున్న ఒక గాయ చిత్రం

ఆపుకోలేని తమకంతోనో ఏమో
భూమి ఒక చనుమొనై నిద్రలేచిన ఘటన
ఇదీ ఆలాపనే.

గేటు పడింది.

నిలువని వాహనాల మీద కందిరీగ మనసులు
ఘుమ్మని నాలోలోన ముసురుకొన్నాయి
అద్దాల లంబాడీ రవికలా మెరిసిపోతూ
దృశ్యమైన యాదగిరిగుట్ట
తల్లి కడుపులో నాకు గుర్తులేదు
పడవలో ఊగినప్పటి స్వప్నమూ లేదు
ఇపుడొక రైలు జోలైనా మిగిలింది
ఇపుడొక రైలు జోలైనా మిగిలింది

(జనగామకు ప్రేమతో. . . .)

# కందుకూరి శ్రీరాములు

## నన్నుగన్న నా నేల

పది చేతులు ఒక్కటైతే ఊరేగింపు
పది అలలు ఒక్కటైతే ఉప్పెన
నీటి బిందువులు చల్లబడితే
మంచుగడ్డ
కొలిమిలో బొగ్గు రాజుకుంటే నిప్పుకణిక

ఇది తెలంగాణా

శ్రమకు ప్రతిరూపం
శక్తికి మరోపేరు
ఇటు మెదక్ నుండి అటు ఖమ్మం
అటు అదిలాబాద్‌నుండి మహబూబ్‌నగర్
చాచి ఎత్తిన రెండు అరచేతులు

మహబూబ్‌నగర్‌లో ఆకలి చావులు
ఆదిలాబాద్‌లో అత్యాచారాలు
కరీంనగర్‌లో చేనేత కార్మికుల హత్యలు
వరంగల్‌లో పత్తిరైతుల ఆత్మహత్యలు
మెదక్‌లో ఎదరు కాల్పులు
నిజామాబాద్‌లో ఎన్‌కౌంటర్లు
నల్లగొండలో నరకటం చంపటం
ఖమ్మంలో అరాచకం అన్యాయం
రంగారెడ్డిలో కుల పోరాటాలు
హైదరాబాద్‌లో మత కలహాలు

పది జిల్లాల అగ్గిపుల్లల పెట్టె
కదిలిస్తే కందిరీగెల తుట్టె – తెలంగాణా

మురిపాల సంస్కృతికి ఈ గడ్డ
మూడు కోట్ల, ప్రజల ముద్దుబిడ్డ

బిగపట్టిన గొంతు దాని స్వరూపం
ఎత్తిన జెండా దాని స్వభావం
దాని భాష - దాని శ్వాస
దాని వేషం - దాని పౌరుషం

గోలకొండ నవాబుల
కాకతీయ చక్రవర్తుల
శిథిలాల కోటలూ - శిల్ప విన్యాసాలు
తరతరాల నైజాం నవాబులూ - రాజుల పైసా రాళ్ళపాలూ
రజాకార్ల బీభత్సాలు - రాక్షసకృత్యాలు
జమ తీసివేత లెక్కల్లో
ఇంకా శేషంగా.మిగిలే ఉన్నాయి.

తెల్లదొరల్ని వెళ్ళగొట్టామని సంబరపడ్డాం
స్వాతంత్ర్యం మెడకు తాళ్ళయి
చుడుతున్నందుకు బెంబేలెత్తుతున్నాం.

యమ ధర్మరాజులు అధికారులు
పాశం ప్రయోగించకుండానే ప్రాణాలు తీయగలరు

బొమ్మరిల్లులా ఉన్న తెలంగాణా పల్లెల్ని
పుట్టమన్ను తవ్వేసినట్టు తవ్వేస్తున్నారు
అందుకే పాముల బుసబుస -

చెట్టుకూ చేమకూ జంతువులకూ జనాలకూ
నేల ఎంత ముఖ్యమో నీరంత ముఖ్యం

ఇక్కడ కడలి లేదు
కన్నీటి సరస్సులున్నాయి

పేరుకు రెండు నదులు పారుతున్నా
ఊరూరుకు నీటికి కటకట
ఈ ప్రాంతాన
మేఘం అల్గిందా
సాగుబడి ఉండదు
పునాస పంటలు అమాస చీకటవుతాయి
పూట జరగటం కష్టమైపోతుంది.

నీరులేని నేల - ప్రాణం లేని మనిషి
గోడుగోడుమంటున్నాయి బీడు భూములు

భూతద్దం పట్టి గాలించినా
మొలకలు మొలిచె గట్లు లేవు
చిలకలు వాలె చెట్లు లేవు
రహదారులూ, రైలు మార్గాలూ గుడ్డిలో మెల్ల
లేమి, దరిద్రం, పేదరికం, బీదరికం
ఇక్కడి ప్రజలు ధరించుకున్న నిలువుటద్దాలు

తెలంగాణా అంటేనే ఆకలికి పుట్టిల్లు.
అడుక్కుతినే బతుకులు కోకొల్లలు
నిన్న పత్తిరైతుల ఆకలి చావులు
నేడు చేనేత కార్మికుల ఆత్మహత్యలు

ఈ ప్రాంతమంతా
తృణప్రాయం చేసుకున్న దేహాల కథలే
అమాయకుల ఆక్రందనల ఆహాకారాల పాటలే
ఎటు చూసిన ప్రశాంతత లేని వాతావరణం
ఏ మూలకు వెళ్ళిన రణగొణ ధ్వనులే
అక్కడక్కడ ఇంకా వెట్టి బతుకులు
మట్టి కొట్టుపోయిన పల్లెలు
మూఢాచారాలు - మూర్ఖ విశ్వాసాలు
వంటింటికే అంటుకుపోతున్నారు స్త్రీలు

అంటరానితనం, ఊరూవాడ తేడాలు
ఇంకా చిన్నచూపునకు గురవుతున్నారు దళితులు
మాల మాదిగ - పల్లెకు దూరం
శూద్రులు దరిద్రులు - ధనికులు నౌకర్లు

ఖాళీ పొట్టలు కోట్లు
పట్టెడన్నం దొరకదు
మనుషులున్నారు
నడుచుకునే యంత్రాలు - మరబొమ్మలు
చెక్కపలకలున్నాయి.
అక్షరాలు మొలవని విత్తనాలు - చెత్త కాగితాలు

సొమ్ముల్ని అమ్ముకున్నట్టు పిల్లల్ని అమ్ముకోవడం
ఇక్కడి అమాయకత్వానికి ఆగర్భ దరిద్రానికి ప్రతీక
ప్రజలు నిస్సహాయులు నిర్భాగ్యులు
చట్టాలను ఇష్టమొచ్చినట్టు మార్చి
రూలును తాయెత్తులా తగిలించుకోవడం
నిరంకుశంగా పాలించడం ఇక్కడి దక్షత
ఇక్కడ ఖనిజ సంపదకు
సహజ సంపదకు కొదువలేదు
అడవి, నేల బొగ్గు, భూగర్భ జలాలు
కొండలూ, కోనలూ వాగులూ వంకలూ అన్నీ వున్నాయి
దేహం ఎంత అందమైతేనేం కంటిచూపు కరువయ్యాక

ఇంద్రసభ కాదు తెలంగాణా
ఇంద్రవెల్లి పోరాటం తెలంగాణా
రంభ, ఊర్వశిల నాట్యం కాదు
సమ్మక్క సారక్కల జాతర తెలంగాణా
పురాణకథ పాతాళలోకం కాదు తెలంగాణా
సింగరేణి నల్లబంగారం తెలంగాణా

భూమికోసం భుక్తికోసం విముక్తికోసం
సాయుధమైన దళం - తెలంగాణా
వీరనారి అయిలమ్మ
విప్లవ వీరుడు కొమురంభీము
జన్మనిచ్చిన మట్టి - తెలంగాణా

హక్కుల సాధన కోసం
మృతవీరుల త్యాగాలే
తెలంగాణాను రణభూమిని చేశాయి.
రక్తాన్ని పొంగించాయి - నేలను ఎరుపెక్కించాయి

వీరులు ఎందుకు పుడతారు
పోరాటాన్ని అడుగు
పోరాటం ఎందుకు పుడుతుంది
ఉద్యమాన్ని అడుగు
ఉద్యమం ఎందుకు పుడుతుంది
సాహిత్యాన్నడుగు
సాహిత్యం ఎందుకు పుడుతుంది
పీడితుల్నడుగు
పీడితులు ఎందకవుతున్నారు
పీడకుల్నడుగు

పీడకులెందుకు పుడుతున్నారు
పాలకుల్నడుగు
పాలకులెందుకు పుడుతున్నారు
ప్రజల్నడుగు

అదిగో ఆ ప్రజలే
పీడితులు - తాడితులు
పోట్లాట - పోరాటం
ఉదయం - ఉద్యమం
వీరులు - విప్లవం

శ్రీకాకుళం నుండి సిరిసిల్లా దాకా
వైర్‌లెస్ వ్యూహాలు
ఊహాలకు ఊపిర్లు
గద్దర్ పాట – తెలంగాణ తేజం
విరసం విసురు – వీరత్వానికి మెలుకువ

పెట్రోలొక్కటి చేతపట్టుకొని
ప్రపంచాన్ని శాసిస్తున్న
చిన్న చిన్న రాజ్యాల్ని చూస్తున్నాం కదా!

యంత్రాలమీద 'మేడ్ ఇన్'లు అచ్చేసి

పొరుగు దేశాలతో
పోటీ పడుతున్న కృషికంటున్నాం కదా!

ప్రపంచ జనాభాలో
ప్రథమ స్థానం ఉన్నా
పనితనంలో భేష్ అనిపించుకుంటున్న
విదేశి విధానాన్ని వింటున్నాం కదా!

అగ్ర రాజ్యాలను అశ్చర్యపరిచిన
సాహస దేశాల కథలు
చదువుతున్నాం కదా!

పగవాడి ముందు జారిపడ్డట్టు
నవ్వేటి బతుకైంది ఏల
ననుగన్న ఈ నేల?
గడ్డమీద ఆరేసిన చేపపిల్లలానో
చర్మం తీసిన పులిలానో చేస్తున్నదెవరు?
ప్రాంతాన్ని వెనుక బడేయటం నీచం
జాతిని వెలుగొందనీయక పోవటం నికృష్టం

కొంద్రగట్టి నాగళ్ళు దున్నిన భూమి ఉంది
ట్రాక్టర్లూ పంటకోసె మిషన్లూ లేవు
ఏతం వేసి మోటగొట్టిన బావులున్నాయి
ప్రాజెక్టులూ పంపుసెట్లు లేవు

ఇక్కడ థర్మల్ విద్యుత్ కేంద్రమున్నా
అన్నీ చీకటి కూకటి బతుకులే
ఇక్కడ కాగితపు పరిశ్రమలున్నా
అంతటా నిరక్షరాస్యత నిర్భాగ్యులే

చక్కెర కర్మాగారాలున్నా
చేనేత పరిశ్రమలున్నా
పని దొరకదు–పైసా చేతిలో ఉండదు

కొబ్బరి చెట్లు నాటుకోలేరు
కూల్ డ్రింకులు కొనుక్కోలేరు
అంతా ఎండమావులే

తునికాకులు చుట్టినట్టు
ఇక్కడ జీవితాల్ని చుడతారు
బీడీలకు దారాలు కట్టినట్లు
మెడకు ఉరితాళ్ళు బిగిస్తారు
పొగాకును అంటిపెట్టి తాగినట్టు
మనుషుల్ని మంటలో వేసి ఆనందిస్తారు

భయం ఇక్కడ వెన్నులా వెంటాడుతుంది
చీకటంటే భయం– చేతబడి అంటే భయం
దొంగ అంటే భయం - దోపిడి అంటే భయం

తెలంగాణాను ఎడారిగా ఉంచిందెవరు
అన్నంలేని అక్షరాలురాని
అవిటిదానిలా తయారు చేసిందెవరు?

ఓటు ఇచ్చింది ఎవరు
మోటు మనుషులుగా చేస్తుందెవరు?
సంతకాలు రాని వేలిముద్రగాళ్ళుగా తీర్చిదిద్ది

గోళ్ళను కత్తిరించి సింహాలను
బోనులో బంధించిందెవరు?

వృత్తాకారంలో తెలంగాణ
వృత్తి కళాకారులతో తెలంగాణ
భాష తెలంగాణ యాస తెలంగాణ
జనుల నాలుకల మీద ఓలలాడుతున్న జానపదం తెలంగాణా

గోసిగుడ్డ గొంగడిబొంత
ఇవే ఇక్కడి ప్రజల ఆస్తులు - అంతస్తులు
ఇప్పటికీ
ఇంకా నడుముకు జకుముంక రాయి దూది
తలకు రుమాలు-నోట్లో చుట్ట - చేతిలో కట్టె
అర్ధ నగ్న శరీరాలతో ఆకలి కడుపుల్తో
ఇదో గొప్పవేషం-అదో అద్భుత సజీవభాష
నేలంతా వాకిలై - ఆకాశమంతా ఇల్లయి
రాత్రింబవళ్ళు కష్టించే
శ్రామికులు-కార్మికులు-కర్షకులు ఇక్కడి ప్రజలు

ఇది ఇక్కడి జాతి సంస్కృతి
తెలంగాణా ప్రజలు - కారాదెన్నడు సవతి పిల్లలు

# బాగోతం మళ్ళా సద్వుతా

పోతన్నను చూసింద్రా
గాయిన ఎట్లా రాసిండో
గట్ల రాసి పేరు నిలబెట్టాలె
పోతన్న బాగోతం గురించి రాత్తే
మనం మన జాతి గురించో నీతి గురించో రాయాలె

ఎన్కట బువ్వ కుండల్నే వండుకొని తిన్నంగద
సట్టిల్నే కూర గోలిచ్చుకున్నం గద

మనింటికి అచ్చిన సుట్టపోన్కి
కాళ్ళకు లీళ్ళిచ్చి కడుక్కోమన్నం
మంచిశెద్దా మట్లాడుకుని సమజ్ జేసుకున్నం
గట్కనో గంజో కడుపునిండా తాగుమన్నం
తైదంబలో సల్లలీళ్ళో నోరార జుర్రుమన్నం

ఇగపోతాంటే మోసెయ్యికింద చెయ్యేసి పట్టుకోలె
పోతే పొద్దున్నది గని అని అన్లే
చంకల చెయ్యేసి ఎడమరెక్క పట్టుకున్నం
కాదు పోదంటే

కడుపుల తలకాయబెట్టి సాగనంపినం
చలిల్నో వానల్నో పోతా అంటే
గొంగడిచ్చి కొప్పెర జేసి పంపినం
ఎండ కొట్టెటప్పుడు పోతాంటే
మోత్కాకు నెత్తి మీదేసుకుని
దానిమీద రుమాల్ పేల్క సుట్టుకోమన్నం
పొలం గట్లపొంట పోయేటప్పుడు
జారి పడేవ్ జెర్రిపోతులుంటయ్ పయిలం
అని అన్నం సాగనంపినం
నువ్వద్దె బిడ్డా గిప్పుడేమో

దునియంతా అతలాకుతలం అయితంది
సద్వుకుంటే అన్ని సంగతులు
మనసున పడ్తయని తెల్వకపాయె
లీళ్ళు తాగెతంద్కె అనుకున్నంగని
లీళ్ళతోని సవాలచ్చపన్లు అయితవని
ఎర్కలేకపాయె

కిట్టమ్మ గోదావరమ్మలు
బతుకమ్మల కోసమే అనుకుంటిమి
దరిమీద నిలబడే దండం బెట్టి ఊకుంటిమి

నా పల్లె గిప్పుడు
చినిగిపోయిన మశ్క బట్టయ్యింది
దొడ్ల గోదల్లేవ్
మందకాడ గొర్లులేవ్
గుడ్డంల ఏముంది అంతా దుబ్బ

కాడికి కప్ప కట్టుకొని ఆడినా
ఆనదేవుడు దయజూపక పాయె
ఎంత లబలబ మొత్తుకున్నా
ఏం ఫాయిదా లేకపాయె
గిట్లెందుకు అయితుందో తెలుత్తలేదు

పోతన్న! పోతన్న!
నీ బాగోతం మళ్ళా సద్వుతా
కిట్ట పరమాప్తుని లీలలు
అంతా ఇంతా కాదు సుమా
మళ్ళా సద్వుతా నీ బాగోతం

## తెలంగాణ అభిమాన్యుడు

అతని సెమటతో. . .!
పుడమి పులకరిస్తుంది
అతని ఊపిరితో. . .!
పంట చేను వికసిస్తుంది
దుక్కి దున్ని గింజలేసి
కలుపు తీసి కలలు కంటాడు
ముందు రోజులను తన ముఖంపై
ఊహించుకుంటాడు
అతడు నిరంతర ఆశాసౌదం
జగానికో కలల పంట
అందరికి అన్నంపెట్టే అన్నదాత
అతడు తెలంగాణ రైతు
అతని గుండె గుట్టు దాచని
నిజాల లోగిలి
వానలో తడిసినా
చలిలో వణికినా
ఎండలో కాగినా
అతని ఆలోచనలు ఆనందాలు
పంట చేలలోనే
తాతల నాటి వ్యవసాయం వదలక
చతికిల బడ్డ రైతుని
ఒక పచ్చి అబద్ధం
శాసనమై మోసం చేసింది
కల్తి గింజలు - నకిలి పురుగు మందులు
నీటి కోరత - కరంటు కోత
పద్మవ్యూహమై చుట్టుకోగా
బీటాలు బారిన పొలాలను చూసి

కురువని మబ్బులు ఎగతాళిగా వెళ్ళుతాయి
డొక్కలు ఎండిన పశువులను చూసి
దిగాలు పడిన అతడు
బిక్కచిక్కిన అభిమాన్యుడే. . .?
అప్పులకు ఆశలకు పొందిక లేక
ఇంత జరిగినా – ఇంత తెలిసినా
మట్టిలో తాను రేణువైనందుకు
ఆయువును పణంగా పెట్టిన
త్యాగమూర్తి తెలంగాణ రైతు
పురుగుమందు పెరుగన్నంగా తిని
ప్రాణాలను వాదిలిన రైతును గూర్చి
నేలలోని ప్రతి రేణువు. . . !
ప్రశ్నిస్తుంది తెలంగాణ రైతు ఎక్కడని?
మట్టి కౌగిట్లో ఒదిగిన అతనిని
చేను, సెలకలు చెట్టు చేమలు
అడుగుతున్నాయి

# ఇదిగో తెలంగాణా

ఇదిగో వినబడుతున్నాయి
తెలంగాణ సాధన నినాదాలు
తెలుసుకో తమ్ముడా. . . .
ఇదిగిదిగో తెలంగాణ బతుకులు
తెలుసుకొని దక్కించుకో తెలంగాణను

ఇక్కడ! . . .
మనషుల బాదలు వేదనలు
జీవనదుల్లాంటి గాధలవుతాయి
మంచినీళ్ళు తాగితే ముంచిన ఫ్లోరిసిస్
వంచించిన వికృత రూపాలు
వంకర్లు పోయిన కాళ్ళు చేతులు
కాలే కడుపుకు ఆకలి తీర్చవు
చుట్టూర నదులున్నా. . . .
పొలాలు ఎండి ఎడారులవుతాయి

ఇంకా. . . .
జీవనం సాగించడానికి
దుబాయి దేశానికి అమ్ముడుపోతారు
రోజు కడుపు నింపుకోవడానికి
పడుపువృత్తిని కొనసాగిస్తారు
పాలమూరులో. . .
బతుకు తెరువులేని బడుగుజీవులు
ఎముకుల గూడు లాంటి ఎదపై
ఎగిరే పైటను నడుముకు చుట్టి
నడిచే ప్రతి ఇల్లాలు తెలంగాణ తల్లికి
ప్రతిబింబాలు అవుతారు
ఇక్కడి. . .
చేతి వృత్తులు చెల్లిపోయాయి
మరమగ్గాలు ఆకలి చావులకు మార్గాలు

పత్తి పంటలు ప్రాణాలు తీస్తాయి
కరెంటు బిల్లులు ఉన్న ఇల్లును జప్తిచేస్తాయి

ఇంకా. . .
ఆకలితో అప్పులతో ఉన్న తెలంగాణ వాసులను
తేలికగా మోసం చేసేందుకు
ఆంధ్రవలస వాదులు వస్తారు
ఇక్కడి భాషను యాసగా మార్చి
ఎటకారం జేస్తూ కాసులు పోగేసు కుంటారు

ఇక్కడి. . . !
రాజకీయ నాయకులు
తల్లి తెలంగాణాను మరచిపోయి
ఆంధ్ర పాలకులకు దాసులవుతారు
తెలంగాణ వాసులు
కష్టాలను, కన్నీళ్ళను చూస్తూ
మాట్లాడే బొమ్మలవుతారు
కనిపించే అంధులవుతారు
ఇంకా. . . ఎన్నెన్నో బాధలు
తెల్లవారదు పల్లెలు నిదురబోవు
తుపాకులు పల్లెలను పరామర్శిస్తాయి
తేలికైన జీవులు కడతేరుతాయి

## కలంధారి

# తెలం"గానా"

"తెలంగాణ ఆవు" పాలంత స్వచ్ఛమైన బ్రతుకులు మావి
మా లంబాడక్క చేసిన "జొన్న రొట్టె"లంత పెద్ద మనసులు
మావి ఏం పాపం చేశామని మాకీ శాపం?
విరగబూసిన మా తెల్లని "పత్తి" మనసుల్ని మీకమ్ముకుంటే -
"జాలీ" నోట్లు ఇస్తే మీ మీద జాలి పడ్డాంగాని మాగుండెల్ని ఖాళీ
దేవతల కాడ "బోనాలు" పెట్టడం తెలుసుతప్ప మీలా ఎదుటోడి బతుకులకి
"పిండాకూడు" పెట్టడం తెలియదే?
మా ముఖాలకు "హోలీ" రంగులు పులుము కోవడం తప్ప మీలా రంగులు
మార్చే "ఊసరవెల్లులం" కాదే?
"పీరీల" గుండంలో నిప్పులు తొక్కడం తెలుసు తప్ప
మీలా ఎదుటోడి "బతుకుల్లో నిప్పులు" పోయడం తెలియదే?
"బతుకమ్మ" పండుగలో పువ్వులు చల్లడం తప్ప
మీలా ఎదుటోడి బతుక్కి "పాడె కట్టి, పూలు చల్లడం" తెలియదే?
నీళ్ళా? "ఆ నీళ్ళు" మాకు రావని తెలిసే ఈ మట్టిలో చెమట,
నెత్తురు పోసి పిసికి దున్నుకుంటున్నాం...
తిరుగుబాటు విత్తనాలు చల్లి... ఉద్యమాల మొక్కలు మొలవాలని
మీ ఆంధ్రాలో వరికోతకు పోయినపుడు "మా కొడవలి" ప్రశ్నిస్తే గాని
తెలిసిరాలేదు మా తెలంగాణకు జరిగే అన్యాయం
"ఆంధ్రా ఇటుక బట్టీ" ల్లోని ఊక పొట్టులా
మా బతుకులు కాలుతూనే ఉన్నాయి
ఇంకేం మిగిలిందని? "ఆంధ్రా హోటల్" పెనం మీద
మేము ఎప్పుడో రోస్టయి పోయాం
"ఆంధ్రా ముఖాలు" తగిలించుకున్న బ్రిటిష్ అంగడి దొంగలు
తిరుగుతున్నారు జాగ్రత్తా!
మా "ముల్లు కర్ర" మొనంత సూటిగా ప్రశ్నిస్తున్నాం
తెలంగాణా ఉద్యమంలో ఇసుమంతయినా "విషం" ఉందా?
ఇప్పుడు తెలంగాణా చెరువుల్లోని "చేపలన్నీ తిమింగలాలై"

ఆంధ్రా కాంట్రాక్టర్‌లను మింగివేయాలి
మా తెలంగాణ తెట్టెల్లోని "తేనంతా" జుర్రు కున్నారు.
ఇప్పుడు మేము కందిరీగలమై లేస్తాం, మిమ్ము కమ్ముకుంటాం
అన్నా.. తమ్ముడూ..."ఎండి పోయిన మన వరి పొలాల్లా"
తలొంచుకుంటే లాభంలేదు.. తిరగబడాలి
మా "చెంచన్న" నెమలీక తోడు మా సద్దిగంపల్లోని
"పెరుగన్నం, మామిడి తొక్కు" మీద ఒట్టు
అవసరమైతే మా "చర్మాల్ని దప్పులు చేసి" మ్రోగిస్తాం,
తెలంగాణకు జరిగే అన్యాయం చాటిస్తాం
న్యాయం జరుగకుంటే మా "గోగునార తాళ్ళను"
ఉరితాళ్ళుగా పేనుతాం
మా బలం చాలకుంటే "తెలంగాణ శవాలన్నిటికీ"
ఊపిరి పోస్తాం... ఉద్యమిస్తాం
ఇన్ని "జాతర్లలో" ఇన్ని జీవాలను బలిచ్చిన
మాకు తెలంగాణ కోసం
మా ప్రాణాలను "బలివ్వడం" ఒకలెక్కా?

# కాంచనపల్లి

## బతుకమ్మ

పేరులు పేరులుగా
రంగులు రంగులుగా
నవ్వే గునకపూలు
తంగేడుపూలు
భిన్న మానస సంయోగాలకు
సంకేతాలై చిరునవ్వేవి
ఈ బతుకమ్మ
గ్రామదేవత కొప్పులో
పూలచెండై ఎగిసిపడేది
యౌవనం దురాక్రమణ చేసిన
పాలపొంగు పల్లె దేహాలన్నీ
తాళపు చప్పట్ల లయతో
ఆత్మగీతం ఆలపించేవి
అమ్మల కొంగులు పట్టుకున్న
పసితలలన్నీ
పాట కొసల కనుగుణంగా
బొంగరాలై తిరిగేవి
నది మధ్యలో రాత్రి వీడ్కోలు
తీసుకునే బతుకమ్మలు
నెత్తిన దీపాలు పెట్టుకున్న
బాతులుగా కదిలిపోయేవి
తల్లో, బతుకమ్మా
తెలంగాణా పెదాల నుండి
రాలిపడిన పూలవాన
మా బాల్యంతీగకు పూసిన
గుమ్మడి పూవా
పగిలిపోతున్న నిన్నటి స్వప్నమా

నగరీకృత కాలకూటముల మాటున
కృత్రిమ జీవన సూత్రాల
మిథ్యాగౌరవాల మాటున
నువ్వేమైపోయావు బతుకమ్మా
మాలో మళ్ళీ బతుకు బతుకమ్మా
ఈ యాంత్రిక యుగధర్మాన్ని
తిరస్కరించి
మళ్ళీ మాలో బతుకు బతుకమ్మా

# ఇప్పుడు నీ తెలంగాణా. . .

చీకటి . . .
చీకటి గుండెలో సముద్రం
సముద్రం పక్కన నిలువెత్తు దుఃఖం వంటి
ఆమె. . .
ఒంటినిండా సందేహాలతో
నడుస్తున్న అమాయకపు కొడుకు
వేసంగిలో చెప్పుల్లేక ఇసుకలో
నడిచే పాదం వాడు
చలికాలంలో మంచు బిందువుల్నే
రగ్గుగా కప్పుకునే వాడు
చేతుల కొమ్మలకు
పాపం అంత ఓదార్చే పచ్చదనం ఏది?
ఆమె వేపలాంటి బతుకులో
చేదే తప్ప చల్లదనం ఏది?

–  –  –

తన ఆకాశంలో కూడా
నక్షత్రాలుంటాయ్
తన మనసు కొమ్మ కూడా
పూల బాస పలుకుతుంది.
ఏపుడైనా తానుకూడా ఒక
పాటై ఎగురుతుది
విచ్చుకున్న వెలుతురు బాకు
తనకూ అందుతది
తెగిపోయిన శిరస్సులు
చిమ్ముతున్న ఎర్రని ప్రాణం నిం[illegible]
తెలంగాణ అన్న తనపేరే
ఉంది
అర్శీయమ్మ
బతుకమ్మ పండుగచ్చె

పూవుల వాన. .

వానే - వాన

స్నేహపు వాయినాల సత్తు

పిండి ముద్దలు

దసరా పండుగ

జంబాకుల అర్చనలతో

కుటుంబాలలో ఆనందాలు

సగటు మనిషి హృదయం వంటి

ఉగాది పచ్చడి

ద్రవరూపంలో

చివురించే ఆప్యాయతలు

ఎన్ని సంబరాలు

భట్టు ముసలమ్మ కథ చెబుతదట

దీపావళి కత

నరకాసుర వధ

బుక్కెడంత విని జల్ది

పోదాం పాంన్రి

కురుమెల్లింట్ల లచ్చిమి పూజ

కత జెప్పేది అవుసుల అంజయ్య

బాపనైన కోమట్లింట్లనే

చెబుతడు ఘరి. . .

ఎన్నెన్ని జ్ఞాపకాల పొట్లాలు

ఎనెన్ని స్మృతుల పరిమళాలు

కాలం అలల మీద ఎలా తేలిపోయింది

బాల్యం పడవ?

అస్సయ్ దులాల పీర్ల పండుగలో

మేదరి మల్లన్నకే దేవుడస్తడు

సిద్దయ్య నిప్పుల మీధ ఉరుకుతాడు

తన దేహపు చెట్టు ఎన్ని

ఆకులను రాల్చేసిందని

కోస్తా శిశిరం

అమెరికా గ్రీష్మం

తన వసంతాలలో ఎంత నిర్ద

యగా ఆడుకున్నాయని

. . . . . . . . . . . . .

నా కొడకా

ఉక్కు పిడుగా

నీకు గాని వేషం వేస్తివి

నీదిగాని బాస పలికితివి

వచ్చిండు అంటే అనాగరిక మయింది

వచ్చాడు అంటే గొప్ప అయింది

నీళ్ళిచ్చిన చెలిమను కాదంటవ

నీడనిచ్చిన చెట్టును కాదంటవ

జామచెట్టు కొసలకు

తుమ్మపూవును పూయిస్తవ

నీ మాటే నువ్వు పలుకు

నీ పాటే నువ్వు పాడు

నీ చొప్పకట్టె నువ్వు నమలు

నీ గుండె తోటే నువ్వు జీవించు

ఇప్పుడు నీ తెలంగాణ

భారతాఫ్రికా అసలు కాదు

తెలుగు తల్లి నుదుటి తూరుపులో

పొద్దు పొడుపు

జాతి శిరస్సుమీద రెప రెప లాడే

సాంస్కృతిక పతాక

# కాసుల ప్రతాపరెడ్డి

## అంతా అ'దృశ్యమే'. . .

కత్తులు కటార్లు, డాల్లు
ధాం, ధీం. . .
శంభో శంకర హరహర మహదేవా!
వీరోచిత నినాదాలు, వీరంగాలు
యుద్ధతంత్రాలు
విజయమో, వీరస్వర్గమో. . .
తేల్చేసుకుందామనే. . .
ఎదురేగిన ప్రతిసారీ
తలపడకుండానే నెత్తురోడుతాం
ఇంతకీ ఓడినట్లా, గెలిచినట్లా?
గుండె పిండేసినట్లయి పిడికిలికి సరిపోదు
చిందు బాగోతమో, యక్షగానమో. . .
రక్తం సలసల కాగుతూనే వుంటుంది
పగిలిన పాదాలు కార్చిన కన్నీరు గడ్డ కట్టుకుపోతుంది
కనవేరా బాలా! వినవేరా!
గుదు గుదు గుంజం గుండె రాగము
తల వెయి ముక్కలై పోవుగాక!
వంద తలలను కోట గుమ్మానికి వేలాడదీయుగాక
విసుర్రాయి తిరిగినట్లే తిరుగుగాక!
ఎముకలు పిండి పిండి అయి రాలిపడు గాక!
మనోబలం చేయి దాకా పాకాలి కదా!
విచ్చిన విత్తనాలేవో, వేసిన పంటలేవో
చల్లిన పురుగు మందులేవో
జేబులు పొక్కలు పడి, ఎవుసం పొక్కిలి పొక్కిలై
మేనంతా విషమెక్కి
లేలేత జొన్న మేసి నురగలు కక్కిన పసురాలమే. . .

పిల్ల చేష్టో, బాల్యావస్థో
ఎరుక చెప్పే తల్లేది?!
కట్టమైసమ్మా! తల్లి పోలేరమ్మా!!
దొడ్డి దొడ్డంతా దొంగలు తోలుకపోయినట్లే
కాటమరాజుకు పిండం పెట్టాం కదా!
దొంగెవడో, దొరెవడో తెలిసెదెలా?
పొద్దుకు చేయి అడ్డం పెట్టి చూస్తే కనిపించేదేమిటి?
చిటారు కొమ్మన మిఠాయి పొట్లం
చిగురేసె, మొగ్గేసె, మనసంతా పూతపూసె
చెట్టులెక్కగలవా? ఓ నరహరి!
పొట్లమె పట్టగలవా  ఓ నరహరి!.
చూపుల గాలంవేస్తే చిక్కేదేది?
ఆశను గుంజకు కట్టేశాక పెనుగులాటే. .
జీవితమేది, సమరమేది?
ఎదరుపడే వాడెవడు? ఎదుర్కునేదెవరిని?
పట్టపగలు చిమ్మచీకటి
సాలు పెట్టిన పొలం మీద ఒట్టు!
గొంతెండిన బావుల మీద ఓట్టు
పాలోడెవడో, పగోడెవడో తెలియదు
కాడికి కట్టిన కోడె కళ్ళెదుటే మాయం
అర్జునా, ఫల్గుణా, పార్ధా, కిరీటి, శ్వేతవాహనా, బీభత్సా. . .
గుండెల దడ తగ్గుతుందా?
నెత్తిమీద పడే పిడుగు ఆగుతుందా?
ఆంజనేయ దండకం అంతా రాదే. . .
చేసిన తప్పుకు చెంపలేసుకునే వ్యవధి కూడా లేదు
చిరిగిన బొంతకు ఎన్ని మాసికలు?
ఎత్తిన కత్తి వాడనే లేదు, దానికంటిన నెత్తురెంత?
అయ్యా, అవ్వా బోనమేదే?
నా మెడను గావు పెట్టే తంబాలోడు ఏడె?
పొలి చెయ్యరాదూ, బలి పశువును నేనే అవుతా.

# బీటలు

మబ్బుల బారును వేటగాడెవడో తరుముతున్నాడు
నా వైపు తెల్లమొహాలేసి
పరుగే పరుగు
ఎక్కడి దాకా, ఎక్కడెక్కడి దాకా -

మహా మాంత్రికుడి కనుబొమ్మల కింద
రెప్పల్లేని నీలి కళ్ళు
జలధారలను కురిపిస్తూ
పచ్చని దేహాలను పండిస్తూ
అక్కడిదాకా, కనుచూపు మేర దాటేదాకా -

ఇక్కడేమో
తల్లిదేహం పచ్చిపుండు
పొత్తిళ్ళలో పసికందులు
మాట నేర్వని వారు
మాయ నేర్వని వారు
ఒడి విడిచేందుకు గుండె జారేవారు

ఎప్పటికప్పుడు ఆత్మ రక్షణే
కాళ్ళకింది భూమిని చుట్టేసుకుంటుంటే
రణన్నినాదాల విత్తులు చల్లడమే
మొగ్గల మీద నిప్పులు కురవడమే

అరచేతి మీద ఐశ్వర్యరేఖ దండిగానే ఉంది, మరి!
కొల్లగొడుతున్న వాడెవడు
గుల్ల చేస్తున్నదెవడు -

## కాళోజీ

# వీర తెలంగాణ నాది

వీర తెలంగాణ నాదివేరు తెలంగాణ నాది
వేరై కూడ తెలంగాణ వీరతెలంగాణ ముమ్మాటికి
తెలంగాణ వేరై నిలచి భారతానవెలయు ముమ్మాటికి

వీర తెలంగాణము వైనంతో భారత పౌరుని ధీధైర్యంతో
ప్రజావాణి నా గొడవ మిన్న 'ప్రజా' ప్రకటన జేస్తున్నది.

వీర తెలంగాణ నాది వేరు తెలంగాణ నాది.

వేరై కూడ తెలంగాణ వీర తెలంగాణ ముమ్మాటికి
తెలంగాణ వేరై నిలిచి భారతాన వెలయు ముమ్మాటికి.

దోపిడి జేసే ప్రాంతేతరులను
దూరము దాక తన్ని తీరుతం
ప్రాంతం వాడే దోపిడి జేస్తే
ప్రాణం తోనే పాతర వేస్తం

దోస్తుగ వుండే వారితో మేమును
దోస్తే చేస్తే ప్రాణం ఇస్తం.
'ఎంతకు అంత' అన్న నీతితో
చింత మాని బ్రతుకును సాగిస్తాం

తెలంగాణ 'బాషిందా' బ్రతుకు
తెలిపిన తరతరాల సత్యమిది
కన్నడులు మహారాష్ట్రులు తుర్కీ
అన్నయ్యల తరతరాలేరినది..
గుజరాతీ, మార్వడి పారిసీ
గుజ్జన గూళ్ళు అనుభవించినది
కాబూలీ ఈరాని భాయిలకు

కనువిప్పుగ మెలిగిన విధమిది.
తెలంగాణమిది తెలంగాణమిది
తీరానికి దూరాన ఉన్నది
ముంచే యత్నము చేస్తే తీరము
మునుగును తానే తీరము తప్పక

జైహింద్ జై తెలంగాణ తెలంగాణ జిందాబాద్
భారతమాతాకీ జై తెలంగాణ జిందాబాద్

# తెలుగు బాస ఎన్నితీర్లు

తెలుగుబాస ఎన్నితీర్లు
తెలుగు యాస ఎన్ని తీర్లు
వాడుకలున్నన్ని తీర్లు
'వాడుక' ఏ తీరుగున్న
తెలుగు బాస వాడుకయే
అన్ని తీర్ల వాడుకకు
పరపతి పెత్తన మొకటే
ముఖే ముఖే సరస్వతి
నోట నోట మాటమ్మ
అన్ని తీర్ల వాడుకను
ఒకే తీరుగా చూచుట
ఎవరి వాడ వారిది అని
ఎవరి వేద్క వారిది అని
ఎవరిదైన వాడుకె అని
అందరికి వేడుకగ తలుస్తే
తెలుగు బాస అభివృద్ధి
ఒకే బాస మాటాడే
తెలుగు వారిలో సమైక్యత
లేకుంటే తన్నులాట
తప్పదు ఏనాటికైన
రెండున్నర జిల్లాల
రెండుమూడు తెగలోండ్లకు
'బడిపలుకుల' బాబులకు
పంజరాల చిలుకలకు
ఎప్పుడు తెలుస్తుందంట
ఎన్నడు తెలిసొస్తుందంట
వాడుక భాషంటే ఏందో?
ఎవరి వాడకం భాషో?

గ్రాంధికాన్ని వద్దంటూ
రెందున్నర జిల్లాల
చదువుకున్న తెగలోళ్ళ
వాడుకనే గొప్పజేసి
దానికె పట్టం గట్టి
'గురజాడ' 'గిడుగు' పేర
మసిబూసి ముండమోపి
రెందున్నర జిల్లాలదె
దండిభాష అంటు చాటి
తక్కినోళ్ళ నోళ్ళు యాస
తొక్కి నొక్కి పెట్టి వుంచి
రెందున్నర జిల్లాల
చదువుకున్న కుటుంబాల
రెండుమూడు తెగలోళ్ళదె
'ప్రామాణిక భాష' అని
శిష్టుల వ్యావహారికమని
అందరి తలపై రుద్దితే
ఎక్కడి న్యాయం అంట
ఇంతకన్న అందరికి
ఒకే తీరు ఇబ్బంది (కలిగించి)
ఒకే తీరు సాధన కలిగించే గ్రాంధికము
సాధ్యమైన గ్రాంధికము
నయమనిపిస్తది అన్న
'వాదుక బాస' అంటె
రాయవచ్చినోడు రాసే
దస్తూరి వలె కాదా?
దస్తూరిలో లిపి వలనే
మాటల్లో యాసకాదా?
దస్తూరిలో అక్షరాల
రూపువలెనె

మాటల ఉచ్చారణ అవును కాదా?
ఎవని యాసలో వాడు
మాట్లాడుతున్నట్లే
ఎవని మాండలికము వాడు
వాడుకొనుచున్నట్లే
ఆ యాసతో, ఆ విరుపుతో
ఆ యమకం గమకంతో
రాస్తె, తప్పేమిటంట?
అన్ని వాడుకలు కూడా
ప్రామాణిక స్థాయి తోడ
వెలుస్తుంటె తప్పేమిటి?
కాళిపట్నం రామారావు బాస బాస కాదా?
రాచకొండ విశాస్త్రి యాసరాత బాసకాదా?
1. "దయ్యాల పన్గదది' మెదక్ పలుకు బాసకదా?
2. 'అంగుడుపొద్దులో' వున్నది కరినగరం బాస కాద?
3. సోమరాజు 'పొద్దు'లున్న బాసకు పట్టంవద్దా?
4. 'కొడుకు పుట్టాలె' బెస్తపల్లె బాస బాస కాదా?
రాయలసీమ వాడి బాస ఇపుడు యాడున్నది?
'శ్రీకాకుళ' గిరిజనుల తెనుగు తేనెలెచటున్నవి'
'బొబ్బిలి దిబ్బల' పులుల గాండ్రింపులు వినరావేం
అందరిచే 'చిత్తం' సార్ అనిపించే చిత్తవృత్తి రెండున్నర
జిల్లాల 'బుల్లోరి'కి ఎందుకంట?
'ముద్దాయి'అన్నమాట
ఘుద్దయి 'ని' మధ్యక్షర దీర్ఘంతో
గుంజిలాగి పల్కితేనే
ప్లేంటిఫ్ అక్యూజుడైతడ
'ముల్జిం'అక్యూజుడు-అనుకోండని
అధికార రాజకీయ దుర్మదాంధం
ఏ ప్రాంతం సౌలభ్యం కోసరమని
యేమనవలె ఏటింకా దౌర్జన్యం
ముద్దాయి అని అంటే

దావా చేసిన వాడు
దావంటె ప్లేంటుకాద?
దావా చేసిన వాడు
ముద్దాయి అవునాకాద?
'అక్యూజుడు' అనుమాటకు
'ముద్దాయి' తెలుగుజేసి
'ముల్జిం' మాటకు మారుగ
వరంగల్లు అదాలత్‌లో
బోర్డుపెట్టి ముద్దాయంటే
నీబాంచెను గులాపోణ్ణి
అన్నోనికి, చిత్తంసార్, చిత్తం సార్
అన్నోనికి, ఫరఖేమిటి, భేదమేంది?
'రోడ్డంటే' తప్పుకాని వేత్తలంత
'సదకంటె' చెవులు మూసుకొనుటెందుకు
'టీ' హాయిగ చప్పరిస్తు –
'చా' అంటే 'ఛా ఛా' అని
'మొగ' మేదో తాగినట్లు
ఉలికి ఉలికి పడుటెందుకు?
' మా అమ్మ వచ్చింద'ని అనుకుంటూనె
'మా నాయన వచ్చింద'ని అన్నందుకె
చెవులు మూసుకొనుటెందుకు'
'మందలించు'టని అంటే
తమ వాడుక బట్టి దాన్ని
'చీవాట్లని' అర్థించుక
'పరామర్శ' 'పలకరింపు'
అను అర్థంలో వాడుక
తెలంగాణ ప్రాంతంలో
ఉన్నదన్న 'తెలివిడి' కూడా లేక
కయ్యానికి కాలు దువ్వు 'సహృదయం'
నేమనవలె?
పోయిందంటే చచ్చిపోయిందని

అనుకొనుట ఎందులకని
నక్కల గుట్టలో వున్న
'లాండ్ మార్టుగేజు' బ్యాంకు
'అరాజీరహన్ బాంకు' బోర్డేమంటది
'భూమి తనఖా బాంకట' దానిపేరు.
'తనఖా' అంటే జీతం
తెలంగాణ వాడుకంత
తనఖా అంటే జీతం
పారసీ పదం అది
సర్కారు పరిభాషలో
నిజామంత వందలేళ్ళు
వాడుకకెక్కిన పదమది
కోటిన్నర తెలుగోళ్ళకు
'తనఖా' అంటే జీతం
వారిని తనఖా అంటే 'రహన'ని (మార్టగేజని)
అర్థం చేసుక చావండని
ఈ తీరుగ లొంగదీస్తె
అడిగే వాడే లేడా?
దర్జాయన, మేరాయన
అంటేనే ఏవగింపు ఎందులకని?
'టైలరు' ఎక్కడి తెనుగు?
'సేగెదారు' తెలుగుకాదు.
'క్లరకు' అంటే తెలుగా?
....... అంటే తెలుగా?
బి.డి.యో, చేరుమను, .......
అన్నమాటలే తెలుగా?
హైద్రాబాద్ దుకాణం పేర్ల బోర్డులన్ని
ఇంగ్లీషులో వున్నాయని
ఏడ్చిండట.ఒక ప్రతినిధి
తెలుగు మహా సభల.

దుకాణం దుకాణమంటే
ఎందుకన్న అదరిపాటు.
'కొట్టు' షాపంటే మెప్పు
కులుకు పాటు ఎందులకని?
'సిల్‌సిలాగా పెట్టి'న్నని
సేగెదారు అంటేనె
'సీరియల్'ను యీ 'వెధవ'లు
'సిల్‌సిలా' అంటాన్రని
వెక్కిరించు రెండున్నర జిల్లాల
చిలుక పలుకు అధికార్లను
తెనుగు భాష మాట్లాడే
భావ సమైక్యతకై కృషి చేసే
నన్నయ్యని కొలవాల్నా?
పళ్లు విరగ తన్నాల్నా?
ఆ.ప్ర.రాజ్య సమైక్యత
చెదరి పొయ్యే దుర్ఘటన ఏర్పడెనట
ఆ.ప్ర. రాజ్యానికెంతో
ప్రాణాంతకమై పోయిందట.
గండం తప్పిందట
అందుకె రాష్ట్ర సమైక్యతను
నిలిపుంచే ఘనసంకల్పంబట?
ప్ర. తెలుగు మహాసభలట
ప్ర. తెలంగాణ ప్రదేశం
రాజ్య మొకటి ఏర్పడితే
భారత జాతి సమైక్యత
కేమిటి అపకార మంట?
రాజ్యాల విభజనము
గ్రామ స్వరాజ్యం మేరకు
అవునా కాదా?.
తెలంగాణ ప్రదేశమంత
వేరే రాజ్యంగా వుంటే

భారత రాజ్యాంగానికి ముప్పొస్తద?
ఆ కోరిక వుండటమే దేశద్రోహమా?
తెలుగు భాషతో వైరమా?
ఇవి యన్ని దొంగమాటలేన కాదా?
ప్ర. తెలుగు మహాసభల ముసుగేసుక
'తెలంగాణ' ఏర్పాటు
ఆ.ప్ర. రాజ్యవిభజన
కోరికయే ద్రోహమ్మని
చాటించే అధికారం
ఆ.ప్ర.రా. ముఖ్యమంత్రి
జలగం వెంగళరావుకు ఎవడిచ్చెను?
ఇది అధికార దుర్వినియోగంబౌనకాదా?
రాజ్యం విభజన కోరెడి వారందరు
భారత పౌరులు అవునా కాదా?
'తెలుగుదేశ'మను మాటకు
'తెలుగుజాతి' అనుమాట కర్థమో
మనందరది భారతజాతే జాతని
భారత దేశ మొక్కటే
మన అందరి దేశమ్మని
భారతదేశం లోన
హిందీ భాషీయులంత
ఒక రాజ్యంలో లేరని
భారతీయులే వారని
తెలుగుబాస మాట్లాడే
వారుకూడా రెండు మూడు
రాజ్యాలుగా విడిపోతే
భారతదేశ సమైక్యత
భావం ఇసుమంతైనా కుంటుబడదు
అను సంగతి
తెలుగు జాతి
తెలుగుదేశంలోని వారికి

నచ్చజెప్పు విధమేది?
తెలిసికూడ
రెండున్నర జిల్లోళ్ళు
రెండు మూడు తెగలోళ్ళు
చదువుకున్న కులపోళ్ళు
రెండున్నర జిల్లాలదే
దండిబాస అని అంటే
అధికార మంత గూడ
తామే పంచుక తింటే
తక్కినోళ్ళ నోళ్ళయాస
తొక్కిపెట్టి నొక్కేస్తే
తిరగబడాల్న వద్దా?
తెలుపండి నలిగెటోళ్ళు
హైద్రాబాదు తెలుగుపట్న మోలె
లేదంటే అది తెలుగుజాతికె సిగ్గట
ఆ మహానుభావునకు తెలియదింక
హైద్రాబాదే కాదు ఆ మాటకొస్తె
తెలంగాణ మరాట్వాడ
కర్ణాటక జిల్లాలతో వెలసినట్టి
ప్రదేశమంత వివిధ భాషలకూడలి
వివిధ సంస్కృతులకు కూడలి
మీనియేచర్ ఇండియా
హైద్రాబాదను నగరం
నేటికి భారతమను మనదేశం
రూపానికి చిహ్నము, ప్రతీక.
జైహింద్ జై తెలంగాణ.

# ప్రాంతం వాడే దోపిడి చేస్తే

దోపిడి చేసే ప్రాంతేతరులను
దూరం దాకా తన్ని తరుముతం
ప్రాంతం వాడే దోపిడి చేస్తే
ప్రాణంతోనే పాతర వేస్తం
దోస్తుగ ఉండే వారితొ మేమును
దోస్తే చేస్తం – ప్రాణమిస్తం
ఎంతకు అంత అన్న ధోరణితో
చింతమాని బ్రతుకును సాగిస్తం
తెలంగాణమిది – తెలంగాణమిది
తీరానికి దూరాన వున్నది
ముంచే యత్నం చేస్తే తీరం
మునుగును తానే – మునుగును తప్పక

# కుమ్మరి భిక్షపతి

## మెతుకు సీమ విలవిల

నీళ్ళన్నా తాగు . . . రామన్నా. . .
నీళ్ళే . . .నిప్పై
నా గొంతులో . . .మండితే
నా బతుకొక 'ఇంగలం' గంగన్నా!
నా పొలం. . . 'అగ్గిమీద గుగ్గిలం' గంగన్నా!
గంజన్నా. . .తాగు. . రామన్నా. .
మింగ మెతుకూ లేదు. .
గంజెట్ల తాగుదూ. . గంగన్నా?!
బువ్వ తినకపోతే . . .
గంజన్నా . . . . తాగకపోతే. . .
సచ్చిపోతవే . . రామన్నా. . !
ఉన్నదొక్క కొడుకూ. .
అడవి అన్నలతో పోరుబాట నడిచి
'లారీల' తూటాలకే సచ్చే . . .
. . . . .
కొడుకు 'కుదెం' తోటి. . .
నా ముసల్దీ. . . సచ్చిపోయె. .
నేను ఎవ్వరి కోసం తినాలే. . గంగన్నా?!
. . .ఎవరి కోసం బతుకాలె గంగన్నా?!

# కుర్మే. జి. ఆర్.

## ఎర్రకోట

నా ఊరు
అరకులోయలో లేదు.
ఉదకమండలం కానేకాదు
దృశ్యాలు ముద్దలు ముద్దలుగా రాలవు
నా ఊరి బగీచాల్లో
కులాల చింతచెట్లు
మతాల మామిడి చెట్లు
విరగపూసి కాయలు కాస్తాయి.
పచ్చని పొలాల గట్లపై
చిచ్చుల ముళ్ళకంచెలు
జొన్నచేల చాళల్లో
కాటుకేసిన కంకులు
నా ఊళ్లో అనవాళ్ళు!
పొలం నాదే. . .
ఎరువుల ధరలు అకాశానివి.
పంట నాదే. . .
ధర నిర్ణయం దళారిది
ఇక్కడ ఏపుగా పెరిగిన ప్రతిమొక్కా
చేను తనది కాదంటుంది.
చెట్టై నిండుగా ఎదిగిన కొడుకు
కాండమై ఒకనాడు తెగిపోతాడు
నా వూరు కేకేస్తే
ఏ పట్నం పలకదు.
ఇక్కడ ఎంతచెడ్డా సరస్వతి
లక్ష్మి యింటి తలుపునే తడుతుంది.
ఊరి మధ్య నిలబడ్డ ఆంజనేయుడు
స్త్రీలను దళితుల్ని కన్నెత్తైనా చూడడు.

నేను రెక్కలు తొడుక్కోక ముందు
నా కాళ్ళకు ఇంకా బలపాలు కట్టుకోకముందు
నా ఊరు ఊరంతా
వీధి వీధిన బారులు తీరేది.
'సైమన్ గోబ్యాక్' నినాదాలై
మట్టిగోడల్ని ముద్దాడేవి.
ఎత్తిన పిడికిళ్ళు ఏ రంగువో
ముష్టి తెల్లవాడికేం తెలుసు?
స్వాతంత్ర్యాన్ని
వదిలేసి పారిపోయాడు
అర్ధశతాబ్దం పైగా
దివిటీ పట్టుకొని పరుగెత్తుతున్నాను.
స్వాతంత్ర్యాన్ని అందుకోవాలనీ. . .
నా దివిటీకి మూడు రంగులే;
ఎర్రకోటం దూరం ఏడడుగులే!. . . .

# ఎక్కడైనా. . .

నేను
చదువుకోవడం తప్ప
చదువుకొనడం చేత కానోన్ని

గోతుల్లో పడడం తప్ప
గోతులు తీయడం తెలియనోన్ని

నిప్పుల్లో నడవడం తప్ప
బతుకుల్లో నిప్పులు పోయడం యెరుగనోన్ని

రెక్కల దోపిడీకి గురి కావడం తప్ప
రెక్కల్ని దాచుకోవడం ఎరుకలేనోన్ని

నిటారుగా నిలబడడం తప్ప
అవినీతిలో సరితూగనోన్ని

మాటలు పదిల పరచుకోవడం తప్ప
మూటలు పదిల పరచుకోవడం గుర్తెరగనోన్ని

భాషలో యాస తప్ప
బతుకులో మార్పు లేనోన్ని

ఇంతకీ నేనెవర్నా. . .?

పాలకొల్లు తోటమాలిని నేనే. . .
పాలమూరు కూలివాన్ని నేనే. . .
కుప్పంలో చెప్పులు కుట్టేవాన్ని నేనే. . .
బక్కోన్నీ. . . బడుగునీ. . .
ఎక్కడైనా. . . నేనొక్కన్నే. . .!

# కోట్ల వెంకటేశ్వరరెడ్డి

## తిన్నకాడికి సాల్

దేశం గాని దేశమొస్తివని
ఆదరిస్తిమి
ఉన్నదాంట్ల కడుపుకింత
అంబలోస్తిమి!
ఇసూటు రమ్మంటే
ఇల్లంత నాదంటివి
తిన్నింటి వాసాలు లెక్కెడితివి
తాతలిచ్చిన సారెడు భూమి
పైసగ్గొంటివి!
పక్కోని సేన్ల
మిత్తి కిందికి పత్తివెడ్తివి
వాని పానం దీస్తివి
మాకండ్లల్ల కారంజల్లి
సర్కారు కంపోలే
ఊరంత మొలిస్తివి
ఏం జేయాలో సమజయితలేదు
నా ఊరి దొర
నా ఊళ్ళనె కావలోడయిండు
యా ఊరోడో ఈడొచ్చి
పెత్తనం చెలాయిస్తుండు
భూం పాయె భుక్తివాయె
కాలువనీళ్ళ నీకు వారె
కళ్ళనీళ్ళు నాకు మిగిలె
ఆలోడివి కాకపోతివి
పాలోడివి కాకపోతివి
అందినకాడికి ఢిగమింగితివి

దోసుకున్నకాడికి దోసుకుంటివి
గిప్పుడు
'నీ ఏసం బాగలేదు
నీ బాస బాగలేద"ంటివి
అయ్యిందేదో అయ్యింది గాని
ఇగనుంచి
పచ్చగున్నకాడ పందిరెయ్యకు
వెచ్చగున్నకాడ గొంగడి వర్వకు
పన్జేసటోనికి పద్దతి జెపితే
చేతులున్న చెర్నకోల ఎదురు తిరుగుతది!
తిన్నకాడికి నీకు సాల్
తోక ముడిస్తే నాకు మేల్

# కోడూరి విజయకుమార్

## ప్రత్యక్షసాక్షి కథనం

ఎన్నని జెప్పమంటవ్ నాయినా?
మా గోస యేమని రాసుకుంటవ్ నాయినా?
మా పానాలే మా చేతులల్ల లెవ్వనుకున్నోళ్ళం
మా వోట్లు మా చేతలల్లుంటయ్యని యెర్కలే నాయినా!
బాగుపడేదెవలో? . . . .  బంగ్లాలు గట్టుకునేదెవలో?
బుక్కెడు బువ్వకోసం రగతం చెమట చేసుకునేటోళ్ళ
యెవల మతలబేందో యెట్ల సమజైతది నాయనా?
మాపటీలి వోట్లెయ్యద్దని వాళ్ళు బజర్దస్తు జేసీ
పొద్దుగాల వోట్లెయ్యాలని వీళ్ళు జులుంజేసీ
బందూకుల నడ్మ బతుకైంది బాంచను
మా మగపోరగాండ్లు ఆగమైపోయిండ్లు
వీళ్ళకేం జెప్పిండ్లని వాళ్ళు గొట్టీవాళ్ళ జాడ జెప్పమని వీళ్ళు సావగొట్టీ
వున్నోళ్ళనే పరాయి దేశమోళ్ళమైనం
రజాకార్ జమాన్ల గుడ గింతన్నాయం లేదు కొడుకా!
ఊళ్లెకు రోడ్డు లేదన్నమా?. . . . పొలాలగ్గాదు
మాకు దూపైన నీళ్ళు లెవ్వన్నమా?
తిండికి తండ్లాడతానమని, టికాన లేదని
లొల్లిజేసినమా?
పానముండీ లేనోల్ల లెక్కనె వుంటిమి గద
మీ లెక్కలల్ల వున్నమో లేమో అన్నట్టే వుంటిమి గద
జరంత నువ్వన్న జెప్పు బాంచను
నివద్దిగ మా వోట్లు మా చేతులల్లనే వున్నయ్యా?

# నల్లికుట్లోడు

గీడ సందు సూసి
చిటుక్కు మనిపిస్తడు
సాటు సూసి జటుక్కుమనిపిస్తడు
"గుడ్ని" సూపి లింగం మాయం చేస్తడు
గుడిసెల్ని మేడలు సేత్తనంటడు
ముందర గుడిసెల్ని పీకేస్తడు
అయ్యలకు, మియ్యలకు లడాయి పెట్టి నవ్వుతడు
పైసలు గుంజుతడు
పైరవీలు సేత్తడు
గీడు సర్కారోని బామ్మర్ది
షాహుకార్లకు "బుడ్డోడు"
గీడు నడిచే ఏళ చిమ్మచీకటి
గీడి తొవ్వెప్పుడు దిడ్డికంత
గీడ్ని పట్టుకోని కొట్టబోతె
మంచి మనసుల మంచాలకు సెట్లు
కొట్టెటోల్ల గుండెల్ల కుంపట్లు
గీడ్ని మావాడ నల్లికుట్లోడంటరు

## గద్దర్

# పురుగులన్నం

పొద్దుగల్ల పరమాన్నం
పగటికి మెత్తన్నం
పొద్దుగూకితే పులిసిపోయినన్నం
తెల్లారితే పురుగులన్నం
ఆ పురుగులన్నం పక్షులకు పరమాన్నం
కాలమిది
సమయమిది
పగిలిన తెలంగాణ కవి కంఠమిది

# అంతరాత్మ

సముద్ర తరంగాల్నిచూసి
పొంగిపోయి
అలల్లో ఆడుకుందామని ఒడ్డుకు చేరాను
చెంగున ఎగిరేచేపపిల్ల
కనుపాపల్నిచూసి సముద్రంలోకి డైకొట్టాను
చిన్న చాపను మింగుతున్న
పెద్ద చాపను చూసి
ఇదేం అన్యాయం అనుకున్నాను
మరింతలోతుకెళ్లితే
నన్నే మింగే తిమింగలాలను చూసి
నా ఆనందం అడవైపోయిది. . . . . .
. . . . .
ఛీ.....తూ......
ఇదేమిటనుకున్నాను
అప్పుడు నా అంతరాత్మ చెప్పింది
కామ్రేడ్ మరింతలోతుకెళ్లమని
అధైర్యంతో పాతాళానికి వెళ్లాను
పాతాళంలోని ఆణిముత్యాలు
నన్నుముద్దాడి
నానెత్తిలో కిరీటమై
ఏదీ పైపైన చదవొద్దు
లోతుకెళ్లి చదవాలనే జ్ఞానోదయం చేసింది
ఆ జ్ఞానముతో
క్షణాలమీదపైకొచ్చాను

# గింజల నరసింహారెడ్డి

## జనగద్దర్

గద్దర్ నీపాట పాట
గద్దర్ నీ మాట మాట
జనం గుండె చప్పుళ్లతొ
కదలిన నీ స్వరం ఊట
శత్రువుపై పడే తూట

కన్నీటిని శత్రువుపై
గర్జించే ఆవేశపు
మున్నీటిగ మార్చెటోడ
ముంచి వాణ్ణి నిలిచెటోడ
గెలిచెటోడ

అన్నల తమ్ముళ్ల నెల్ల
పిలిచెటోడ
విడిసెలోడ! నీ తోడుగ
గుడిసెలోడ
జన గద్దర్
ఘన గద్దర్
వని నిద్దుర మాపెటోడ
ధ్వని హద్దుల దాటినోడ
జనుల లోన చైతన్యపు
ధునుల పెంచు గర్జలోడ
పీడితులకు నీ కంఠం
వాడినట్టి క్రూరులచే
ఓడినట్టి, ఘూడినట్టి
హితులకు నీ కంఠం
నీ కార్యం

నీ శౌర్యం
నీ వ్యూహం?
గద్దర్ నీ పాట పాట
గద్దర్ నీ మాట మాట



# గోపగాని రవీందర్

## గొంతువిప్పిన పొలాలు

తండ్రిని పోగొట్టుకున్న పొలాలు
కన్నీటి సంద్రాన్ని పొంగిస్తున్నాయి
ప్రతి నిత్యం ముద్దాడే స్నేహవాసి
పలకరింత స్పర్శను కోల్పోయామని

అశ్రువులను అస్త్రాలుగా మలుస్తున్నాయి
క్షణం కూడా విశ్రమించని హాలికుడు
తల్లి పిల్లను కాపాడుకున్న సెంట్రి
ఇక లేడని పడి పడి దుఃఖిస్తూ

వడిసేలలను తయారు చేసుకుంటున్నాయి
మా సారాన్ని గ్రాసం కోసం
మార్చుకున్న వెన్నముక అతడు
మా ఒడిలో కాయాన్ని
కరిగించుకున్న కిసాన్ అతడు
వ్యథాభరిత జీవన నౌకను
సుడిగుండాలతో అల్లకల్లోలమైన
జీవనదిలో సరంగులా సాగలేకపోయాడు అతడు

నిన్ను దూదిని చేసిన వడి
సస్మరణలను
మా గుండెలపై అర్ధరాత్రి పత్తికాయ
చిట్లినట్లుగా వాడి గద్దెకిందనే
భూగర్జన జూపిస్తాం!
మా దాహ పగుళ్ళను
శోకజలంతో తీర్చిన కన్నీటి దాతవు
కాకుంటే
ఘర్మజలంతో తడిసిన కృషీవలుడివి.

వాడు కరెంటు కోత పెడితె
మాకు కడుపు కోతనే మిగల్చి పోయావా!

నింగినుండి వాడు
ఎప్పుడు ఎండమావులను చూపించాడు
వాయు గుండాల కోరలతో
బంగాళాఖాతం గాడు నిలువెల్ల
కాటేసి పోయాడు!

అంకురించని
మృత శిశువులను సబ్సిడిగా పొంది
'కర్మ' అని సరిపెట్టుకున్నావు
పుట్టకముందే తాకట్టు పెట్టుకున్నావు
పెంచుకుంటున్న వరికంకులను
మదిలోనే కుమిలిపోయావు
మిగిలిన కొంతను అపురూపంగా
అంగట్లోనికి కొనిపోతె
కండువ బాహువుపై ధరించి
పాదాచారివై పయనిస్తివి.
సక్కని సరకులు
సుక్కల భవనంలోకి అందిస్తివి
ఎండిన డొక్కల్ని మిగిల్చుకొంటివి

మా కనుపాపల నడుమ
కన్నీళ్ళ సాక్షిగా నీ ఉసురు పోసుకున్న
సర్కారు ఎంతోకాలం ఉండదు
నలువైపుల నుండి
సమర నగారా మోగిస్తున్నాయి
తండ్రిని పోగొట్టుకున్న పొలాలు.

# అమ్మ రాసిన ఉత్తరం

ఏమని రాయమంటావు బిడ్డ
పంటల్లేని కాలం దాపురించే.
పగుళ్ళతో చిట్లిన నేల ఒంటిని చూస్తూ
పచ్చని కంబళి ఎప్పుడు కప్పుకుంటుందోనని
కన్నుల్లో ఒత్తులు వేసుకొని చూస్తున్న బిడ్డ

నువ్వు పిల్లగానిగున్న దినాల్లో
ఈదులాడె చెరువుల్లో మచ్చుకైన చుక్కలేదు
మంగమ్మత్త కొమురమ్మ మల్లమ్మల
కోతల పాటలకు డాన్సులు చేసె చిత్రాలు లేవు.
ఎంత చెప్పుకున్న బతుకును ఎంత తవ్వుకున్న
పెల్లలు పెల్లలుగా  గాయలు రాబట్టె బిడ్డ
నువ్వు పసిపిల్లగానప్పుడు గుక్క పెట్టి ఏడుస్తుంటే
ఆడబిడ్డ కర్రావు పాలను దానం చేసింది గుర్తుందా?

ఆకలికి తట్టుకోలేక కేకలు పెడ్తే
తడారిపోయిన గుండెల్ని అదిమి పట్టుకొని
కసాయోనికి కట్టబెట్టాం
నీ సవాసగాడు
బువ్వకు కరువై బిక్కు బిక్కు మంటున్నాడు
జీతం రాళ్ళను నమ్ముకున్న మాదిగెల్లన్న ఊరోదలి
పోయిండు బిడ్డ.
దొంగ కాలం వచ్చే
విత్తు మొలచిన దిగుబడి లేకపాయె
మనిషంత పెరిగిన మొక్కకు
ఒక్క కాయ లేదురా నాయనా
గట్లు గట్లుగా పేర్చిన తోటలలో
పాములు పారుతున్నట్టు పురుగులు తిరగబట్టె
రైతు గుండెకు చెదలు పట్టింది కొడుకా

చూస్తుండగానే సర్వనాశనం కాబట్టే
నా కైతె పెయ్యంతా భయంగుందిరా
చేతిలో చిల్లిగవ్వ లేక రైతు బిడ్డల పాట్లు
చూస్తుంటె.
ఒక్కడు కూడా ధైర్యం చెప్పట్లేదు
ఊరు ఊరుగా లేదురా
ఊరును ఉత కఱ్ఱ చేసుకున్నోడు బాగానే
ఉన్నాడు
ఊరు ఉరితాళ్లకు బలైపోతాదేమోనని
దిగులుగా ఉందినాయన
నువ్వు జాగ్రత్త బిడ్డ
ఎండిపోయి ఎడారిగా మారినా
తల్లిని ఎప్పుడైన తలచుకుంటు వుండు. . .

# గోలి గురుప్రసాదరావు

## మా పల్లెలో సాయంత్రం

పొద్దు గూకిందంటే చాలు
సూరీడు పడమటి కొండకు
ఎర్రని తిలకం దిద్దుతాడు
జంగిరి గొడ్ల పాదధూళి పైకిలేచి
ఆకసానికి ధూపమేస్తుంది
పచ్చని పైర గాలి
కన్న తల్లి ఒడిలా
అలసిన ప్రాణాల్ని సేద తీరుస్తుంది
ఈ మట్టి వాసనేమో
భూమాత పులకించి
మనపై జల్లిన సుగంధంలా అనిపిస్తుంది

శ్రమ సౌందర్యంతో పల్లె పల్లెంతా
ఓ ఆరని దివిటీలా ప్రత్యక్షమవుతుంది

స్వేదంతో తడిచి
ముద్దయిన శరీరాలు
అప్పుడే కడిగిన ముత్యాల్లా
తళతళ మెరుస్తూంటాయ్
రాత్రివేళ –
చల్లని వెన్నెల
అమాయకుడి చిరునవ్వులా
స్వచ్ఛంగా ఆహ్వానిస్తూంటుంది
నింగిని అతుక్కుపోయిన చుక్కలూ
మౌనంగా తలలూపే చెట్లూ
మనతో ఏవో గుసగుసలాడుతూంటాయ్
కష్టమైనా – నష్టమైనా
సుఖమైనా – దుఃఖమైనా
మనకు జోలపాట పాడాల్సిందే మరి

ఇక - తూర్పున
వెలుగు రేకలు విచ్చుకోవడమాలస్యం
ఇప్పుడే పుట్టిన శిశువులా
పల్లె నెమ్మదిగా కళ్ళు తెరుస్తుంది
తన మనుగడ కోసం
ఆఘమేఘాల మీద
ఒళ్ళు విరిచి
తిరిగి నడుం బిగిస్తుంది

# ఖబర్దార్

వెనుకబడ్డ వాళ్ళమే
అభివృద్ధిలో
ముందుంటామ్మరి
ఆకలి చావుల్లో
శంకు స్థాపన
రాళ్ళేమో ఫక్కాగా
సమాధులు కట్టుకొమ్మని
చెబ్తుంటాయ్ నిక్కచ్చిగా
ఓట్ల పండక్కి మాత్రం
కురిపిస్తారు వాగ్దానాలు
గంజి నీళ్ళకూడా
వరమివ్వని బడాచోర్లు
ఎదుర్చూసి వాతపెట్టకపోతామా?
వాళ్ళ జాతకం తిరగ రాయకుంటామా?

## చిన్ని

# పరిచిన పంతం

యుద్ధభూమి నుండి
వేస్తున్న పొలికేక
బరిలో మేము
అవతల నువ్వు
ఎన్నాళ్లు కాస్తారు తోడేళ్లమందను
మాగొర్రెలు కోరలు మొలిపించుకుంటున్నాయ్
గాటవేయబడ్డ మా గొడ్ల తాడు తెంపుకొని
బుసలు కొడ్తున్నయ్
గిప్పటిదాకా ఎండిన మాబీడుభూముల్లో
పచ్చని పసిరికలు మొలుస్తున్నయ్
మీకు కల్సొచ్చిన కాలమంతా
ఎదురు తిరుగుతుంది
దారబోసిన మా నెత్తురంత
తెలంగాణ పల్లెలు
పంతాని కెగుస్తున్నయ్
అనసబడ్డ చెప్పులు
కసి నాగులై కాళ్ళకు సుట్టుకుంటున్నయ్
మా నోటికాడ కూడును
మా పొలాల్లో నీటిని
దూరం సేసిన మీ పాపాల కుండల్ని బద్దలుకొడుతున్నమ్
రాళ్ళను వక్కలు సేసిన సుత్తులు
పంటకోసిన కొడవళ్ళను
ఇంక మా సొంతం చేసుకుంటున్నం

మా సెమటలు పంట రాసులైనపుడు
మా ఊపిరి ఫ్యాక్టరీ గొట్టాలైనప్పుడు

గురి చూసి కొట్టిన పాట
మాదే అయినపుడు
ఇక్కడ మీదంటు ఏముంటది

అందుకే
అప్పన్నుంచి ఇప్పటిదాక
చిందించిన మా నెత్తురుతో
తెలంగాణ పల్లెలు
పంతాన్ని పరుస్తున్నయ్

ఇక నా తెలంగాణ
తెగబడుతుంది

# చెరబండ రాజు

## సరికొత్త రజాకార్లు

ఇనప టోపీలోల్లు
పెద్ద పెద్ద మీసాలోల్లు
కోరమీసం పోరగాండ్లూ ఉంద్రు
లారీల్నిండా జీపుల్నిండా
నీ కాల్మొక్తుత బాంచను
చెప్పు పంతులు
రాత్రో రాత్రి వూరిమీద పడ్డరు.

ఎవలకోసం మొచ్చింద్రు
అల్లనెవరు పంపిచ్చింద్రు
చీమ చిటుకుమన్నా చిందులేస్తుంద్రు
తాటాకు సప్పుడయినా తూపాకెక్కుపెడ్తుంద్రు
అల్లొచ్చినంక ఏం జెప్ప పంతులు
వూరి మీద కాకులే కరువైనై
మా కేమన్న మంచి జేస్తరా
కుల్నాలెక్కువ జేస్తరా
కరనపోడి కడుపుమండ
అనాలి ముండ మొయ్య
అని మొల్తాడు దెగ
మా కష్టమంత దిగమింగి
అప్పులిప్పిస్తనని
యాడాది నుంచి తిప్పుతుండు
మాట్లాడితే పైసలంటడు
మా పొయిలకె పుల్ల లేదంటే
మోపులకు మోపులు కట్టెలు
గంపల్నిండా కూరగాయలు తెమ్మంటడు
కంట్లెవడితె తల్యాల్నంటడు

ఆని సంగతాల్లకు తెలుసునా పంతులు
ఆల్ల తుపాకే గుంజుకొని
నాల్గు ముడ్డి మీద్దంతె
అప్పుడన్న బుద్ధొస్తదేమొ
ఏం పంతులూ గట్లున్నవు
కొత్త గొచ్చినవు గదూ చెబితె శానా వుంది పంతులు
ఆంది మనిషి జన్మంకాదు యిసప్పురుగు
వూరవిశె కంతిలేదు
పటేలోడ్కి పట్టపగ్గాల్లేవు
వయసు పిల్ల కొత్త కోడలు గనబడితె పాపం
బంగ్లకు రమ్మంటడు
పోతేనేమొ తలుపులేస్తడు
పోకపోతె జీతముంచడు
మా మొగోల్ల గోడు బొొద్రాయి కెరుక
గట్ల శానాశాన జేసిండు పంతులు
ఏందో సంగతి
ఆల్లోచ్చినంక బలాదూరుగ

ఊరుమీద తిరుగుతుండు శావుకారి
ఆల్లు ఆల్లు సుట్టాలా పంతులు
పొద్దంత ఆని అరుగు మీదే పంతరు
పొద్దు గూగితే ఆనింటి గస్తే తిరుగతరు.

కల్లోలం గిల్లోలం అంట ఏంటి పంతులు
ఎవల బువ్వ ఎవరు తింటుండ్రు
అయ్యో చెప్పుత చెప్పుత మంచిగ
సర్పంచు చెంచు రెడ్డి లేదూ
కోడిపిల్లలు గోస్తడు
కల్లు కుండల్దెస్తడు
సాటుంగ సాటుంగ జల్సాల్జేస్తడు
లంచమా సర్కారు తాఖీదా పంతులు

ఊల్లంతా అనుకుంటుంద్రు
మోరీల పైసలు తిని
మోటారు సైకిలు కొన్నడంట
పోశిగాని గట్టు జెంపి
ఎకరం దుక్కినాదే అండట
ఎట్టి నేను జెయ్యనంటే
మాదిగోల పెంటిగాన్ని
పక్కలిరగ తన్నడట
పెండ్లమొచ్చి మొత్తుకుంటే
జుట్టువట్టి గుంజిండట
ఆల్లంత సర్కారు మడుసులేగా
అన్నాల మేందో అల్లల్ల ఒక్కరన్న జెప్పరా పంతులు
ఏమో పంతులు
ఇరవై ఏండ్ల కింద ఇట్నే జరిగింది

మా కష్టం సుకం యిని
దైర్నం జెప్పే కొమరయ్యను
నిన్నగాక మొన్ననే పంతులూ
నువ్వింక తొవ్వల్నే ఉన్నవేమో
ఇంట్లకెల్లి తోల్కపోయి
చింతల్తోట గడ్డకింద
చితకబొడిసి సంపి
కాకులకు గద్దలకు పడేసింద్రు
కుక్కలూ నక్కలూ పీక్కతిన్నై
పసిపిల్లలు పాలు ముట్టలేదు
తల్లులు పొయిలు రాజెయ్యలేదు
అయ్యాల ఊరంతా కుతకుత ఉడికింది
ఏ అయ్యాపలకలేదు
పటేలు కర్నం పత్తాలేరు
సర్పంచు పట్నానికి బండి గట్టిండు

మన రాజ్యమొస్తదీ మన మంత నిలవాలి
అంతదాక మనకు అన్నమే వద్దురా
గిట్లజచ్చేకన్నా గట్ల నే సద్దాము
భయమెందుకకయ్యలూ
భయమెందు కమ్మలూ

కొమరయ్య గొంతుకే మొక్కాల
గిట్లాంటి పాటలు ఏంపాడెటోడు
ఎంత సక్కటి మడిశి ఏం సత్తెం మడిశి

ఆడెల్లి పోయినంక
బతికేమి ఫలమని
అందరం గట్లాగే సెప్పుకుంటుండాము
గట్లెందర్ని సంపుతరు పంతులు
సెప్పు పంతులూ సెప్పు
పున్నెముంటది నీకు
సదువుకున్నోడివి సత్తెమే సెప్పు
సచ్చి నీ కడుపున పుడతం
నైజా మోడుమల్లా.
రాజాకార్లను పంపిచ్చిండా
సోరాజ్యమంటే ఏంది నీ బాంచను

గట్లేదుస్తవేం పంతులూ
నీ బిడ్డ బాయిలవడి సచ్చిపోయిందటగా
యాదొచ్చినాదా

అల్లమ్మ ఏడుస్తాందా
ఆ ముండ కొడుకు లేమో అన్నరంటగా
మీ వూళ్లో ఇంతేనంటగా
దేశమే ఇట్ల తగలబడ్డదా
ఏడ్వకు పంతులు ఏడ్వకు
మా కదుపు లెట్లా అయితది

మా అసుంటోడివి నువ్వు
కొమరయ్య అనేటోడు
కొత్త కొత్త సంగతులు సెప్పేటోడు
గరీబోల్లంతా ఏదో పోరాటం సెయ్యాల్నని
ఆ రోజులు దగ్గర వద్దయట
దొంగలంత సస్తరంట
భరోసావుంచు పంతులు
కొమరయ్య మీద ఒట్టేసి సెపుతున్నం
మాతోటే నువ్వు
ఆడి తొవ్వే మనకు
కాకుంటే మన పిల్లలకన్నా బువ్వపెడతది

# డా॥ చెరుకు సుధాకర్

## తల్లివేరు తెలంగాణకై

అమ్మను ఎరుక పట్టుడు అంత కష్టమా?
బిడ్డ గాకపోతే తల్లిని దబ్బున గర్తుపట్టేది ఏవరమ్మా?
నా ఎరుకకు ఏండ్ల చరిత్ర ఉంది.
నా ఆర్తికి, అనుబందానికి ఏండ్ల కడగండ్ల వడగండ్ల చరిత్ర ఉంది
చరిత్రకు చరిత్ర నేర్పిన తల్లి తెలంగాణా ఆనవాలు మాయం చేసి
మనిద్దరి "తల్లి మాయి" ఒకటే అంటావు.
నీ దరి, నాదరి 'ఆంధ్రమాతే' దయామయి అంటవు
నీకు, నాకు ఒకే అమ్మని నమ్మబలుకుతవు.
చెట్టంత తల్లి గదరా మా అమ్మ?
పుట్టెడంత కడుపుపంట గదరా మా అమ్మది?
మనిద్దరి తల్లి ఒకటో కాదో పచ్చనాకు చేతుల బట్టుకొని
ప్రమాణం చేద్దం, ఇమానం అందాం
బారసాల నాడే, దిష్టి పూసలు గుచ్చిన నాడే,
కండ్ల కింద పుల్లెలు పెట్టి కాల్చిన నాడే తేలిపోయింది
మన తల్లివేరు వేరని.
బిడ్డల కెప్పుడో సద్దిమూటలు పంచుకున్నప్పుడే అర్థమయింది
తొక్కు మెతుకులు ఒకడికి,
వెన్నపూస, సన్నబియ్యం మరొకడికి
సద్దిగంపలో 'సుద్దులు' ఎవనికి వినిపించినా
ఎవడూ ఇది లొల్లే అంటడు
పిర్రగిచ్చి లొల్లి పెడుతున్నానని రచ్చకెక్కుతడు?
ఇది నా తల్లి పాటంటే "పాటిలేని పాటంటడు.
పదవి కోసం పెదవి తెరిచిన అంటడు
తల్లివేరు తెగ్గొట్టి మొక్కను నాకిరం బట్టిచ్చి
బోన్సాయిని చేసి పెరుగని చెట్టని చెట్టెక్కి మొత్తుకుంటడు
బిడ్డలు పాలకేడ్చుడు లొల్లి అయితదా?

బిడ్డలు "పాలు" అడుగుడు లొల్లి అయితదా?
పాలకోసం అల్లాడే పెంపుడు జంతువుకు
చనుబాలు పట్టే అమ్మను చూస్తిమి గాని
గుక్కపెట్టి ఏడ్చే బిడ్డకు వట్టిపోయిన రొమ్మును
అన్చిన ఈ అమ్మకు బిడ్డనని నెనెట్లా చెప్పను.
నా తల్లి వెన్నకు నునుపు నేర్పిన తల్లి.
నా తల్లి గోవుకు గంటకట్టి పసుల్ని కాపాడుకున్న తల్లి.
నా తల్లి గాయపడిన పసులకు, పకృతికి పసరు కట్టుతో ఇలాజ్ చేస్తది.
నా తల్లి పరాయి బిడ్డకు కూడా ప్రమాదమొస్తే పక్కటెముక తీసి
పాణాన్ని అడ్డుపెడతది.
నా తల్లి లోకం బతకాలని
తీరొక్క పువ్వులతో బతుకమ్మ పేర్చి పకృతిని వేడుకుంటది
ఒక్కమాటలో, గుట్ట గూలుతుంటే ఆపే శిబ్బి తీరు నా తల్లి
బిడ్డలు తక్కువోల్లా?
తల్లి పేరు నిలబెట్టే బిడ్డలు వాళ్ళు.
నలుగురి కోసం పాణమిస్తరు
నలుగురి కోసం దూలా గుండం దొక్కుతరు.
లోకం బాధలు పోయే ఇచ్చంత్రపు పువ్వు ఉందంటే
పువ్వులాంటి జీవితాన్ని చిదిమేసుకొని
తూర్పు దిక్కు పోయింద్రంటే వెనుకకు తిరుగుడే లేదు
పొద్దుకు కాపలా ఉండమంటే
పొద్దు తిరుగుడు పూవు తీరు సూర్యుడెటుంటే అటు తిరుగుడేగాని
ఎండంతా వాని వొంటి మీది కెళ్ళిపోయిన 'సోయి' లేనివాడు
వానికి లోకం సోయే గాని వంటిసోయి లేని వాడు
అమ్మను ఎరుకబట్టి,
ఆదిని యాది తెచ్చుకొని
పొలి మేరలకు ముగ్గు బోసుకొని అగ్గిల తానం జేసి
నా రాష్ట్రం నాకు కావాలంటున్నడు
పోషమ్మ సాక్షిగా, పోతరాజు సాక్షిగా
కాటమరాజు సాక్షిగా, లింగమంతుల సాక్షిగా, గోసంగి సాక్షిగా

తెలంగాణ కావాలంటున్నడు
మనిషంటే ఒడ్డూ, పొడుగు ముచ్చట కాదు
భూమంటే మట్టి, మాను, మాకులు కాదు -
పాటంటే పదం, పల్లవి పడికట్టు గోల కాదు.
రాష్ట్రమంటే పొలిమేరల ఆలనా పాలనా కాదు

రాష్ట్రమంటే అమ్మ ఋణం తీర్చడం.
రాష్ట్రమంటే బిడ్డల కలలు నిజం చేయడం

# చొప్పదండి సుధాకర్

## గోజరాజులు

సూరీడు అద్దంలో మొహాలు సూసుకోకనే
సుక్కలకు వీడ్కోలు చెప్పి
పిట్టల సుప్రభాతం వింటూ
పనులు మొదలు పెడతారు
బెడ్ కాఫీలు తెలియవు, బ్రేక్ ఫాస్టులు లేవు
నోట్లో నీళ్ళు పుక్కిలించి
ములుగర్ర సంకలో బెడితే సాలు
ఇంటిది కుడితి నీళ్ళలాంటి చాయ్ తెస్తుంది
చిక్కటిపాలు తానిస్తుంటే సూరునీళ్ళచాయ్
ఎందుకు తాగుతున్నారో తెలియక
పెయ్య మోరెత్తి
'అంబా' అని రంధిరాగం అలాపిస్తుంది
పాలసర్వ తీసుకొని పక్కనుంచి పోతున్న
అయ్య 'జె' అంటూ తనని సర్సి
నడుస్తుంటే తానూ వాళ్ళ ఇంట్లో
శాల్తీయేనని పెయ్యకళ్ళు తుర్తిగ మూతపడ్తయి
ఆ సరుపు కోసమే అడ్డం నిల్సుందని
తెలియని అయ్య ఆలిస్యం అయిపోయిందని
దబాదబా పోతుంటడు
ఆకాశంలో సగమో, అప్పుల్లో సగమో తెలియని
ఆడ్డి పెండ దీయడానికొస్తుంటే
ఆదిలచ్మి కొట్టంలోకి వచ్చినట్టుంటది
అమ్మను చూసి బిడ్డ గంతులేసినట్టు
పెయ్య అరడగుల కొట్టమే ఆరెకరాల
ఆటమైదానమైనట్టు గిరికీలు కొడుతుంది
సల్డి మింగి ఉడ్కుది సద్ది కడుతుంటే
సల్డి తప్ప అర్గని ఆర్యపుత్రుల్ని చూసి

గట్కుదేవత గుడ్లనీరు కుక్కుకుంటుది
రొడ్లను మింగే గాడ్దికొడుకులను ఏమి అనలేని
గోర్నమెంటు వడ్లెండబోసే రైతులను కసురుకుంటుంటే
సాచ్చెం చెప్పలేక పొలాలు జలాశయాలవుతాయి
అప్పులకీ, అన్యాయాలకీ అన్నలూ
అవి అనుభవించడానికే పుట్టిన పట్టాదారులు
అయ్యలూ మీకు దండాలు
మా కష్టాలు మీ కష్టాలు చేసుకొని·
మీ ఇష్టాలను మాకు అంకితం చేసిన
నడిచే దేవుళ్ళూ మీకు దండాలు!

# చౌడోజు రమేష్‌కుమార్

## నీటి మీద రాతలు

నమస్తే మల్లేశన్నా!
ఎట్లున్నవ్ మలక్‌పేటల?
వొదినె, పిల్లలు గిట్ల బాగున్నరా?
కారటేస్తలేవు, ఫోన్ జేస్తలేవు
ఏమైంది నీకు? నన్ను యాది మర్శినవా ఏంది?
'తబియత్' మంచి గున్నదా?
నువ్వైతే 'మంజీర' నీల్లు తాక్కుంట
మంచిగున్నవ్ గానీ
మా సూర్యాపేటల నీల్లతోని మస్తు పరేషానైతుంది
ఎటూ సుదరాయిస్తలేదు సమజైతలేదు
మున్సిపాల్టోల్లు రెండు మూడు దినాలకో పాలి
నీల్లు ఇడుస్తుంద్రు! గా నీల్లయినా ఒకదినం ఎర్రగ
ఒకదినం పచ్చగ పార్టీలు రంగులు మార్తున్నట్టు మార్తున్నయ్!
గది గట్ల బెట్టు! నల్లాల కెల్లి పాములు, తేల్లు, బల్లులు, జెర్లు
గస్వంటి జీవరాసులన్ని బైట పడ్తున్నయ్! గిదేందని మున్సిపాల్టోల్లన్నడుగుతే
నీల్లు మస్ల బెట్కోని తాగమని ఐలాన్ జేసింద్రు!
మన గరీబోల్లకు పొయ్యి మీదికుంటే పొయ్యి కిందికి లేకపాయె! యిగ నీల్లె
మస్ల బెట్టాలె!
పైసలున్న దొరలు మోటర్లల్ల, కార్లల్ల, లారీలల్ల బైట్నుంచి
నీల్లు తెచ్చుకుంటుద్రు
గీ నీల్లు తాగి తాగి పాయికాన బెట్టి సర్కారీ దవాకాన్ల షరీకైతున్నం!
గీ నీల్లతోని సచ్చేకాల మొచ్చిందన్నా!
గీ నీల్లతోని వశపడ్త లేదు మస్తు పికరు జేస్తున్నం
ఏమన్నంటె ఒకాయన 'దోసపాడ'ంటడు ఒకాయన పాలేరంటడు
సచ్చిందాకుండు పెండ్లి జేస్తమంటరు!
ఏం జెప్పాలె మల్లేషన్నా! మా బాధలు ఒకటి గావు!
యిగ మా రోడ్ల మీద నడుస్తే గుంతలల్ల వడి ముడ్డిరుగుతయి!

యిగ వానకాలమొస్తే సాలు బుర్దతోటి సింగరేణి మజ్దూరోల్లమైతం
సడక్ పొంటి నడువకుంటైంది
చెద్దరు గప్పుకుంటె ఉడకబోస్తది
చెద్దరు తీస్తే దోమలు గరుస్తయి
దోమల బాదకు పోరగాల్లు నిద్రబోరు,
మమ్ముల నిద్రబోనీయ్యరు తెల్లార్లు జాగారం
మీ గరీబోల్లు ఓట్లేయ బట్టే మేం గెల్చినం
అని మా నాయకులు అన్నరు
మరి గరీబోల్ల ఓట్లతోని గెల్చిన నాయకులు
గరీబోల్లకు ఏం నాయ్యం జేసింద్రు?
మా కైతే ఎటూ సుదరాయిస్త లేదు! సమజైతలేదు!
యాది మర్వకుంట కారటెయ్యి!
పుర్సతుంటే యాద్గిరి దుకాండ్లకు ఫోన్జెయ్యి
ఈ దోస్తును మర్వకు! దోస్తానా యిడ్వకు!
గట్టు జాతరకు పొదినని పోరగాల్లను తోల్కరా!

## జగన్‌రెడ్డి

# భద్రకాళి చెరువులో రుద్రమ దాచిన తల్వార్

చెదిరిపోయిన ఆకాశం హద్దులలో
నీ శూన్యపు దిగంతాల మరకలు
నువ్వు మా కొన్నెత్తురు ముంతవు
తేటతెల్ల పెరుగుబువ్వవు
నీ పిడికిట కత్తయి నక్షత్రాల అవలిగట్టు
నీ నొసటి బొట్టులో చంద్రిగాడు
పునరుత్థానాలలో కాలం కొంగ్రొత్త రంగులు కురుస్తున్నది
వెన్నెలలు శ్వాసోపశ్వాసలు
యుగాలన్నీ
నీ ముందు సాష్టాంగ ప్రణామాలు పలుకుతున్నాయి
శివసత్తుల శిరోజాలలో ప్రాణ ప్రతిష్టలు
రక్తపంకిలాలను నీ చరిత్ర పిండార్థ బోసుకుంటున్నది
ఎన్నో పసుపు కుంకుమలు చెల్లిపోయి
తెగిన మొండాలపై నీ హస్తసాముద్రికాన్ని చదువుకుంటాం మేము
కొండగొర్లు కొత్త చిగుర్లు పోసుకుంటూ ఏటి ఆటలు మేస్తున్నాయి
భాష్యాలకు దొరికిపోయిన నా కన్నీళ్లలో మునిగి తేలుతున్నాం మేము..
విలయతాండవాలలో విస్తుపోతున్నది మేము కానేకాదు
ధైర్యము జారిన ఈ లోకమే
వీర కుంకుమలకు కాళ్ల దుమ్మయినా మిగలలేదు
ఎవరికని బొట్లు పెట్టేది
కూలిపోయిన బొమ్మరిండ్లలో పైరగాలులు పాతపాటల్ని
తెంపుకొస్తాయి రాత్రి పూజలకు
తేపతేపకు మేము కాశగడ్డి చలికాపుకుంటాం
ఎర్రబోనాలను పుదిస్తూ ఎర్రిపాటలు కట్టుకుంటున్నామింకా
తెలంగాన! నా తెలంగాన!!
పువ్వులన్నీ పుప్పొడి తరగల్ని తరుముకొస్తుంటే

ఏరు ఎగతన్నుతున్నాది
మునిమాపటీల మునగ తీసుకుంటాయి మారోజులు

రా తల్లి! రా!!
నీకొడిగట్టిన రూపానికి ఆకుపసర్లు పూస్తాను
నా కన్నీళ్ల కసిలో
నీ గండదీపాలను దగ్ధమిస్తాను
వస్తాను
వేయిన్నొక రాత్రుల్ని చిదిమేసి
వస్తాను
ఒకే .పేరుతో వందలసార్లు
నా బుచ్చిపిల్ల! కొంటెపోరి!
భద్రకాళి చెరువులో
రుద్రమ దాచిన తల్వార్
రజాకర్ రాబందులపై
గొట్టి ముక్కల ఎక్కుపెట్టిన బందూక్
జోడెన్ ఘాట్‌లో
కొమరంభీం వదిలేసిన బాణం

వెయ్యి వసంతాలు పూసి రాలిపోతాయి
వంద శరద్ రాత్రులు తూలిపోతాయి
బాభేర్ఘురి - భువనగిరి
మంజీరలు - మానేరులు
రామగిరులు - సాలచెట్లు
నల్లమలలు - రేలపూలు
కొమురెల్లిలు - కొమురయ్యలు
అయిలేనులు -ఐలమ్మలు
పోతన్నలు - పోతరాజులు
సోమన్నలు - సోపతి గాళ్లు
వెయ్యి వసంతాలు పూసి రాలిపోతాయి వంద శరద్‌రాత్రులు తూలిపోతాయి
తెలంగాన ! నా తెలంగాన !!

# పగ

తెరచిన అరచేతిని కుక్కముట్టింది
నట్టింట నన్ను నేను నరుక్కుందామంటే
ఆరుగాలం రోగాల్లో అవసరార్థం సోపతిలో అర్థాన్ని పోగొట్టుకుంది ఆత్మ

అంచుల వరకు చేరుకున్న ఊరేగింపు స్తూపమై కూలిపోయింది

చింపుకున్న ముఖం నుంచి అతికించుకున్న నిస్పృహలో
ఇజాల భజనలోమత్తిలి ఇనుపరజనై కాలి తేరుకుంటున్నా
కన్ను తెరిచేవుంది...! కాళ్ళకాపరై దొంగజపం చేస్తున్నది!!

తిప్పుకోలేను ! కాలంచరఖాపై కరిగే రంగులరాట్నాన్ని
విప్పుకోలేను ! కలం కాటులో వెలసిన తప్పుడు రాతల ఈగల మంద గానాల్ని

వీర్యాల క్రతువులో కారిపోయింది మనస్సు
అంగాలగంగలోంచి మూగుతోంది అంతరాత్మ

ఏరాతిరికి .. ఆ రాతిరే స్వగతమైపోతున్న జాగారంలో
దేవుకుంటున్న పేగుల్ని .. కదుపుకుంటున్నా ...

పెకిలినవి మట్టి పెల్లలూ వేపుకునే వేడి నిట్టూర్పులూ కావురా!
తేలినవి! తరానికి లక్ష అస్తిపంజరాలు!!
కార్చినవి కన్నీళ్ళుకావురా!! చితికినవి చివరిపంక్తి చరిత్ర కదనాలు!!

నాకు తెలుసు!
చాకలి పిల్ల మనువులో బొడ్డు తెంపుకున్న ప్రేమనగరు
ఆబిడ్స్ నుంచే అసలు ఆజాదీ కత మొదలనీ.....!
నైంటీన్ ఫార్టీ సెవన్ నుంచి ఏకె ఫార్టీ సెవన్‌దాక
జారుకున్న మా పదుచదనాల ఏడు పగల్లలో
అతాపతాలేని చరిత్రే నాకు జమానతని....! నాకు తెలుసు!!

శవాల శంకరాచార్యుల నాచుకూపంలో నీతుల మోత
తెరుచుకుంటున్న కనుగుడ్లలో బావురమనే అశాంతి

భ్రమలు లేని బయలు! బుగులులేని మొగులు నా చుట్టూ..
కదులుతున్నా కసిగా ....! ఖబర్దార్ వస్తున్నా ...!!
కదుము కట్టిన మా పెరటి పాదులో
దర్జాగా ఊరేగుతున్న విగ్రహ మాత్రుల్ని బద్దలుకొటేస్తా!!
బద్దలైన ముక్కలతో ఊరూరా శిలాన్యాస్‌లు చేస్తా!! చేయిస్తా!

గుండెగుండెకూ నా చిట్టి చెరువు నీళ్ళు తాపి పాతేసిన కతలు విప్పేస్తా...!
నా బాగమతి పట్టణంలో తారుమారైన నాతల్లి వేరును పట్టేస్తా!
మా పల్లెకంటిలో కూరిన పల్లేరుగాయను పెకిలించేస్తా. . . !
పీర్ల గుండంలో కూలిన నిప్పు కణికనో
సికింద్రాబాద్‌లో ఆవురావురుమంటున్న మౌనమైసమ్మనో
పాలమూరులో పడావుపడ్డ మట్టిపల్కనో కాను
కాకతీయ గడ్డపై
తెగిపడ్డ
తెలంగాణ మొండేన్ని.

# జయధీర్ తిరుమలరావు

## ఇది వంద యుద్ధాల ఒడి

సన్నాయి రాగాలు
కిన్నెర గానాలు
ప్రకంపనాల పల్లవులవుతాయి

పచ్చని పండంటి పైరు పొలం
ఏడాదికి సరిపడే ధాన్యపు గుమ్మి
దగ్ధగీతిక లవుతాయి
ఉరుములు – మెరుపులు
గుడిసెలోని సెమ్మ – పొలంలోని కంచె
గావుకేకల వేదిక అవుతుంది

ఇది వందయుద్ధాల రాగాల మడి

ఆకాశం నుండి రాలిపడే చినుకులు
మబ్బుల్లోంచి జాలువారే చాందినీ
భూమ్మీదకు చేరేసరికి
ఫెటిల్లని పగిలిన శిధిలాలవుతాయి
పారేది ఈ నేల నదులు – ప్రతిఫలపు పంట ఆ కోన
ఈ విషమ అసమ రాజకీయార్థికశాస్త్రం
ఒక తీతువై ఎలుగెత్తుతుంది
దేశానికి ఒక
కొత్త పాఠ్యం బోధించడానికి
వ్యాకరణాన్ని తిరగదోడే ప్రణాళిక సంసిద్ధత

ఇది వందయుద్ధ పల్లవుల గీతం

అవునూ ఇక్కడ
యుద్ధం లేని రోజుందా

నాలుగు మహా రాజవంశాలు
ఈ యుద్ధభూమిలో జనించి
యుద్ధరంగంలో పెరిగి
యుద్ధ సంస్కృతిలో విస్తరించి
యుద్ధంలోనే కదా చరిత్ర పరమళించింది

కటకం నుండి కన్యాకుమారి దాక
విస్తరించిన
దండనాథులు ఈ నేల కూనలే

ఇవ్వాళ రాజకీయమై, పెట్టుబడై, అధిపత్యమై
వారే ఈ నేలని క్షతగాత్రం చేస్తున్నారు -

విజేతలై విజయాలై జైత్రయాత్రలైన.
బక్క పలచని గోసిగాళ్ళు
మరోచోట సెంటు భూమి నాదన్నారా?
గోడదాటి గోమాలతల పాలు పితకలేదు
గోడదూకి గోడలూ పెరళ్ళూ నావనలేదు
నాలుగు మహారాజ వంశాలు ఈ నేలమీద అడుగెట్టి
మతాన్నో మైసమ్మనో
కులాన్నో కూడుగుడ్డల సంస్కృతినో
ఎగతాళి చేసినందుకు

ఒట్టు
ఏ పొలం గట్టుకకింద భూగర్భంలో
ఓడిన అధిపత్యపు ఆనవాళ్ళైనాయి

ఢిల్లీ సుల్తానా, గోలకొండ ప్రభువా
నైజం నవాబు, అంగ్లేయ ప్రభువూ
ఎవడు నిలిచాడిక్కడ?
రోహిలా సైన్యాలను చీమలు తమ పుట్టల్లో
పడదోసిన దృశ్యపేటిక ఇది

2.

వేల ఏళ్ళ భాషా సౌందర్య కంఠానికి
ఏభై ఏళ్ళ సాంకర్యపు కంటకమాల ఇనాం

భాషంటే జీవజనం – జనజీవం
యాస పేరుతో దూషించేవాడా
నాలుక నాలుగుముక్కలవదా?
ధూర్తత్వం ముళ్ళకంచెల్ని చేసి
నా చుట్టూ నిర్విరామంగా నిలిపి
సెంటు వాసన పైకిపూసి
ముంతపొగ కసిగా చేస్తుంటే అనిపిస్తుంది –
దారిదోపిడిగాళ్ళయినా బాగుండేది
అస్తులు కోల్పోయే వాళ్ళం –

చోరులయినా బాగుండేది
ఆభరణాలు అప్పగించేవాళ్ళం –

బందిపోట్లయినా బాధుండేది కాదు
సర్వసంపదలని వొలిచి ఇచ్చి
సంస్కృతినైనా దక్కించుకునేవాళ్ళం

మాతో పాటు
తినడానికి వచ్చి
ఇక్కడ నీళ్ళు తాగి సేదతీరడానికి వచ్చి
ఇక్కడ జీవసంస్కృతిలో సహచరులుగా వచ్చి –

నీ పిల్లని కోడలిని చేసి
నా వంశాంకురాన్ని దత్తత తీసి
కలగలిసిన కవలలమయ్యాక
కూడిన డబ్బు వడ్డీపేర పేర్చిన సంపద
రాలే చెమటని పారె కరెన్సీ నదిగా చేసి
నేలను కొని ఊళ్ళని కని అడివిని అన్యాక్రాంతం చేసి. . .

ఇప్పుడు దృశ్యాల్లో అక్షరాల్లో నా భాషకి వెక్కిరింతలు
భాషని సాంస్కృతిక ఆధిపత్యరూపం చేసి
నా కవచాన్ని, ఆయుపట్లని ఎకసెక్యాలతో ఎక్కుపెడుతున్నావు చేసావ్
పరీక్షించకు
ఆక్షేపించకు
ముళ్ళవక్షస్థలాన్ని కౌగిలించలేనందుకు వగవకు

నువ్వెన్నడైనా నా బతుకమ్మపాటకి పల్లవైనావా
నువ్వెన్నడైనా కొమిరెల్లి మల్లన్న 'పట్నం' చూశావా
నువ్వెన్నడైనా సమ్మక్క జాతరలో భాగమయ్యావా

నువ్వొక ఏలియన్‌వి
ప్రజల్ని పరాయికరించిన 'రూలర్‌వి

మా బతుకుమీద చావు దెబ్బలు పడినా
అయ్యో అనని ధీరోదాత్తుడివి

బతక వచ్చిన తమ్ముళ్ళకోసం
మా అమ్మ వడిని పరిచే ఉంచాం
వారు మా ఆత్మీయ పచ్చ కార్డులు

బతుకుల్ని కొల్లగొట్టే బిగ్ బ్రదర్లపై మాత్రం
రుధిర బింధువులమై ఘనభవిస్తున్నాం
యుద్ధారంభపు సమాధిస్థితి ఇది.

ప్రజారాజ్య నినాదానికి తూట్లుపడ్డ
విశాలాంధ్ర ఉందా ఇప్పుడు?
ప్రైవేటు వేటు మా పేగుల్ని మెలితిప్పుతుంటే
రాజ్యాన్ని మీ భాగ్యాల్ని రక్షించుకోండి
ఆత్మయైన మా భాషని, గౌరవమైన పాటని
మా చిందునీ బైండ్ల కథల్ని
మా ఒగ్గు ఢమరుకాల్ని మాత్రం మేం దాచుకుంటాం –

ధనిక దోపిడి కూలదోసి
చిన్న నేల మీద చిన్న ప్రజల అధికారాన్ని
పెద్ద ఎత్తున నిలిపే

మరో యుద్ధానికి
కాకితో కబురంపితే మాత్రం
సిద్ధంగా ఉంటా. . . .



# మెదడులో నరాలు జ్వలిస్తున్నాయి

మెదడులో నరాలు జ్వలిస్తున్నాయి, ప్రశ్నిస్తున్నాయి
కళ్ళలో నీరు బొట్టుబొట్టుగా లీకైన ట్యాప్‌లొంచి రాలుతున్నట్లు రాలుతున్నాయి

శ్వాస ఇంకా ఎందుకు ఆగిపోలేదని, గుండె ఎదురుచూస్తుంది
అది బాధో ఇది దుఃఖమో తెలియడం లేదు
జీవితం బ్రతకడం వేరు వేరు అయినపుడు
బాధ, దుఃఖం, బ్రతకడం జీవితంలో ఒక భాగం అయినపుడు
జీవితం మళ్ళీ సముద్రమే అవుతుంది
అపుడు కూడా సముద్రం మీద స్టీమర్
ప్రయాణం చేసే దొరలు ఉంటారు.

* * *

దొరలకు సేవకులుగా పుట్టామని కాదు
బానిసలుగా మారమని, జంతువులు అవుతున్నామని

* * *

మెదడులో నరాలు జ్వలిస్తున్నాయి

జవేరియా

## మన తెలంగాణ

బంధాలను బంధాలను
ఆత్మీయతాను రాగాలను
ప్రేమాభిమానాలను
పంచి పెట్టే భూమి
మన తెలంగాణ.
జ్ఞాన సంపదలకు
గనులున్నాయిక్కడ
తల్లీ సరస్వతికి దేవాలయం
ఈ భూమి సిరసంపదలకు
పుట్టినిల్లు
అన్నపూర్ణగ వర్ధిల్లుభూమి
మన తెలంగాణ.
దయాకరుణ రసాల జీవనదుల
ప్రవాహాలతో
ప్రేమలు పరిమళించే మనస్సున్న
తోట మన తెలంగాణ
శత్రువులను మిత్రులుగా
మార్చేటి
స్నేహశీతల పవనాలు వీచేటి భూమి
మన తెలంగాణ
పరులను తల వారిగా నమ్మే
అభిమతం.
తప్పులను క్షమించే క్షమాగుణం
మంచిని పెంచుకున్న పుణ్యభూమి
మన తెలంగాణ.
తెలంగాణకు తెగులు పట్టి
ఇష్టాయిష్టాలతో కష్టపట్టే

చీడ పీడకు
చెల్లిపోయే రోజులివి
తెలంగాణ తల్లీకి స్వేచ్ఛనిచ్చే
వీరపుత్రులు ఎగరేసే
విజయకేతనం ఎగరనుంది
నింగిలో ఎగరనుంది



## నదులమై కవిత్వమౌదాం

ఈడుబోయిన చెలకలా
ఇసిరి పారేసిన పొట్టపేగుల్లా
బాపనాయన ముట్టలేని చర్మపు చేతుల్లా
చాకిరితో నవిసి ఇంటెనక కాతఆగిన కాకరపందిరిలా
కదలని గొంగళిలా ఉంది నా తెలంగాణ
తీరని గోసకు అర్తులకు ఆర్తి నా తెలంగాణ

పగిలిన పాదల దారుల్లోంచి పత్తిగింజల పెచ్చులు
పచ్చ పురుగులా ఒంటిమీన అంబాడుతున్న దయిద్రం
ఈ ఎముకల గూళ్లలో పేర్లు ఎవరెవరివో
సాచ్చాలు లేవు, సంతకాల అంగోట్టాల మొదళ్ళూ లేవు
ఫ్రిజ్‌లో సీసాకు గడ్డకట్టిన సెమటలాగా
పగిలిన రక్తాల బిందువులకు చినుకుల వాన నేనే
ఎక్కడ నెత్తురు గొంతు తెరిచినా ప్రవాహం పరుగు నేనే......
రోజు పొద్దిటాల ఎంత నెత్తురు చల్లితేగాని
అడవిల మోదుగాకులు అంత పచ్చబడ్డది
నాది ఎద పగిలిన జాతర
పగలగొట్టిన కల నుంచి కలకలలు
కొలువులెన్ని మారితేం
నా కొలిమిల మండింది నా చేతులే
ఏ గోదారి నా గుక్కను ఏడుపు నుంచి తప్పించింది.
నా కండ్ల నీళ్ళతో ఒల్లు పెంచుకున్న ప్రకాశం బ్యారేజీ
పొద్దును పొడిచి కూసిన కూత నా తెలంగాణ
అంతామెక్కి విసిరి పారేసిన యూజ్ అండ్ త్రో
ఆర్టికల్‌లా వుంది నా తెలంగాణ
నోటికి మూతికీ మధ్య అందని బువ్వగదరా నాతెలంగాణ
మొలతాడు గట్టిన మొగపిల్లగాళ్లను

ఆడుకునే ఏటగదరా నా తెలంగాణ
అరవబట్టిన పిల్లగాళ్ళు అగపడరిక్కడ
అసలు తల్లి పేగుబంధం బాధ గదయ్యా తెలంగాణ
గొడ్లగాసే పోరని కసులకాడ చేతుల మూగభాషల
ముసురు తెలంగాణ
పొట్లంగట్టిన పరాయితనం నా తెలంగాణ
కెలకేసే కనిశపిల్ల గొంతుల దిగిన గాలం వలసపోట్ల
సలుపులాట నా తెలంగాణ
గుడిసె ఉట్టికి ఏలాడుతున్న సల్లకుండ తెలంగాణ
యాడబడితె ఆడ దొరికే మానవత్వపు పంటల
తోపు మా తెలంగాణ
మావోళ్ళ దప్పిక ధేనువు కామాలా తీర్చే
తాళ్ళతోపుల గొలుసు మా తెలంగాణ
పొట్టకొచ్చిన పంట పగుళ్ళ నుంచి రాల్తున్న
రైతు శవాల పాడె ఈ తెలంగాణ
ఇక్కడ తల్లుల గర్భసంచులన్నీ
ఫ్లోరిన్ ఉమ్మనీటి సంచులే
కళ్ళముంగటనే అంతా ఊడ్చుకబోతున్నా
పరిగేరుకునే పొట్ట పోసుకునే తల్లి
ఎదుటోని నోళ్ళు కొట్టలేని దగాపడ్డ తెలంగాణ

నా యాసపై రాళ్ళేస్తూ
పరభాషల మేకులు దించుతుంటే
తపించిన శిలువ నా తెలంగాణ
మాది బతుకుపాట, బతకమ్మ పాట, ఎట్టిపాట
ఉచ్చుల్లో పడేసిన మా పాదాల పిట్టలగోస తెలంగాణ
వేల ప్రాణాల్ని మాకు మేమే విసిరేసుకొని
దేశానికి ఎర్రకిరీటాన్నిచ్చిన నా వీర తెలంగాణ
ఇక్కడ ధీరులు విడిచిన వూపిర్ల శ్వాసతో
ఎందరు కవులు మహోలయ్యారో గదా!
మేం కబ్జాల జోలికి ఎన్నడుపోయినమని

గంజి మెతుకుల్ని దోసిలి చేసుకున్న చేతులివి
సొంతరాజ్యంలో తావులేక తిరుగుతున్న
గౌతమబుద్ధులు మా పాలమూరు బిడ్డలు
భూమిలో తమనితాము చల్లుకొని
రెడ్ ఇండియన్స్‌లా పత్తాదొరకని వాళ్ళు
వూళ్ళకు వూళ్ళు దుమ్ముపట్టి చితుకుతున్నా
సివాలెత్తని పిట్టల గుంపు తెలంగాణ
కిష్టపట్టె కష్టాల పట్టెయితే బావుండు
అదిప్పుడు వలసల పట్టిక
దరిద్రానికి ధర్వాజ తెలంగాణ
వంకబెట్టండి మా వాక్యాలకు
పండించుకోండి మీ కావ్యాలను
ఇప్పుడింక తెలంగాణకు తోవతెల్సింది
ఒక్కసారి కాళోజీ వాగులో పడి
నదులమై పొంగుకొద్దాం రండి

జంబో

# నా పేరు యాద్గిరి

నేను భాషను ప్రేమిస్తాను
యాసను ప్రేమిస్తాను
భాష నా తల్లి
తల్లిని ప్రేమించని వాడు మనిషే కాదు
కవి అంతకన్నా కాదు.
ఏ భాషైనా యాసైనా నా కిష్టమే.
నా భాష నా యాస నాకు మరీ ఇష్టం.
ఏ భాషను ఏవడు ఖూనీ చేసినా
వాడిని ఖూనీ చేయాలనేంత కోపం

నా పేరు యాద్గిరి
నా పేరు వింటెనే
మీ మొఖాలు వెకిలిస్తాయి.
నన్నో సర్వర్‌గానో విలన్ గానో
ద్వందార్థలో జోగర్‌గానో
మోసగాడిగానో తార్పుడిగాడిగానో చూపిస్తారు
అవహేళన చేస్తారు.

నా భాషలో లేని అనాకారితనాన్ని
వంకరలని జొప్పించి
నాతో మాట్లాడిస్తారు
ద్రౌపదిని వివస్త్ర చేస్తున్న
కురుసోదరుల్లా సంబర పడతారు
నిజమే!
భార్యని వదినని అవమానించిన
వ్యక్తులు చరిత్రలో వున్నారు
కానీ,
తల్లిని మానభంగం చేస్తున్న వ్యక్తులు
ఇప్పుడే తయారవుతున్నారు.

# జూకంటి జగన్నాథం

## మునాసం

ఎవరితోని చెప్పుకోవాలె ఏమని చెప్పుకోవాలె
ఎవరితోని పంచుకోవాలె ఎట్లని నించుకోవాలె
లోపల దెబ్బలు నెత్తురెల్లని తన్నులు
మనసు తాయిమాయి అయితుంది

రోడ్డేసింద్రు పట్నం గడియకో బస్సేసింద్రు
గని కీసల బుడ్డపైస లేకుంట సేసిన్రు
గాని నడువ కాళ్ళు రాకుంట సేసిన్రు
మనసు బొత్తిలకు ఇరుగ్గొట్టిన్రు –

బోరింగులేసి మా బాయిలు బోర్లేత్తిరి
కరెంటిచ్చి మా దీపం మలిపేత్తిరి
మ్యాదకులం బూమ్మీద రెండు రెకలేస్కు
మన్నులమన్నై బోర్లాడుకుంట బతికెటోల్లం
నమ్మికూడ నడిత్తే నిండ ముంచితిరి –

ఎటని పోతం ఎవలని పోతం
ఇగేందో అగేందో ఒకనాడు గాకుంటే ఒకనాడనుకుంటె
ఇంతింత బొండిగెలదాక నీల్లుదెత్తిరి –

కాలం అయ్యి మాదండిగ అసలు కొట్టినయ్
మా కాలువ సాగదు పొలం పారదు
నీల్లబొట్టులేని చెర్వుమత్తడి
మా కన్నీల్లతోని దుంకుతుంది –
రాట్నం అటకెక్కె
సారె లబ్బరు బిందైపాయె
ఆతారెలు సిలుంపట్టె
నాగలి దూలం పట్టె

ఎడ్లు కోతకు నడిచె
పనికోసం మంది సిరిసిల్ల సిద్దిపేట
భీవండి బొంబాయి తొవ్వపట్టి
ఏడేడు సముద్రాలు దాటి
ఎడార్ల పైసలు ఏరుకోవట్టి
పచ్చని బతుకులు మన్ను పోసుకోవట్టి

ఒక్క తీరనా ఒక్క లెక్కనా
ఒక్క తరువాయనా ఒక్క తంతనా
సలసల కాగే నూనెల గోలియ్యవట్టిరి -

గడికి టి.వీ. లంటరు, కంప్యూటర్లంటరు
అప్పు తెత్తమంటరు ఆకలి పోగద్దమంటరు
అందరూ సూత్తుండగనే
కోళ్ళు మాయం సేత్తుంటరు

ఎవల్తోని సెప్పుకోవాలె ఏమని సెప్పుకోవాలె
ఎవర్నని అనాలె ఎవర్నని అడ్గాలె
జడివ్వని గొర్రె యాద్కి వత్తుంది
ఏడేడు సెర్లు ఒక్కసారి తెగినట్టు
ఏద్వేద్వని దుఃఖం ముంచుకత్తుంది -

అరె! పెండ్లికి సప్పుడు మట్లాడుకుంటె
మని వుండగనే సావుకు వాయించినట్టుంది -
దొంగలు దొంగలు ఊర్లు పంచుకున్నట్టు అయినకాడికి
అమ్ముకోవట్టిరి
గదేం మునాసం. గిదేం న్నాయం -

సుకపడ్డోడు సుకపడ్తడు
కట్టపడ్డోడు కట్టపడ్తడు
బిచ్చమెత్తుకుంట 'బంగారు ప్రదేశ్ అంటరు -
మీరు కచ్రం మేము ఎడ్లం

ఇత్తునాలు మాయి ఇగురాలు మీయి
కల్లంల బర్తిబండి ఇంట్లకచ్చేదాక నమ్మకంలేదు
మ(గ్రగట్టిన నీల్లు కాలువ సాగుతదనే బరోస లేదు
పై చేయిని కిందికి సేత్తిరి
కాళీ కడుపు మీద దప్పు గొట్టవట్టిరి -
చెప్పుకుంటే ఇజ్జత్ పోద్ది
చెప్పుకోకుంటే పానం పోద్ది -
అరెరే! ఏం పుల్లెందలు కడుపు అవిశిపోవట్టె
పచ్చిలెక్క ఒర్రుకుంటూ ఒక్కతీర్గ కొట్టుకోవట్టిమి -

తొవ్వలు వేరు తొక్కులాటలు వేరు
పండిన పంటను
నడ్మల గద్దోలె గిర్నీతో కతం బెట్టవట్టిరి -

నీళ్ళిచ్చినందుకు
మా బతుకుల్ల నిప్పులు గుమ్మరియ్యవట్టిరి
గిది పాడి కాదన్నందుకు
పిట్టలెక్క కాల్చవట్టిరి -

అయ్యో!
అంతా ఒక్కటనుడంతా ఒల్లెక్కాలు వట్టేది
అయ్యో!
పంద్రాగాస్టు మీది
సెప్టెంబరు పదిగేడు మాది
పొద్దు మేము చీకటేమో మా (ప్రాప్తం
వెలుగేమో మీ పాలు -

తొవ్వలు పెద్దగ జేత్తరు
అడ్డం అచ్చిన పెద్ద పెద్ద చెట్లను నరికి అవతల పారెత్తడు
ఎండలు లగాయించి దంచుతయ్
చలి మా దండిగ పెడుతది
వాన కొడితే ఒక్క తీర్గ కుండపోత లేకుంటే బొత్తిలకే గుండుసున్న
మల్ల నెత్తిని నోరుసేసుకు గా బాటల పొంటే మొలకలు పాతిపెట్టుడు
రా గాడిది పో గాడిది ఫుజూల్ పన్లు

దొంగలు లేరు దొరలు లేరు
పద్ధతి లేదు ముద్దతి లేదు
న్నాయంలేదు అన్నాయిం లేదు
ఎలుగని సూసుడు లేదు చీకటని ఊకునుడు లేదు
ఎదిరిచ్చి నోన్ని సంపి పేగులు మెడలేసుకొని ఏదో అల్లి సెప్పుడు
సెవులు పిండి సేతికిచ్చుడు బాయిలపడ్డోనిమీద బండలు పారేసుడు

గీ సదువులు అద్దని సెప్పుడు
బేపారమే ఇక  ఇంటావంటా ఇలవరస కావాలనుడు
అమ్రికా! దిక్కు సూసి పిల్లి పులి వాతలు గుంజుకునుడు
దాని లెక్క మనం అవుతమనుడు
బాగోతంలోని బుడ్డలికానేషాలు
రాజు యాటకు పోదామంటే 'పా' అనుడు
కొలువు సేద్దమంటే గట్లనే మరాజాని పబ్బతిపట్టుడు
బొంకుడు బోర్లేసుడు బుదురకిచ్చుడు నెత్తిమీద సెయ్యి పెట్టుడు

మునాఫా లేదు ముదురలేదు
గోస సోచాయించుడులేదు పుల్లెందుల లెక్కకురాదు
ప్రైవేట్ అని సెవుల జోర్రీగలెక్క ఒక్కటే తలుగుడు
గట్లయితెనే బాగుపడ్తమని లొట్టిమీద కాకోలె కవ్వర కవ్వర ఒర్రుడు
పీనుక్కు సింగారం సేసి అన్మారెడ్ల సుట్టూ తిరుగుడు –
ఓట్లకు నోట్లంటరు

నోట్లకు సీట్లంటరు
ముంచెటోడు ప్రజల సేవ అంటడు
నిండా మునిగి పానం పోంగా సూసెటోడా గదే సేవ సేత్తున్నమంటడా
గదేందో గని అడిగెటోడు కడుపు నింపుకునుడే
ఏలెటోడు కమాయిత్తనే వుంటడు -

కోంద్ర బూమిలేనోడు బుక్కెడు బువ్వ లేనోడు
'సియాసత్ల'కచ్చి కోట్లు నంకులకు పడిగెలెత్తుడు -
పిల్లల కొట్లాట కోతి తీర్చుడు పాసంగం లేని తక్కెడతోని జోకుడు.

అంతా సూర్‌మార్ కాల్లే
అంతా ధోకాబాజి గాల్లే
సెప్పులున్నోని ఎంట సెప్పులు లేనోడు నడ్చుడు
సెట్టు ఎక్కిచ్చి సేతులు ఇడ్సిపెట్టుడు -

గీల్ల వగలు ఏడ్పులకు
వాగుల పారే నీల్లు ఎన్కకు గుంజుకున్నయ్
గీల్ల దొంగ మాటలకు
పిట్టలు బీరిపోయి పలుకుడు బందు పెట్టినయ్

ఏం నాటకాల్! ఏం నాటకాల్!
ఏం మాటల్! ఏం మాటల్!
తల్లిగారి బూమని ఓ పారి
సాప్ సఫాయని ఓ పారి
పూడికల్దీసుడని ఓ పారి
పిల్ల తల్లుల తర్బీయతని ఓ పారి

ఓరి నాయనో! ఓరి కొడుకో!
పుట్టి నేర్సింద్రో పుట్టక నేర్సింద్రో
గుల్లని ఓ పారి గుత్పలని ఓ పారి
అంటు ముట్టని ఓ పారి
దేశాన్ని ముందుకు తీస్కపోతుంటే

కాల్లుపట్టి ఎన్కకు గుంజుతుండ్రని ఓ పారి
ఇకిలిచ్చుడు లోపల్లోపల సకిలిచ్చుడు.

సెప్పింది సేసుడు లేదు
సేసింది సెప్పుడు లేదు
గిదేందంటే సడీసప్పుడు లేదు
అన్నది మల్ల అనకుంట
సేసింది మల్ల సేయకుంట
గడియకోమాట పూటకో తరీక
బోకెత్తుల ఏషాలు బొందలపడేసే నల్లికుట్ల తనాలు –

కాపోల్లు సత్తుడ్రంటె మేమేం సెయ్యాలంటరు
న్యాతకాల్ల ఊపిర్లు తీసుకుంటుండ్రంటే మమ్ముల్నేం సెయ్యమంటరు
కైకిలు దొరుకుత లేదంటే కతకతోటె నడిపియింరంటరు
జీతాలు సాల్తలేవంటే మేము ఏడ్నెల్లి తెత్తమంటరు
బూక్ హర్తాల్ అంటే పోలీసోల్లను ఉసికొల్పుతరు
కంచెతోని చేన్ను మేపిత్తరు మంచెతోని చంటను కాజేపిత్తరు –
మన ఏలితోనే మన కన్నును పొడిపిత్తరు –
కాయిష్ ఉన్నా లేకున్నా నిమాయిష్ వస్తువుల్ని
కొనిపిచ్చేదాక టీ.వి. తిరికీస్ ఇడ్సిపెట్టది.
అటెన్క సూసుకో

గావర గావర సెక్కర సెక్కర ఎక్కే గడప దిగే గడప
సేతులు కాళ్ళు అయితయ్ మనుసు రాయైతది
కంటి నింద నిద్రపోయింది లేదు కడుపు నిండ తిన్నది లేదు
తొవ్వల నిలబడి తొక్కేవ్ అనుడు ఊమ్మితడి కండ్లకు పూసుకు ఏడ్సుడు

పిల్లని తల్లికి గాకుంట
మొగన్ని పెండ్లాంగాకుంట
పెండ్లాం మొగన్కి గాకుంట
ఇల్లు ఊరికి పనికిరాకుంట

ఊరు మందికి అక్కర రాకుంట
మంది దేశానికి గాకుంట
దేశం మందిది కాదనుకుంట
మనిషిని మనిషి దూరం సేసుడు
మన్నుకు మనం ఏమి గాకుంట పాయ గొట్టుడు

సేసేటియి సేసుకుంట
సంపి సాదర సావు కర్చు ఇచ్చుడు
సాగనంపి ఇంట్ల దొంగలు పడుడు -

కుర్సిల ఎవలు కూసున్న గదే అంకర బుద్ధి దొంగ సూపు -
మీకు గత్తర రాను మీకు జెట్టలు బుట్ట దుల్లుమ్మ గొట్ట
మిారు మీదుంటే ఆనలు పడయ్ కిందుంటె పంటలు పండయ్
గీ యాభై రెండేండ్లకే దూమ్ దూమ్ సెందర సెందర
తవ్వడు ఎత్తడు మొయ్యడు తన కడుపు నిండితే దరిద్రంపాయె -

కుట్టెటోడు కుడితెనే సెవులు నొయ్యయి
ఇగ మీ తక్తపీటలుగా అమ్రికా కంపినోన్కి గుత్తకియ్యాలె!

## జూలూరు గౌరీ శంకర్

# జమ్మికులు

కల ఎవనికీ ఇంత చిక్కంగ, దట్టంగ, మట్టసంగ, గుండ్రంగా
నాసుట్టూతా నేను చక్కర్లేసుకుంటూ... నాపెకలిన మాటలు... ఎన్నెన్ని
సార్లు విశాలం కింద పగిలిన గాజు ముక్కలు... కమిలిన దెబ్బల మీద
కంటి సూపులు... మానుడులేని ఈ సురుకుపోట్ల దెబ్బకు మనసు...
సార్లూ నిజంగా చెప్పుండ్రీ... ఎన్ని సార్లని మీకిది బాగా... చెప్పురి...
నచ్చు చెప్పటం మీన మన్నుబోయ.. అప్పుజెప్పటం అగ్గి పాలుకాను..
ఎనకబాటు తనమేందీ పేరు ఇకారంగా... ఎవరు చదవాలి ఈ భాదల
పట్టి... ఎవరు తొడుక్కోవాలి ఈ కన్నీళ్ల అంగీ... ఇప్పిసూడు ఇది
అవేదనల ఉట్టి.

భాదల్ భాదల్ చల్ భాదల్, కష్టాల్ చల్ చల్ కష్టట్టాల్...
జరజరటైరో.. మారో.. గియో.. గిర్‌గిరో.. మళ్ల మళ్ల చక్కర్లు ఏయ్..
చక్ చకా.. తుమ్మల్ తుమ్మల్ సర్కారు తుమ్మల్.. నా సుందరాంచల్..
నా అందరాంచల్... తుమ్మలతోపు... తుమ్మిసికల జోరు..
తెలంగాణాంచల్... ఎక్కడ చూసినా పాతాళగంగలకు గాలాలు...
నాలుక నానవినీళ్లు...' నా భూమి.. సమస్తం ఆకలాకలి గోలం..
ఆత్మాభిమానానికి ఏలాడుతున్న తెగని రాగం.. సూడండి.. ఇది
చలిమంట.. అది పొలికట్టే.

విచారించాలి... విస్తరించి వీస్తు... ఎదల పొంగుల్ని ఎగజిమ్మిసారించి..
వీసుగు చెందిన విచారణల వీస్తు... విచారిస్తు.. మూలాల ఎరమ్రట్టి
పొరల్ని పొట్టుతీసి తెరచిచూచి... రాత్రులు ఉలిక్కిపడ్డ చీకట్లు.. తెరలు
లేవాలి... పగిలిన వేదికలు... ఉలికిపాటును అట్టిపెట్టు
పిడుగుపాటు... విషయానికి చికిత్సల విచికిత్సలు చూడు... బొందల్ని
తవ్వు...

తొండిలేకుండా గాయాల్ని లెక్కలు ఐకట్టు... ఇప్పటి దాకా ఎన్ని
అతుకుల మాటలో, మాటలకు మాట్లో చూడు... ముక్కుకుంటూ..
దేకుకుంటూ... ఎందుకు కోపం తెగినకాలువయ్యిందో... ఎట్లా

రాలిపడ్డానో గట్లనే... ఆనవాళ్లు కదల్చకుండా కళ్లక్కడపెట్టు...
సూపుముద్ర... సురుకుముద్ర... కోపముద్ర... కరకర
కరుకుముద్రలు... కదులు కదులు కటకటమని కదులు కదులు...
చిన్నప్పుడు మా నడిగూడెం రాజాగడీ గోడమీద ఇప్పటికీ చెడగని నా
చూపులు...
నా  భూమి... నా మాగాణం... జై జై...

కళ్లకు గంతలు కట్టిన కనికట్టు నిప్పిన కవిత్వమే జీవ కవిత్వం...
ఎవనిపాయ నుంచి పారే నెత్తురుకు వాడే భాష... త్రిలింగాలుకాదు చూసింది
చెప్పే కళ్లే ప్రవాహ సూచికలు... నా తీర్పు మీదే నేను... నా భూమ్మీదే
నేను... అడిగితే కడుపుల అన్నంతీసిచ్చే నావొళ్ల ఎరకలేని తనమే
కదిలించలేని నా ఎదురులేని చరిత్ర... నా వెంటాడే కళ్లతోనే దేన్నయినా
తిరగరాస్తా... తల్లీ ఇంక నీ మూల్గు వినలేను...

నేను ఋణం తీర్చుకునే బిడ్డనౌతా...
రచ్చ బండ దర్వాజ తెరుచుకుంది
తీర్పు నికరంగా వాయిదా కాదు
ఈ పాతకోడ్‌లు శిక్షల టేపులకుచాలవు
మూలాల వెలుదళ్ల నుంచి తీర్పులు.

## తోవ తెలంగాణ

నిజంగా ఆశ్చర్యం కానిది
నాదెంత నిజాయితీ అవేశం
ఓర్పుకు నాపేరే సహనపు మంట
కాలం ఇంత నిర్లక్ష్యంగా నెట్టేసినా
పేలకుండా ఎట్లా మిగిలానో ఏమో
ప్రశ్నలకు ప్రశ్నే ప్రశ్నన్న
నా జీవనదుల స్తన్యాలను నాకందకుండా
చేసిన  తనాన్ని ఎమనాల్నో!?
ఏ ద్రోహద్రోణుల వేళ్ళు నరకాల్నో!!
లేని, లేమి తనాలతో వెనక్కి నెట్టేయటం కంటే
మించిన పెద్దతప్పు ఇంకేమన్నా ఉందా?

సమాధానాన్ని సామూహికంగా పాడుదాం రండి

నా తల్లి తెలంగాణ
మా చూపు, తోవా తెలంగాణ
మా చివరి దరి, దారి తెలంగాణ
మా కలతనిద్రల్ని చాకలి ఐలమ్మా మేలుకొలుపు
ఓ దొడ్డి కొమరయ్యా, నన్నొక్కసారి ఆవహించు

## నోళ్ళు తెరిచిన సద్దిమూటలు

దిక్కులకు దిక్కు లేనప్పుడు
తనకు తనే దిక్కొచి దిక్కు
వెనుక పడేసిన అడుగలన్నీ
చరిత్ర పాదాలు తొడుక్కుని ముందుకు
నేను కాని నేను ఇంతకాలం ఎంత అబద్ధం
నా మట్టి కడుపులోనే మళ్ళీ మళ్ళీ
మొహమాటపు మాటలక్కర్లే
ఎత్తిపొడుపులు అస్సలొద్దు
ఈ సజీవ నెత్తుటి ముద్దలు
ఎప్పుడూ కత్తుల వానలే
ఎవరెన్నెన్ని నీళ్ళు బోసినా
అది మండుతున్న ప్రత్యేక నెత్తురునే
నా చేతుల దోసిళ్ళు నరికిన మోదుగు మొక్కల చిగుర్లు
నన్ను నేను చెప్పుకోవడం
బొడ్డుతెగని బిడ్డ కేక
మళ్ళీ నోళ్ళు తెరుస్తున్న సద్దిమూటలు
ప్రాంతాల పాదాల యాత్రలు
పరాయికరణపు చీట్టీ చించి
మళ్ళీ కొత్తగా పుడుతున్నా

## శివన్న గూడెం కళ్ళు

కడుపుల బాధ కండ్లల్ల కురిస్తె తప్ప
తృష్ణకు లేవు నీళ్లిక్కడ

తృటిలో తప్పిన ప్రమాదం కాదిది.
చిత్రపటమే అసమైక్య చిత్రం

చుట్టుకున్న వలసచుట్టూ ఆధిపత్యపు చక్కర్లు

పెద్దగుట్టమీన సెలపడితేనే
కాలం సల్లకుండ

వొట్టిన పత్తికాల్వలు
పత్తెలు బతికున్నప్పుడు
ఒంటికీ ఇంటికీ బతుకు

పానాలు హ్యాండ్ బోర్‌లో
ఎర్రమంటల్లో రాచకొండలు

ఆశల కండ్లు పొడిసిన వడగండ్లు
అర్జునా. . . ఫల్గుణా. . .
ప్రొఫెసర్ జనార్దనా. . . మద్దెల శాంతన్నా
సురవరం చేతులందుకున్న తెలంగాణా

పదునెక్కిన శివన్నగూడెం పెద్దాయన కళ్ళవి

## లొల్లి ఇంగాగదు

పానాల్ని విత్తనాలుగా చల్లిన పానాలు, గా పోరాటంల నాల్గునేల అమ్మచీరల ఆకాశాలను చించిన తనం మీన కలబడాడిన పానాలు, తెగిన రెక్కలు తెంచుకున్న చూపులు, నా మట్టి పొదుగుల్ని పిండేస్తుంటే ఎదురెదురు తిరగిన ఊపిర్లు, కొమరయ్యను చిట్లగొట్టిన తనం నుంచి నెత్తురు పంటల ఏరులు, నెత్తురు కట్టలకు పురుళ్ళు, రాలిన పూతల్ని లెక్కించలేను, జరిగింది ఎందుకెందుకు, ఎంతెంత జరిగినా గిప్పటికీ నామీద మంది ముద్దరలు, పల్లానికి పారే కన్నీళ్ళకు యాడ అగ్గంటినా మంటాగదు ప్రామాణికం పదంతో నా భాషను యాసను మింగేసిన పత్రాలను నడిబజారులు తగలేస్తున్నా, నా రెక్కల శబ్దానికి నా గొంతే
నిజం ఓపిక న్లా తల్లి నా తెలంగాణ మానవత్వపు మాగాణి
కాకపోతే కసి ఆవేశాన్ని ఎన్నెన్ని సార్లు తెంచేదో!! ఎంత తవ్వినా కన్నీళ్ళలోతు తప్ప జలపిల్ల అరుపు ఇనబడదే, నీళ్ళు ఎంత తవ్వినా కన్నీళ్ళలోతు తప్ప

జలపిల్ల అరుపు ఇనబడదే, నీళ్ళు లేకుండా పచ్చటి కలలు, తాటాకు లెగిరిన
సగం ఒంటితో గోడలు_పగళ్ళ ఎఱ్ఱటెండ లయిన పస్తుల పయటాలలు,
ఏడుపాగని వూర్లగోసలు అబద్ధం కలయిక పాటకు ఈ కన్నడు ఏ కంటినీ
ఇవ్వడు మొదలయిన లొల్లి ఇంగాగదు ఇగ ఇనటాల్ గినటాల్ ల్లేవ్
మేం తెలంగాణ బిడ్డలం
వెన్నుసూపని ఎనకబడినోళ్ళం - దళితాత్మలం,
తెలంగాణకు 'జై'లం, 'జైజై'లం
(తన 67ఏళ్ళ వయస్సులో 20 ఏళ్ళ ఆవేశం కట్టలు తెంచుకుంటున్న
కుఱ్ఱాడిలా తెలంగాణా గురించి తపిస్తున్న ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్ట్స్
కాలేజి మాజీ ప్రిన్సిపాల్ మధుసూదన్‌రెడ్డికి ప్రేమతో. . . . .)

# టి. కృష్ణమూర్తి యాదవ్

## నా తెలంగాణ

నా తెలంగాణ బీదదేకావచ్చు
బాధల్లో ఉన్నా భయపడే రకం కాదు
పోరాటం దాని ఊపిరి
నిజాం నవాబును గద్దెదిగే దాక
నిలేసి పోరాడింది
నా తెలంగాణ బీదదే కావచ్చు
బతుకుదెరువు కోసం
చెరువుల కింద కుంటల కింద
పొలాలను సాగుచేసుకొవచ్చు
జమిందార్లు జాగిర్‌దార్ల క్రూరపెత్తనాన్ని
కూకటి వేళ్ళతో పీకేసింది
నా తెలంగాణ బీదదే కావచ్చు
గుట్టల పొంటి గట్లపొంటి తిరుగుకుంట
బర్రెలను మేపుకుంట గొర్రెలను కాసుకుంట
గట్క గంజి నీళ్ళు తాగి
గట్టి పోరాట పటిమను నేర్చుకుంది
నా తెలంగాణ బీదదే కావచ్చు
ఎర్రచెక్క భూములే కావచ్చు ఇసుక పర్రెలేకావచ్చు
బొగ్గుబావులే కావచ్చు బొరింగిబావులే కావచ్చు
మోటలు కొడ్తూ పాటలు పాడుతూ
పంటలను పండించుకుంటది
నా తెలంగాణ బీదదే కావచ్చు
సమ్మక్క సారక్క జాతరలే చేస్తది
బతుకమ్మపాటలనే పాడుతూ ఉంటుంది
కొమురెల్లి దేవున్ని కొర్కెలు తీర్చమంటది
అయిలోని దేవునికి పట్నాలు ఎసివస్తది
ఎమడాల రాజన్నకు కొడెలను కట్టెస్తది

నా తెలంగాణా బీదదే కావచ్చు
రుమాల్లనే చుట్టుకొవచ్చు దొడ్డు దొతులనే కట్టుకొవచ్చు
ఏకశిలానగరం ఎలికల కథలు తెలుసుకోవచ్చు
కాటమరాజు - కాంబోజరాజు కథలు వినవచ్చు
గొలకొండఖిల దాని గత చరిత్ర చదువుకొవచ్చు
చార్మినారు దాని ప్రేమకథను తెలుసుకొవచ్చు
కళలకే పుట్టిల్లు కధలకే కణాచి
ఒగ్గు కథలు వినవచ్చు గంగిరెద్దులను చూడవచ్చు
రామప్ప దేవాలయంను వెయ్యి స్తంబాలగుడిని చూడవచ్చు
బాసర సరస్వతిని బద్రాద్రి రామున్ని చూడవచ్చు
నా తెలంగాణ బీదదే కావచ్చు
బాధల్లో వున్నా! భయపడే రకం కాదు
దొడ్డి కొమురన్నను కన్నది, కొమురంభీంను కన్నది
రావి నారాయణరెడ్డిని కన్నది మగ్దుం మొహినొద్దిన్ కన్నది
నల్లా ఆదిరెడ్డిని కన్నది గద్దరన్నను కన్నది
నా తెలంగాణ బీదదే కావచ్చు
బాధల్లో వున్న భయపడే రకం కాదు
పోరాటం దాని ఊపిరి
అన్యాయాలకు ఆనకట్టలు వేయడం దానిపని.

# ఆళ్ళు ఊరోళ్ళు

గూన ఇండ్లల్ల
గుడిసెలల్ల ఉండెటోల్లు
ఇంటెనుక ఎడ్ల కొట్టం
ఇంటి ముంగిట బర్లకొట్టం
ఆళ్ళు ఊరోల్లు
ఊల్లల్ల బతికెటోల్లు

చేన్లల్ల మంచలేసి
వడిసెల్లు తిప్పెటోల్లు
ఊరకాకుల్ని తరిమేసి
ఊసబియ్యం బుక్కెటోల్లు
ఆళ్ళు ఊరోల్లు
ఊల్లల్ల ఉండెటోల్లు

తొక్కు నూర్కోని
తొటకూరండుకొని
బుక్కడు బువ్వతిని
తోటలు ఏరుకొనేటొల్లు
ఆళ్ళు ఊరోల్లు
ఊల్లల్ల బతికెటోల్లు

తంగేడు పూలు తెచ్చి
తపుకులల్ల బతుకమ్మల పేర్సుకొని
శివుని గుల్ల ముంగిట నన్న
చెరువు గట్ల మీదనన్న
ఆడుకునేటోల్లు
ఆళ్ళు ఊరోల్లు
ఊల్లల్ల బతికేటొల్లు

చెర్లల్ల కొంగలను
చెట్లమీద గొౖరెంకలను
చూర్లల్ల ఊరబిషికలను
సూసుకుంట ముచ్చట పడేటోల్లు
అళ్ళు ఊరోల్లు
ఊల్లల్ల బతికేటోల్లు
చిరుతల రామండమంటే
చీరలు కట్టుకొని ఉర్కెటోల్లు
గొల్ల సుద్దులంటే
గొంగల్లేసుకొని కూసుండెటోల్లు
అల్లు ఊరోల్లు
ఊల్లల్ల బతికేటోల్లు

పసిపాపలను సాదినట్లు
పసుల పోషణ సేసుకునేటోల్లు
పట్నంల సదివే కొడుకులను
పావురంగ సూసుకునేటోల్లు
అళ్ళు ఊరోల్లు
ఊల్లల్ల బతికేటోల్లు

గుడిలల్ల పెత్తనానికి
గండి పెట్టినోళ్ళు
నవాబుల దొరల రాజ్జిరికం
రాళ్లపాలు సేసినోళ్లు
అళ్లు ఊరోల్లు
ఊల్లల్ల ఉండెటోల్లు

ఎఱ్ఱచెక్క భూమి దున్నుకొని
ఎవుసం సేసుకొనేటోల్లు
నల్లరేగల్లు దున్ని
నవదినుసులు పండించేటోల్లు
అళ్లు ఊరోల్లు

ఊల్లల్ల ఉండెటోల్లు
గద్దరు పాటలంటే
గంజి తాగకుంట అచ్చెటోల్లు
సీకట్ల సుక్కలచ్చిన
సివరిదాక ఇనేటోల్లు
అళ్లు ఊరోల్లు
ఊల్లల్ల బతికెటోల్లు

ఓట్లు ఏసి ఏసి
ఇసుగచ్చినోల్లు
బతుకులు మారలేదని
బాధలు పడెటోల్లు
అళ్ళు ఊరోల్లు
ఊల్లల్ల బతికెటోల్లు

తూర్పు దిక్కున నడిశెటోల్లకు
తుపాకులు పట్టినోళ్ళకు
బువ్వ తినె బెట్టెటోల్లు
ఎర్ర జెండాలను ఎగిరేసేటోల్లు
అల్లు ఊరోల్లు
ఊర్లల్ల ఉండెటోల్లు

# టి. జితేంద్రరావు

## కోటి గాయాల కూన

కోటి రత్నాల వీణే
కొల్ల గొట్టబడి కోటి గాయాల కూనై రోదిస్తుంది
కొలిమిలో నిప్పులా మండుతోంది

గాయాలు ఎన్నెన్నో గాయాలు
ఎందరెందరో చేసిన గాయాలు
ఎన్నాళ్ళనుండో అవుతున్న గాయాలు
గాయమే తానై - తానే గాయమైన బ్రతుకు తనది.

గోరు ముద్దైనా
గొంతెమ్మ కోర్కైనా
దానికెప్పుడూ మొండి చెయ్యే చూపెట్టబడుతుంది

వలస వచ్చిన చీడలతో
ఇక్కడి పచ్చదనమంతా పుచ్చి పోతూనే ఉంటుంది
అభివృద్ధికై అవలివైపుకు నెట్టివేయబడుతూనే ఉంటుంది

కోడిపిల్లల్ని తన్నుకు పోయినట్టు
అప్పుడప్పుడు వచ్చే అవకాశాల్ని
అన్ని వైపుల నుండి వచ్చే డేగలు తన్నుకు పోతూనే ఉంటాయి

పచ్చదనం ఉంటుంది
కాని పంటపొలాలు మండుతాయి
పత్తి సైతం పచ్చి విషమై ప్రాణాలు తీస్తుంది

ఇక్కడి మాట వెలివేయ బడుతున్నది
ఇక్కడి పాట వెలివేయబడుతున్నది
బ్రతుకు బలి చేయబడుతున్నది
ప్రామిస్‌లుంటాయి

ప్రాజెక్టులుండవు
కారాగారాలుంటాయి
కర్మాగారాలుండవు
బతుకులు మండుతుంటాయి కాబట్టి
పొగలుంటాయి, సెగలుంటాయి
పదిహేను నుండె ముప్పయి మధ్యన వయసు
దిక్కుతోచని తనంతో దారి తప్పిపోతుంది
బ్రతుకు తెరువు లేనితనం
భగా భగా మండిపోతుంది
అణచి వేయబడ్డతనం
శోకమై, ఆక్రోశమై ప్రతిధ్వనిస్తుంది
దగా చేసేతనం
ఇక్కడి కళ్ళకు గంతలు కట్టి దాగుడు మూతలాడుతుంది

# తమ్మనబోయిన వాసు

## బర్రెనెత్తిల శోకం

నాత్రిని మేస్తున్న చేను. . .
ఈద్రుగాలి నెత్తీరబోస్కోని
ముత్తెలమ్మ గుడికోలాటం దుర్వుకి
దుబ్బులెగుర్తున్న వోరడి కాలైనట్లుంది
పొద్దు చెంద్రున్ని పొద్వంగనే. . .
కద్బుల బాధ కల్లెదుర్గా ఇంటిముంగల
పేడగల్పిన సాన్పయ్యింది
ఊకొట్టిన దినాలు బోంగ
తనువు కట్టె పొయికింద కాల్తుంది
పేగుల మజ్జె ఇర్కున్న సర్కారోళ్ళగాలికి
అఖర్న రాలిన అంసూ
అయిర్లై లేసింది సిబ్బిమీన
కంచంల బువ్వకి గరీబుతనం కారమై
మూతికి తగ్లంగనే. . .
జుట్లిర్కిన ఏండ్లపాపం
కుండ్లంల్ల దిర్గి కాళ్ళతాన చమ్కాయిస్తున్నయ్
గుండె గొర్గిన తీపు కలేసి తిప్పుతుంటే
పోగులేషానికి నుద్రు గొట్టుకోని
అరికాలితో ఏద్రొమ్ము తన్నించుకున్నా
జరంత తొంగ్జూసి
పొడి సెంపల్ని సెర్పుకుంది
బొడ్డెక్కి ఆడిన పీరుకట్టె
ఎర్రంగి ఏస్కున్నప్పుడు
నెర్రబార్న పొలం
ఎండల నిలబెట్టి ఇప్పిందాక
పక్క పక్క కద్బుగ్ల నవ్వింది
మర్లబెట్టిన గోస పెయ్యిని సల్పుతుంటె

కష్టాల గోర్సి బత్కిన వొడ్లగింజల్ని
సేటుగుమ్మిల లగాయించిన ఏడ్పుగల్పి
మూత్కి సిక్కమేస్కోని గుమ్మరించిన
గాలిమోటరు దవాకి
జేబు తడారిపోంగ
తరిని గోలీలు సూదులు
బగ్దదిని తేన్పినయ్
నొప్పి మాస్కెకు
అడ్డున మిగ్లిన గావొక్క జీవాన్ని
గుంజరుడం దెంపి గడ్డ దాటిస్తుంటె. .
గా బర్రెనెత్తిల శోకం
నడిరేత్రి ఆన కన్పడక
ఇల్లు తడ్పినట్లైంది
కొట్టాం ఎల్తిగ నా గుండె నతికించింది
కట్టె మంచల్ల కళ్ళు మూస్కుంటే
నాఁతిని
ముక్కలు ముక్కలు
కొరుక్కు తింటున్న సీకటి
కన్రెప్పల్ని జోగొడుతుంది. . .

# వలపోత

పచ్చిపచ్చిగా మొలకెత్తుతున్న బొందలగడ్డ
ఎనెక్కి జాగని కరువుకు గొట్కోని
నేల నుదురాసింది

చిన్నగా ఏడ్పంతా గాల్లెగల్సి ఊర్లమీన
కట్టాబెడుతున్నది
నెర్రెలు ఈనిన నేలలల్లి పద్కముందే
ఆయిరైతున్న కంటనీళ్ళు

పీన్గెలు జాతర్లెల్లినయ్ దులో . . . దులా. .
పోతురాజునురో. .
గుండెను దప్పుజేసి సిర్రేస్తుండు

పీన్గెల అన్న. . .
జంప్కానేస్కోని పండిన కాళ్ళు పుచ్చిన తాతలు
పీన్గెలు పోంగ . . . పోంగ
కెవ్వున. . . తరాలు
దుమ్ముల జమైన శోకం జమేన్ తుక్డాలల్ల
పగిళ్ళిచ్చుకుంటుంది

బేరాల చూపుల్ల. . .ఎడ్ల ఆంసూల
తానమాడి శక్కరొచ్చిందా బిడ్డా. . .
గీడబుట్న పాపాన్కి చేతుల్ల. . . . కట్టెచేతులల్ల. . .

మట్టె బొర్లాడుతూ వలపోత బెట్టాలల్నే బిడ్డా. . .
ఆకలికి మందలు గొట్కబోతున్నయ్
గాలిల . . . సంతల. . . కష్టాల గడ్డల్ల. . .
వొంటినిండ కంపమండల్తో గొట్కుంటున్న
సారలు సారలుగా కమ్ముకుంటున్న నెత్తురు

సైబర్ కేకలకు చింత చెట్లమీన పిట్టల్లేన్నయ్
చెట్టు గొట్టడమే. . తర్వాయి భాగం. . .
మిగతాది రేపు

పొలిమేర్ల సేతులు సాపిన ఆక్టోపస్
మాటలు. . పాటలు . . .కొత్తకొత్తగా. . .
ఊపిరాడట్లేదు. . . జరంత గాలిగావాల్నే. . .

నీల్లువాయే . . . భూం వాయే. . . బిడ్డలు వాయే. . .
గీ గడ్డమీన తల్లిబోసింది. . .
గుంటలు . . . గుంటలుగా మచ్చలు
మా భూవ్ని అల్లుకుంటున్నందేక్క గదా. . .
ఇండ్లు . . . తనువులు. . కలలు. . .
సురసురా పోరల నెత్తుర్ల ముద్దైన నేల
సూరులకెల్లి నడినెత్తిన ధారగా. .
ఆస్మాన్ కర్గుతున్న మోత . . .
గల్లుగల్లున మోటగొట్టిన మోత
గజల్లు ఘుమాయిస్తున్న నేలంతా
ఖవ్వాలీల లెల్లాటల మోత
దారెంట ఉర్కుతున్న దర్వు. . .
ఏయ్ దర్వేయ్. . . ఎహే
పిడికిట్ల దుబ్బంతా పొలిజల్లుకుంటూ. . .

# తిరునగరి శ్రీనివాస్

## ఊరేగింపు

ఇది నిజంగా మరచిపోనని అనుభవమే!
గాయపడ్డ దేహానికి గతంలో
తన వెన్నుని పరచి ప్రాణం పోసిన పత్తి
తెల్ల బంగారమై
చావు తోరణమై
మైసయ్య చావుడప్పుకి చిర్రాపుల్ల అయ్యింది!
విస్తరించిన వేయి శిరస్సుల
దళారీ భూతానికి 'జీ హుజూర్' పాడింది
కలవరింపుల్నీ కూడా మిగిల్చకుండా మ్రింగేసింది
పత్తి 'చెదపురుగ'వుతుందనుకోకపోవడం పొరపాటే!
నమ్ముకున్న భూమిలో పండింది
గొంతు బిగుసుకునేంత ఉరిత్రాడే!
కడగండ్లతో ఉడికిన కనుగుడ్లు
పగిలిన పత్తికాయలోంచి బయటకొచ్చాయి!
'సుతిమెత్త'గా ఉంటూ ప్రాణాలు తీయడం
పత్తి నైజమని 'విచారణ' అవసరం లేకుండానే
పదే పదే రుజువవుతోంది!
'గాలీ – ధూళీ', 'భూమి–ఆకాశం', నువ్వూ–నేనూ' సాక్షిగా
నిజంగా 'అతడు' వంచితుడు
చచ్చింది 'అతడే' అయినా
బ్రతికున్న స్మశానాలం మనం!
భూమి పుత్రున్ని తెల్లబంగారపు
కలల లోకానికి సాగనంపాం!
ఇక మిగిలిందిల్లా
'అతడి' అస్థిపంజరం ఊరేగింపే!
ఆకాస్తాలో కూడా అతడిని వదలక
బూడిదలోని బొమికలనూ ఏరుకుంటే
మనచుట్టూ మిగిలి తిరిగి తెగబడేవి
నిర్జీవ మృత్యాత్మల ఘోషలే!

## ఉద్యమం - ఊపిరి

గూడెం గుండెల మీద
ఇనుప భూట్ల శబ్దం
నగరం నడిబొడ్డు మీద
లాఠీల నాట్యం
ఉద్యమంగా ప్రవహిస్తున్న
ఊపిరి

చుట్టూ మొనదేలిన
బాయ్‌నెట్ జైళ్ళు
అయినా కళ్ళు గప్పి
ఊరేగుతున్న జెండా
నా ఊపిరి.

నల్లరాతి గనుల్లో
నలుగుతున్న చేతులు
నా ఊపిరి.
నిత్య నిఘాలో సైతం
మట్టికి మాటలు నేర్పుతున్న
చైతన్యం నా ఊపిరి.
గుండ్ల కెదురొడ్డి
గుండె నెత్తుటి దారలు
గుడిసెల్లో కెగజిమ్ముతున్న
వెలుగు దీపాల్లో
నా ఊపిరి.
నా ఊపిరి – నా కలం
కనురెప్పల క్రింద
కలాన్ని ఎక్కుపెట్టి

తూర్పు సెగల్ని,
కొత్త చరిత్రకు,
నెత్తుటి పరవళ్ళు చేస్తున్న,
ప్రవాహం నా ఊపిరి -
ఉద్యమం - నా ఊపిరి.



## తుమ్మల దేవరావ్

# కచ్చురం

కచ్చురం తోవ. . .
రాలు, రప్పలు, ఎత్తుపల్లాలు
వంకరటింకరతో పసిపాప మెత్తని అడుగుల్లా
రెండు రైలు పట్టాల్ని
ఉతికి సాగదీసి నిటారుగా ఆరేసినట్లుంది
వేలవేల మట్టి పాదాల్ని మోసి మోసి అరిగిన కర్రులా ఉంది
కొత్త కొత్తగా సింగారించుకునే మట్టికన్యలా ఉంది

తోవ వీపు మీదినుంచి
కమ్ముల కచ్చురం నడిచినపుడు
భూమి గుండ్రని యిస్సురాయిలా నా చుట్టు ప్రదిక్షిణ చేసినట్లుండేది
ఎద్దుల గిట్టల శబ్దాలు
నిశ్శబ్దంగా పర్చుకున్న నేల మద్దెల మీద లయత్మకంగా చిరు సంతకాలు
చేసేవి
మూగల చప్పుళ్లు గద్దర్ గజ్జెళ్లా గల్లు గల్లు మంటుంటే
కోనలన్ని నిశ్శబ్దాన్ని మోసుకొని చీకటిలోకి జారుకునేవి
గడ్డి మైదానాల్లో ఒంటరిగా ఎండుపుల్లలు ఏరుకుంటున్న
పిచ్చుకల కనుపాపల్లో వేటగాడి వలలు వ్రేలాడేవి.
వాటి చుట్టూ కొండంతదిగులు తాలుకు దృశ్యాలు కఠినశిలలయ్యేవి

ఉడుత ఒకటి సరదగా తోవకడ్డంగా హైజంప్‌లేస్తూ
ఎన్నెన్ని స్వేచ్ఛ వసంతాలను పిండుకునేదో!
సీతాకోక చిలుకల గుంపొకటి వనవిహారంకై వచ్చి
ఎద్దుల కొమ్ములకు రంగులద్దుతూ సరదాలాడేవి
తోవలో సాగుతున్న కచ్చురం
ముందు వెనుక కచ్చురాలకు
వర్తమానం పంపుతూ ప్రయాణపు భయ ఛాయల్ని పోగొట్టేది
ప్రయాణములో చల్లని నీరెండలు, పచ్చని దృశ్యమేళాలు

దాహం తీర్చే గిరకల్లేని ఊటబావులు - ఆత్మీయుల పలుకరింపులు
అడుగడుగున తారసపడేవి.

తాతముత్తాతల చరిత్రను పురావస్తు శాస్త్రవేత్తల్లా తవ్వుకుంటూ
ముచ్చట్ల ముల్లెలు విప్పుకుంటున్న అవ్వల మాటల్ని
వింటుంటే కొన్ని పిడీల (తరాల) అనుభవాలు గుండె గదిలో
ముకులితమై ముద్దాడేవి
ఉరుములు మెరుపులు ఆకాశంలో
భయంకర దీర్ఘ శబ్ద ప్రకంపనలు సృష్టించినపుడు
బిక్కుబిక్కుమంటు తలదాచుకునే ఊరపిచ్చుకలయ్యే వారిమి
చీకట్లు ముసురుకున్నపుడు కందీళ్ళు వెలిగించుకొని
రాతిరి జాగరణ చేసే వారిమి.
ఎద్దుల మూగల రవళులతో చీకటి బుజం మీది గొంగలయ్యేది
ఉదయ ద్వారాలు తెరుస్తున్న పాటగాడు
జీవితాన్ని పాటగా పాడుకుంటూ చేనుకు బయలుదేరుతాడు
మూడు రాళ్ళ నెత్తులమీద వంట పాత్రలు
ఏరుకున్న పుల్లలతో వంటలు సిద్ధం
పాపం చివరికి రాళ్ళు
జ్ఞాపక చిహ్నాలుగా మిగిలిపోయేవి.

కచ్చురంలో పయనిస్తుంటే
జీవితాన్ని అతి దగ్గరగా అనుభవిస్తున్నట్లుగా ఉండేది
అనుభవాల అనుభూతులు స్థిరాస్తుల్లా మిగిలేవి
నాకు నిద్రిస్తున్నట్లు ఉండేది
నిద్రలో స్వప్న విహంగంలో ఎగిరినట్లు ఉండేది
ఎగురుతున్న నా చుట్టు
ప్రపంచమంతా నెక్కరు పట్టుకొని నడిచి వచ్చినట్లు
కళ్ళు తెరిస్తే ప్రాకృతిక దృశ్య ప్రవాహం
కనుపాపల్లోంచి రీళ్ళు రీళ్ళుగా కదిలిపోయేది
గుంపులుగా గుంపులుగా తరలిపోతున్న మేఘాల పలుకరింపులు
విరిగిన రెమ్మమీద జంట గువ్వల గుసగుసలు

ఆకాశయానం చేస్తున్న కొంగలగుంపు
చూపుల ప్రసారాలపై శ్వేత శిలలు దాల్చేవి.

గాలి కదలికలకు చెట్లమేను వయ్యారంగా వంగుతూ పులకరించేది
చీకటి చెట్టుకు పూసిన నక్షత్రాల్ని లెక్కించినపుడల్లా
యిసుక మీద రాసిన బాల్యపు గుణింతాలు గుర్తొచ్చేవి.
కచ్చురాన్ని సింగారించినపుడల్లా
కాలం గుండెను పట్టుకొని ఊరేగినట్లు ఉండేది
కందైన కరువై, నోగళ్ళు యిరిగి, కమ్ములూడి
కోణార్క శిథిలాల్లా పడి ఉన్నాయి
కచ్చురం మ్యూజియంలోకి తరలించడానికి సిద్ధంగా ఉంది
తోవలన్ని వెడల్పులై వాహన కాలుష్యాన్ని ప్రసరిస్తున్నాయి
గత మధుర స్మృతులన్ని అప్రకటిత స్వప్న స్మారకాలయ్యాయి
కచ్చురం నాగరికతను మోసుకొస్తున్న మన రాయబారి!!

సూడంగ సూడంగ నెలలు పోయియాదుదులాయె లచ్చి,
ఏపాటి కాపటి ఎరరుకైతదని కారట్ల మీద కారట్లు రాస్తి
ఎన్ని రాపిచ్చిన మొఖం కనిపిస్తదా? పానం తీర్తదా?
ఏదో యింత సంసారం మీద రంది

అక్కడ ఎట్లున్నదని అడగ్గానే
గుండె దేవేశినట్లు - యిసిత్రంలా ఏదో బరువు మీద పడ్డట్టు
చెమటతో పెయి కొత్త చెరువౌతుంది. కన్నీటి చీకట్లు ముసురుకుంటాయి.
దారం తెగిన పతంగిలా మనసు. . .

మన బాధల బాగోతం నీ కెరుక లేంది ఏమున్నదిగాని, అయినా
నువేంచెస్తవ్. . .
ఒంటరి పిట్టవైతివి పిల్లల కోడివైతివి
సంసారం మీద రందితో పిసబిత్తిరి దానివైతివి
చిన్నోడ్కి ముదిరిన పోశవ్వ,
కర్దసం పట్టిన గుడిసెలో పెయిబొక్కలతో ఏసుతున్న ముసల్దాని దమ్ము
శెట్టంత ఎదిగిన పెద్దొడ్కి పెద్ద మండలా యిరిగిన ఎడమ శేయి
ఎట్లున్నా యేమోనని ఒకటే ఫికరు. . .

పిల్లల పానాలు తలుసుకున్నప్పుడల్లా
గుండె బేజారై పోతది కడుపుకుంతిని సంపుకుంటామా లచ్చి!!
నిన్నిడిసి మన్నిడిసి పరాయి దేశంలో కాలుపెడ్తి.

ఇక్కడి సంగతులంటావా. . .
పైసలకోసమే ఈ బతుకంతా అన్నట్లుగా. . .
పని మాటంటావా. . ఏంపనులో ఏమో?
ఊరిడిసి, దేశమిడిసి సూడని సముద్రాల్ దాటి
దేశంకాని దేశంలో పడితిని·
బొగ్గసుంటి మండుటెండల్లో

బొగ్గలచ్చే ఇసుక మైదానాల్లో
పుర్సత్ లేకుండా రాతం పని చేయాల.
అనకాలమెల్లి. . . సలికాలం గిర్రునే కుమ్మరి సారోలె తిరగవట్టె
మారంది మన బతుకులు మనకు పట్టిన యావ
బతుకు ఉట్టి యిలా నదుమంత్రం తెగుతుందని అనుకునాన్నమా. . .?
తిన్నది కాదు తాగింది కాదు
పుజూలుపుట్లె మునిగితిమి
ఎజెంట్లు బ్రోకర్లు మందిని ముంచే ముండ కొడుకులు

మన గరిబోళ్ళ ఉసురు తల్గి
ఎన్నటికైనా మట్టిలో పోతారుగాని. . .
ఈ పాణంలో సిలుకసుంటి రెండెకరాల
సెలుక అనామత్ అడ్డికే పోయింది
పుస్తెలమ్మినా తీరదన్న బాకి ఫికరు
ఎంచేద్దు ఎసరోతే మనసు కుతకుతలాడుతుంది.

ఇడియవ్వ! ఇక్కడి మనసులు తీరుకొక్కడు
మతలబెందో మర్మమెందో తెలుపడు
అర్థంకాని బాషలో అవ్వలక్కల ఉసురుపోసుకుంటడు
పైసల్లి పానంది యిసాబే లేదు
దినంలో దినార్లు పండకుంటే కుతి తీరదు
లచ్చి! దినాలు మంచిగలేవు యిగురంతోని ఉండు
నీ యిగురమే నిన్నిడిదాక సాగనంపింది
కైకిలో కలనో పోయి పొట్టపూర్త కమాయించు
ఏడినీళ్ళకు సన్నీళ్లు తోడన్నట్లు, సంసార కాండిని ఇద్దరు లాగినట్లు
ఉంటాను లచ్చి!! దప్పు జాగర్తా అటుకుమీద వెట్టు!!

# తెలిదేవర భానుమూర్తి

## ఆల్లు

సెట్టు కింద గూసోని
సుట్ట తాక్కుంట
అన్నా తమ్మీ అన్కుంట
కస్టం సుకం మాట్లాడుకునేటోల్లు
ఆల్లు
ఊరోల్లు
ఉన్నోల్ల మోసాల కన్యాలమైనోల్లు

బుక్కెడు బువ్వ దొర్కకున్నా
రెక్కలిర్గ పనిజేసెటోల్లు
ఆల్లింట్ల ఏడ్పు దాస్కోని దొరింట్ల నవ్వుల బండించెటోల్లు
ఆల్లు
ఊరోల్లు
ఏమెర్కలేనోల్లు

కుక్కలెక్క బత్కుతున్నా
మొర్గశాతగానోల్లు
బాంచెన్ దొరా అన్కుంట
బత్కులెల్ల దీసెటోల్లు
ఆల్లు
ఊరోల్లు

రేప్పొద్దుగాల్ల
గాల్లే
గా ఊరోల్లే
ఏమర్కలేనోల్లే
అన్నెర్క జేస్కుంటరు
పనిజేసిన కాడ్కి పైసలియ్యమంటరు

దొరింట్ల లెక్క
మా ఇంట్ల గూడ నవ్వులు బండాలంటరు
కస్టం మాదయితె
సుకం దొరదెట్లంటరు
ఆల్లు
ఊరోల్లు
దొరోల్ల మీద మర్ల బడెటోల్లు

# ఇగ ముంగల

ఏడ్వకు ఏడ్వకు ఏడ్వకుర కొడ్క
ఇగ ముంగలెట్లయిన ఏడుస్తనె ఉండాలె
పెద్దగైనంక
దొరోల్ల బర్లు నువ్వె గాయాలె
యాల్ల పొద్దుగాల్ల లేసి మోట గొట్టాలె
పంటలు బండించాలె
ఉపాసాలతోని బత్కంత ఎండాలె
ఏడ్వకుర ఏడ్వకుర ఎడ్డి నా కొడ్క
మీ తాత జేసిన బదల్
చుక్త జేసెతందుకు మీ అయ్య
దొర తాన యెట్టి జేస్తుండు
మీ అయ్య బదల్ నువ్వె చుక్త జెయ్యాలె
ఏడ్వకుర ఏడ్వకుర ఏడ్వకుర కొడ్క
దొర పొలంల నేను కలుపు తీయ బోవాలె
జోలెల పండుకోర కొడ్క
ఊకోర ఊకోర ఊకోర కొడ్క
ఇగ ముంగలెట్లయిన ఏడుస్తనె ఉండాలె

# సాటింపు

అద్కతిన్న ముసల్దాని సావు జేపిస్తున్నడు
దొర సావు జేపిస్తున్నడు
కస్టాల తడలసుంటి ముడ్తల పెయితోని
పొద్దుమీకె ఎలుగులున్న కండ్లతోని
కదుపుల పేర్కపోయిన ఆకలి తోని
"గింత బువ్వేయ్యవ్వా" అన్కుంట
ఇల్లిల్లు అద్కతిన్న ముసల్దాని సావు జేపిస్తున్నడు
దొర సావుజేపిస్తున్నడు
ఇయ్యాల్లో, రేపో కూలే పాత గోడసుంటి ముసల్ది
బత్కి సస్తున్నప్పుడు
"ఆకలయితున్నది దొరా" అన్కుంట
దొరింటికి బోయినపుడు
జీతగాండ్లతోని
"ముసల్లంజె నెల్ల గొట్టుండ్రిరా" అని అన్నోడు
మంది కదుపులు గొట్టి బత్కెటోడు
మందాక లెసుంటిదో ఎర్కలేనోడు
ఇయ్యాల్ల కొమ్ముతోని
దప్పుసప్పుడుతోని
ఎగిరెటోల్లతోని
ఆకర్కి ముసల్దాని పీన్గెతోని
అని పేరు సాటిచ్చుకుంటున్నడు
దొర సావు జేపిస్తున్నడు

# తోట మహాదేవ్

## సభ

పక్షులన్నీ
స్వేచ్ఛకోసం
ఆకాశంలో హాయిగా
విహరించాలని తాపత్రయపడితే. .
అడుగడుగున
వేటగాళ్ళ మూక వెంబడిస్తూ
బాణాలతో
బంధించాలని చూస్తుంటాయి. . .
పక్షులు ఎగురుతునే ఉంటాయి
నాగళ్ళు దున్నుతునే ఉంటాయి
శ్రమ శక్తి
చమటను దులుపుతునే ఉంటుంది
దూరాన విజిల్ చప్పుడు. . .
ఒక్కసారే దుమ్మంతా
మైదానాన్ని ఆక్రమించుకుంటుంది. . .
మైదానంలోని
గడ్డి పరకలు
గడి గోడల్లోని
చెక్క రవుతులు
మెదులుతూ. . .
కదులుతూ. . .
పూర్తి కదిలిక కోసం
గోడను పడగొట్టాలని చూస్తుంది
ఊరేగింపుతో
నినాదాలు
లాఠీలకంటె
ఎంతో ఎత్తు ఎదిగి పోతుంటాయి

మైదానంలో
వచ్చి వాలిన పక్షులన్నీ
స్వేచ్ఛ కోసం
ఊపిరి పీలుస్తున్న ప్రాణులన్నీ తిండి కోసం
తీక్షణంగా చెట్ల వైపు
చెట్లు తయారు చేసిన
స్టేజి పైకి చూస్తుంటాయి. . .
దుమ్ము రేగుతునే ఉంటుంది
విజిల్ చప్పుడు వినిపిస్తునే ఉంటుంది
కాళ్ళు చేతులు
విరుగుతునే ఉంటాయి.
తలలు పగులుతునే ఉంటాయి.
ఇంకాస్సేప్పయితే
తుపాకులు
గాలిని గాయపర్చాలని చూస్తుంటాయి
మైకు
గొంతు
మైదానాన్ని అందరగొడుతుంటాయి –
కాకీ బట్టలు
చెత్త కుండీలో
పారేసిన ఎంగిలి మెతుకుల కోసం
కక్కుర్తి పడుతూ. . .
రక్తం లేని మనుషుల్లా
జనంపై స్వారి చేస్తుంటాయి –
చెట్లు ఊపిరి పీల్చుకుంటాయి
చెట్ల కొమ్మలపై
పక్షులు
బాధపడుతూ మూల్గుతుంటాయి
గూళ్ళన్నీ చెదిరి కిందపడి పోతాయి .
రక్తం మైదానంలోంచి

గడ్డి పరకల్ని
ఇసుక రేణువుల్ని ఎర్రబరచి
మెల మెల్లగా
వేగం పుంజుకొని
ఎర్రజెండాల సవ్వడిలో
కాకీ బట్టల్ని
ఖద్దరు చొక్కాల్ని
పాతాల లోకాన తొక్కేస్తుంది
మైదానాల్ని
మనుషుల్ని
రవుతుల్లో ఉన్న నిప్పును పరామర్శిస్తాయి
ఈటెలు
కత్తులు
గొడ్డల్లు
తుపాకులు
చెట్లనిండా
నిండిపోతాయి
పక్షులన్నీ
పాటలు పాడుతుంటాయి
గడ్డి పరకల శిరస్సుల నిండా
మంచు నిండుతుంది
స్టేజీ పై
గొంగడి వేషం
ఎగిరి గంతేసి
గొంతెత్తి పాడుతుంది
వ్యాన్లు
లారీలు
తోక ముడ్చుకొని వెళ్ళిపోతాయి
అప్పుడు. . . .
భల్లున తెల్లవారి

ఆకాశాన ఇంద్రధనుస్సు
ఏడు రంగులకు బదులు
ఎర్ర రంగే
ముఖానికి పులుముకొని
అంతిమయుద్ధం కోసం సన్నద్ధం అవుతుంది!!



# తైదల అంజయ్య

## మోటబారి

ఒక కల మొదలవుతుంది
నీలోపలా, నాలోపలా మనందరిలోపలా
దానివెంట నడుస్తుంటాం అలిసేదాకా!
ఇగనువ్వు నడవలేనపుడు కలనక్కడ మోపుతావు
అది నెత్తురు మరకలంటిన బండరాయైనా సరే!
దారెంబడ్డి నడిచేవాడు ఆ కలనందుకుంటాడు
తప్పదు! మరణమొక అబద్ధం.
వెళుతూ వెళుతూ నువ్వు ఉప్పందించక తప్పదు
మరణం నిజమైతే మనమింతదాకా రాము
ఏదో ఒకరూపంలో తన ప్రతిరూపాన్ని
సృజించకుండా ఏదీ అంతరించదు.
మనిషిగానో, మనిషంత ఆశయంగానో
అన్నిటినీ మించిన ఆచరణగానో!
మన వెంట నడిచే వాన్నికి
ఒక కొనసాగింపును యిచ్చివెళతాం.
కలసాగిపోయినట్లే మనందరిమధ్యా,
రూపాయి చీకటి కమురు కురుస్తుంటుంది.
నిరంతరాయంగా, మనల్నిమనం తెలుసుకోనంతగా!
ఎప్పటికీ, అన్నిటా, అంతటా
అంతరం పెద్ద అవరోధం
. . . .
మంచె మీది నిద్రలో
మంచు గప్పిన రాత్రి బరువుగా కదులుతుంది
శరీరం సగం పక్క అప్పు తొలుచుకుపోతుంది
అధిక పీడనం వద్ద ఒక ప్రవాహం మొదలవుతుంది
పొలం కాలువలో నీటిచక్రం కన్నా
వడ్డీ చక్రం వేగంగా పరుగెత్తుతుంది.

నిప్పులు కురిసే ఎండా కాలాలను
వరికళ్లంలో చీపురుతో ఊడ్చి
చాటెడు బియ్యంతో యింటి ఆకలిని చెరిగేసిన
తల్లుల నుదుటి అరచేతిచూపులోంచి
ఎగిరిపోయిన వెలుగు పిట్టలు
పున్నమియెన్నీలోలె
పూసిన తంగేడు పూల ముఖాలు,
గోగుపూలు తెస్తామని
రాత్రికి రాత్రే కొండెక్కుతయ్.
బొడ్రాయి కాడ కడివెడు శోకాలు గొల్లుమంటయ్
సమజీవనం పుష్పించాలని చేండ్లనిండావెలిగిన
గునుకపూల నక్షత్రాలు బతుకమ్మలై వస్తయ్
ఊరిమీద ఎవని మంత్రం పారొద్దని
బైండ్లోళ్లు పొలిమేరచుట్టూ
నెత్తురు మెతుకుల పొలిజల్లుతరు.
ఊరిచావడి నడుమ
సాధన శూరులు కావలి నిలవడుతరు.
పోశమ్మ గుడి ముందటి పోతలింగడు
ఉడుం బలుపును యిగసైసనని
గావుకేకలేస్తడు.
ఊరి సెరువు మీద దోపిడీ వలస దేగల
వలల కన్నులు పడొద్దని
కట్టమైసమ్మ కండ్లెర్రజేస్తది.
నట్టనడిరాత్రి జలజలాదుఃఖించే
మృతనదుల దుఃఖాలను ఎవడువింటాడు?
మోటబారిలో నిలవడ్డ రైతుతప్ప!
నిశ్శబ్ద దుఃఖాలను చేదుకుంటూ
మోట సాగిపోతుంది
బావిలోకి వంగిన
తుమ్మకొమ్మల గూళ్ళనిండా
ఒక సామూహిక గానం మొదలవుతుంది.

# జాడవట్టే పిలుపు

ప్రత్యామ్నాయంలేదు
యిగ వేరే దారి లేదు
అన్ని దారులూ మూసుకుపోతున్నపుడు
ఇన్ని దాడులు చుట్టు ముట్టినపుడు
యిగ దప్పుదు నిండా మునగక తప్పదు

అందక పోవడానికది స్వప్నం కూడాకాదు. పచ్చినిజం!
పగటి కలలు కనడానికి
మనమున్నది వెలుగులోకాదు. కాళరాత్రిలో!

ఇంకా తెలవారలేదు.
చీకటికి భయపడటంగాదు
దాన్నే వ్యూహంగా మార్చుకుందాం
లక్ష్యం నిర్ణయించకా కాదు
మార్గం తెలియకా కాదు
ఎవరు నడిచిన దారి యిది?
ఎక్కడ మనం దేవులాడేది?
ఎక్కడిక్కడ నిలబడి, గిరిగీసుకున్న హద్దుదాటి.
ముందు నడిచే కాళ్లనునరికే నడుమంతరపు కుట్రలువదిలి
ఒక సన్నివేశంలో మనం కలిసే 'యాళ్ల' యిది
తప్పిపోయిన గొర్రెను వెదికే గాలింపులో వున్నం
ముసలి చింత కింద తిరిగే గానుగెద్దు కన్నులో
మన బతుకు చిత్రాలు తిరుగుతుంటయ్!
ఏడ్చీ, ఏడ్చీ ఎక్కిల్లు మిగిలినయ్!
కలుపుదీద్దామంటె కటిక నేల మిగిలె
యిగ మునుం బట్టే దేమున్నది? గెట్లు నాటుదే!
కోడిగూసేజాము ముసలయ్య దమ్ముపట్టే
చుట్టమీది కుంపటి మిణుగురు దీ.
పని మరసిన కొడుకును జాడవట్టే అవ్వపిలుపుదీ
ఇసుకలో 'కాసెపుల్ల' ఆడే పిలగాండ్ల దేవులాటదీ

ఒకటేతొవ్వ!

అది తెలంగాణా తెలంగాణా!

తెలంగాణా తెలంగాణా!



# దర్భశయనం శ్రీనివాసాచార్య

## ధాన్యం ముందు కూర్చుని

పొలాల్లో నాగలి వెనక నడిచి
నాగటి చాళ్ళలో పైరులా ఎదిగి
ఇవాళ నగరం అంగట్లో
నా ధాన్యం ముందు కూలబడ్డా -
నాగలి నాగరికతను పండిస్తుందని నమ్మా -
లక్షల ఆకలి మరణాల సువిశాల దేశంలో
నా ముందు ధాన్యం దయనీయంగా
ఇసుకకుప్పలా పడి ఉంది
ధర పలకదు ధర పలకదు
కూడగట్టి కూడగట్టి వేలుపోసి పంట తీస్తే
కడకు అంగట్లో దిక్కులేని దేబిరింత
కొనండి బాబు కొనండి అయ్యా
ధాన్యం ధాన్యం
ప్రాణంలాంటి ప్రాణంలాంటి ధాన్యం
సకలజీవచలనాలకు ఇంధనం ధాన్యం
ఎవరూ కొనరా ఎవరూ కొనరా
పొలాన్నిక్కడికి తెచ్చాను నా ముందు
ధాన్యంలా -
సంపద ముందు కూర్చున్న పేదరైతును -
ప్రాణం ముందు కూర్చున్న నిస్సత్తువని. .
మీ ఇళ్ళల్లో పొయ్యిమీద
తుకతుకలాడే అన్నమే బాబూ ఈ ధాన్యం
నేనిప్పుడు పొయ్యినే - మంట అగుపడదు
నా లోపల తుకతుక - పొంగు అగుపడదు
ప్రాణాన్ని పండించితెచ్చి
మీ అంగట్లో మరుగుతున్నాను
మీరేమో దర్జాగా వచ్చి ధాన్యం కుప్పన

కెలికి
ఈ మట్టేమిటనీ ఈ దుమ్మేమిటనీ
ఈ పెడ్డలేమిటనీ నాసిరకం నాసిరకమనీ
విసుక్కుంటూ కసురుకుంటూ పావలాకీ పరక్కీ
ధాన్యంపోసి పొమ్మంటారు
మట్టిలోంచి పుట్టుకొచ్చింది కదా ధాన్యం
మట్టంటదా ధాన్యానికి దుమ్మంటదా
మీ చూపుకి కంప్యూటర్ సోకింది
మీ దేహం ఏ.సి.కి. గడ్డకట్టింది
చలీ ఎండావానల్లో లేచి ఎదిగినిల్చి
తళతళా కళకళల జీవకాంతితో
వరిమొక్కలు ధారపోసిన ప్రాణహారాలే ఈ ధాన్యం
తెలుసు మీకు తెలుసు
ఈ ధాన్యమెలాగూ మీకే దక్కుతుందని
ఈ ధాన్యం లేకపోతే మీకు ప్రాణం లేదని!
ఇలా కూలబడీ కూలబడీ
డీలాపడి మీ చూపుల చివర్లకి వేలాడీ వేలాడీ
మరిగీ మరిగీ ఆకలికి చల్లారి ఆఖరికి తలొంచి
సరే బాబూ మీ ధరకే బాబూ అని
ఎలాగూ మీకే ధాన్యమప్పచెపుతానని
మీకు తెలుసు మీకు తెలుసు
వడ్లగింజ నుంచి బియ్యంగింజ అని
కనీసం తెలీనివాళ్ళు అధికారవేషాల్లో
అంగట్లో ధరల్ని తేలుస్తారు
ఇవాళ గిట్టుబాటంత పుచ్చుమాట
మరోటిలేదని ఖాళీ చేతుల సాక్షిగా
నేను చెప్పగలను
ఒక్క సాయగా నిఖార్సైన నాగటిచాలును
వేయలేని వాడు
యవసాయమ్మీద పొడుగాటి లెక్చర్లిస్తాడు

అసెంబ్లీలు దద్దరిల్లి మాకేంటి
సుభాక్షరాల అభయమాలల
ఉత్తుత్తి తీర్మానాల ఎండుతోరణాలు మాకేంటి
అంగడి మాకు పరాయిదైనపుడు -
మార్కెట్ భాషలో
నేనమ్మినట్లు మీరు కొన్నట్లు-ఒక లావాదేవీ -
కానీ రహస్యమేంటి?
మీరు ధాన్యం మీదుగా పదిమెట్లు పైకి -
నేను ధాన్యం జారి పదిమెట్లు కిందికి
పొలాలేమే పల్లెటూళ్ళో
అంగళ్ళేమో నగరాల్లో -
ఈ రాజకీయం నాకంతుపట్టదు
అంగట్లో ధాన్యం పోతుంది దైన్యం మిగుల్తోంది
కింది నుంచి లోతుల్లోంచి లేచి
మళ్ళీ నాగటి చాళ్ళ నేసేది నేనే
మీకు ప్రాణబీజాలిచ్చేది మళ్ళీ నేనే -
అగ్నికి కరువులేదు
నేను మంట కన్పడని పొయ్యిని
ప్రశ్నలుడుకుతున్న తుకతుకని -
పొలంలో తలెత్తి తిరిగినవాణ్ణి
మీ అంగడికొచ్చినపుడే పలుచనైపోయా -
మట్టిలో కలియదిరిగిన దేహాన్ని
పల్చబర్చిందెవరు? ధాన్యాన్ని తాలుగా చూసిందెవరు?
మట్టి బతికుంది నేను బతికున్నా
ధాన్యం దిక్కులేందవుతుందా
కోతలముందే కాదు
కోతల తర్వాత కూడా
పొలాలు కళకళలాడాలని కోరడం నేరమా
నా తుకతుక ఆవిరి కాదు
వుండిపోతా పల్లె తగ్గరే
కుప్పకొట్టిన పొలాన్నే అంగడిచేస్తా

ప్రాణం కావాలా బాబూ ప్రాణం కావాలా
రావాల్సిందే మీరంతా పొలాల్దగ్గరికే
పట్నమో నగరమో
క్యూ కట్టాల్సిందే పొలాల అంగళ్ళ దగ్గరే!
ధాన్యాన్నీ ప్రాణాన్నీ స్వీకరించి
నాగటి చాళ్ళలో నడిచివెళ్ళండి
నాగరికత మొదళ్ళెక్కడో తెలుస్తాయి
ధాన్యం మెరుపు పల్లెకు దక్కేదాకా
నాగళ్ళు కొడవళ్ళూ నాకు పనిముట్లేనా
ఆయుధాలు కూడా!

# దార్ల రామచంద్ర

## మట్టి పాట

మొల్ల రామాయణం రాసింది
ఈ మట్టి చేతులతోనె
ఆడది మహాగ్రంథం రాయట మేమిటి!
సనాతన సంప్రదాయం
ముక్కున వేలేసుకొని పక్కున నవ్వింది,
తరాలు మారినా మా తలరాతలు మారని
మట్టి మనుషుల బతుకులు
బువ్వ తినే చిప్పనుండి
మనిషి చివరి అంతిమయాత్ర
తలకొరివి కుండ - చిప్పపాత్ర వరకు.
నువ్వు మట్టి పాత్రల మహాశిల్పివి కానిదెక్కడ?
పేద మద్య తరగతికి ఎండాకాలపు ఫ్రిజ్‌వు నీవు?
నువ్వు కన్నతల్లి కర్తవ్యమై నిలవనిదెక్కడ?
మట్టిని నమ్ముకున్న నీ బతుకులో
బహుళజాతి ఆధునిక యంత్రమొచ్చె
ప్రత్యామ్నయ పాత్రల వెన్నో ప్రవేశపెట్టె,
నీ బతుకుగుండెపై కుంపటి పెట్టె
చేతి వృత్తి కుండల గుండెలు పగిలిన బతుకు
శిధిలాల జాడల నెతికి
బాద్యులెవ్వరో పట్టుకోండి చూద్దాం?
అంగట్లో అన్నీ ఉన్నా
అల్లుని నోట్లోశని అన్నట్లు
బతుకు తిప్పుకోలేని అడుగులు
ప్రత్యామ్నాయా ఉపాధి లేని బడుగులు
నా తెలంగాణ పల్లెబతుకు సమరంలో
తెగిన తలల కుండల కుటుంబాలు
ఆకలి తీరని మట్లి బతుకు పాట

ఆకలి తీర్చే మార్గం కోసం వెతుకులాట,
నా పల్లెలిప్పుడు కుక్కలు చింపిన ఇస్తరి.
కాలం – కరువు సందున ఇరికిన
దీన అవస్థల దీర్ఘ కవితలు.



డా॥ దిలావర్

## కోటిసంకెళ్ళ బందిఖాన!

కొమ్మ కొమ్మలో తెల్లని పావురాల గుంపులు వాల్తాయని
నాటిన నాటి విప్లవం. . . .
ఇలా నెత్తురు ముద్దలు పూస్తుందని అనుకోలేదు
ఉద్యాగాల పంట పండుతుందనుకున్న తెలగాణ మాగాణంలో
అసలు కంటే కలుపే పిచ్చిపిచ్చిగా మొలుస్తుందని ఊహించలేదు
ఇప్పుడెక్కడ చూసినా కోంద్రలకు కోంద్రలు మింగి
బతుకులకు చుట్టుకున్న కొండచిలువలు!
కనురెప్పల అస్వతంత్రావరణం చుట్టూ నాటిన ఇనుప చువ్వల మధ్య
నీటి బుడగల్లా చిట్లుతున్న ఆశల స్వప్నాలు!
పరాయితనం సిలువ మీద
రక్తరాగాలు స్రవిస్తూ
మౌనం దిగగొట్టిన స్వతంత్ర గళాలు!
నా తెలంగాణా!
కోటి సంకెళ్ళ బందిఖానా!
ఇప్పుడు దండకారుణ్యమంతా
తుపాకులు పట్టిన రుత్విజుల జీవన వేద ఘోష!
ప్రతిచెట్టూ తుపాకులు కాస్తున్న మృత్యుహేష
ఎక్కడ ఏ రొద్దు
ఎప్పుడు మందుపాతరై పేలుతుందో
ఎక్కడ ఏ రాత్రి ఎన్‌కౌంటరై
భళ్ళున సంధ్యారుణిమ కక్కుకుంటుందో. . .
ఇన్‌ఫార్మరనో - కోరియరనో అంతమవడం తప్ప
ఇప్పుడిక్కడ ఏ మనిషి పేరుకీ ఒక వ్యక్తిత్వమంటూ లేదు
నెత్తురు ముద్దగా మారిన నా తెలంగాణా!
ఇది ఏ విధ్వంస వైభవానికి ఆనవాలు?
కోటి రాగాలు పలికిన రతనాల వీణా!
ఇది ఏ వలసవాది అదృశ్యపు చేతివ్రాలు???

# దెంచనాల శ్రీనివాస్

## చిట్టెం లేదా సావు బంగారం

చెరువు నుంచి చింతకొండనుంచి
కొలింకొట్టంనుంచి ఉలిబాడిశె నుంచి
సుత్తి తిత్తిల నుంచి మట్టిబూడిద నుంచి
పుట్టిపోయిన జీవితమొక చిట్టెం

జాజిరి జాజిరి పాపా జాజిరాడ బోతె జొన్నిత్తుదొర్కె
జొన్నిత్తుదీస్కొని పట్నంకుబోతె పట్నంకుక్కల్ని
భౌభౌమనె అప్పుడే నావల్లు
ఝల్లుమానె ఝల్లుమన్నకాడ ఉత్సలు రాలె

కొలిం నమ్ముకున్నవు నువ్వు
నీ నెత్తురమ్ముకున్నది బతుకు
రెక్కల్ని నమ్ముకున్నవు నువ్వు
నీ బొక్కల్ని అమ్ముకున్నది ఊరు

పెండ్లం గిచ్చులె
కొడుకుగొట్టలె
కోడలెత్తెయ్యలె
మన్వడు మందుబెట్టలె
కక్కలె ఏర్గలె
బంగారం సావు

చీమచిట్టిర్కె చిల్క దుఃఖబాయె కాకికాలిరిగె
గద్దరెక్కిరిగె రాయిచెట్టు రంపాళమిరిగె ఏనుగు కుంభస్థలమిః
అత్తకు దుత్తంటుకబాయె కోడల్కి తెడ్డంటుకబాయె
మామకి మంచమంటుకబాయె నాకు పీనిగంటుకబాయె
నీయమ్మ బతుక్కనీ దెం. .. . . .. .

యెలక్ట్రిక్ మాటల్లేవ్. మంటల చేతల్లేవ్. జైండాకై ఎగిసిపడే
యవ్వనాల్లేవ్. పోస్టర్లంటిచ్చుడ్లేద్. గోడలు దూకుడ్లేద్
లాఠీ దెబ్బల్లేవ్. అంబరకోసం మొగుడ్నొదులుడులేద్, అమ్మా -
నాన్నల్నొదుడులేద్, పెండ్లాం పిల్లలనిడ్సుడులేద్, తుపాకులు
బట్టుడులేద్. ఒక వజ్రవాక్యం కొరకు వేయి రాత్రుల నెత్తుటి
వాంతుల్లేవ్. నిజం కోసం గుండెల బ్లాస్టింగుల్లేవ్. మెదడు
వల్కనోల్లేవ్. ఒక సిద్ధాంత రాద్ధాంతానికి కళాశాలలు, పరివారాలు

వూళ్ళు రెండుగా చీలుడ్లేవ్. జెండాను అవమానించిన శిరసుల్ని
సోడాబుడ్లతో పేల్చుడ్లులేవ్. వూరేగింపుల్లేవ్. నినాదాల్లేవ్. స్తనాలు
పిండేసినా, శిరోముండించినా, శిరసు నరికించినా పోట్లాడేవాడ్ లేడ్ పోరాడు
సంగాల్లేవ్. పథేర్ పాంచాలీల్లేవ్, పాల్‌రాబ్సన్‌లేడ్.
అర్ధసత్యల్లేవ్. మార్క్సులెనిన్ మావోల్లేర్. సోలెడు సోలెడు ధన్యాలో
ఆంధ్రావాళ్ళా దినాలో లేవ్. గోంగూర గో బ్యాక్‌ల్లేవ్. అమ్మాయిల -
క్కమీలేద్ అస్తమైథునాలవస్త్రంలేద్. ఒక్క పెండ్లంలేద్. ఒక్క
మొగుడులేడ్. నీతి నియ్యత్ లేదు.

ఒక ఉద్యోగం యియ్. వొక పీహెచ్డీ ఇప్పియ్. ఫారన్ ఫండిప్పియ్,
ఎన్జీవో పెట్టి విప్లవం తెస్తాను. నా ఒక్కడికే లోనిప్పియ్ విత్తనాలు
కొనుక్కుంటాను. నా ఒక్కదానికే డి.ఏ. పెంచు. ఒకసారి కుర్చీలో
కూర్చోపెట్టు. వొకసారి వేదికెక్కించు. జాకెట్ నలిగేట్టు బైక్ మీద
తిప్పు. కనీసం వార్డు మెంబర్నిచెయ్. నా పాట సిన్మాలో పెట్టుకో.
నాతో రాయించు. నా మీద రాయి. నన్ను హీరోయిన్ చెయ్. నా
పుస్తకం అచ్చేయించు. వొక ప్రాజెక్టు, వొక అవార్డు, వొక
కాంట్రాక్ట్, వొగ పెగ్గు, వొక చికెన్ సిక్స్టీఫైవ్, వొక మటన్ బర్గర్,
వొక మ్యాట్నీ, వొక చీరె, వొక మిడ్డీ, వొక ప్యాంట్,
వొక రూపాయి, వొక పైస.

ఈ రాత్రే కంప్యూటర్ నేర్చుకుంటాను. నీ పేరుతో
కవిత్వం రాస్తాను. నా మొగుడు లేనప్పుడల్లా వొచ్చి పోతుంటాను

(ఉన్నా) లేని మీ ఆయన లోటు తీరుస్తాను. పగలు నీతో హోమిస్తాను, రాత్రి నా పెండ్లాన్ని పంపిస్తాను. నీ శీఘ్రస్కలనాల్ని అంగబలాలుగా ప్రచారం చేస్తాను. రోజూ
నీ అంగాన్ని చప్పరిస్తాను. రోజూ కొంచెం నీ మలం తింటాను.



## ఉగా దుర్కొచ్చింది

ఊల్లె కుగాదొచ్చింది
ఉర్కిరాంఁడి. ఉర్కిరాంఁడి
ఊపిర్లు బిగబట్కోని
లేకుంట అగువడుక్కోని
ఉర్కిరాంఁడి, ఉర్కిరాంఁడి

మీ గుండె ఎన్క దిక్కుల
మన్నులేని మ్రోడ్ల శిక్కుల
మొరటు తనం మోద్గు నీడల
అమురతపు యిసం తాక్కుంట
కరుకుతనం శెర్కు మేస్కుంట
కూకున్నా రెందుకూ?
ఉర్కిరాంఁడి; ఉర్కిరాంఁడి;
ఇంతకు మునుపు, నిరుడు. . .
పాత యాడాది పోయ్యేటప్పుడు
ఎడ్సుకుంట నవ్వినం మనమంత
గట్లనే గ్గీ ఉగాదికూడ

నయనాల నార్కేలాలు
పగ్లగొట్టి
డక్కల డొకడొకల
డప్పులు గొట్టి –
పేగుల పాటలు సొన్నాయి
కుతికె గ్గట్టి
ఉగాది నూరేగిద్దాం రాంఁడి!!!

ఉగాదేం దెచ్చిందని
ఏం దేన్ది ఎందుకొచ్చిందని
అడ్గకుంఁడి! అడ్గకుంఁడి!!

మీరు మీ పేరు మర్శింద్రేమోనని
పెయ్యి మీద బట్టుందో లేదో నన్ను సోయి
మీకుందో. . .
లేదో నని ;
తెల్గు మాట్లాడొస్తొందో లేదో
నోర్లొంకర్లు పోతానయో ఎమో, అని
ఏన్గ లోలె ఉన్నరు. మల్ల
పీన్గ లోలె నడ్తాంద్రేందని
ముద్దు ముచ్చట సూద్దామని;
ఉర్కొచ్చింది
మనూరి కొచ్చింది

కాలం పకారం నడుత్తాన మని
కందకంల పడేటోల్ల లేపి
దెబ్బలకు మందు రుద్దేందు కొచ్చింది
తెర్లు గాకుంట, తెల్వి తెప్పించ డాన్కొచ్చింది.

ముల్లెలు, మూట లందిచ్చెటందుక్కు రాలె
కొట్లాటలు, శీట్లాటల శీదు ఊడ్సి
ఏకంగ శాంతం అల్కటానికీ రాలె!!
అన్నిటీక్కి కారనం మన్సు గాబట్కె
గది మార్చె తందుకొచ్చిం దుగాది.

తెల్గోన్వని
నీ పేరాజ్జేయ్యటాన్కొచ్చింది.
పతో నింట
పొయ్యి రాజెయ్యటాన్కొచ్చింది
ఊల్లె కుగాదొచ్చింది -
ఉర్కి రాంఢ్రి
ఉర్కి రాంఢ్రి !!

# లొటపెట

అసలది గాడిది.
నిమ్మలంగ, అనుకువగ ఓంద్రపెట్టి
బత్కులన్ని తెల్లంగ జేయిస్తనని. . .
అద్దమైన ఓట్ల గుద్దలన్ని పోలింగు సంటరు
సాకలి రేవు దాక మోస్కపోయింది.
'శాబాష్! నువ్వే మా పెబ్బువు' – అనంటుంది పెజ

ఇనయంగ
బయిరంగంగ
శిగ్గ లేకుండ
తను గాడిద నంటన్న – యాది మర్శి
దండేంయిచుకుని.
పోటువ దీయించుకుని
బాసలన్ని జేసి, సాటుంగ
అవినీతి కంపు బొందల్ల, రొచ్చుల రొంపుల
గుంటల్ల గుంటల్తోడి గంటల కొద్ది బొర్లిబొర్లి
తెల్లని శిరునవ్వుల బట్టల్తోడి బయిటి కొచ్చింది.

ఇగ అయితె, నిన్నియ్యాల. . .
దాని బుర్ర పెరిగింది.
ఎంబడెంబడే బొర్ర పెరిగింది.
ఏ పారిటీ కద్లించ కుంట కాల్లు తంబాలు, జేస్కుంది
అత్యాసతోటి మెడ సాపిసాపి పొడూగు జేస్కుంది
గదే గమ్మతు –
ఇప్పుడది గాడిది గానే గాదు – లొటపెట

గాడిది లొటపెట అయితదా అని
అనుమానమే ఒద్దు
రాజకీయం మందు దింటె, ఏది ఏదన్న గావచ్చు
ఇప్పుడైతె లొటపెట మన్సులను

మోసంతోని నమ్మించుకుంట
పని జూయిస్తనంట, అన్నం జూయిస్తనంట
దూప దీరుస్తునంట. . .
ఎడారి పనాలికల మీది నుంచి
అల్ల మంచితనాన్ని పైకి కిద్కి
ఈపు మీద ఊపుకుంట
ఓపికను నవ్వుపాలు జేసుకుంట
నిదానంగ షికారు వోతాంది.
పేగులు ఓపికతోని గిట్ట నర్కబడితే
రగతం మాడిపోతే
ఎండిన గొంతులనుంచి కమరు ఆసనొత్తే.
రక్త నాలాలల్ల దూప - పారితే
దూపల - సావు కనిపిత్తే.
దూప దీర్సు కుంటందుకు
జనం - లొటపెట పుర్రె పగలగొడ్తది.

# నందిని సిధారెడ్డి

## మేలుక

అందమైన పూలతో
ఎంతమంచి సమాధి కట్టింన్రు
నా గొంతుకు –
మరచిపోవటం సుఖమే
తెలుసుకోవటమే పెద్ద అశాంతి

ఉంగురాల మెరపురాళ్లు జిగేల్‌మన్నప్పుడు
ఏదోయాదికస్తది
తియ్యని చితులకింద కాలిపోయిన
బొక్కలుగా మిగిలిన
నన్ను దేవులాడుతున్నాను

మాటకు రంగులద్దిన మాయలోడా
నీకొంచెపుతనానికి
నామాట మంచం పట్టింది గదరా
దోసెడు రక్తమిచ్చి బతికిచ్చుకుంటా నామాటను –

పోరాటం పురుడు. పోసుకున్నోన్ని
కత్తులతో కొట్లాడొస్తద
కపట బ్యాజీతోనే కొట్లాడొస్తలేదు

కబ్జా
భూమిమీద నేసనుక్కున్న
మెదళ్ళమీన గ్గూసున్నవు గదరా
ఆయామ్మా, పార్టీలు మార్చిన మాయమ్మా
తుఫాను బాధితుల చీరలు దొంగిలించిన యమ్మ
సెంటిమెంట్లు మాట్లాడ్తుంది
భుజకీర్తులకు సెంగనెగిరిన మాయయ్య

సెంటిమెంటు అతుకుతుండు
కడుపు కాలికాలి మేం పాడితే
తెలుగుతల్లి ముక్కలయితదట
మా తల్లీ మాటల్ నేర్చినవ్ గదవే
మనిషిని ముక్కలు ముక్కలు గోసినప్పుడు ఏమాయె
ఒప్పందాల చేతిలో చెయ్యేసి చేసిన బాసలు
కాకులకు గద్దలకు ఏసినప్పుడు ఏమైతివే
వోయయ్యా
నాకాళ్ళకింది పంటపొలాన్ని అగ్గున సగ్గునకు కొని
ముక్కలు చేసి అమ్మినపుడు యాడవోతివిరా
జిల్లాను పేజీలు పేజీలుగా పాపినప్పుడు యాడవోతివే మాయమ్మా
ఊరిని తుకుడలు తుకుడలుగా
లారీల కెక్కించినప్పుడు యాడవోతివే మా తల్లి
వొత్తునా పోదునా సిలుకల్ల కొలికి
రాకు రాకు బంగారు మైసి
సిలుక పలుకులొద్దు
బంగారమడుగుతలేం
మాకు బువ్వగావాలె
మాకు బువ్వగావాలె

కిలో బియ్యంతో మాయవునం కొల్లగొట్టివి గదరా
ఉప్పేసి పొత్తు గూడిన దరమాత్ములారా
మాది సముద్రం ఉప్పు
మాది కన్నీటి ఉప్పు

శివరంజని అసావేరి రాగాల నీ సంగీత పరవశంలో మమ్ములముంచి
మా నీళ్ళు దోసుకెళ్తిరి
మనోళ్ళే కదా అని మా నోళ్ళు కొట్టుకుంటే
మమ్ములనీళ్ళకన్నా పల్చనచేస్తిరి గదరా
చేతులకు నూనెరాసుకొని ఉంటరు మీరు
మాతేడ పట్టువడుతరు

ఎంతయినా
పొగాకు గోదాములకూ
బొగ్గు బాయిలకూ ఢిల్లీ ఆస్మాన్ ఫరకుంటదిలే
కరెంటు ఎత్తుకపొయి
మా మోటర్లు గాలవెడ్తిరి
పొగాకమ్మి సార అమ్మి సినిమాల్దీస్తిరి
మా బతుకుల అగ్గి వెడ్తిరి

మన నేల ఒకటే మన జాతి ఒకటే అయితే
బతుకులొక్క తీర్గ ఎందుకులెవ్వరా అయ్యా
మన తల్లి ఒకటే అయితే
మాతృ స్తన్యమెందుకు దొరుకది
భారతం పుట్టిన భూమిలో పుట్టింద్రు గదరా
బద్దమాసి తనమెవలది?
దర్మతెవలది?
పలుకు పలుకున నునుగారాలు
బోల్తాగొట్టించె తందుకు  బడామాటలొస్తయిమీకు
ఖేల్‌ఖేల్‌మే ఫరక్ రహతా
హర్ జమానా అలగ్ హోతీ
యేఖేల్ ఔర్ నహి చలేగా

తెలంగాణ అంటెనే
తెలంగాణ ముక్కలయ్యేదుంటే
ఆ బంధమే వొద్దు
సేపయి తల్లి అసలే వొద్దు
తెలంగాణే మా రక్తం పంచిన తల్లి
ఏత్తునా పోదునా శంకుస్థాపనలు
రాకు రాకు బంగారి బాంచ
కళ్లముందు ఊచలుంటెనే జైలుకాదు
మనసును కట్టిపడేసే మాటకూడా జైలే
షామియానా చెక్కుతో
నా హత్యలను తుడువలేవు

సమాధులు తవ్వుకొని
నా మాటలు సరాయింస్తయి
జొన్నకర్రల జెండలు బట్టుకోని
మా సెలకలు జులూస్ తీస్తయి



# బతకపోయిన బతుకు

దారుశిల్పాల్లా నిలవడ్డ
మొండితుమ్మల కింద నుంచి
రుమాలు ధరించి పూర్వీకుడెవరో
నడిచిపోతున్న అలికిడి
మేకలు మేసి గలగలలాడుతున్న మనసు
నడవకేమి

ఒక సూర్యకిరణం విరిగి
చెప్పుల్లేని అరికాలుకు గుచ్చుకొని మొత్తుకుంటది
కొద్దిసేపట్ల నెత్తూరూ కన్నీళ్ళూ కలగల్సి
రుమాలు నిండా జ్ఞాపకాలు

ఇరవయేండ్ల కిందననగా పాడువడి
పెంకలు లేచి
పెండెరాలి
కూలికూలి
గడుసుగా నిలవడ్డ మొండిగోడల పక్కల
నిన్నట్నుంచి సంచరించిండు
మట్టిగప్పుకున్న చిక్కుల దువ్వెన ముక్కచూసి
ఉట్టి దిగని రంగుమారిన రిబ్బెన చూసి
కన్నీళ్ళు దాచి రోదిస్తున్న చాటపెట్టె చూసి
అతను తట్టుకోగలడా. . .

కార్తులు కార్తులుగా
చెట్ల చేతులకు పచ్చబొట్లు పొడిచే పురాస్మృతులు
పూదిచ్చిన కూరాడుకుండ పగిలిన పాత అంచు
గుండెకు ఛిద్రం చేస్తుంది
అనుబంధాన్ని చావగొట్టి
అసహాయంగ చూసే అసమర్థత
పొగచూరిన గోడ నానుకోని

తలకిందులైన పొయ్యి
జీవితాన్ని అద్దం పెట్టుకొని ఎక్కిరిస్తుంది

బతకవొయ్యి బావుకున్నదేమున్నది
ఒక్కపూట బువ్వకోసం
దేశదేశాలు తిరిగి దేవుకున్నదేమున్నది
ఈత తట్టకు బదులు
ఇనుపతట్ట మోసిందు
యిత్తులకు బదులు
పైసలు చూసిందు
ఈడ్సుకపోయిన చేతుల మీద మొయ్యలేక
కన్నతల్లిలాంటి పొలం రైను బెట్టిందు

తిరిగి తిరిగి తిరిగొస్తే మిగిలిందేమున్నది?
పుచ్చిన చేరెళ్ళ మీద స్వప్నం
తెగిపోయి మొలకు వేలాడే నమ్మకం
మోసపు మెరుపులల్లుకుంటున్న
మొండిగోడల మధ్య
బతికున్నాడు ఇంకా మొండిగా
పాలోల్ల వాకిండ్లన్నీ పొక్కిల్లే
వాడంతా వలస పోయినట్టు
ఇండ్లన్నీటికి తాళాలే
ఎంత సంచరించినా
పాతమట్టి నెంత రాసుకున్నా
కంటికింది నల్లటిమచ్చలు పోవు
గుర్తుపట్టే ఒక్క ముసలవ్వకు కండ్లు కన్పించయి
ఊల్లె ఉండనియ్యరు
బయట బత్కనియ్యరు
ఇల్లిడిసి ఊరిడిసి భూమిడిసి బతకవోతే
బతుకంతా మసకబారుతనే వున్నది
కూలిన గోడల కింద

ఏం దేవులాడితే ఏముంది
ఎగేసుకొచ్చే ఏడుపు తప్ప -
తొక్కులాటలో గట్టివడ్డ గడ్డిపోచలు తప్ప
ఎవలూకుంచుతరు

మొండితుమ్మల్ల
కూలినగోడల కింద కూలబడ్డ
అతన్ని గుర్తించిందెవరు?
నిద్రపట్టని కవి!
పొలుపడని పచ్చిబాలెంత తెలంగాణాపల్లెను చూస్తూ
ఎంతకూ నిద్రపట్టని కవి!

# ప్రొఫెసర్. ననుమాసస్వామి

## వాయిదాలు పడుతున్న విజయం

అస్తిత్వం కోల్పోతున్నామనుకున్నప్పుడు అసహనంగా
ఎదురు తిరగడం సహజమే
నూనూగు మీసాల నూతన యవ్వనం లోనే
తెలంగాణా పోరాటంలో దూకిన వాణ్ణి
పులికి దునక నేర్పడం, పాముకు పాకనేర్పడం
లాంటి శిక్షణ లేమీ లేనివాణ్ణి
కందిరీగలు దాడి చేసేది కూడబెట్టిన తేనని
కాపాడుకోడానికే కదా
ఎగిసే కెరటం, ఎగిరే గాలిపటం నాకు ఆదర్శం
పారే ఏరుకు ఎంత సహజత్వం?
ఘనీభవించే మంచుకు ఎంత స్వచ్ఛత?
కాలిన గాయాల మీద ఎన్ని నీళ్ళు కుమ్మరించిన
బాధ బాయదే
నా రత్నాల వీణ పరాయీకరణలో ఏ స్వరాలు
పలికినా సహించలేను
నేను నిరంతరం పోరాడే సమరయోధుణ్ణి
తెలంగాణా పతాకాన్ని తుపాలకిలా పైకెత్తుకున్న సైనికుణ్ణి
మూడు కోట్ల గుండెగాయాల్ని కాయానికి అతికించువాణ్ని
సెంట్రల్ జైల్ గోడల్నిండా నినాదాల్ని చుక్కల్లా వెలిగించిన వాణ్ని
విశ్వాసమొక్కటే మనిషిని బతికించలేదు గదా!
కుక్కజాతంత సహజంగా ఒకరికి లోబడి బతుక లేను గదా!
రాయి తాకిపడి ఊరు నాకు అయి రాదనే అసమర్థతని
దరికి చేరదీయని వాణ్ణి
తెలంగాణా సాయుధ పోరాటం నిన్నటి స్వప్నం
ప్రత్యేక తెలంగాణా పోరాటం నడుస్తున్న చరిత్ర
చరిత్ర సంస్కృతులే గదా జాతి గొప్పదనానికి ప్రతీకలు
గుడ్డలో ఎన్ని నీళ్ళు మూట గట్టి మోసుకొచ్చి పోసినా

గోలెం నిండదు

- ఆ 365 మంది వీరుల్ని కన్నతల్లుల కడుపుమంట లారవు

పొద్దు తిరుగుడు పువ్వేగదా భూమి సూర్యుని చుట్టూ
తిరుగుతుందని తెలిపేది
పాఠశాలల్ని పరీక్షల్ని బహిష్కరించి మా భవిష్యత్తుని
ఒక యేడాది పాటు వాయిదా వేసుకోలేదా!
హెచ్చెస్సీ మార్కుల పట్టికలో అన్ని '.......' గుర్తులే
వచ్చినందుకు సంబరపడి ఊరేగ లేదా!
పగలే కాదు రాత్రి పూట కూడా చెట్లు ప్రాణాల్తో నిలబడే ఉంటున్నాయి
కోంట్రేయడం గొర్రుకొట్టడం మోట తోలడంలోని
నైపుణ్యం చదువుల్లో సంపాదించుకోలేక పోయినోణ్ని
కలాలీకారిని అయినంత సునాయసంగా కలం కారిని
కాలేక పోయినోణ్ని
'నాన్ ముల్కి గోబ్యాక్' పోరాటం న్యాయ సమ్మతమేనన్న
సుప్రీం తీర్పు ఇప్పటికైనా అర్థం కాలేదా?
మా పల్లెల నడుమ గుంటూరు పల్లెలు ఊడల మర్రుల్లా
విస్తరించుకుంటూ రాలేదా?
ఫిలింసిటీలు, గార్డెన్లు, డైరీలు, పార్కులు ఒక్కటేమిటి?
అన్నింటి పేరా 'మాభూమి' హారతి కర్పూరమవుతుంది.
బల్దియా బ్యాలెట్‌లో నాగలిపట్టిన రైతు చిరునామే గల్లంతయింది
33 ఏండ్ల క్రితమే విజయానికి దగ్గరై వెన్నుపోటుకు గురైన వాణ్ణి
నా ఆలోచనల మీద నాకే సందేహం
నా విజయం మీద నాకే అపనమ్మకం
గతాన్ని తల పోసుకుంటూ దిగులుగా బతుకుతున్నవాణ్ణి
జాజిరి జాజిరి జాజిరిపాట, పాట పాడరో గాజులపాప అంటూ
ఆడాలనిపిస్తుంది
హోళిరె హోళిరె రంగ హోళీ చెమ్మకేళిరె హోళీ అంటూ
ఎగరాలనిపిస్తోంది
బతుకమ్మ ఆట సద్దుల పండుగ నాడు కఱ్ఱ గొట్టాలు పట్టుకొని
ఆడిన సరసం గుర్తుకొస్తుంది
నాపాట నా ప్రాంత మంతా నిశ్శబ్దతరంగం లా లీనమైపోయింది

నా కళల్ని నెమ్మనెమ్మదిగా నేను మర్చిపోయేట్టున్నాను
ఉద్యమ గీతాల్నయినా గుర్తుకు తెచ్చుకొని ఆలపించాలని ఉంది
పదం పదం కల్సి కదంకదం కల్పిగీస్తే గెలవలేమా?
విజయం ఎప్పటికైనా తథ్యం కాకపోతేవాయిదా
పడుతుంది తప్ప.



## ఇంద్రవెల్లి ధనుస్సు

ఈదరగాలి అసహనంగా
ఆకులు తుంచేయబడ్డ చెట్టును తాకుతూ
విషాదంగా మూలిగింది
పారిపోయిన వాహనాల చక్రాల చారలపైన
కళ్ళు క్రోధం కక్కినయ్
అధికారం చేత అవమానించబడ్డ ఒళ్ళు
పుళ్ళయి సలుపుతూనే వున్నది –
చెరచబడ్డవృక్షం దౌర్జన్యాన్ని తలుచుకొని.
మునిపళ్ళతో గర్జిస్తున్నది
'తుడుం' పిలుపు గాలి చెవుల్లో మోగుతూనే వున్నది
హన్నా –
కడుపుల్లోకి చీల్చుకుపోయిన బుల్లెట్ల బాధలకన్న
నేల తల్ల నుంచి ఎడబాటు చేసే కుట్ర బాధాకరమైనది
సంఘటితమైతేనే సహించలేని కుట్ర యిది
కానీ, సమిష్టి జీవితతత్వం జనం నరనరాల్లో
తరతరాలుగా పారుతూవున్నది
దాన్ని ఆపేందుకు బుల్లెట్లతో ఆనకట్టను కట్టలేరు
చక్రవర్తుల మరణశాసనాల్ని మరొక్కసారి చదవండి.

. . .  . . .  . . .  . . .

జులుం సహించని ఎలుగెత్తిన గాలి
జులూస్ తీసేందుకు సిద్ధమై నిల్చుంది.
గూడెం గూడెం సుడిగాలై గూడుపుఠాని కుట్రను
పడగొట్టేందుకు సన్నద్ధమైనయ్
దౌర్జన్యానికి గుర్రై, కన్నబిడ్డల్లాంటి
ఆకులూ రెమ్మలూ తుంచేయబడ్డ వృక్షం
విహ్వల విషాదగీతం మాని, గుర్రున ఉరిమింది

లోలోపలికే యిన్నాళ్ళూ చూస్తున్న దృష్టి
లావాలెక్కయి రెక్కల్నివిప్పింది
అక్షరం ముక్కా రానోళ్ళముందు కూడా
యిందిరా జాలం తుక్కు తుక్కయింది.
పిస్తోల్ పిచికారీ చేసిన గోండుల నెత్తురు

. . .   . . .   . . .   . . .

ఆకాశం అద్దంలో
సారించిన విల్లులా యింద్ర ధనుస్సయి
కూకటి వేళ్ళతో ఈ వ్యవస్థను కూల్చేందుకు
పడనున్న బీభత్స కుంభవృష్టికి
సంకేతంగ మెరుస్తున్నది
న్యాయం - అన్యాయం మాత్రమే తెల్సిన గోండులు
బతకడమో - చావడమో మాత్రమే తేలాలని తెగిస్తున్నరు.

## మధ్యవర్తి చేతుల్లో రైతూ, కవి!

రైతుగారూ. . .!
నీ నిరాశాన్వేషణ మా అక్షరాలకూ వుంది
నాగేటి చాళ్ళలో భూదేవి చుట్టూ ప్రదక్షణలు చేసి
మట్టితో మమేకమై పెనవేసుకున్న చెమటతో వస్తావు
నీ మట్టిపాదాలే భక్తిపాద కుసుమాలు
మట్టితో పరవశించే నీ చేతిపంటను
మా సన్నసన్నని పూరేకు వ్రేళ్ళతో నీ స్మృతిగింజల్ని
మా గొంతులో జారవిడుచుకుంటాం
నీ ఘర్మజలం మానవాళి అభిషేకానికే కదూ!

నీ మీసం, చేతిలోని కట్టె, భుజానికి వేళ్ళాడే గొంగలి
పగిలిన మరకలు, వాడిన చెంపలు, కళ్ళూ, కన్నీడి జలఖడ్గాలు
మా అనుభూతుల్లో చెక్కుచెదరవు -
వర్షపు చినుకుల వరిమొక్కల కొనలపై
తలపాగ పరచుకొని పచ్చనాకు సాక్షిగా పాడే నీ పాటనీ
పగుళ్ళు బారిన భూశవంపై పడి
విలపించే నీ దుఃఖ తంత్రుల్నీ
ఈ దేశ మరణనాదంగా భావిస్తాం
నీ రెండిన బావిలోంచి, నీవు గొంతెత్తి అరిస్తే
మేము నీలానే దేశమంతా అరుస్తాం
నీ వేషం వేసుకుని బుర్రకథల్నీ జక్కుల కథల్నీ కోలాటాల్నీ
అవసరమయ్యే శతసహస్ర జానపదాల్నీ పాడుతాం
మా అక్షరాల్ని దున్నే నాగలివి నీవే
మా భావాల్లో కాలుతున్న గుడిసె నీదే
మా నినాదాల్లో తేలే గ్రామాలు నీవే
ఇంకా నీ శవాన్ని ఊరేగించేప్పుడు కూడా కాడిమోస్తాం అగ్గిపడతాం
సమస్త జానపద కావ్యరస జలాల్ని కుండల్లో నింపి

సమాధిచుట్టూ తిప్పి కాళ్ళకాడ పారేసి మొత్తుకుంటాం
కాకులకూ గద్దలకూ అన్నపు ముద్దల్ని పెట్టి
నీ నెరవేరని కోరికల్ని ఒక్కొక్కటే అడుగుతాం

బతకలేక మద్యం తాగి కుంగి కృశించి నశించావుకదా
పొలం గట్టున కూర్చొని బతుక్కోసం బాధపడే వాడివి కదా
చెరువు గట్టు చేరి గేదెల్నీ దూడల్నీ కడుక్కుంటూ
పెళ్ళాన్నీ పిల్లల్నీ కడుపుమంటల్నీ తలపోసే వాడివికదా
మొన్నటి వరదల అలలపై శవాలు శవాలుగా
తేలివచ్చిన న్యూస్‌రీల్ నీవాళ్ళదే కదా!
పిచ్చివాడా!
నేలను నయనంలా నమ్ముకునేవాడా!
మేమూ నీలానే నీ దుఃఖ జలాశయాల్ని నింపుకుని
సంతాపసభలు బాష్పాంజలులూ ఘటించడం తప్ప
మిగిలిందేమిటి చెప్పు!
మధ్యవర్తుల కబంధహస్తాల్లో నువ్వు అనాదరించబడుతున్నట్లే
మా యీ జనజీవన సాహిత్యమూ
అనాదరణ వాఙ్మయమే బాబూ 'అనాదృత వాఙ్మయమే. . .

# చేలోకి పురుగులొస్తున్నాయి!

పగులుతున్న పత్తిమొగ్గల కాలమిది
చిట్లుతున్న దూదిపూల రోజులివి
రాత్రంతా రెప్పవాల్చని నక్షత్రాలు
సూర్యోదయ మవ్వగానే
పత్తిచేల పరుపుపై వాలిపోతాయి
తారలా వెలిగే ఒక్కో పత్తి మొగ్గ కూడా
ఆకాశపు చేనుమీద
వెన్నెల నవ్వుల్ని వెదజల్లుతూ ఉంటాయి
నాకు మాత్రం
నీలాకాశపు పంటపొలంలో కళ్ళువిప్పిన తారలకూ
నేలఒడిలో విచ్చుకుంటున్న పత్తిమొగ్గలకూ తేడా అగుపించదు
భూమ్యాకాశాల మధ్యన అద్యంతం వెలిగే ప్రతిరూపాలివి
అయినా కాస్సేపు తారలమాట మరచిపోదాం
మరికాస్సేపు పత్తిచేల ఫ్లాష్‌బ్యాక్ కథల్ని వొదిలేద్దాం

ప్రస్తుతానికి
ప్రాణాపాయ స్థితిలో వున్న పత్తి మొగ్గలకోసమే ఈ సమావేశం
బతుకంతా ధారపోసే దూదిచేల మీద
పాషాణ విషం దట్టించే పత్తి పురుగుల దాడి ఆగేట్లు లేదు
పత్తిమొగ్గా! పత్తిమొగ్గా!
రెప్పి విప్పాల్సిన వయసులోనే రెప్ప మూయాల్సి వచ్చె కదా!
హఠాత్తుగా కాటేసే పత్తిపురుగు ఓ కన్నీటి బొట్టైనా రాల్చదుకదా!
దయరాని దయరాని దయరాని
దూదిమొగ్గలమీద దయరాని. . . !
నల్లటి దూదిగింజ తెల్లటి పాలపొంగు అయ్యిందంటే
పంచభూతాలతో కలిసి పెంచిన రైతు కూడా
ఓ పత్తి మొగ్గేనని విశ్వసించాలి విశ్వసించాలి!
అనునిత్యం మన అంగాంగాల్ని కప్పే ఈ దూదిగుడ్డలు
ఏ పత్తిమొగ్గలో వొత్తిగిలి పెరిగాయే గమనించాలి గమనించాలి

పాల పొదుగుల్ని పితుక్కున్నట్లు
ఈ దూదిపోగుల్ని కూడా
ఎన్నిమార్లు పితుక్కున్నామో శోధించాలి శోధించాలి
మన ఈ దేశంలోని ప్రతిఊరు ఓ పత్తిచేనే
ప్రతి గుడిసె ఓ పత్తిమొగ్గే
నిలువెత్తు కాలిపోయే కొవ్వొత్తి దారం కూడా ఈ పత్తిమొగ్గలదే
ఐనా, పాలించే రాజకీయమే పత్తిపురుగు అయ్యింది కదా!
దయరాని దయరాని దయరాని
దూది బతుకుల మీద దయరాని దయరానీ . . .!

దూది మొగ్గా! దూది మొగ్గా!
మా కవుల ముడిదూదిమేడవి నీవే
మా కావ్యం సూదిలోని దారానివి నీవే
మానవ కళ్యాణానికి మంగల సూత్రానివీ నీవే
మా మంచం మీది పక్కబట్టలూ
మౌనంగా నలిగిపోతున్న తలదిండ్లూ
తెగిన చెప్పుల్ని వొడిన చేర్చుకున్న దారప్పోగులూ
ఇలా అన్నీ ఈ దూదిమొగ్గల దేహాత్మలే కదా!
నల్లటి నేలపొరల్లో అదృశ్యమైన దూదిగింజా
మా బతుకు పొరల్లో భాగమై బతుకుతున్నావా!

పత్తి మొగ్గా! పత్తి మొగ్గా!
అంతులేని నీ బాధల సవ్వడుల రికార్డు వింటా!
నిన్ను హింసించే
పత్తి పురుగుల మృత్యుకావ్యాన్ని రాసి నీకంకితమిస్తా!
క్షణ క్షణం మా బతుకు చేలో పుష్పించే నెలవంకవి నీవే!
నేల గర్భంలో తడిసిన చమురువత్తివీ నీవే
ఆద్యంతాల్లేని
మా దేశం దివ్వెలో వెలిగే అరుణతారవు నీవే!

# పగడాల నాగేందర్

## గోస

మీ గడీల దర్జాలకు
మీ రగతమద్దిన గులాపోళ్ళం గాద్ర
దొరల బంకుల్లో
తరాలు బేగారి జేసిన
బాంచెను బతుకులు గాద్ర మావి!
మా కులపాడోళ్ళ గుంజిన
మస్తెక్కిన మా దొరతనాల యాద్మరచి,
దొరసాన్ల కచ్చుడాల ముంగలురికిన
కాళ్ళు గావ్ర మావి!
కరణపు దొరతాన
అంగుష్ఠ నిషాలొత్తి
ఆని జిత్తులెక్కల సుత్తి పొరలల్ల
సిక్కు బడ్డోళ్ళం గాద్ర
దొరల తోపులల్ల కాయలు బోయినా
పటేండ్ల చేన్లళ్ళ గింజలు మాయమయినా
గరీబ్ బతుకుల షికాయత్‌లు మోసి,
మస్కూరోళ్ళ చేత మక్కలిరగదన్నించుకున్నోళ్ళం గాద్ర
"నీ బాంచెను కాల్మొక్త" అని
ఏండ్ల తరబడి – దినాం బేగారం జేసిన
నసీబ్ మారనోళ్ళం గాద్ర!
మీ కాళ్ళ కింద – కచ్చుడాల కింద
పూర నలిగిన గులాపోళ్ళం గాద్ర
హుజూర్‌ల ఫర్మానాల్లో
జామీన్లే లేనోళ్ళం గాద్ర
ఎట్టే ఎర్కయితది గాని,
మా మొహాలకు ఎగుసం ఎర్కయితాది?
మునాపకిచ్చే మక్తగింజలెర్కయితాయ?

మీ తీర్న - ఎవడి పెండ్లాం సొమ్మన్న
జమాయించెటోళ్ళమా?
ఎవడి సెమట గింజలయిన
గాదెలల్ల నింపుకున్నోళ్ళమా?
మీ జామీన్లల్ల - ఎట్టి బతుకులెల్ల దీసినోళ్ళంగాదె!
మీ దొడ్లళ్ళ గొడ్లయి మసిలినోళ్ళం గాదె!
మీ గలమలకు బొట్లయినోళ్ళం గాదె!
మీ అకిట్లళ్ళ సొన్పయినోళ్ళం
థూ నీ యవ్వ!
మీ గడీల సీకటర్రలల్ల
కావరమెక్కిన మీ దొరల కామానికి
తనువు నెత్తురైన
ఆడబాపన్లం గాదె!
అయ్యెవడో తెలియక
మనుషులమై బుట్టి కూడ
అలికీ కులపోళ్ళమై
మీరూసిన ఎంగిలి గతికి - బతికే
కుక్కల మైనం గాద్ర ఇన్నాళ్ళు
'కళావంతులుగా' సీకటి మురికిల
మైలబడ్డ బతుకుల్ని -
దళిత వాడల్లో ఆరేసుకుంటం!
మా ఎనకబడ్డ కులాలోళ్ళ గోసంతా
గియ్యాల రాచపుండై సలుపుతోంది!
మొన్న 'నిజాం'ల
నిన్న 'కాంగీ' రాజుల
యియ్యాల 'ఆంధ్ర' హుజూర్‌ల
ఫర్మానాల్లో
బతుకు బండలయిన
తెలంగాణ గోస గాద్ర మాది!
కాల్వలొస్తయని,
సర్కారోళ్ళిచ్చిన బంజర్లు సల్లంగ బండతయని

తాతల కాలం నుంచి
తప్పియకాని పంచాయితీలల్ల
దండ్గలు గట్టి దావాలు మోసి
తనువులు నవిసిన బతుకులాయె గాద్ర
చేతి కందేట్లు నీళ్ళు బారే గడ్డలో
మీ మోచేతి నీళ్ళు తాగే బతుకులాయె గాద్ర!
చినుకురాలకున్నా - ఫసల్ పండకున్న
చితికిన బతుకెట్లెళ్ళదీస్తున్నవని
ఇన్నొద్దలసంది
అర్సుకున్న నాథుడు లేకపాయె!
గియ్యాలతక్లీఫొచ్చిననాది,
మా బతుకులల్ల తక్లీఫు ఎయ్యాల్టిసందో వుంది!
మీ జామీన్లొద్దు-జెండాలొద్దు
ఇజ్జత్‌లోని మీ రాజకీయ ఝగ్డాలొద్దు
మల్లింకో పొద్దు
గీ పోతుగడ్డను
దొరలకో-రెడ్డకో 'గడీ' గానీయం!
మళ్ళింకోపాలి
మేం జీతగాండ్లమై ఎట్టిజేయం!
మా బతుకుల బుగ్గిజేసిన-సీకటి గడీలకు
గియ్యాల రేగ్గంపగొడుతున్నం!
అరుగాలాల కష్టానికి
కాయం కాయలు గాసినా,
మేమెందుకు పచ్చగాలేమో
గియ్యాల్నే మాకు సమఝయ్యింది
జరిగిన అన్యాలం దల్సుకుంటే
ఒళ్ళంతా గరమైతాంది!
గా పురుటినొప్పులతోనే
గీ నేలంతా నెత్తురు గుడ్డవ్వాలనే
సొకలి అయిలమ్మలమై సిందేస్తున్నాం!
దొడ్డి కొమరయ్యలమై శివాలెత్తుతున్నం!!

# దేవులాట

అరక కదలని నేల మీద
ఆశల అడుగు లెక్కడివి?
మట్టిని రూపాయిలుగా
మల్చుకున్న వాడికి తెలుసు
నేల తల్లి రొమ్ముల్లో
నెత్తురును పిండుకునే రహస్యం

నా కలలో వేలాడే ఉట్లను గొట్టే
మర్మం తెలిసిన వాడా!
ఇయ్యాల, పక్కున పగిలిన
బోనం కుండరా నా బతుకు

జానపాడు సైదులుకు - మెదకొరికి బలిచ్చిన
మేక పోతరుపు - నా గొంతులో

జాతర జనంలో మునిగిన దేవుడెక్కడ?
పరుగులెత్తిన రంగుటెద్దుల బండ్ల దుమ్ముకు
మురిసిన కట్టమైసమ్మెక్కడ?
ఉట్టి మునిగి, ఊళ్ళే మునిగాక
కాకి తప్పుడవైన నా తుంగ గుడిసె ముందు
కన్నీళ్ళతో అలుక్కుంటాను!

చెంబు తపాల సంకనెత్తికొని
రజాకార్ల దాడులకు ఊళ్ళొదిలిన
నా తాతల వారసత్వం యాది కొస్తుంది
గత్తరచ్చిపడ్డద్దు - మీద బడ్డ
గీ పులిచింతల కట్ట కింద
తెల్లబోయిన నా బతుకు కల్లం తోడు
ఆడికి పండేకి పచ్చనోట్లే!
నక్కజిత్తుల తెలివితో

ఏలిముద్ర ఎయ్యకుండానే
నా బతుకును
వీలునామాగా రాయించుకున్నోడా!
నీ వాడిన జూదంలో
నా ఊళ్ళకు ఊళ్ళే
బతుకమ్మలై తేలడం తల్చుకొని
ఎర్రిగా నవ్వుకుంటున్న!

నమ్ముకున్న ఆలిని
రెక్కలు రాని గద్ద గాళ్ళనీ - నెత్తికెత్తుకొని
ఇయ్యాల బతుకు దెరువుకు
ఏడ్నని దేవులాడను!

(నల్లగొండ జిల్లాలో పులిచింతల ప్రాజెక్ట్ కింద ముంపుకు గురయ్యే గ్రామాల ప్రజల వేదనతో గొంతు కలిపి)

# జోలి

మోదుగు డొప్పలో వెన్నెలను జుర్రుకున్న గీ నేల
సలుపుతున్న సనుబాల తీపిని
మేస్తుంది!

నెత్తుటితో తడిసిన
తంగేడు పూల వనంలో
జీరబోయిన బాలసంతు పాట
గుండెగూటిలో గువ్వై ఒదుగుతుంది

అంటరాని జాతంతా అలలుగా
కదుల్తుంటే
మట్టి పొత్తిళ్ళలో తల్లి
మాయిని నెమరేస్తుంది!

గడప గడపకు జోలెలో నింపుకున్న కన్నీళ్ళు
లిపిలేని బాధను మోస్తున్నవి
ఆకులు అల్లల్లాడుతున్న గీ అడవంతా
కొలుపు గుంతల్ల వెండి కొడవళ్లై పూస్తుంది!

మట్టి పాత్రలు బీటలెత్తినప్పుడు జీవితం ఓ పాచి మడుగు
బుడుంగున మునగాలి
కైగట్టిన పాటకు
డప్పుమీద దరువు మార్చాలి
కులపు ఊబిలో అల్లుకుపోయిన నాచుమధ్య ఎంతకాలం,
జలపాత ప్రవాహాలమై సాగాలి!

అర్థంకాని యుద్ధంలో
ఆశల నిచ్చెనలు జార విడుచుకున్నాక
పొలాల్లో పరిగలేరుకుంటున్న కలల్ని
ఈ నేల ముఖచిత్రంగా ముద్రించాలి! కాసేపన్నా - కిరీటాల్ని

కీర్తిగానాల్ని
పక్కకునెట్టి
తడి నెత్తడినే పొదుపుకోవాలి

కవిత్వంలో జీవితంలో
సాకబోసిన కన్నీళ్ళనే ప్రేమించాలి
తగలెట్టాలి - కసిగా
దొల్ల కవిత్వాల్ని - కపట ప్రేమల్ని!

పుష్పించాలి కొత్తగా
ఓడిపోయిన వీళ్ళకలల్లో
వెన్నుపాములమై.
నెత్తురోడుతున్న మోదుగుపూలమై!

ఈ మట్టి మొలచిన ఆత్మల్ని
మల్చుకొచ్చిన కన్నీటి కాలం
వెయ్యేండ్ల గాయాల్ని
కెలుకుతుంది

ఇప్పుడిక - బోనం కుండల్లో
చేయిజొనిపి తిన్న
వెన్నెల ముద్దల్లేవ్!
జాతరలో వేలాడదీసిన
చిలుకల దండల్లేవు!
దరిద్రాన్ని మరిపించిన మోట పాటల్లేవు!

బుగులు బుగులైన ఈ నేలంతా
ఏ తల్లి సాపెనో
ఈ పీనుగుల పెంటల్లో
జంగపోళ్ళమై తిరుగుతున్నం
బొందల గడ్డలకు కాటి పాపలమై
కాపలా కాస్తున్నాం!

నెత్తిన మన్ను బోసుకొని
కడుపు కొట్టుకుంటూ
భోరున ఏడ్వడమే మిగిలింది గీ గడ్డకు

ఇప్పుడు
ఈ భూమిలోంచి ఎక్కడ పిడికెడు మట్టి తీసుకున్నా
ఒరిగిన వీరుల కనుగుండ్లే కదలాడుతున్నాయ్!
నుజ్జునుజ్జయిన
జీవాల ఆత్మకతలే విన్పిస్తున్నాయ్!!



# పత్తిపాక మోహన్

## తెగినపోగు

నేతన్నా! నీ చేతిమీద
మల్లెమొగ్గలై పూచిన
'శ్యామసుందరాలు' 'తెల్లబుగిడీలు'
సీతాకొక చిలుకలై విరిసిన
'మీనా'లు 'యిరుకులు' చీరలు
కన్నీళ్ళకు తడిసితడిసి మొద్దైపోతున్నాయి

సంపాదించే చేతులు
గంజినీళ్ళు పోస్తాయని
ఎముకల గూడు తండ్రి
ఎండిన డొక్కతో తల్లి
ఆశగా భార్యాపిల్లల ఎదురు చూపు

అన్నం పెట్టిన చేతులైనా
'ముట్టి' పట్టి నేసిన చేతులైనా
బీడీలని నమ్ముకోవాలి
తంబాకు గుండెనెంత దహించివేస్తున్నా
క్యాన్సర్ కబళించినా
తెమ్మర్లు తెమ్మర్లుగా తేలివచ్చిన ఉన్ని
ఊపిరితిత్తులకు అడ్డంపడి
గుండెల్ని మండిస్తుంటే
కలలన్నీ 'దింపుడు కళ్ళం' కాడి
ఆశలయ్యాయి
చేసిన కష్టమంతా
దావఖాన ఖర్చుల కయ్యింది

గరిమనాభి కోల్పోయి
చల్లాచెదురైన ఇల్లు

కార్ఖాండ్ల 'కండెల మిషినీ'
'పుంజాలన్నీ' తప్పుపోకుండా లెక్కకట్టినా
ఆఖరి బద్దె రాకముందే
వమ్మైపోయిన ఆశలు
'ఈనె'ల నుండి యీగీయీగీ
'పలక' పోట్లకు తట్టుకుని
కండల్ని కండెలు చుట్టి
నరాల పోగులకు రక్తాన్ని రంగు పూసి
చచ్చీచెడి నిలబడితే
ఆకలి చావులే శరణ్యమయ్యాయి

నిన్న పురుగు కాటేసింది
ఇప్పుడు పోగు ఉరిపోసింది
మొగ్గం విరిగిపోయాక
పరామర్శల సానుభూతి
'స్వర్ణాంధ్ర' స్వాప్నిక లోకానికి
నేతన్నల మరణాల మానవహారాలు
అమీబా సింధటిక్ వ్యవస్థ
ఆగిపోతున్న ఆఖరి శ్వాస
రూపంలేని 'విజన్ 2020'కి
నేతన్నల ఊపిరి
తెగుతున్న 'లచ్చన' పోగు

నేతగాడి చావు సాక్షిగా
పురివిప్పిన శవరాజకీయాలు
గోరుచుట్టపై రోకలిపోటులా
బంధులతో శవవిందులు
శవాల ఎదురుగానే
ఉనికిని చాటుకునేందుకు
ఎక్స్‌గ్రేషియాల వేలంపాటలు
కూడులేక పనిలేక తల్లడిల్లినప్పుడు

కడుపుకాలి 'తెలంగాణ తల్లి'
వినిపించని ఏడుపు
ఊసైనా ఎత్తని సర్కారు
ఆకలి ఎన్‌కౌంటర్లు చేయించిన క్షణాన
ప్రాణం పోయాక
ఓటు బ్యాంకుల రాజకీయాలు
చావులన్నీ కాసుల సానుభూతులు
నేతన్నల మరణాలన్నీ
అధికారవు గద్దెకు ఎక్స్‌గ్రేషియాల ముదుపులు

నేతన్న బతుకు రాజకీయమైంది
చావూ రాజకీయమైంది

నల్లగొండ.. నకిరేకల్.. దుబ్బాక
భువనగిరి.. వరంగల్.. కొత్తపల్లి.. సిరిసిల్ల
ఆకలిచావుల వాంగ్మూలాల్ని నమోదు చేస్తాయి
ఇందిరానగర్.. ముష్టిపెల్లి...
తారకరామానగర్.. సుందరయ్య నగర్..
కార్మిక జన నివాసాలన్నీ
కన్నీటి తీరాలైన సముద్రాలు

కన్నీటి ప్రవాహం
మానేరు తీరం
బాధల ముఖచిత్రమై 'సిరిసిల్ల'

బతుకును బతకనీయకుండా
కూల్చేసిన రాజ్యానిది నేరం కానప్పుడు
వృత్తుల్ని కూల్చేసి చేతుల్ని విరిచేసి
బతుకుల్ని పరాయీకరించిన
వ్యవస్థది తప్పుకానప్పుడు
ఇప్పుడు ఇక్కడ
మరణం కూడా మానవహక్కే
మరణం కూడా ఓటు బ్యాంకే-

# పవన్

## ప్రశ్న

నీ మూడు రంగుల ఉత్తరీయం కన్నా:
నా ముప్పయిమూరల తలపాగ ఎందుకు విలవ తక్కువ?
నీ చద్దికంపు చికెన్ సిక్స్టీ ఫైవ్ కన్నా
నా యినపు సీకు కబాబు ఎందుకు రుచి తక్కువ?

నీ నిలువ సరుకు కూల్‌డ్రింకుకన్నా
నా గట్టికల్లు లొట్టి ఎందుకు విలువ తక్కువ?

నీ వెంగాబాయిస్ వొంకలొంకల గిటార్ మెలికల పాటకన్నా
నా సిందోళ్ళ సిందులూ, శారద పాటలూ ఎందుకు విలవ తక్కువ?
మా పగటి బాగోతాలూ
ఒగ్గు కతలూ నీ కూచిపూడి డ్యాన్స్ కన్నా ఎందుకు విలువ తక్కువ?
నా హైదరాబాదు పాన్ కన్నా
నీ వైజాగ్ కిళ్ళీ ఏం గొప్ప -
బైండ్ల డప్పులూ -
గంగిరెద్దులూ, చిడతల హరిదాసులూ,
కాటిపాపలూ, వినోద గాళ్ళూ
ఏ పారిశ్రామికరణ, గ్లోబలైజేషన్
పెనుతుఫానులో ఎండుటాకుల్లా
ఎక్కడెక్కడ రాలిపడున్నారోకదా?
స్టేజి లైట్లు మిరుమిట్లలో స్టేజి కర్టెన్
వెనక్కు పాతేసిన పాత కథలన్నీ
గజ్జెకట్టి పాడాలిప్పుడు -
గుండెచప్పుడుకు వేదికలెందుకు?

తమ్మీ అందుకో చిలక్కొయ్యకు తగిలించిన డప్పు
చెల్లీ దుమ్ముదులుపు గూట్లో పడున్న గజ్జెల్ని

# పల్లె మణిబాబు

## తెలంగాణ పోరగాణ్ణి

కాళ్ళు చేతులు వంకరై
కార్టూన్ బొమ్మనై
మా అమ్మ కడుపు
ఫ్లోరిన్ ఉమ్మ నీటిలో
ప్రాణం పోసుకున్నాను

అన్యాయమన్న అయ్య
ఎన్‌కౌంటర్‌లో చస్తే
మొండిగోడల ఇంట్లో
మొండి చేతుల అమ్మ
లాలనలో పెరిగాను

పల్లేరు కాయల్లో - నా
పసితనం చూసుకున్న
పలుగురాళ్ళలో
పొరాడటం నేర్చుకున్న

నేతల కోతలు, కరెంటు కోతలు తప్ప
పంట కోతలు తెల్వనొన్ని
నెర్రెలు బారిన నేలలో
అన్నపూర్ణ రాష్ట్ర బొమ్మ చూసినొన్ని

ఎకరంలో పండిన పత్తి
మొలతాడుకి సరిపోకున్నా
ఊరుకున్నొన్ని!
ఎరువుల షాపోడి ఇంటికి
ఉప్పరి పనికి వెళ్ళినొన్ని!!

నేతలు ఎన్నిసార్లు తన్నినా
ఎన్నికలపుడు మరిచేటొన్ని
అరచేతిలో అభివృద్ధిని చూసి
అతిగా మురిసేటొన్ని
కడుపు మంటని బయటపెట్టక
కారం మెతుకుల్తో అణచుకున్నోన్ని!
కడుపు పంటని అమ్ముకునే
కన్న తల్లుల్ని చూసినొన్ని!

నేను-
తెలివి తక్కువ వెర్రివాణ్ణి!
తెలంగాణ పోరగాణ్ణి!!

# పి. విద్యాసాగర్

## గాలికట్ట

ఆమె
అప్పుడెప్పుడో అడ్డదిడ్డంగా నరికిన మోదుకు
ముడత రోగంతో పూసిన తునికాకులా ఉంటుంది
ఆమె కోడికూతను నిద్రలేపి
సూర్యుడి ముఖం కడిగి
రుతువులకు పాలుతాపి
తన చుట్టూ తనే తిరుగుతున్న భూమికి తల్లిలా ఉంటుంది
ఆమెను చూశాకే అడవి చిగురించడం నేర్చుకుంది.

. . . . .

ఇప్పుడు ఆమె ఆమెలా లేదు
ఆకుల కల్లంమీద జరిగే అంకెల గారడిలో
మోసపోయిన గాలికట్టలా ఉంది
ఈ భూమ్మీద జానెడు కడుపై పుట్టిన పాపానికి
బతుకుని ఆకుల కల్లం మీద అమ్ముకుంటున్న
సడియం లచ్చుక్కా!
బతకాల్సిందే
బుక్కెడు బువ్వకోసం జీవితాన్ని ఆకులు ఆకులుగా రాల్చుకుని
కట్టలు కట్టలుగా పేర్చుకుని
ఎంతో కొంతకి అమ్ముకోవల్సిందే
లే తల్లీ లేచి కూర్చో
ఎండిన డొక్కకి అంబలితాపి జోలెకట్టుకో
అడవి పిలుస్తుంది జోలెకట్టుకో
నడవాలి నడవాలి వంగుతూ లేస్తూ కోస్తూ
దారుల్లేని గుట్టల్ని ఎగబాకాలి
జోలెకి కడుపుకీ
ఆకుకి ఆకలికీ పీటముడి వేశారెవరో

అది విప్పేకొద్దీ బిగుసుకుంటుంది
ఆకులు ఏరీ ఏరీ
కోసీ కోసీ జోలె మోసీ మోసీ
చెమట చెమట చెమట
దాహం దాహం దాహం
భయం భయం భయం
నాగుపాము బుసల్ని దాటి
ఎలుగుబంటి పంజాల్ని దాటి
దారుల్లేని గుట్టల మీద
ఇప్పుడు నువ్వెక్కడున్నావమ్మా ఎక్కడున్నావ్?
దాహం
ఇసుక తుఫానులా అవహించిన దాహం
దాహం పులి పంజాలా విస్తరించిన దారుల్లో
నడిచీ నడిచీ
గుండె లోలకమై ఊగీ ఉగీ
చెమట సముద్రమై ఉప్పొంగీ పొంగీ
దాహమేసిన గొంతు గాయపడిన జంతువులా తన్నుకునీ తన్నుకునీ
అయ్యయ్యో . . . .ఇప్పుడామె శవంలో ఉంది

. . . . .

శవానికి తెల్లగుడ్డ కడుతున్నప్పుడు
ఆమె నాకంటికి అప్పుడే చుట్టిన బీడీలా కనిపిస్తుంది
బీడీ తాగుతున్నప్పుడల్లా ఆమె గుర్తొస్తుంది
చివరి దమ్ములో బూడిద బూడిదగా రాలి గుండెకలుక్కుమంటుంది
నీళ్ళు తిరిగిన కళ్ళలో ఆమె తప్ప
ఆ సమస్త ప్రపంచమూ శూన్యంగా కనిపిస్తుంది

(తునికి ఆకు సేకరణకు అడవికి వెళ్ళి దాహంతో
మరణించిన ఆదివాసి మహిళల కోసం)

# తెలంగాణా

కుట్రదారుడ్ని చేశారు
జైళ్ళనాటి దేశద్రోహిని చేశారు
తెలంగాణాలో పుట్టడం
పుట్టిన పాపానికి ఆకలెయ్యటం పిడికిలుండటం నేరమైంది
అక్కడెక్కడో ఆడపిల్లల్ని కనటం అపరాధమైతే
తెలంగాణాలో మగపిల్లల్ని కనటం మహాపరాధమైంది
కనిపెంచిన తల్లులకు ఎదిగిన కొడుకులుండటం నేరమైంది
చూపుడు వేలు మీద సిరా చుక్క ఆరకముందే
ఓటు ఉరితాడై బిగుసుకుంది
మాటల్నీ భావాల్నీ దాచుకోగలం
ఏం జరిగినా కనిపించకుండా గట్టిగా కళ్ళు మూసుకోగలం
మరి
కళ్ళు మూసుకున్నా కన్నీళ్ళు ఆగవుకదా
అప్పుడు ఏడవటం కూడా కుట్రే అవుతుంది
ఏడ్చే ప్రతివాడు కుట్రదారుడే అవుతాడు.

# పప్పుల రాజిరెడ్డి

## అవ్, మాది మాగ్గావాలె

యేండ్లనుంచి యెంత మొత్తుకుంటే ఏం ఫాయిదా
యెల్లన్న గొంగడి యేసిన జాగలనే వున్నట్టు
మన బాధలు యెక్కడియక్కడనే
యాడుండాల్నో గాన్నే వుండవట్టె
మాది మాకు గావాలని యెప్పటి సందో
ఎగిళ్ళు వారంగ మర్రిచెట్టు మీద గుంపుకాకులు
వొర్రినట్టు
వొక్క తీర్గ రికాంలేకుంట వొర్ర నేర్వ బడ్తిమి
గుడిల దేవునికన్న కనికర మొత్తది గని
గాళ్ళు మాత్రం చెవులున్న చెవిటోళ్ళ తీర్గ
కండ్లున్న గుడ్డోళ్ళ తీర్గ చెయ్యవట్రి
ఒస్ నీ అన్యాలం పాడుగాను మీదేమన్న పంచుకుంటిమా
గుంజుకుంటిమా
వున్న నీళ్లన్ని మీదిక్కే మల్పుకుంటిరి
యీడ బుట్టిన కరెంటు – బొగ్గు అటెత్కపోతిరి
పట్నం కెళ్లి మొదలువెడ్తే ఇందూరు దాకా
లస్కర్‌కెళ్లి మొదలు వెడ్తే కన్నగురుం దాకా
బంగారం పండే ర్యాగల్లు అగ్గువకే దొబ్బితిరి
కార్ఖానాలు మీకే – కాలేజీలు మీకే
సిన్మాల పేరు జెప్పి ఎకురాలకెకురాలు అల్మకుంటిరి
పత్రికలు మియ్యే పలుకుబడి మీదే
మా జాగలుగొని మమ్ముల్నే జీతం బెట్టుకుంటిరి
ఎడ్డేషం మాదాయె ఎట్టిశాకిరి మాదాయే
బగ్గదేషం మాదాయె  బాంచన్ బతుకుమాదాయె
కల్లం మీది సావుకారి బతుకు మీదాయె
అల్‌కబీర్ గోజలోలె పులకాశోలె గోసోలెమేం
మా దగ్గర సదువు తకువ శాని తకువ

లేకలేక యెప్పుడన్న సర్కారోదు కొలువులిస్తే
మానోళ్ళల్ల మన్ను గొడ్తిరి
గొర్లమంద మీన తోడేళ్ళు వడ్డట్టు - అమాంతం
గుంజుకు పోయి ఆంబుక్క వెడ్తిరి
సర్కారు మీదే సవాలక్ష అధికారాలు మీవే



# పున్న సుదర్శన్

## ఆమె - రాట్నము

ఎవడు రాసిండో రాత
రాసినోడు పాడుగాను!
చేసి చేసి బొక్కలన్నీ తెల్లగైతున్నై
సిన్నప్పట్నుండీ తిప్పుతనే ఉన్నా
బతుకంతా రాట్నం సుట్టే సుట్టుకపోయింది
సిక్కులు బడ్డ పోగుల గూడైంది.
గంజిలో పడ్డ ఈగలెక్కన
నేను రాట్నంల పడ్డ
అమ్మకదేదో రోగమొచ్చి
మంచాన పడ్డప్పుడు
తొలిసారి రాట్నం ముట్టిన
లేత చేతులకు పట్టు దొరక్క
కండెలూడిపోతే కసురుకున్న నాన్నను
తాత కోపం చేసేటోడు
తాతకి నేనంటే పానం
నన్ను సూస్తే నానమ్మని సూసినట్టే ననేటోడు
సలికాలం కడుపులో దోపుకుని పడుకునేటోడు
పేగుల సప్పుడుకు నిద్రరాక
లోపల కూడా రాట్నం ఉందాని అడిగితే
అదోలా నవ్వి ఊర్కునేటోడు?
రాట్నానికి సెలవంటె కడుపుకు సెలవే
అచ్చు ముందరేసుకున్న నాన్నతో
ఆచారి సంబంధం గురించి సెబితే
సేతిలోని అతుకు సేతిలోనే ఊడిపోయింది
కట్న కానుకలు అనగానే కండ్లు ఇల్లు మీదపడ్డా<
పెద్దదాని పెండ్లికే ఇల్లమ్మితే
ఇంకా ఇద్దరాడపిల్లలెట్లా?

తాతప్రశ్నకి నాన్నదగ్గర మూగ సమాధానమే మిగిలింది.
ఎలాగైదేనే?
తాతకట్టిన ఇల్లు నా పెండ్లి పేరుమీద ఖర్సయ్యింది.
ఇల్లు పోయినా బాధో
పట్టు మొగ్గం నేసేటోడు
అల్లుడైందన్న ఆనందమోగాని
నాన్న మాత్రం పెళ్లిరోజు బాగానే తాగిండు
నాన్నకు నిజంగానే బాగా బాధైనట్టుంది.
అప్పగింతలప్పుడు కూడా లేవనేలేదు
ఇక్కడ కూడా అంతే పాతరాట్నమ్మీదనే కొత్తగా పడ్డాన్నేను
అదేనేసుడు
అదే కండెలు సుట్టుడు
తిప్పుడు ఏదైతేనేం?
తిప్పలు అవేగదా!
కుక్కలు ఎంటబడట్టు రోజులు ఉరుకుతున్నై
పిల్లలు, పెండ్లీలు, అప్పులు, బాధలు అన్నీ జరుగుతున్నై
పోగుమీద పోగు పేర్చి
ఆయన సూపు సన్నగైంది
పాకోళ్లతో అని తొక్కి తొక్కి
కాళ్లమీద నరాలు పొంగినయి
నడుము వొంగిపోయి ఆయనకు
నడమంత్రపు ముసలితనం వచ్చింది.
రాట్నం లాగానే నాబ్రతుకూ ముసలిదైంది
బతుకులింతకన్న ఏం మారినై
ఏం కోరికలు తీరినై!
అయ్యా పట్టు మొగ్గం నేసినా
కట్టు కోడానికొక్క పట్టు చీరన్నా ఉందా?
నేసిన కూలి కడుపుకే సాలదు
నేసింది కట్టుకునే అదృష్టం కూడానా
ఏ చిన్ననగా లేక ఎన్ని పెండ్లీలకు మెడచుట్టూ చీర కప్పుకుని
పోలేదూ?

నా మాటకేమొచ్చెగాని
వానొస్తే ఇల్లే వాకిలైతది
కప్పు సదిరించి ఎన్నేండ్లయింది?
పిల్లల పెండ్లీల్లకైన అప్పులెన్ని తీరినై?
బతుకులంతకన్నా ఏం మారినై
పిల్లగాళ్లు కూలికి పట్నం పోయింద్రు
ఆళ్లకేమన్నా సదువులా? ఉజ్జోగాలా?
ఆడికి పోదామన్నా ఆళ్ళకూలి ఆళ్లకే సరిపోదు
రాట్నం మూలకు బడ్డది
చెదలు బట్టి పోయింది
ఇప్పుడెవరూ బతకమని చెప్పరు
సావమనీ చెప్పరు
బతికి సావాలో
సచ్చి బతకాలో తెల్వడంలేదు

# పుప్పాల కృష్ణమూర్తి

## చెరువు

నా ఊరి చెరువు ఎప్పుడు జీవం పోసుకుందో గాని
నా కన్నతల్లి కంటే ముందుగానే పుట్టింది
అందుకే అది అమ్మల గన్న యమ్మ, మూలపుటమ్మ
ఊరిని పహరాకాస్తున్న చెరువు కట్ట
ఊరిసిగలో తురిమిన నెలవంకలాగుంటుంది
మృగశిర మబ్బులు కరిగి, ఆరుద్రలో వర్షించినా
ఊళ్ళోని బావులు వికటాట్టహాసాలతో విర్రవీగినా
ముసి ముసి నవ్వులతో నీరు నింపి మురిసి పోయేది
ఎగువన అలుగుతో, దిగువన తూముతో
అడిగిన వారికి లేదనక సాయం చేసే రంతిదేవుడయ్యేది
వికసించిన తామరలను తల్లో తురుముకుని
కొత్త పెళ్ళి కూతురులా ముస్తాబయ్యేది
అలుగు పక్కమెరకపై, గరకమేస్తూ గాడిదలు
మధించిన ఆంబోతుల్లా ఓండ్రపెట్టేవి
ఊళ్ళోఅడుక్కొచ్చిన బుట్టబువ్వ
జారుడు బండపక్క కూర్చుని తిన్న సాకల సైదులుకు
తన చల్లని నీళ్ళతోనే సేదదీర్చేది
సాకిరేవు బానల్లోని సవిటినీళ్ళల్లో
కుతకుతా ఉడుకుతున్న ఊరిమురికిని వదల్చడంలో
నా చెరువు నీళ్ళముందు నీ డిటర్జెంట్లు వెలవెలాబోతాయి
ఊరిమీద తొలికిరణం యొలిచింది మొదలు
ఊరి మురికి నంతా తనలో యిముడ్చుకుని
పైకి పసిపాపలా నవ్వుతుంది
ముడ్డికి తాటాకు బుట్ట, భుజంపై వలతో చెర్వు ఒడ్డున నిల్చుంటే
ఆకలితో వచ్చిన కన్నకొడుకుకు కడుపునింపినట్లు
ఒక్కవిసురుడికే బుట్టనింపి పంపుతుంది

మదారుసాబు, మైసయ్యలు, మావులు, గాలాలతో షికారు చేస్తూ
బెండు ముక్కలై తేలుతారు.
చెరువు వారన పెరిగిన జమ్ముతోనే
సాలమన్, కాంతయ్యలు కడుపునింపుకుని
నా గుడిసెకు నీడలౌతారు
కట్టకున్న ఈతచెట్ల కల్లు తాగి
తెల్గోళ్ళ ఎంకటి కాల్చితెచ్చిన జమ్ము పిట్టలు నంజుకుంటూ
కట్టమీద కూసుంటే,
చెరువు తన చల్లటి చేతులతోనే గాలి విసిరింది
తన చీకటి బతుకుకు తెల్లటి ముసుగు ధరించి
ఎరకల వీరయ్య అవుసాటున నిలబడి
జమ్ములో పట్టిన నీరు కోళ్ళతోనే
తన ఆకలి కడుపును నింపుకుంటాడు
ఊరి మీద వదిలిన మైసమ్మదున్న
ఎండేళ్ళతాపం తీర్చినందుకు కృతజ్ఞతగా
తల నీళ్ళలో ముంచుతూ, తేలుస్తూ చెరువుకు నమస్కరిస్తుంది
మా ఊరిరైతులు ఎర్రంచు పంచెలు గట్టినా
కాలరెగరేస్తూ కట్టమీద నిల్చున్నా
పాలకంకులతో, పసిడి నవ్వులతో
నా పల్లె పచ్చగా విలసిల్లుతున్నా, అంతా నా చెరువు చలవే
తుఫాను రక్కసి నా చెరువు గుండెను చీల్చినపుడు
ఊరి ప్రజల బ్రతుకులకు గండిపడిందని
గద్గదస్వరంతో విలపిస్తూ
బోరున కన్నీరు కార్చిందీ నా చెరువే
ఇక పచ్చని నా పల్లె ముంగిట్లో
ఈ ఏడాదంతా కరువే

# డా॥ పులిపాటి గురుస్వామి

## దూప

ఎడారి నట్ట నడిరేయి గాలిలేని లేదా
మిట్ట మధ్యాహ్నపు ఎండా కాలపు తీవ్రత, లేదా
గుడ్లగూబలు మీద దూకిన ఒంటరి భయంతనం

వాడిపోతున్న పూల చప్పుళ్ళ కింద
దేహము దాని ఆత్మ
చెమట బిందువుల దాడికింద
ఎవరి హస్తపు స్పర్శ కోసమో
ఊపిరి ఉక్కిరి బిక్కిరి

నలుగురు కూచొని మాట్లాడుకుంటున్నపుడూ
ఉధృతమైన సముద్రపు అలజడి
ప్రపంచం నిశ్శబ్దపు మూలుగు కింద
చివరికి గుండె కూడా

అలా కెరటాలతో దుఃఖం
సుడిగాలిలా చుట్టి వదలదు
ఒక బిందువు ఉపరితలం వెంట ఆవిరౌతుంటుంది
దప్పికతో పక్షవాతపు రెక్కలు
నివాస యోగ్యం కాని భూమిలోనే
ఏడుపు ప్రారంభం
2.
దిక్కులుంటాయి
సూర్యుడుంటాడు
భూమి వుంటుంది
చంద్రుడుంటాడు
పక్షులుంటాయి
పచ్చదనం ఉంటుంది

పంచభూతాలుంటాయి
తీర్చని ఇవేవీ తీర్చే ఎవరో ఉండరు

మళ్లీ పద్యం ప్రారంభమౌతుంది



# నడిచే ఉరి

నేను ఉరేసుకున్నాను
ఒకే తాడు రెండవ చివరి కొన
గొంతుచుట్టు వత్తిడిగా
శ్వాసను బంధించడమే కదా
ఇలాంటి వత్తిడిని
రోజుకు చాలాసార్లు పొందుతాను
అంటే రోజూ ఉరిని బిగించుకుంటూనే ఉంటానా!

గుళ్ళోకి పూజకు వెళ్ళినట్లుగానే
మనుషుల దగ్గరికి వెళ్తాను
ఉరిబిగించుకుంటుంది
చిత్రం చాలా చిత్రం
నేను మనుషుల కోసమా లేక ఉరి కోసమా వెళ్తున్నాను

మెలికలు తిరిగిన బలమైన
తెగని ఒకతాడు  కంటే కూడా
జాగ్రత్తగా విడతీయలేనంత
బిగుసుకుపోతున్నాడు మనిషి
గొంతు చుట్టూతా
మనసు చుట్టూతా
ఐనా నేను మనిషిని కదలికలు కలవానిగా
నమ్ముతున్నాను

మనిషి నను ఉరిలా పెనవేసుకుంటున్నాడా!
నేను మనిషిని సమీపిస్తున్నానా
మృత్యువునా?

చావుకు చాలా రూపాలని విన్నాను
మనిషి ఒక మహోన్నత రూపమా మృత్యువుకు
అంటే ఉరికి మనిషి పర్యాయపదం కావచ్చా!
ఐతే నేను ఉరిలోనే బతుకుతున్నానేమో!

## పాక్కిలి నేల

పాకురు జాలారు బతుకు మీద
జారు పాదం
కలల కాయల్ని తినేసిన
పూతల పురుగు

సొనకన్ను
ఒకటి కాదు
రెండూ,
ఏండ్ల పాతం

చలి నములు చేతులు
చన్నీట పగిలిన కాళ్ళు
వొడువని సాకిరి సేవ

అమ్మకానితనం
తగలబడుతున్న గుండె కింద
వచ్చే పోయే శాల్తీల
దీవెన వడ్డన
వొక్కరుచి కాదు

జాలితిట్లు
నువు రాసుకోని
రాయితనం మీద

దుల్పు దుల్పు
బూజు తలల భుజాల్ని
కమురు కసుపోగు కుప్పని
ఊకు
పెంటమీద సల్లు

అల్కు పిడ్స
నీ చేతుల్లనే ఉంది

నీ చేయి సల్లగుండ
అమ్మ లేనోల్లంత
నీ బిడ్లలే చెల్లే

## డా॥ పేర్వారం జగన్నాథం

# రెండు చిలుకలు

అనగనగా -
రెండు రామచిలుకలు
అవి ఒకే తల్లి పిల్లలు
అందులో ఒకటి
దొరవారి చేతికి చిక్కింది
ముచ్చటగా దాన్ని పెంచి
మాటలు నేర్పినారు దొరలు
అప్పుడప్పుడు అరుబయటా
అంతఃపురంలో విహరిస్తుందది
రాణివాసంలోకి వెళ్ళి
నేర్చుకున్న మాటల్ని వల్లిస్తూ
దొరసానుల అలరిస్తుంది
దొరవారి బుజంపై వాలుతూ
చూపరులకు విందు చేస్తుంది
అద్దంలో తన ప్రతిబింబాన్ని
తానే పొడుస్తూ ఆనందిస్తుంది
దొరవారి పని మనుషులు వచ్చి
చాకిరీ చేస్తుంటే
గొప్పగా ఉబ్బిపోతుంది
నౌకర్లపై హుంకరిస్తూ
నానా హంగామా చేస్తుంది
దొరవారికోసం వచ్చిపోయే
పెద్దోళ్లతోటి సయ్యాటలాడుతూ
సరిగమలు పలుకుతుంది
పంజరంలో పోసిన గింజల్ని
ఆరగించి నిదురపోతుంది.

ఇక మరో రామచిలుక -
ఆదరించేవాళ్లు లేక
పోషించేవాళ్ళంటే గిట్టక
ఒక కాపు బిడ్డ చెలుకలోని చెట్టుపై
గూడుకట్టుకొని నివసిస్తున్నది
చెట్టుమీది పిట్టలతో కలిసి
స్వైర విహారం చేసివస్తుంది
నాట్లు వేసేటప్పుడూ
పల్లె జనులు పాడే పాటల్ని
శ్రద్ధతో నేర్చుకుంటుంది
పశుల కాపరులతో దోస్తీ చేసి
చెరువులో మునిగి గిరికీలు కొడుతుంది
నేల రాలిన గింజలు
నేలపాలు కాకుండా
ఏరుకబుక్కి కడుపునింపుకుంటుంది
పొలం పనుల్లో ఉన్న
కాపు బిడ్డల దరికి జేరి
వచ్చీరాని పాటలు పాడి
వాళ్ల కష్టాల్ని మరిపిస్తుంది.
రంగురంగుల చిలుకల్ని
అంగట్లో అమ్మడం కోసం
ఎవడో పన్నిన ఉచ్చులో

ఈ రెండు చిలుకలు చిక్కుకున్నాయి
పరస్పరం అవి మాట్లాడుకున్న మాటలు
వాటికే అర్థంకాక
మనసులు అంతకన్నా కలువక
ఒకటి తూరుపు దిక్కు కూ
మరొకటి పడమటి దిక్కుకూ
ఎడమొగం పెడమొగం పెట్టి
రుస రుస లాడుతూ

ప్రక్క ప్రక్కనే కూర్చున్నాయి
ఈ రెండు చిలుకల బాషను
అర్ధంచేసుకన్నవాడు
వల విసిరినవాడు
గప్‌చిప్‌గా గట్టుపై కూర్చున్నాడు.

# పొట్లపల్లి శ్రీనివాసరావు

## దెబ్బతిన్న పులి

ఇక్కడ కరువున్నది
గుడిశెల తడకల్లో బాధల దరువున్నది
తెలంగాణ మాగాణి మండుతున్నది
పత్తికాయ గుండె పగులుతున్నది
చిరిగిన గోచి - నెత్తిన రుమాలు
కురుమ గొంగడి - లాంతరు బుడ్డి - చేతి కట్టెను చూసేకదా
ఇక్కడి పొలం బతుకుతున్నది
ఈ పొలాన్ని చూసేకదా -
ఇక్కడి రైతు రెక్కాడుతున్నది

ఇక్కడ కాలువలుండవు - వున్నా నీళ్ళుండవు
ఇక్కడ ప్రాజక్టులుండవు - వున్నా నిధులుండవు
ఇక్కడ పరిశ్రమలుండవు - వున్నా ఉత్పత్తులుండవు
ఇక్కడంతా ఖాయిలా . . . ఖాయిలా. . .
ఖాయిలా బతుకు తెలంగాణాది
ఇక్కడి పచ్చని బతుకులుండవు - మెచ్చుకోలూ కవిత్వాలుండవు

ఇక్కడ తుఫాన్లురావు . . . నష్టం కూడా రాదు
ఇగ కోట్లెందుకు . . ? గింజలెందుకు . ?
పక్కా ఇండ్లెందుకు. . .? మంచి బట్టలెందుకు?
ఇక కాలువలెందుకు? ప్రాజక్టులెందుకు?
కొత్త పరిశ్రలెందుకు?. . . ప్రశ్న. . .
ప్రశ్న . . . ప్రజలది కాదు. . .
తెలివిగా ప్రజలను ప్రశ్నించే ప్రశ్నకు
ప్రశ్నించె హక్కెందుకు. . ?
మంత్రులు. . .మంత్రులు మారుతేంది సారూ
మనుసులు . . .మనసులు . . . మారాలి గానీ. . .
అసలే తూట్ల జల్లెడ తెలంగాణ
మాట్లాడితే తూటాల చప్పుడు తెలంగాణ

ఇక్కడ సదువూ, నౌకరీ, ఎవుసాయం
పరాయిది. . . పరాయిది
పరాయికరణ ఇక్కడి వాడుకను కూడా తప్పంటున్నది
ఎకసెక్కంగా మాట్లాడుతున్నది
ఇకే పోరడు పోరు చెయ్యక ఏం చేస్తడు

ఎనక బడ్డ కులం తెలంగాణ
ఎనక బడ్డ జాతి తెలంగాణ
దగాపడ్డ తెలంగాణ ఒక కొలిక్కి వస్తున్నది
దెబ్బతిన్న పులిలా కలియ తిరుగుతున్నది

ప్రసేన్

## దేవిడికి దూరంగా

రోజూ నిద్రలేవడమంటే
వాయిదాల్లో మరణించడమే

ఎవరి అరచేతుల్లోనో తలవాల్చి మరెవరి పొత్తిళ్ళలోకో
ముడుచుకుని మసకగా
ముఖం చాటేస్తుంది పగలు చీకటిమైదానం నెర్రెలలో బిగుసుకొని
రెప్పలు వాల్చేస్తుంది అలసిన చెమట
వెలుగు వర్షంలో కప్పు చిరిగిన మొండి గొడుగు
మాపల్లె

తన్నడానికి ముసుగులే లేనివాళ్ళు
దేహాల నెక్కడ దాచుకోగలరు
జీవ పేటికలను మోస్తూ
ఎవరీ కాందిశీకులు ఎక్కడికి వలస

పగటి నవ్వుమీంచి జారిపోయే
చీకటి దుఖ్ఖ చారికలు మిగలవు
రెప్పలు కుంపట్లయిన జీవితాలకు
రాత్రులు రహస్యాలు చెప్పవు

ఎవరికైనా ఇల్లెందుకుండదు
నీడ తల్లెందుకుండదు

దేహాల తివాచీలు నేసి శరీరాల నాపరాళ్ళు పరచి శ్వాస జోలలో ఊపిరందని
మెలకువని బతకనివ్వదెందుకీ మత్తు ముంపు ఎవరికైనా తల్లికోడి రెక్కల
గూడెందుకుండదు ఎవరికైనా
చలి గొంగళి కింద
నిద్ర వణుకుతుంది దిగులు మగతగా
నిద్ర పొర్లింతలో వేలి కొసను తడిమి

కోరికల జ్ఞాపకం రాలిపోని కలగా

. . .    . . . .

ప్రాణంలోంచి శవమెందుకు మొలిచింది
బతుకులోంచి చావెందుకు వెలిసింది

కల చప్పుళ్ళకు
కళ్ళు దిగ్గున లేస్తే
చుట్టూరా నిద్రపోట్లు తిన్న మృతదేహాలు

మా వాడకు నిద్రాభంగమైంది

# మాతృభాష మారువేషం

ఏ భాష ఏ యాస
ఏ గ్రాంథికం ఏ గ్రామ్యం
నాకిపుడు సందేహాల్లేనేలేవు!

నత్తినత్తిగా ఎలాస్టిక్ అక్షరాలతో నేను కొత్తమాట తడబడుతున్నపుడు ఉచ్ఛారణలేని పదాలు నిప్పుల స్నానం చేసాయి కదా మీ భాష కోసం నా, అర్థాన్ని బియ్యం గింజల పలకమీద జంజెం కట్టిన ఉంగరంతో రచించారు కదా!

నూనెలో లేని అక్షరాలు
ఏం పలికాయో తెలీదు
పెదబాలశిక్ష నాయాసలో ఎందుకులేదో
మాతృభాష చుట్టపు చూపెందుకయిందో!
ఏమీ తెలీదు. . .

ద్విత్వాలు దంత్యాలు తాలవ్యాలు తేడా పలకలేను నిజమే. వత్తులూ పొల్లులూ యాసలో విరిగిపోతాయి నిజమే. వాక్యం తెగాల్సినచోట తెగదు. అవిరామ చిహ్నాల గాయాలను పులుముకుంటుంది నిజమే.

మార్కులు రాని మాతృభాష నాది
ఇప్పుడు ఏ అక్షరాన్ని దిద్దాలి
ఏ మాండలికాన్ని బట్టీపట్టాలి
ఏ సమాధానం అప్పజెప్పాలి
నాకు సందేహాల్లేవు
సంస్కృతాన్ని తెలుగించిన కొత్తభాష నా బాల్యం దేవతల పలుకుబడిని నేలజార్చిన దౌర్జన్యం నా అక్షరాభ్యాసం నిశ్శబ్దంలోకి వెళ్ళే అభావం స్వభావం

నోరెప్పుడూ. మెలికలు పడదు నిజమే
ఐదారేడు అక్షరాలు ఉంగలు చుట్టుకొని
శబ్దాలుగా దొర్లుకొస్తాయి నిజమే

ఇది అధునిక మాండలికమూ
అర్థాన్ని మాత్రమే గొణిగే నిరక్షరమూ
సందేహమూ సమాధానమున్నూ
ఏ భాష మాట్లాడాలి ఏ యాస రాయాలి
ఏ ప్రాస పాడాలి
అణుమాణాల్లేవు!
నా శ్రార్ధం నా పిండాకూడు
స్పష్టంగా పలకడమూ గ్నాపకమే
తప్పుడు ఉచ్చారణ
అరచేతి నెత్తుటి పూవుగా
మారడమూ గ్నాపకమే

గోడఖుర్చీ వీపుమీది వాత గీతలూ బుగ్గమీది పంతులోరి

మొరటుసంతకమూ
దవడల మధ్య పగిలిన పలుకురాళ్ళ పలకరింతలూ అన్నీ జ్ఞాపకమే

ఇపుడైతే నాకిక
అచ్చరం రూపంతో పనిలేదు
మాట సబ్దంతో పని లేనేలేదు
భావంతో కదా నా వివాదం
బోల్దెన్ని తప్పులు
గొనిగాను
రాసాను
పళికాను
ఇప్పుడు నా కెంతో
పొగరుగా వుంది. . .
(తెలంగాణ యాసను వెక్కిరించే వారికి వినమ్రంగా)

# కల్సుందామ్రా?

ఎంత మంచి కౌగిలి ఇది ఓ.నా ధృతరాష్ట్రా రమ్మంటూనే
పొమ్మంటూనే నాకెంగిలి మెతుకులు విసిరిన వ్యూహంలో చిక్కుకుని
గిల గిలలాడిన నా పక్క టెముకలకు నీ ప్రేమబలం తెలియదా సూది
మొన మోపేంత నేలైనా ఇవ్వనన్న సుయోధనుడే మంచోడు
పంపకాలలో నేరుగా మోసం చేసిన నాగమ్మే మామంచి మాయమ్మ
మరి తందనానాపురే తందనానా భళా తందనానా తెలంగాణా!

నీకు నీళ్ళు మాకు కన్నీళ్ళు
నాకు రాళ్ళు నీకు నాలుగు రాళ్ళు
మాకు బీళ్ళు మీకు సాలిరువాళ్లు
మీకు గద్దెలు మాకు సుద్దులు

అదే కౌగిలింతల వాటాలలోనే బలవంతపు బంధం మోసపోయింది
కదా
సూస్కుందాం తీ బిడ్డా నువు యాడ్కిబోయినా నా దప్పిక తీరుద్దా
జరంత బువ్వ తినంగనే పెయ్యిని ఒరుగు చేసి ఒరగబెడతనా
గట్కుతిని
మూతి నాకంగనె దవ్వకు దవ్వ తొవ్వకు తొవ్వ యాద్కొస్తాదిర, పొంత
కుండల కాలిన దుఃఖమ్‌కు సల్లనీళ్ళు తోడన్చెప్పి చల్లబడేస్తివి కదర...
తమ్మితమ్మి అనబడ్తివి గుండెల్ల కాలే కట్టెలు నెట్టబడ్తివి గదర. . .
గందుకె మళ్ల బడికెళ్లాల పలక బట్టుకుని

వచ్చిందన్నా వచ్చాదన్నా
వరాల తెలుగూ మనదేనన్నా. . .
తెలంగాణ జాతి మనది
నిండుగ వెలుంగు జాతి మనది
ఇంత దూరం నడిచి కన్నీళ్లతో అడుగుజాలను చెరిపేసుకుంటున్న నా
చాటు మాటు ఏడుపు నీకు వినపడదులే గోల్కొండ రాజులకో నిజాం
పాలకులకో ప్రతి శ్వాసనూ హారతిచ్చాక ఆరంభాన్ని జుట్టు పట్టుక
ఈడ్చుకొచ్చి మూలకు కూచోబెట్టాలి కదా నా ఈ దీన తెలంగాణ!

భవతీ భిక్షాందేహి అన్న పాటను జోలపాటగా పాడి
జరబువ్వంటెయ్యమ్మో అని ఎకసెక్కంచేసి
నా భాష విలన్‌లది కదరా
మాటల్లో దేవుళ్ళూ రాక్షసుల చేతుల్లో మరణిస్తారు మరి.

నెత్తురు చిందిన నేలంతా తుపాకుల మడమలు మొలిస్తే మడమ
తిప్పని మహావీరులు తూటాలై సుళ్లు తిరిగి విజయ పతాక
కరవాలాలను రెప రెపలాడించి పదును చెక్కితే తలలన్నీ
రక్తపుటేర్లలో బతుకమ్మలై నాకే కమ్మలు కడితే నెత్తురంతా మేట
కట్టలేదా, చిన్న రాపిడికే మా మేటకుప్ప కూల లేదా నెత్తురు
ముద్దలతో చెండాటలు చెండాడ లేదా నా ఈ వీర తెలంగాణ!

ఎంకి పాడినా ఎల్లి ఆడినా
పొలి గీసినా గేలి చేసినా
కొండదేవర మీద ఆన
ఇదిగిగో కన్నీటి వాన
నెత్తురే కదా గందుల శాన

వెలిగిన తెలుగుజాతిని సగాన్నేమో ఆర్పేసి అబద్ధపు యుగళ
గీతాలను పెద్ద మనుషుల చిన్న మనసుల ఒప్పందాలు బరుద
మసిపూయకుండానే మారేడు కాయలు చేస్తే మొదటి పోటు
బలంగానే పడింది ఇప్పుడేదైనా రాజకీయం కాదులే వెనుకబాటు
తనమూ కాదులే అంతా ఆర్థిక సామాజిక సాంస్కృతిక కారణమే
ఫజల్ అలీ మీద ఒట్టు జవహర్‌లాల్ నెహ్రూ మీన ఆన ప్రకాశం
పంతులూజీ ప్రామిస్ అందరి కసమ్ నేనెప్పుడూ నీవాడ్ని
కానంటోంది నా వేరు తెలంగాణ
ఆ బీళ్ళు చూడు ఎలా చిట్లి పోతున్నాయో
ఆ నీళ్లు చూడు ఎట్లా పల్లం ఎంపు పరుగుతున్నాయో
ఆ సొమ్ము చూడు ఎట్టా చేతులు మారి మారి రంగులు మారిందో

పొలికట్టె మోత బరువుకు కుంగిపోయి రుచి తెలియని చప్పదనపు
చక్కెర బొంగుల కప్పల తెప్పల నడుమ నలిగిపోయిన నీకు

బతుకమ్మ పూల రంగుల గుత్తుల పేర్లు తేలియాటలు ఏం
తెలుస్తాయి చెప్పు మేడారమో సమ్మక్క సారలమ్మో జాతరలో రాలిపడ్డ
అడవిదేవత నుదుటి కుంకుమ రంగు కళ్ళబడిందా చెప్పు ఇప్పపూవు
విస్కీ తాగావా అర పెగ్గో పావు పెగ్గో తాగావా తాగి వాగావా
ఎప్పుడైనా అందుకే మరి రాతిరి పాడిన వెన్నెల పాట తెల్లవారి
పోలోమంటూ సోలో అయిపోతుంది ఇది నా దీన వీర వేరు
తెలంగాణ ఐక్య చిందు కలిసుండే వేరైన జీవి సచ్చేమందు!

కలిసి ఉంటే కలదు సుఖమూ దుఃఖమూ
ఇది కలిసి వచ్చిన అదృష్టమూ దురదృష్టమూ
మోసగాళ్ళకు మోసగాడు మామంచి చెడ్డోడు పెద్దోడు
అన్నకు తగని తమ్ముడు
ఇంత జరిగినా ఇంకా కల్సుందామ్‌రా!

## మంటల నిప్పులు

ఎండిన డొక్కలు
వెలివేసిన పక్షపాతాలు
సమరాలు
సలసల కాగే ప్రాణాలు
కొల్లలుగా ఉద్యమాల ఊపిర్లు
పగిలిన తెలంగాణా గుండెలు
మోత ఆగని
తెలంగాణ ఆకలిగంటలు
మంటలకు నిప్పుఅక్కర్లే
మా నిజాయితీ చాలు

## డా॥ బన్న అయిలయ్య

# అపనమ్మకం - మూల భాష

దుఃఖాన్ని అనువదించాలి
దుఃఖభాష తెలిసిన దుబాసీని అన్వేషించాలి.
అనేక పొరలు
అనేకానేక దుఃఖం పార్శ్వాలు తెలియనివాడు
ఎలాదాన్ని తర్జుమా చేయగలడు?
గుండె చెవితో
దుఃఖపు సవ్వడులు వినగలిగిన వాడే
దాన్ని అనువదించగలడు
మనిషి కన్పిస్తున్నంత సహజంగా
దుఃఖం లేదుసుమా!

సమస్త శరీరాన్ని
శరీరంలోని అణువణువుని
మైక్రో పరీక్షలు జరిపినప్పుడే
దుఃఖం సహజత్వం ప్రతిబింబిస్తుంది.

గెడ్డానికి నిలువెత్తు కర్రనానించి
బక్కరైతు దర్శిస్తున్న
సుదూరతీర ఎండమావుల్లోని
బతుకునావ దుఃఖాన్ని అనువదించాలి.

కనుగుడ్ల బావులతో
ఇంకిపోయిన జలాశయాలు శోధించాలి
తడికళ్ళ వేదనతో
భాషే చెప్పలేని రైతు హృదయపుటల్లో
సామూహిక ఆకలిదేహాల ఆర్తనాదాలు
భుజాన్నేసుకుపోయే దృశ్యాల్ని చిత్రించాలి.

పత్రానికి
పచ్చదనాన్నిచ్చిన రైతన్నా!
నీ ఊపిరిపై తెల్లగుడ్డకప్పి విలపిస్తున్న
దొంగకళ్ళ దుఃఖాన్ని అన్వేషిస్తున్నాను.

పొలం చుట్టూ
చూపుల కంచెకట్టి
సూర్యుడివై చంద్రుడివై
సమస్త నక్షత్రమండలమంతా నువ్వే విస్తరించి
రాత్రీ పగళ్ళ మధ్య
నిర్భయ సంచారివైనా
భూమిని తొలుచుకొస్తున్న చీడ
మొక్కమొక్కకున్న
కాయను తొలుస్తుంటే
బతుకు చేనంతా
ఒక అపనమ్మకం కమ్ముకున్నాక
గంపలు గంపలుగా నిరాశను
గోతాలలో కుట్టేసిన
దుఃఖం పీటముడులు విప్పాలి.

రైతన్నా!
ప్రాణదానం చేయటం తప్ప
ప్రాణం తీసికోవటం తెలియదు నీకు.
పంట కన్నీటి చీడను తప్ప
కన్నీళ్ళు పెట్టని ఘన చరిత్ర నీది
ధైర్యాన్నివ్వటం తప్ప
అధైర్యాన్ని దరికిచేరనివ్వని
గుండె దిటవుంది నీకు
పొలం గట్టుమీదున్న నల్లతుమ్మ
నాగటి దుంప కావాలని గొంతెత్తుతుంది
బొగ్గుల కుంపట్లో ఎర్రగా కాలిని కర్రూ

వెదరు పొదలోని ములుకోల
కాలాన్ని నిర్దేశిస్తున్నాయ్.

రైతన్నా!
నీపాదం సోకినంత మేరా
పగిలిన నేల పులకించి
పచ్చదనం సంతరించుకుంటుంది
నేడు కాకున్నా రేపయినా
నువ్వే దాని ప్రాణదాతవని నమ్ముతుంది.

నీ చెమటామృతాన్ని
దోసిళ్ళతో తాగిన విత్తనం
నేలతో మైత్రి కలిపి
చావును జయించింది
నువ్వేమో
రాల్తున్న పత్తిపువ్వుపై సంతకం చేసి
దాన్ని అనువదించి చదువుకోండిరా అంటూ
కళ్ళగుమ్మానికి కట్టిన పరదాల వెనక్కివెళ్తున్నావ్.

దుఃఖాన్ని అనువదించాలి
దుఃఖభాష తెలిసిన దుబాసీని అన్వేషించాలి.

## ఒక జొన్న రొట్టెల కల

పాల పిట్టల కిలకిలలు
గోరువంక రాగాలు
చిలకల గుంపుల పరుగులు
పల్లె ప్రకృతి తనలో తాను పాడుకుంటున్న
ఓ మధుర గీతం.

నదులు ఒడ్డాణాలు
పంటకాలువలు చేతి ఉంగరాలు
పల్లె గుడిసెలు
సామూహిక తపస్సు చేస్తున్న మునులు.
పల్లె స్మృతులు పచ్చదనపు పావడాలు
శిశిరంలోనూ చిగురించే జ్ఞాపకాలు
దీనికి వసంతం తప్ప
మరో రుతువే తెలియదు.
ఇవే నన్ను శాసించిన పరిసరాలు
నన్ను శ్వాసించిన పరీమళాలు
నన్ను కవ్వించిన నవ్వించిన సంభాషణలు
రాత్రీ పగళ్ళను జొన్నరొట్టెల్ని చేసి
కాలం కారాన్ని అద్దుకొని తినడమే తెలుసు
రాత్రి అకాశం కింద నిద్రపోయే పల్లెచెరువు
ఊయలలో ఊగే శిశువు
పల్లె రాగాలను మౌనంగా పాడుకునే
రహస్య వాగ్గేయకారుడ్ని నేను.

## బాణాల శ్రీనివాసరావు

# పచ్చబొట్టు

వెంటాడే జ్ఞాపకాలు . . . ఊరుమారినా... రూపుమారినా. . వృత్తి మారినా . . .
ఒంటిరంగు మారినా. . . మాట మారినా. . . యాస మారినా. . . చదువులొచ్చినా.
.కొలువులొచ్చినా. . . నాగరిక సంస్కారాల్ని అయిష్టంగా తొడుక్కున్నా. . .

చేపను గాలంతో లాగినట్టు లాగేది జ్ఞాపకం
గూళ్ళు మారినా మారనివే గువ్వల గుర్తులు
చంద్రుని రూపు మారినా మారనిదే ఎన్నెల రంగు.
ఎప్పటికీ మాసిపోక మురిపించేవే జ్ఞాపకాల హరివిల్లులు

* * *

వేటాడేది జీవితం
జీవించే కొద్ది మిగిలుండేది
నిరంతరం భయపెట్టేది
అనుక్షణం పోరాటం చేయించేది
జీవితం! జీవితం!!

* * *

అర్ధరాత్రి దాకా ఎన్నెల్ని దోసిళ్ళతో తాగి దాచుకున్న ఎన్నెలకుప్పలు. తెల్లారు
జామున్నే నిద్రలేపే పొన్నాయి పూలు. చినుకుల్లో నానుకుంటూ కొమ్మలకు
రాళ్ళు విసిరే చిలిపితనం. నక్షత్రాల్లా రాలే పూలు. రాలిన పూలన్నీ
ఏకత్వంలోకి... కళ్ళల్లో కరిగిపోని నక్షత్ర దృశ్య పరిమళం

* * *

పీర్ల పండుగలు .... దూలలు...అస్సైదూలలు. . . ముఖానికి చీకట్ని అద్దుకున్న రాక్షసుడు
దూదేకుల ఖాసీం... సైనికుల్లా కేరింతల్తో మార్చింగ్ ... భయంలేదు ... దానీ అర్థం తెలీదు.
నీల్లాడే కప్ప తల్లులు. కడవల్నిండా నీళ్ళు కావడి మధ్యలో గోంద్రుగప్ప ఆకాశానికి వేలాడే

సందమామ. కప్పను మోసుకుంటూ... వర్షంలో తడుసుకుంటూ.
ఊరంతా ఊరేగుతూ మేము. . .

* * *

ఎడ్లబండిమీద పొలానికి పోతూ పాడుకున్న జానపదాలు. పాపయ్యతో పాడిన మోటబాయి పాటలకు పచ్చని పొలాల పైరగాలి కోరస్. లచ్చయ్య నేను చెరువు కట్టకున్న తుమ్మచెట్లని ధరించిన బాల ఏసులం. భూమిని సగానికి సగం చేసి పాటిమట్టిని, ఎర్రమట్టిని ఎత్తుకొచ్చిన రోజులు. చీమ చింతకాయల కోసం ఎదురుగడ కొక్కాలతో ఆకాశాన్ని అమాంతం లాగడం. రంగు రంగు మబ్బుల్లా రాలే చీమ చింతకాయలు. బాల్యాన్ని చుట్టూ తిప్పుకున్న రేగి చెట్లు, ఈత చెట్లు

* * *

ముంజకాయల కోసం మండే ఎండల్లో కంది కొర్ల అంపశయ్యలపై పరుగెత్తే సాహసం. నాలుకమీదింకా ఆరని ఈత కొట్లుకుంటూ తిన్న చింతకాయల పుల్లదనం. తాటి చెట్లమ్మటి చిలకలెమ్మటి తిరిగి అరికాళ్ళకు కట్టిన నెత్తుటి మరకల్తో పట్టుకున్న రింగన పురుగులు. గుడ్లకోసం మంచి తుమ్మాకు యేతేసి అగ్గిపెట్టెలో దాచుకున్న అపురూపమైన ఆస్తులు. ఇప్పటికి చెవుల్లో మోగుతున్న రేపాల తిర్నాల కీచుపిట్టలు. పిల్లంగోవిలు.

* * *

శ్రీరాముని పెళ్ళప్పుడు
ఇల్లిల్లు తిరిగి పాడిన భజన పాటలు
రాగిచెట్టు కింద
రాములోరి గుడిగచ్చు మీద
ఆడుకున్న అష్టచెమ్మాటలు
దుమ్ములో దొర్లుకుంటు ఆడిన
సీసం గోలీలాటలు, జిల్లా గోనే ఆటలు

* * *

కాటిపాపడి గొంతులోంచి గుండ్రాళ్ళు బయటికొస్తే గుడ్లు తేలేసి
చూచిన క్షణాలు. ఒల్లంతా గాయాలతో కొరడా కొండ చిలువతో
బాదుకునే పెద్దామ్మోరోడి కొరడా మోతలు నా ఒంటి మీది
గాయాలు. చీకటి పడేదాకా ఇసుక వాగులో ఆడిన కబడ్డీ ఆటలు
కట్టుకున్న పిట్టగూళ్ళ మహళ్ళు. . .

ఎప్పటికీ మాసిపోని మచ్చలు మరువలేని
మధురానుభూతులు  మరణించే మనిషి బతికుంటే జ్ఞాపకం
తడారని మనసుమీది పచ్చబొట్లు.

# మాట్లాడతాను మనిషిగా. . .

మాటే మనిషికి ప్రాణం
మాట్లాడే వాడే మనిషి
మాట్లాడతాను మనిషిగా

* * *

మట్టి మడతల కింద మాసిపోతున్న కుల వృత్తులోంచి. .. . నయా వలస వాద పెట్టుబడిదార్ల యంత్రాల్లో పడి నలిగిన చేతివేళ్ళ కన్నీళ్ళ బాధల్లోంచి... మా తాత తండ్రులు బిగించి వదిలిన నాలుక నారీ శబ్దాల్లోంచి... మాకుల వాయిద్యం రుంజనాదాల్లోంచి. ... వాడిన పనుముట్ల పదునుల్లోంచి... వాళ్ళ మునివేళ్ళ చివర్లల్లోంచి ... నగల్ని చేయడానికి సానపెట్టుకున్న కళ్ళ తీక్షతల్లోంచి... కొత్త నగల్ని చేస్తున్నప్పుడు పడ్డ మనో సంఘర్షణల్లోంచి ... ఆ పల్లె కళాకారుల కళా
నైపుణ్యాంల్లోంచి... పగిలిన మా కలల్లోంచి ... ఒలికిన కన్నీళ్ళల్లోంచి. . . చితికిపోయిన బతుకుల్లోంచి. . . ఆకలి మంటల్ని ఆరిపేసిన నీళ్ళ గ్లాసుల్లోంచి. . . ఊరు మొత్తంలో ఒంటరైన మా తాటాకు ఇంటి చూరు లోంచి. . . మా 'వెనుకబడిన తనం' లోంచి. . . మా తెలంగాణా జీవిత అమాయకత్వంల్లోంచి . . . మా పల్లెతల్లి బీడువారిన తనంలోంచి. . .

* * *

మట్టిలోకి దూసుకుపోతూ
కొత్తదారుల్లోకి సాగిపోతూ
మా గాయాల పాటల్ని
మీ చెవుల్లోకి ఒంపుతాను
బకెట్ల కొద్ది బాధల్ని చేది
మీ దోసిళ్లు నింపుతాను

# బెల్లి యాదయ్య

## ఎడారి ఓడ

నేను దగాపడ్డ తెలంగాణా బిడ్డను
నీ బాంచన్దొరా కాల్మొక్తా గడ్డను

చుట్టూ జీవనదులు ఉప్పొంగుతున్నా ముంతెడు నీళ్ళకు
అలమటిస్తున్న ఎడారి ఓడను
శిలా ఫలకాలు పడి పుష్కరాలు గడుస్తున్నా అమలుకు
నోచుకోని రంగుల శాసనాల స్మశాన నీడను

బొగ్గు బట్టీ నరుక్కుతిన్న చెట్టు మొదట పిట్టగూడై
విలపిస్తున్న గతం నాది
లోవోల్టేజికి కాలిన కరెంటు మోటారులా పేగులు
కమిలిన వర్తమానం నాది
ఎండిన నారుమడి చెప్పిన కరువు తీర్పుతో ప్రాణం లేని గోమాతలా
వధశాలకు చేరుతున్న భవిష్యత్తు నాది

నేను దగాపడ్డ తెలంగాణా బిడ్డను
నీ బాంచన్దొరా కాల్మొక్తా గడ్డను

హార్లిక్స్ తాగి చక్కటి పాపెడవై
ముచ్చటైన యూనిఫారమ్‌వేసి సర్దిన బ్యాగులై సంతాకలు చేసిన డైరీలై
మాంటిస్సోరి కలలుగా ఎదగాల్సిన నా లక్షలపాలబుగ్గలను
పేదరికం పాశం పసులకాపరులుగా మార్చి కంపకట్టెల్లో మండిస్తోంది,
అడ్డంకుల సంకెలలు త్రెంచుకుంటూ
అక్షర కాంతుల్ని విశ్వవిద్యాలయపు పతకాలుగా ధరించిన
నా వేల హార్సపవర్ల యువత
ఉపాధికొరవడి తుపాకులై పేలుతుంది.

ఎన్‌కౌంటర్ చదరంగంలో నేల కొరుగుతున్నదెవరైనా
నా వాకిలే అశ్రువాహిని -
సచివాలయ సముద్రం ఎప్పటికప్పుడు ఉప్పెనై

కుర్చీ స్వరాలు రాకుండా ఈ కోటి రత్నాల వీణతీగలను
బంగ్రోతు శ్రుతిలోనే కప్పేస్తుంది
డాలర్ వారసులు నా బీడు భూముల్లో ఫ్యాక్టరీలుగా అవతరించి
నా సోదరగణాన్ని పొగ గొట్టాలుగా మార్చుకుని
కపటౌదార్యం ప్రకటించుకుంటున్నారు.
పెంపకంలో పంపకంలో ప్రభుత్వాలు చూపే సవతితల్లి
ప్రేమకు నా నందికొండ కాలువే నినదించే సాక్ష్యం -

నేను దగాపడ్డ తెలంగాణా బిడ్డను
నీ బాంచన్దొరా కాల్మొక్తా గడ్డను

వరి నాటుకూ కోతకూ నా జిల్లాల నడుములే బాగా వంగుతాయి
ఏపుగా పెరిగిన చెరుకును తరగడానికి ఈ పల్లెల
కొడవళ్లే పదునుగా వుంటాయి,

నా జనప్రభంజనాన్ని తూర్పుకు మోసుకు పోవడానికి
దూరాన్ని హారన్ మోతలతో కొలుస్తూ దూసుకొస్తున్న లారీ వలస దిక్సూచి
ప్రతి యేటా ఎన్నో ఉజ్వల బాల్యాల బడిగోడల్ని కూలగొడుతోంది

నాప ధూళిని అంబలిగా కలుపుకుతాగేవాళ్లు
దూదిపూలపై ఆశలుడిగి అసువులు బాసేవాళ్ళు

సగం సగం తింటున్నవాళ్లు
క్షణం క్షణం చస్తున్నవాళ్లు
గుడ్డి దీపాల చెంత మరుగుతున్న కన్నీళ్లు
బంజారాహిల్స్‌పునాది రాళ్లు, జూబిలీహిల్స్ పూలకుండీలు

మూసీనది మురికి పాయల నానుతున్న కాపురాల దేరాలపై రెక్కవిప్పే

మట్టి పావురాలు నా నిర్మల్ బొమ్మలే, నా మెతుకుసీమ బతుకులే-

రాష్ట్రలక్ష్మి అభివృద్ధి సంచికలుగా వెలువడే రహదార్ల పుటల్లో ప్రత్యక్షరం
నా పాలమూరుసంతతే

నేను దగాపడ్డ తెలంగాణా బిడ్డను నీ బాంచన్దొరా కాల్మొక్తా గడ్డను-
చదువులతల్లి సరస్వతి నా బాసరతీర్థమందే వెలిసినా గిట్ల
నా యాసను వెండితెరపై రౌడీ.మూకల భాషగా చూపెట్టడం
పార్లమెంట్ మీద జరిగిన  దాడికంటే పెద్దకుట్ర
సహజపాండిత్య వారసత్వమున్నా
పాఠం వినడానికే తప్ప చెప్పడానికి అర్హతలేకపోవడం
కార్పొరేట్ బందిపోట్ల చర్య -
బట్టకు రంగులద్దడంలో ఎంత పేరుంటే మాత్రం ఏంలాభం
బతుకే ఒక అవమానపు మడతల వస్త్రమైనప్పుడు,
టన్ను పేపర్ పార్సిలు నైతే మాత్రం ఏంప్రయోజనం నా
చంటిపిల్ల చెంపగడ్డలకు మర్రిపాలతో అతకడానికి
ఇంతకాయితమ్ముక్క ఇంట్లో లేనప్పుడు,

నా గళ్లలుంగీ కట్టి నా చిన్నిబీడీకాల్చిన నటులంతా హీరోలైనా
నేను మాత్రం జీరోనే,
కండ చెక్కెర తయారుచేస్తున్నా
కప్పు టీ తాగడం ఇంకా నా గుడిసెలకు అలవాటు కానేలేదు, నల్లబంగారం
విరివిగా పండుతున్నా చీకటి బరువు దించుకున్నది లేదు, పట్టు చీరలు
నేస్తాం పాత చింపులు తప్పించిలేవు
ఉన్ని కంబళ్ల నిర్మాతలం చలికి వొణకని రోజే లేదు,
దట్టమైన అరణ్యాల్లోంచి వస్తున్నా పట్టెమంచానికి కోళ్లేలేవు,
బీద డొక్కలకు పంపిణీ జరగాల్సిన భూమి లెక్కదప్పి
ఏ ఎస్టేట్కో పట్టాఅవుతోంది.

నేను దగా పడ్డ తెలంగాణా బిడ్డను
నీ బాంచన్దొరా కాల్మొక్తా గడ్డను

స్వరాజ్యానంతరం
ఏ చరిత్రా కారుడు రాయలేని గొట్టపుబావి విషాదాన్ని

చిత్రకారుడు వేయలేని ఫ్లోరిన్ వదనాన్ని

ఏ శిల్పాచార్యుడు చెక్కలేని  అష్టావక్రుణ్ణి,

బాగా నిర్లక్ష్యం చేయబడ్డ వాణ్ని-

భాగమతి చెంపలను సైబర్ వేళ్లు గిచ్చి పోవడాలొద్దు
నాచంకల్లో ఫిల్మ్‌సిటీ చెక్కిలిగింతలొద్దు
బేగంపేట బులిబుచ్చికాయలొద్దు

అస్మదీయ తస్మదీయ గోముఖవ్యాఘ్రాలు కూర్చుని చేసే
చర్చల కుంకుడుకాయ రసమర్దనంవద్దు

భేషరతుగా

ఇప్పుడు
నాకు నా నేలకావాలి
నాకు నా గాలికావాలి
నాకు నా నీరుకావాలి
నేను నా ఊరుకావాలి

నాకు దారి చూపే గుప్పెడు నిజాయితీ కావాలి

నేను తిరగబడ్డ తెలంగాణా బిడ్డను -

## బోడ జగన్నాథ్

# బోనగిరి

బోనయ మాకు ముత్తాత
గిరమ్మ మా అవ్వకు అవ్వ
అందుకే అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ
మా భువనగిరి మాకు పేగు బంధం
ఈ గిరి శిఖరం
గడచిన శతాబ్దాల తీపిగుర్తు
మా తాతలు నడిపిన యుద్ధాలకు కసరత్తు
ప్రజా ఉద్యమాలకు ఆయుధమైన విచ్చుకత్తి
అనాది నుంచి మా పునాదుల్ని
గట్టి పరచిన ఈ కొండ
మా చరిత్రను దాచుకున్న అమ్మ ఒడి
మా బాధల్ని మా ప్రజల కరువుల్ని
దాచుకున్న కన్నీటి తడి
ఎన్ని మరణాలకు కారణమైందో కానీ
ఎన్ని చరణాలకు లయలు కూర్చిందో కానీ
ఎందరి జ్ఞాపకాల కత్తెరలో స్వప్నకుసుమ మైందో కానీ
ప్రకృతి సిగపాయలో ఇందీవరమై భాసిల్లుతుంది
వర్షంలో అందమైన జలపాతం అవుతుంది
ఎండలో విప్పుకున్న వెండి గొడుగౌతుంది
మంచులో ముడుచుకున్న హిమఖండమౌతుంది
ఆరు ఋతువుల్లోనూ రమ్యమైన నెమలిపింఛమౌతుంది
అప్పుడప్పుడూ మా వయసు పిల్లలకు
స్కేటింగ్ పోటీ అవుతుంది
ఊదారంగులో నిద్రపోయే ఈ కొండ
మారాం చేసే మా పసిపిల్లలకు
నల్లని బూచిగాడు
చిరునామా తెలియకున్నా చేయిపట్టుకొని

చిట్టి తల్లిలా గమ్యానికి చేర్చే కొండ గుర్తు
చుట్టు ప్రక్కలా మాకున్న ఒకే ఒక్క చుట్టం
ప్రయాస పడే ప్రయాణికులకు
పలుకరించే చారిత్రక ఒయాసిస్సు

# బాల్యఛిద్రం

నా బాల్యం భవిష్యత్తు బారేజీ లేకుండా
అలలు అలలుగా సాగే సాగరం లా ఉండేది
పిల్లలమంతా కలిసి ఆడుకుంటున్నప్పుడు
రచ్చబండ రంగుల పూల దండలా మారేది
వర్షంలో మా ఊరు మయూర నృత్యమైనప్పుడు
మేం పిల్ల కొంగలమై గంతులేసేవాళ్ళం
కానీ మా అమ్మ నావీపు మీద చరిచి
పుస్తకాల్ని భుజాలకి వ్రేలాడ దీసినప్పుడు
కత్తులు గుచ్చుకుంటున్నట్టు బాధ పడే వాణ్ణి
ఆమడ దూరం అడవిలాంటి మళ్ళు
దాటుకుంటూ బడికెళ్ళాలంటే
కాళ్లని ముళ్లు అల్లుకొని పోయేవి
ఇసుక రేణువులు కాల్చిన సూదుల్లా గ్రుచ్చుకునేవి
ఇనబింబం నాముఖం చూసి నవ్వుకునేది
రాత్రులు నాన్న తన వ్యసనంతో
చమురు దీపాలను ఆర్పుతున్నప్పుడు
ఆ గద్దింపుల మైకంలో
గద్దకు జడిసిన కోడిపిల్లనై
అమ్మ చేతుల రెక్కల క్రింద ఒదిగే వాణ్ణి
అక్క చెప్పే పొడుపు కథ వింటూ
చుక్కల్ని లెక్కపెట్టె వాణ్ణి
ఊహ ఎదుగుతున్న సమయం
విత్తిన విత్తు భూమిలోనే
గూడు కట్టుకుంటున్నప్పుడు
రెండో అక్క శరీరం నిండుగా
బట్టలు కావాలన్నప్పుడు
పటేలు ఎద్దులకు మూపులుగా
నాచేతుల్ని నాన్న తాకట్టు పెట్టిన క్షణం

నా బాల్యం గావుకేక పెట్టింది
ప్రతీ పండక్కి పటేలు అణా
నా చేతిలో పెట్టినప్పుడే
భవిష్యత్తు పక్కున నవ్వింది
ఎండ మావుల్లో వెండితీగనై కరిగి పోతున్నప్పుడు
దొర గోదామును చెమటతో తడుపుతున్నప్పుడు
అంబలి మాత్రమే నా గొంతును తడిపింది
అమ్మ మాత్రం ఓదార్చటం మరచి పోయింది

# భైరెడ్డి కృష్ణారెడ్డి

## దేవులాట

యాన్నించి వొచ్చిన్రొ యేమ్మాయ జేసింద్రొ
కండ్లల్ల దుంబోసి బుగ్గిపాల్జేసింద్రు
గుండె చెరువైపోయి కడుపు రగులుతుంది
అవిసిపోయిన పానవల్లాడి పోతుంది

కోడిపంజు కుయ్యంగ పేడకల్దీసేసి
రేకల్లు బారంగ గాల్లల్ల గడ్డేసి
ఆవుతల్లుల కాల్ల తారాడుకుంటుంటె
ఊపిరై నిండిన ఉచ్చుగచ్చెటుబాయె

గొర్కోల్లు గుంకంగ అయ్యమ్మ లేపంగ
కండ్ల పూసులు తుడ్సి పుకిలించి నీల్లూసి
బిరబిరా మోకెత్తి మోట కొట్టిన నడవ
ములుగఱ్ఱ పాడిన తత్వాలు ఎటుబాయె

పచ్చజొన్న గట్క గంగబాయిలి కూర
సద్దరొట్టెలయెన్న కలిబువ్వ సలబొట్లు
కుడుముల్ల పానకం కొసిరి కొట్లాడిన
సిబ్బిరేకుల అటికె కుండల్లు ఎటుబాయె

దంతెల్ల గుంట్కల్ల బురద గొఱ్ఱుల్లల్ల
నల్ల రేగల్లల్ల నాగండ్ల చాల్లల్ల
అమ్మలకు అయ్యలకు బువ్వ బెట్టాలనీ
రిక్కపెట్టిన పరుగు రంకెల్లు ఎటుబాయె

యాతకొచ్చిన నారు కాసెపోసిన నడుము
యిరువాలు పైసాలు సెయ్యిసాసిన మడులు
మాలోల్ల మైసమ్మ అడుగుల్లకైతైన
ఉయ్యాల పాటల్ల కండ్ల నీల్లెటుబాయె

తుమ్మల్ల సంద్రల్ల వాగుల్ల వంకల్ల
సీటారు కొమ్ముల్ల పులపులా సినుకుల్ల
పసులల్ల పొరగాడు పైరగాలైపోయిన
చిలక కొరికిన మాట రేలపాటెటుబాయె

ఎరజొన్న సేలల్ల పూనాససొప్పల్ల
బుడుమొద్ల సొల్లల్ల బూతరాకాసుల్ల
కమ్జుల ఈకల్ల గోరింక రెక్కల్ల
సుంకు తొడిగిన పాల మనసులువి ఎటుబాయె

పక్కింటి గంగమ్మ మనవడా రమ్మని
పందిట్ల మంచంల కూసో బిడ్డా అని
ఉంటనో పోతనో యాదిలుండాలని
పచ్చల్ల పొడిసిన పావురం ఎటుబాయె

గొల్లసుద్దుల డోలు సిందోల్ల మద్దెల్లు
కాటికాపని శంకు బైండ్లోల్ల భేరీలు
డప్పుల్ల కొమ్ముల్ల అస్సైదూలాలల్ల
నడకల్నేర్పిన పల్లె ఉగ్గుపాలెటుబాయె

కట్టమీద మైసమ్మ అమ్మపోలేరమ్మ
గడికాడ పోతరాజు గుల్లె ముత్యాలమ్మ
గవుండ్లోల్ల సూరిగాని కావడెక్కిన కల్లు
సివమెత్తి సిగమూగె యీరంగమెటుబాయె

బొడ్రాయి రచ్చబండ గుట్టంత ఆంబోతు
ఊరబాయి మర్రిచెట్టు తేనెటీగల తెట్టె
మర్లబందం ఈత కోతికొమ్మల ఆట
పదమైన పసితనపు సుద్దులవి ఎటుబాయె

ఆదిక్కు తెలిసింద ఈమూల గురుతేన
అలి దొరుకుతాది కొలువు దొరుకుతాది

సేతుల్లగీతల్ల శాట్లల్లగింజల్ల
కొలుపుసెప్పిన ఈత బరిగెల్లు ఎటుబాయె

మంచెమీదెంకన్న మంచెకిందెల్లమ్మ
వొడిలేలలో రాయి వొల్లోన గోంగూర
ఆ గెట్టు ఈ గెట్టు కాపలలు కాస్తుండ
సరసమాడినపక్క గడ్డిపూలెటుబాయె

బతకమ్మ తంగెల్ల ఒక్కొక్క పువ్వుల్లు
గట్టు జాతరకాడ గాజుల్ల మోజుల్లు
సొమప్ప తిరనాల సిలకల్ల అలకల్లు
మేనెక్కి సిగ్గైన అల్లరది ఎటుబాయె

దాగుడుమూతల్ల ఎన్నెల్లకుప్పల్ల
యీడొచ్చి పైటైన కొత్తపెళ్ళిపిల్ల
సిడతల్ల భజనల్ల కోలాటమాటల్ల
గజ్జె కట్టిన మగని కనుసైగ లెటుబాయె

# భవాని శ్రీనివాస్

## మారని బతుకులు

అసలు గీ సర్కారుందా? సచ్చిందా?
గాల్లకు మేం మనుషుల్లా కనిపిస్తున్నామా?
ఓ బిందెడు నీళ్ళకోసం
మూడు మైళ్ళు నడిచి
గాల్లందర్ని గుంపుగా జూసి
పానం పోయినట్లాయే. . .
గట్లని ఇంతదూరం వచ్చి
కాలీ బిందెల్తో ఇంటికి పోలేంగా. . .
పొయ్యి మీద ఎసరెట్టకపోతే
నా పొల్లగాల్లకు
కూడు ఎట్టాపెట్టను?
ఆరం పైనయ్యింది తానంచేయక
బట్టలు కంపు అసనేస్తున్నయ్
ఏరే ఊళ్ళో సదువుకని పోతే
నా పొల్లగాల్ల దగ్గర అసనొస్తుందని
ఆల్ల సోపతిగాల్లు
ఏతాసికం చేసి దగ్గరకు రానీక పోయే
గీడ గింత పెద్ద చెర్వుంది ఎం లాభం?
గిల్ల బర్లు పందులు ఈత గొడ్తయ్
గా సాకలోల్లు కూడా
గీడనే బట్టలుతకబట్టిరి
గట్ల గీనీళ్ళు గలీజయిపోనాయ్
గందుకే గా చెర్వునీళ్ళు బాలేవని
చెర్వు పక్క గుంటలు తవ్వుకుంటున్నం
గీ గుంటల్లో నీల్లూర్తేనే
మా పాణాలు నిలబడేది.
గీ గుంటల కాడ కూడా

బల మున్నోల్లకే
నీళ్ళు దొరకబట్టి
మైళ్ళ కొద్ది నడిచి కాళ్ళు పీక్కపాయే
నీల్లు లేక గొంతులెండి పోయే
గింత దూరం మొస్తే
గీడ నీళ్ళు దొరకవ్
నాయకులొస్తుంటరు పోతుంటరు
ఓట్ల కోసం  దండాల్‌పెడ్తరు
మాకది జేస్తం ఇది జేస్తం అంటరు
గెల్చినాంక మళ్ళీ కన్పించరు
అక్కరొచ్చి నప్పుడు అసల్కి కనింపించరు
మా ఓట్లతో గెల్చి
మమ్మల్ని మర్చిపోతరు
మా బత్కులు మారవ్ ఎప్పటిక్కీ

# మద్దెల శాంతయ్య

## తెలంగాణ

ఏం రాయమంటవు శంకరన్న
సాయుధ పోరాటం అన్నోన్ని
ఇంట్ల పీనుగెల్ల అయిశ్ పోరగాళ్ళందరు సచ్చిరి
అసల్ కిరికిరి అంతా ఆడ్కెల్లె సురవైందనుకోరాదు

గౌండ్లొనికి పలుగురాయే కరవై
అది అలిగి అటకెక్కింది

మాదిగ డప్పులు మూగబోయినయ్
మాలల మగ్గాలు మాయమయినయ్
ఏమి రాయమంటవ్ శంకరన్న
తీరొక్క చిత్రంగుంది
ఇక్కడి బాధలు చెప్పుదుకంటె
తిర్పతెంకన్నను బొత్తలపాలెం తోల్కొచ్చుడేనయం

ఎవని బాధల్ రాయమంటవ్ శంకరన్న
వూళ్ళకు వూళ్ళే గోస తీస్తాన్నయ్
గత్తరొచ్చిన తీర్గనున్నయ్ వూళ్ళన్నీ
వషపడ్తలేదు ఏం చెప్పాల్నో

పంటలు పండక పెద్ద రైతులే
పట్నాలకు పక్షులెక్క పోబట్టిండ్రు
మేత లీళ్లు లేక పస్‌లను కోతలకియ్యబట్టిండ్రు
ఇండ్లండ్ల ఇసురాళ్లు తిర్గ చానదినాలాయె
నడిమిట్ల అయశ్ పోరీ పోరగాళ్ళంతా
అంత సైజెస్తమని అడవులు బట్టిండ్రు

మంగలి పెంకలు సుస్తమన్న కండ్లబద్దలేపు
బాగోతాలు జెప్పె బుడ్గజంగమోళ్ళు ఎటుపోయింండ్రో ఏమో. . .
కాలం కల్సి రాకపోతాది –
కాపోళ్ళ రెడ్డోళ్ళ సంగతి సూడమాతియ్
చేపల తోట్లలోని చాపల్లాగ ఎవరొచ్చిన
సమస్య; సమస్యగానే ఉందన్న శంకరన్న –
యాభై ఎండ్లకుమీన మనోళ్ళు మందోళ్ళు కల్సి
పది జిల్లాలకు అర్రెకార్సుతున్న పస్ల లెక్క
మెదలెత్తకుండ గుదెలేసింండ్రు

మడికట్లల్లో ఒట్టిపోయిన
తాళ్ళను గొడ్డళ్ళతో కొడుతున్న శబ్దాలు
ఇక ఆగొద్దు – బొత్తలకు బొత్తాలే మెదలకేద్దాం రండి.

మనమాడిన ఆటలు లేవు పాటలు లేవు
తైతిల్‌నాధు చాపలు పడ్తమని పోదమంటే ఎర్రల జాడలేదాయె
గురుకోళ్ళను జూసి లేచే రైతులు
అసలు కాలాలే మర్చిపోయింండ్రు

తెలంగాణం తెస్తమని మనోళ్ళంతా
పట్నంల చంద్రన్న కలవబోయింండ్రు
ఆపడ్తే జర పైలమని చెప్పు

కొక్కొరోకో అన్న కోడికూతలు
మేకల అర్పులు ఇన్పడపాయే
ఏం రాయమంటావ్ శంకరన్న

పెనిమిటినని చెప్పుకోనీకి కూడ షరమ్ అయ్‌తాంది
పంచర్లేసే అహ్మద్ గాడు
కుట్టుమిషన్ సలీంగాడు
షెడ్డు శీను, పందిమాంసం అమ్మే రామన్న
ఎటుపోతుండ్రా లేదో తెలియద్.

కాసిన కాయలను ఇక
చెట్లమీదనే పండనిద్దాం శంకరన్న

మన పోరగాళ్ళకు పాలు మర్వకముందే
ఎ.కె. 47లు తెల్సు
మన అక్కలకు మంచెల మీదకెళ్ళి
మందు పాతర్లను పేల్చటం తెల్సు
మన రైతలన్నలకు ఆర్.డి.ఎక్స్ తెల్సు
అన్నీ తెలిసిన మనకు గింతకాలం
గుడెలెందుకోసింద్రో, ఎందుకేయించుకున్నమో
మనకే తెల్వటంలేదు శంకరన్న

అన్నా! శంకరన్నా గింతెందుకు గానీ
పది జిల్లాలలోని మన అమ్మోళ్ళు
ఎడమకాలి చిటికెనేలు దుమ్మురేపిస్తే
అందులో కొట్టుకుపోరంటవా
ఆ మందోళ్ళు వారి ప్రాంతాలకు

అన్నా! శంకరన్న
నీ కవిత్వం సల్లగుండ,
వదినమ్మకు వందనాలు
అమ్మా, అయ్య భద్రం దండాలని జెప్పు
పోరగాళ్ళు మరీ మరీ యాదకొస్తంద్రు
చెర్వుగట్టు తిరునాళ్ళకు బొయ్యేటప్పుడు
బొంగుముద్ద తెస్తనని జెప్పు
ఊకె కొట్టకు చదవకుంటె మాయె
చదివి నీవు, నేను ఏమెలగబెడ్తున్నగని
రెక్కలున్నయ్ ఆలె బత్తరు
ఉంటా

(ఈ తెలంగాణ కవితా సంకలనం కోసం మద్దెల శాంతయ్య రాసిన "తెలంగాణ" అన్న కవితే అతని ఆఖరి శ్వాస. ఆసుపత్రిలో చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాటుతూ కూడ ఈ కవితను సంకలనానికి పోస్టు చేయండని మిత్రులు శిఖామణి, మురళీకృష్ణలకు పదే పదే చెప్పాడు. శాంతయ్య కవిత నేడు తెలంగాణ రస్తా. శాంతయ్య మార్గంలో ముందుకు సాగుదాం.)

## మన్నె శ్రీనివాస్

### దిశ

నేస్తం
బాధల వంతెన మీద
బ్రతుకు బాటలు వేస్తున్నోల్లం
ఆకలి కేకల మీద ఆర్తనాదాల
గీతాల్ని వింటున్నోల్లం
ఇక్కడ మన జీవితాల్ని
మనమేగా తాకట్టు పెట్టుకుంది
మన గాయాల్ని మనమేగా నెమరేస్తుంది
ఇంకా జరపవల్సింది చాలా ఉంది. . . .
ఇక్కడ కర్తవ్యాన్ని
కాలం మీద పదును పెట్టాల్సిఉంది
పిరికి గుండెకు ధైర్యాన్ని నింపాల్సివుంది
వీర తెలంగాణ
తల్లి నొదిటిమీద
తిలకం దిద్దాల్సివుంది
మనదొక లక్ష్యసాధన
విరామ మెరగని నిరంతర పోరాటం మనది
పద . . . .
వర్తమానం పురిటి నొప్పులు పడుతుంది
రేపటి ఉద్యమ బాలుడికి
స్వాగతం పలుకుదాం
ఇప్పుడేగా మన జీవితపోరాటం ఆరంబదశ
దశదిశలుగా చాటిచెప్పడానికి
మన ఆశయ పతాకాన్ని
తూర్పుదిశగా ఎగరేద్దాం
కాలం పొత్తిల్లలోంచి
వెలుగుల్ని

వెదజల్లడానికి మంత్రసానులౌదాం
మన చీకటి తెరల జీవితాల
వీడ్కోలుకై నడుం బిగిద్దాం.

## మోతుకూరు అశోక్

# కొల్పులోల్లం

గట్ల శిత్రంగ జూడకుంఢ్రి బాంచను
పెయినిండ గీ పేగులు జట్టుకున్నందుకు
గట్ల శిత్రంగ జూడకుంఢ్రి మాపానాలవిశిపోతయి
ఎన్కటి యవ్వారం గాదని మేమేమన్నా
కొత్త పోకట వోయినాం నాయినా. . .
గంజి తీ గోలె గదే బత్కులు బత్కవడ్తిమి
గాను గెద్దోలె గట్లనే దిర్గ వడ్తిమి
ఇష్టమున్న లేకున్న గదే బుర్దల బొర్లవడ్తిమి
గట్లేమంటే కులం అక్కుబాపతంఢ్రి
మేం నోరు దెర్శి అడ్గెతందుకు మాకు నోళ్లున్నాయ్ బాంచను?
మా కష్టాలక్కాల్లున్నాయి. . .కాల్మొక్త. . .
ఈ డచ్చీ రాకముందే తొల్తబుట్టిందాన్ని ఊరిమీది కిద్వాలె
అది పరేడు పటాల్ దొక్కి ఆడ నేర్వాలె
శానైందంటే మేం ఒక్క పొద్దిడిశినట్టు
మా పోరగాండ్ల ఉసురు బోస్కోవడ్తిమి
అది కొంగెయ్య నిజాగనే ఉండది బాంచను
ఏం జేస్తం నాయినా పయిస కోసం
గడియకో గండామోలె దినాలెల్లదీస్తం
జీవి కొట్టుక లాడ్తది మీ పాదాలొట్టు మా తంఢ్రి
ఇష్టమొచ్చినోళ్ళు ఇష్టమచ్చినట్టు యాడ్కిరమ్మంటే గాడ్కచ్చి
ఏం జేశినా సావక బత్కుతుంటం నాయినా
మాకేదన్న దర్వుజూపే తంఢ్రులున్నారు బాంచను
రోగమొచ్చి పంటె మమ్ము గానెటోల్లున్నారు కాల్మొక్త
కాదుపై కాలవడ్డా దాని బతుక్కి బరోసా కమ్మి
పొద్దు పొడిశే తందుకు యాల్లున్నది
పొద్దుగూకె తందుకు యాల్లున్నది. . . మాకు
యాళ్ళ పాలున్నాది నాయిన

పురాగ పొట్ట గోస్కుంటున్నం బాంచను
లగ్గాలచ్చినా సావులచ్చినా ఆళ్ళముంగటాడాలె
ఆళ్ళ పీన్గుల ముందటాడాలె
మా పోరగాండ్లు ప్యాలా లేర్కుంటరు మేం పైసలేర్కుంటం
జోలెగట్టి ఒక్కో పైస కండ్లకద్దుకోవడ్తిమి
మేం కొల్పులోల్లమైతిమి – మా బత్కేగంతండి
మేం జచ్చినా అడ్గెటోల్లుండరు
మేం సత్తెనా నైనా మా రెక్కల కష్టమాగదు
మా ఆటలాగద్దు మమ్మ దోస్కపోయె
గా బద్దుమాశితన మాగొద్దు
మేం కుక్కలజింపిన యిస్తర్లం నయినా
మా తంద్రులు మీరు సచ్చి మీకద్పున బద్తక
మీ పాదాలసాచ్చి తంద్రి
మా కల కల వట్టిగ వోదు
తలు బెట్కోనున్నా మేం కొలుబ్బెట్టి శెప్తం
మేం కొల్పు లోల్లం నాయినా
రంగ మెక్కే కొల్పులోల్లం

# పుట్టువడి

గిదేం పుట్టువడి గాల్బాయె
మన్సుల్ల మన్షిగాను –?
మంచిగ నడుత్తామంటె అన్నీ దిప్పల్లె –
తెల్మి తెల్వన్ అద్గిచ్చి. . .బుదగరిచ్చి గదోగిదో నేర్పిరి.
పోరగాని శాతలు మాని జరనోరు దెరిస్తె
'పెత్తనమెత్కున్నావురా'. . . అంటుంద్రు ;
శాతనైన కాడ్కి కైకిలి జెయ్యవోతె
'జీతముంటావురా'. . ని. నిలేస్తడు
తాతలు. . . తండ్రులు జీతాలె జేశిరి
ఆళ్ళ లగ్గాల బాకింక అగ్గోలె మండనే వట్టె. . .!
అది సల్లారేదెప్పుడు? కడ్పు సల్లంగుండేదెన్నడు. . .?
గీ రెక్కలు గూడ పాత బాకీల కింద
రైను వెట్కున జూత్తరు ;
ఒక్కట్కి నాల్గుజేశి మిద్సులెత్తకుండ వంగవెడ్తరు –
రాత్రనక పగలనక అరొక్కతిప్పలు వడి
నాల్గు పైసలు కండ్ల జూశినమో లేదో. . .
నాల్గు నిట్టాడు లెక్క జేశినమో లేదో. . . 'సంపాదించమర్గిండ'ని
అడ్డమైన పంచాదుల్ల ఇర్కియ్య జూస్తరు –
ఎంత జేశిన ఎట్టిశాత గావట్టని
జర సద్పు నేరుత్తామంటె. . . 'నీటుకాడైతుండ'ని
నోరు వలగ్గొట్టు కోవట్టిరి!
పనికింతా సరైతదని పుస్తె మట్టెలు గట్టి
కోడలు పోరిందెస్తె . . లేని కిర్కాట్లు వెట్టి
ఇద్పు కాయిదాలదాక దేవట్టిరి –
పంచాది జెప్పుమంటె పెట్టెలడ్డంబెట్టి
ఇల్లు తెర్లు జేశిరి –
శెయ్యని తప్పులకె పుస్తెలమ్ముకోని. . .
గిన్నెబోకెలమ్ముకోని. . . కశీర్లపొంట దిర్గుడాయె;
జుర్మాన గట్టి బయటపడె యాళ్ళ
'మరినాత జీతముంటావురా'". . .
మల్ల గదే తొవ్వ – ?

# మౌనశ్రీ మల్లిక్

## అరుణా.. నేనెళ్ళిరానా?!

ఓ అమరుడు రాత్రి కల్లోకొచ్చిండు
సుట్టుపక్కల పల్లెల్లో జరుగుతున్న
అన్నాయాలను అక్కరమాలను
పూసగుచ్చినట్టుజెప్పిండు
దోపిడీ దుర్మార్గాలను దుయ్యబట్టిండు
నా భుజంమీద తలబెట్టుకొని వల వల ఏడ్సిండు
గుడిసెముందు కుంపటిని
సెగరాజేసి మంటంటిబెట్టిండు
మూలకేసిన నాడప్పుదీసి కాపిండు
కడుపెంత మండిందో
డప్పుమీద అమరుని సేతికి
ఎల్లమ్మబూనిందనుకో!
నిద్రజెదిరి కళ్ళుదెరిస్తే అమరుడులేడు!
భుజం మీద తడితడిగుంది!
పాలకుర్తిలో పాటాగి పోయిందనిజెప్పిండు
నేనెళ్ళిదరువేస్తా – కొత్త గొంతులు బలికిస్తా!
నేన్దిరిగి రాకపోతే..
ఆపెద్ద వాగొడ్డున నాగోరిగట్టి
సుక్కురారంపూట ఎఱ్ఱమన్నుతో అలికి
నీ ఎఱ్ఱచీరనూగప్పు
రోజూ డప్పును కాపి నాగోరిపక్కనబెట్టు
ఆ అమరునిలెక్క
రోజుకో పోరన్ని నిద్రలేపుతా..!
అరుణా..నేనెళ్ళిరానా..!?

## యం.డి. అహ్మాద్

# దగాపడిన తెలంగాణ

ప్రశాంత నిద్రావస్థలో
కంటి రెటీనాపై ఒక సంచలన దృశ్యం
శరీరమంతా గాయాలతో సలుపుతున్న బాధల మూలుగులతో
చింపిరి చినిగిన దేహముతో
ఎండిన కన్నీటి చారలతో
జీవధార నదులున్న
ఆ గొంతులోని జీర అవిరై
కనురెప్పల మీద కత్తులు కాపాలా కాస్తున్న చిత్రము
తెలంగాణను దగాపడ్డ తెలంగాణాను
భూమి పొరలను తొలుచుకొని
మొక్కవోని ధైర్యముతో మొక్కై
మొలకెత్తిన తెలంగాణాను
"పెద్ద మనుషుల ఒప్పందం" ముసుగులను చీల్చుకొని
వేయి వేళ్ళ గొంతులను సవరించుకొని
దీన హీన జీవిత పుస్తకమును
పుంఖాను పుంఖాలుగా కరపత్రాలై
ఎగజల్లిన తెలంగాణాను.
పరాయి ఉక్కు పాదాల కింద నలిగి పోవడ్డి
చిలుకపచ్చ చీర కట్టిన దాన్ని
మెడల నల్లపూస లేకపాయె
చిత్రాల విచిత్రాల సినిమాల్లో
నా ఊపిరిని ముక్కలు ముక్కలుగా నరుకవట్టిరి
గల్లుగల్లున సంబరాలతో
పల్లెల్లో అలాయి బలయితో తెల్లవారెదాన్ని
పల్లెల్లో తుపాకుల, తూటాల లొల్లిలాయే
తుపాకుల కంచెలాయే
నైజాం మెడలు వంచిన వీర తెలంగాణను

మాయమాటల అంకెల గారడీలో నన్ను ఆగంజేయవట్టిరి
పసందైన పచ్చని పంట పొలాలు కాజేసి
వట్టిపోయిన బీడుభూములు నా ఎదపై పరచవట్టిరి
బతుకుకు బువ్వపెట్టే తలలను
నా మెడలో హారాలుగా వేయ వట్టిరి
కష్టపడే నా కొడుకుల చెమటను
అత్తరుగా రాసుకొన వట్టిరి
ఏమిని చెప్పుదు బిడ్డా!
నా కడుపు కోత
నన్ను సందులేక తూట్లు, తూట్లు పొడవ వట్టిరి
బిడ్డల్లారా! ఓ కన్న కొడుకుల్లారా!
ఈ యముల చెరనుండి
నన్ను యిడిపీయింఁడ్రి ఇంక బాధలు పడకున్న
లొల్లి చేయంఁడ్రి, జంగు జేయంఁడ్రి
తెలంగాణా అవ్వను కాపాడు కొంఁడ్రి

# యస్. సుప్రసన్నా చార్యులు

## నేటి తెలంగాణా

నా తెలంగాణా నాడు రత్నాల వీణ!
నేడు మాత్రం సమరాంగణాల కోన!
చేతికందని పత్తి ఉత్తిదై పోయింది
చీడ పురుగును కాటేయాల్సిన విషపు చుక్క
పత్తి రైతును పగబట్టి అంతమొందించింది
మాయలేడివంటి కరువు కాంత కౌగిళ్ళలో కరిగీ కరిగీ
పూవులమ్మిన చోటనే పుల్లలమ్ముతున్న
తెలంగాణా నేడు నిర్భాగ్య సీమ!
అగ్గిపెట్టెలో అమరే జలతారు చిట్టిచీరకు
ప్రాణం పోసిన సిరిసిల్ల చేనేత వీరుడిపుడు
ఆత్మహత్యా దుర్వ్యసనానికి బానిసై అమరుడైనాడు
ఆ కళాసృష్టి కన్నవారికీ, కట్టుకున్న వారికి కూడా
చితిలో సగం కాలిన కట్టెలు మిగిల్చి
ప్రశ్నిస్తుంది మా గతేమిటని?
అనేకానేక చీకటేరులు పారి జీవితాల్ని చిదిమివేస్తున్నాయి
గుండెలు పగిలేలా వగచే తెలంగాణా
నేడు ప్రాణాలనణచు కాన!
తెలంగాణీయుల అమాయకత్వాన్ని, భోళాతనాన్ని
ఏకంగా డాలర్లుగా మార్చుకోవడానికి విలువైన
అక్రమిత వ్యాపారాలు చేస్తూ, నిజాయితీని పరిహసిస్తూ
నీ గతింతేనని తెల్లదొరని మరిపిస్తారు!
మన మాండలికానికి మసిపూసి
బాసకు, యాసీకరణకు విలనిజం రంగునద్ది మనల్ని
సోమరిపోతు రౌడిగా చిత్రిస్తాడు తోటి ప్రక్క తెలుగువాడు?
మన సంస్కృతిని వెక్కిరిస్తాడు, నాగరికతని నయవంచన చేస్తాడు.
ఇక్కడ విద్యుత్తు జనిస్తుంది, ప్రాజెక్టులుద్భవిస్తాయి ఎవరికి? ఎందుకు??
మన కోసం కాదు నాగార్జున సాగర్ కుడి ఎడమ కాలువల్ని

శిశువుకి చూపినా విశదీకరిస్తాడు నీరేవైపు పయనిస్తుందో?
నిరుద్యోగం, రాజకీయం, నిస్సహాయం, ఆక్రమణం, అవమానం
అన్నీ మూకుమ్మడిగా దాడిచేసి
రత్నాల వీణను రాళ్ళతో కదతేర్చాయి
అందుకే! నేటి నా తెలంగాణా పగిలిన పాతవీణ!

# యస్. హరగోపాల్

## పదారు తీర్ల పాట

బుగులు జరమొచ్చినట్లుంది
తెలంగాణలో ఇపుడు గూడ
రజాకార్ల గుర్రాలదండ్లే తిరుగుతున్నట్లుంది
పెరిగిపోయిన తల్లి పుస్తెల్ని పిల్లలేరుతున్నరు
దింపుడుకల్లం ఆశ సచ్చిన అయ్య కొడుకు రుధం తీరిందనుకున్నడు
మొన్ననే కాసిన మామిడి చెట్ల తీర్గ కోయిలలైన పాటలు
గాలివాన కుట్రకు రాలిపోయినై
గండకత్తెర్లేసుకుని పోయినయ్ నదులు, వాగులు
బొగ్గుతట్టలల్ల చేరినయ్ చెట్లూ చేమలు
పొద్దు పీనిగల మీద పొడుస్తున్నది
షికారి మోజులో మోస్తున్నబారు తుపాకిలో తూటా అయింది రాత్రి
గుట్టమీది గండంల ఏనుగు మోట బొక్కెన్ల ఎవలిది నిశాని నాయినా?
తుండాలు, తుండాలైన పాట, నరికి పోగులు పెట్టిన పాట
పదారుతీర్ల పాట బల్ రామసక్కదనాల పాట
గుండాలే జెండాలై ఏలుతున్న దేశంలో
మందేగుండెలు దండు కట్టిన పాట
మా అవ్వ పాట, మా తోడబుట్టిన పాట
నాట్లేసిన అవ్వకు, మోటకొట్టిన అయ్యకు
చేతికందిన పంటపాట,
కలుపుతీసిన తల్లికి, కాపుకాసిన తండ్రికి
కడుపులో బువ్వైన పాట
సొరికె కొట్టిపోయిన నీళ్ళలెక్క
చేసిన కష్టం ఎవని పాలైతుందో దప్పు కొట్టి పాడిన పాట
ప్రజలు చేస్తే రాజ్యమొచ్చిందో, రాజ్యమే ప్రజల్ని తెచ్చిందో
అన్నీ తెలిసిన బతుకుపాటల మునుం ప్రజలందుకుంటుంటే
లాఠీలై తూటాలై వేటాడిన హింస నెదిరించిన పాట
మా తోడు నీడైన పాట, పండుగలాగ కడుపు నిండే పాట

దోస్తానీలాగా మనసు నింపే పాట
మా పాట మాకు ఎవరిస్తారు తండ్రీ
మా కోయిలని మాకెవరు చూపుతారు నాయనా?

# మట్టి పాత్తిళ్ళు

పురుగులు మందు త్రాగి రైతులు
ప్రత్తిపింజెలకే ఉరిపోసుకుంటూంటే,
మెడమీద విరిగిపడ్డ కాడితో శవాలింకా
ఈ నేలలో ప్రాణాల్ని విత్తుతూనే వున్నాయ్!
చాలు, చాలుకీ ధారపోసిన చెమటలు
సముద్రాలై వెక్కెక్కి పడ్తున్నాయ్!

నాగలితో రైతులు పగులదీసిన బీళ్ళ గుండెల నెర్రెల్ని
భూమి, వాళ్ళ పుర్రెలతోనే కప్పుకుంటున్నది
తాము విత్తిన బీజశక్తులు, తమకే
పాడెకట్టి శ్మశానాలకు మోస్తున్నాయి
ప్రభుత్వం పగటి నిద్ర పోతున్నది!
ఎవడేడ్చాడు రైతులకోసం?
– దేశం వెన్నుముకల మూలుగు పీల్చే హంతకులే అంతా?

కడపు కట్టుకొని నాగలిదున్నేది
పొలాల్లో కాదు రైతన్నా!
మనుష్యుల ఎడారి గుండెల్నే దున్నాలి నువ్వు!
అన్నంలో విషం పోసుకున్న వాణ్ణెవ్వడూ కాపాడలేదు,
బలవన్మారణాల్ని శాసించిన ఈ వ్యవస్థకీ తప్పదు మృత్యువు!

దున్నేయ్ రైతన్నా, ఈ కిరాతక రాజ్యాహంకారాల్ని
దున్నేయ్ ఈ అమానుష మానవ నైజాల్ని, వలసవాదదారుల్ని
నెత్తుటితో సాగుచెయ్యి, కొత్త విత్తనాలు వెయ్యి
నేను ఒక బీజాన్నై నీ చేతిలో
మొలకెత్తనీ నీ పాదాల మట్టిలో

## యాకూబ్

# ఇప్పుడు నా పేరు తెలంగాణ

నా చుట్టూ బిగిసిన వల -
ఇపుడొక స్వప్నం గురించి చెబుదామనీ
మరొకానొక జ్ఞాపకం గురించి వివరించుదామనీ

ఎక్కడ్నుంచి వచ్చానో
ఎక్కడికి వెళ్తున్నానో
బట్టబయలు చేద్దామనుకుంటున్నాను
కానీ,
నన్నొక అజ్ఞాతుడిగా మార్చి
నా చుట్టూ కాపల -

2.
నిజానికి నా పేరు కాలం -
అనుక్షణం నన్ను వెంటాడే బతుకుల్నించి
నా చరిత్రను మలుచుకుంటుంటాను

అజ్ఞాతవాసం వంటి తపస్సులోంచి
ఎందుకు దిగివచ్చానో చెప్పడం కష్టం

నా గొంతులో తగిలే చెమ్మ మీదుగా
ప్రయాణించే జీవితం గురించి తెలుసుకోకుండానే
నా తపస్సును భగ్నం చేస్తున్నారు.
నా కళ్ళల్లోని కాంతిని ఏ మాత్రం చదవకుండానే
నా దారుల్లో చీకటినే వొంపేందుకు సాహసిస్తున్నారు

3.
ప్రవాహంలా సాగుతున్నప్పుడు
పచ్చపచ్చని ఆకులుగా
వికసించిన పూలకొమ్మగా వూగుతున్నప్పుడు

నా గొంతు కారుణ్య గీతాలు ఆలపిస్తున్నప్పుడు
నా జీవితం ఆశయాల ఆహార్యం ధరించినప్పుడు
ప్రశంసల పాలపిట్టలు నా వెనుక ఎగిరివచ్చాయి.

4.
ఇపుడు నా ఉనికి గాయం
నా కనురెప్పలపై
కునుకు
ఎన్ని సంవత్సరాలుగా ఎదురుచూస్తున్నదో
చెప్పలేను గాక చెప్పలేను

ఇపుడు కాలంతో
ముఖాముఖిగ
తలపడేందుకు
నా ఆహ్వానం -

పత్తికాయలూ
పత్తిని పండించే గ్రామాలూ
పగులుతున్న నా గ్రామంలోకి
కాదు
నా లోకి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను -
మళ్ళీ మళ్ళీ మరణించే ప్రాణాల వైపుకి
తొంగి చూడండని పిలుస్తున్నాను

5.
ఇనుప చువ్వల్లాంటి కాలువల్లో
కణకణ మండే నిప్పులాంటి నాగేటి చాళ్ళలో
నిద్రపోతున్న నీరెండిన ఏర్లలో
నన్ను నేను పోల్చుకుంటున్నాను -

ఇపుడు అండంలోని జీవిలా
గింజలోని మొక్కనై

నేనే వొక శ్వాసగా నిల్చున్నాను

ఇప్పుడు నా పేరు కవిత్వం
మరో పేరు తెలంగాణ

# యెన్నం ఉపేందర్

## మా సెరువు

మా సెరువు బవు రూపి
ఎండే ఎండకాలాన
కాష్టాల దిబ్బోలె వుంటది
అమాస చీకట్లో
మిణుగురులా మెరుస్తయి
కోపుల నీల్లు
పోత్తాడు కల్లు పట్టించి
పైకి సూత్తుంటరు
మా వోల్లు
సినుకెప్పుడు పడుద్దాని. . .
సినుకు సినుకు కలిసి
నల్లమట్టి మునుగుద్ది
వొచ్చిపోయే సినుక్కు
తూము మునుగుద్ది
ఆనంక మా సెరువు సూడాల
సిక్కంగా కలిపి
ఉట్టి మీదుంచిన
గట్క కుండోలె ఉంటది
మత్తడి బడ్డదంటే. . .
యింక మెతుకుల దిన్నట్టే
బతుకు ఆకాసాన
ఆశల గాలిపటాల
తోల్తాం
కట్ట తెగిందంటే. . .
యింక నే సెప్పలేను
పేగు దెగిన బరాబరే

# కర్రు పుట్టింది

అది ఇనప ముక్క –
కొలిమిలో పడకముందు
కట్టె బొగ్గుల నడుమ
ఊపిరి పోసుకుంది
జంట తిత్తులు ఊదంగా

నల్లబొగ్గుల కెట్ల
ఎఱ్ర రంగొచ్చెనో
కమిలి కమిలి కఱ్ఱు
సూరీ డెట్లాయనో
తెల్ల పంచెలోల్లకు
తెలియక పాయెను.

సమ్మెట దెబ్బలతో
సాగిన వాళ్ళది –
మొనదేరి వున్నది.
కొంకి మొల సందున
ఆకలి గొని ఉంది –
దుక్కి దున్నేందుకు

తుమ్మ వంకరుంటేనే
నాగలి అయ్యింది.
కొలిమిలో కాలింది గనుకే
కఱ్ఱు అయింది

ఈ 'కొలిమి' 'కొలిమి' కాదు
ఈ 'కఱ్ఱు' 'కఱ్ఱు' కాదు
దున్నేది 'దుక్కి' కాదు
కూల్చేవి 'గట్లు' కావు
కుళ్ళగొట్టేవి 'పెద్దలు' కావు

సాలు పెట్టిన కొద్దీ
గడపారిన వేర్లు బయటకొస్తున్నై
ఎదురు నిలబడబోయి
ఎళ్ళకిలా బడ్తున్నయి

సెద పురుగుల తోటి
తూట్లు పడ్డ నాగలి
గొడ్ల కొట్టం మూలన
గోడకు వొరిగిన నాగలి
'అనిచినట్టు' 'అనిగిన' నాగలి
ఎదురు మల్తుంది. . . అట్టెట్ట
సమజ్ గాట్లేదంటూ
సతికిల బడ్డరు

కొయ్య నాగలి కాదది
కొత్త నాగలి యిది
జంట తిత్తుల్లారా
గట్టిగా వూదండి
నాగలి పొట్టలోంచి
కఱ్ఱ పుట్టింది
కొత్త కఱ్ఱు పుట్టింది.

# రంగు సత్యనారాయణ

## ఊపిరికోస

సగం చే బదులు . . . . సగం ఉపాసాలు మొత్తంగా భరోసా లేని
బతుకులు అక్కడక్కడ మాడి మసైతున్నా రవ్వంత ఆశ ఊపిరిని
నిలుపుతుంది ఎక్కడో వెలితి. . అసంతృప్తి చివరకు పుట్టుక మీదే
విరక్తి ఎవరో వినిపిస్తున్నారు నీతి సూక్తుల్ని. . దైవవాక్కుల్ని ఆకలి
ప్రశ్నగానే మిగిలింది అంతా కర్మని. . . దైవాన్ని . . .
నమ్ముకోవాలని
సలహా కపటంతో మాట్లాడే వాళ్ళు ప్రామిసరీ నోటుకు నకల్లు
సెంకడ్ సేల్స్‌కి నో గ్యారంటీలా పూట గడుస్తుందనే నమ్మకాల్లేవు

ప్రేమిస్తే ప్రాణం మీదకే వస్తుంది

సగం ప్రాణం . . . సగం మరణం కలిస్తేనే నేను శవస్నానానికి
నింపిన
కన్నీటి కుండ పాడెకు వెనకా. . . ముందు ఏడ్చేవారు . . .
ఓదార్చేవారు నిజంగానే. . . . ఏడుపుల్ని నటన అనటం తప్పు. . .
తప్పు
నా కోసం ఏడుపు వాళ్ళ కోసం నటన

శోకాన్ని . . . మౌనాన్ని వేరుచేసే పెద్దర్వాజ
దిగూట్లో బందీ అయిన పంచపాళ
పొక్కిలైన వాకిలిప్పుడు దింపుడు కళ్ళంలా వుంది.

## రఘు

### కాళోజీ

రైలు దిగగానే ఊరు ఊరంతా
ఒక చిరుగాలి
రక్తస్పర్శై కమ్ముకుంటుంది
అప్రయత్నంగా
బాల సముద్రం కెరటాల్లో పడి
కొట్టుకుని పోతాను

ఎవరి ఎఱ్ఱని చరిత్ర వింటే
తెలంగాణ వేడినెత్తురు
ఉద్వేగంతో లయ తప్పుతుందో
ఏ నడిచే సూర్యుడి పాదాలముందు
ప్రభుత్వాలు గడ్డిపూలై మోకరిల్లాయో
ఎవరి ధీరత్వంతో
నా నేల పునీతమై నిలిచిందో

ఆ ఊత కఱ్ఱలు లేని వ్యక్తిత్వం
నన్ను వివశుడ్ని చేస్తుంది
అరమరికలు లేని చైతన్య శిఖరం చేతిస్పర్శ
ఒక పాటై తనువంతా ప్రవహిస్తుంది
ఇప్పుడు జ్ఞాపకాల గుండెల్లో
నిశ్శబ్దానికి శీర్షోదయం అయ్యింది
నరాల్లో నిప్పురవ్వలు నింపుకున్న వాడిని
చీకట్లేం చేస్తాయి?
నేనొక బిగించిన ఫిడేలు నౌతాను
త్యాగాలతో జాతిని అభిషేకం
చేసిన వాడిని స్మరిస్తూ
మట్టినిండా పోరాటం నిండిన
హన్మకొండ వీధుల్లో తప్పిపోతాను.

## రవీంద్ర నూటెంకి

# గిది తెలంగాణా

అవ్వతోడు, గిది తెలంగాణా!
గిక్కడ
బత్కుమీది కన్నా
మనిషి మీది కన్నా
మట్టి మీన్నే పావురం!

గీ మట్టి పరాయి దైనందుగ్గాదా
బండెనుక బండి పదారు బండ్లు గట్టి
నిజాం సర్కరోనికి గోరీ గట్టింది!
 గీ మట్టి కిరాయి దైనందుగ్గాదా
పొద్దుగూకని రాజ్జానికి పొద్దుపొడుపు లేకుండా జేసింది!
గీ మట్టి గడీల గుత్త సొత్తైనందుగ్గాదా
రగలే జెండాలై మొలిచి రైతుల అండ నిలిచింది!
. . . . .

పిప్పరమెంటిచ్చి పిలగాన్ని బుదగరిచ్చినట్టు
అద్దద్దంటున్నా 'ఇశాలాంధ్ర'కు తలను జేత్తె
కలిసుంటే కలదు సుకమనుకొని ముర్సిన
బతుక నేర్సినోనివి బాటసారోలె వత్తె
బతుకుదెరువు జూపి బందుగును జేసుకున్న
మరి నువ్వేం జేసినవ్?

పెద్ద మనుసులొప్పందాన్ని పెద్దల్లో గలిపినవ్
610 జీవోని అడుసులో తొక్కిపెట్టినవ్
మా కంట్లె కారంగొట్టి మా నౌకర్లు కాజేసినవ్
మా నోట్లె మన్నుగొట్టి మా మట్టి నోళ్ళు గొట్టి
మా జీవనదుల్ని నీ జలనిధుల్ని జేసుకున్నవ్
పోనీలే మనోడే అనుకున్నా

గియ్యాల గాపోతె రేపన్నా
నాకు నాయం జరక్కపోద్దాని
పచ్చోలె ఎదుర్జూసిన

తెలంగాణోళ్ళంటే తెలివి తక్కువోళ్ళన్నా
నీ యాస నేర్పిన నీ యేషం గట్టిన
గియ్యాల గామట్టే వల్లకాడై పోతంది
మా బత్కులే ఏడార్లై పోతున్నై
ఇగెట్లూకుంట?

పెండ్లైన నెల్లాళ్లకే కట్టుకున్నదాన్నిడ్సి పెట్టి
బొంబైవోయిన మా భీమని మీదొట్టు
ఆడిదాని తోడునీ పున్నొక్క శెల్కనీ అమ్ముకొని
దుబాయి వోయిన మా దుర్గని మీ దొట్టు
కూడుగ్గతి లేని శెయ్యి బిగించిన ఎఱ్రని పిడికిలై
అడివిల అన్నాలమై పోయిన మా రాజన్న మీదొట్టు
గడ్డీ గాసంలేక దేశదేశాల నోళ్ళలో
మాంసం ముద్దలైతన్న మా గొడ్డూగోద మీదొట్టు
ఇగ శేతులు ముడ్సుకొని కూకోను
మట్టి మీన్నే మమకారం బెంచుకున్నోన్ని
గీ మట్టిల్నే పానాలు బెట్టుకున్నోన్ని
గా మట్టికోసం పోరాడుడు నాకు కొత్తగాదు

# రాజ్‌కుమార్

## అంటుకుంటున్న ఎలగడ

జలపాతాలను ధారబోయడమే తప్ప దోసెడు నీటిని
నిలుపుకోలేని నా తల్లి
మీ కంటికి నా తల్లి చేతికి ఎముక లేనిదో ఇంగితం లేనిదో ఏమైనా
మేం మాత్రం ఈ గట్లపై గట్టున కొట్టుకునే చేపలం

పగుళ్ళువారిన నాతల్లి  నల్లరేగడి పెదాలపై మీ ప్రాజెక్టులు నీళ్ళు
చల్లగలవా?
జారిపోయిన కొండవాగులు కొండెక్కి రాగలవా?
విపరీత సందర్భాలు విపరీతమైన ప్రశ్నలే సంధిస్తాయి
భౌగోళిక సానుకూలతను తమ భౌతికశక్తిగా భ్రమిసేవారికి
ఈ ప్రశ్నలు దొంగకు తేలుకుట్టినట్లే ఉంటాయి.

మా అడవుల్లో వేట మీ పూర్వుల సరదా ఆ అడవుల్నే వేటాడుతున్న
సరదాలు మీవి
పుల్లా పుడక పువ్వుకాయ తేనె బంకలనిచ్చి సాకే చెయ్యినే
నరుక్కుపోతుంటే
ఎన్నాళ్ళని కన్నీళ్ళ మలాం పూస్తూ బతుకుతాం. . .
పచ్చదనం ఆవిరైన మొండి బతుకులే
పదునెక్కిన బరిసెలౌతాయని మరువొద్దు
ఎక్కడి నుంచో మమ్ముల నుద్ధరిద్దామని ఉద్యోగధర్మంగా
చంకన సంచితోవచ్చి లారి చంకనెక్కి వెళ్ళారే. . .
అసలు ఉద్ధారితులెవరన్నదే మా ప్రశ్న?
ఉన్నన్నాళ్ళు
మా రూపును మాటను కష్టాలను కన్నీళ్ళను సంతోషాన్ని సంబరాన్ని
సమస్తాన్ని
ఛెకిలి మాటల ఏవగింతల సూదులతో పొడిచి పొడిచి
బతుకును గాయాలతో అలంకరించడమే కదా
మీరు చేసింది

మా అమాయకత్వం అజ్ఞానాల క్షేత్రాల్లో మీ ఆధిక్యతల
తుపాకులు నాటి
మా అడవుల్ని రణరంగం చేశారు
మీ బూట్ల చప్పుళ్ళు మా గూడాల్లో మందుపాతరలై
పేలుతున్నాయి
ఏకకాలంలో మా గుండెలో వెన్నులో దిగబడుతున్న
తూటాలే కదా మీ పరస్పర దాడులు
మీ భిన్నమార్గాల ఆధిక్యతను మసి చేసేందుకే
అడవిన ఎలగడ వ్యాపిస్తున్నది
మీ రూపవైవిధ్యపు నాగరికి విషనాగం కోరలు పీకేందుకే
తుడుం మోగుతున్నది
మీ భ్రమల వేదికను భగ్నం చేసేందుకే
గుసాడి గజ్జె కదుతున్నది.

# కొత్త తోవ

కండ్లల్ల వొత్తులేసుకు జూస్తున్న ఊరు
మొండి మొగులు చిన్న తిప్పైన జాడలేదు
ఉన్నదూది వాము మబ్బు కరుగుడు కల్ల
సుక్క రాలుడు కల్ల

పొలం నాల్కె పంటకాల పిడస కట్టుకుపాయె
వొరి గొల్సులెయ్యక మునుపె గొడ్రాలిగ ఎండవట్టె
బుడిబుడి నడకల ఎండ్రికాయలు
ఒడ్ల పొక్కలిడిసి తూముల కుర్కవట్టె
తూముకింద రాల్ల నడిమిల్లు
బెల్లంగొట్టిన రాయోలె గోండ్రుగప్ప

ఈ పాలికి పొల్లగాండ్లు చెర్ల మెరుపులు పూయించెటోల్లు
పాడుకాలమొచ్చి మర్రినీడల్ల వూగే వూడలైపోయిరి
గడ్డి పోచ కరువై
గుట్ట కోటి చెట్టుకోతైన గొడ్డుగోజు

చెరొడ్డున మూతుల్లేని కాగులు పొయిరాల్లు యిడిసి
ఉతుకులు లేవు ఊపిరి విసురులు లేవు
యిరుగ మరుగ పెరిగన బేషరం చెట్లు
యాడనో ఓ కాడ
గుంటలల్ల కప్పగుడ్ల కళ్ల బురదనీల్లు గాక
ఏమున్నయ్ చెర్ల?

పొద్దు గూకె పాలికే పల్లెకట్టం
పచ్చగడ్డి మోపునో పళ్ళు కాయల గంపనో
ముల్లెనో మూటనో నెత్తికెత్తుకు ఇల్లు చేరేది
కరువు కాలం పాడుగాను
తల్లుల తలలకు నీల్లకుండలు మొలిపించె
అడీల తోవ తప్పిన మనిషి ఏదో తోవల నడుస్తనే
వోతడుగని నడక నాప్తడా?

ఊరేగింపుగా. . .
అనుమాండ్లకు గంగనీల్ల తానాలుపోసి కొత్తచందూరం రాస్తిరి
లింగానికి గంగనీల్ల చిల్లుకుండలు కడ్తిరి
పిల్లగాండ్లు రోకలికి కప్పనుకట్టి ·
"కప్పతల్లి. . . కప్పతల్లి. . . కడుపునింపు
చాటెడంత మొగులు చేసి చెరువు నింపు"
కప్పకు తానాలు పోస్తిరి – పసుపు కుంకాలు చల్తిరి
ఎన్ని జేస్తిరని
ఊరికి పండుగొచ్చినా కష్టమొచ్చినా దేవుడేకదా!

దారులన్నీ మూసుకుపోయి
పురుగుమందు తాగిన ఊరు
గిప్పుడిప్పుడే
కండ్లల్ల వొత్తులేసుడాపి మెదడులో వొత్తులేస్తున్నది
మొండి మొగులును కాదు
నేలను జూస్తున్నది
నేలపై జరుగుతున్న మోసాన్ని జూస్తున్నది
తోవలన్నింటిని కాదని
"కొత్త తోవ" తవ్వుకుంటున్నది.

## డా॥ రామడుగు రాంబాబు

# నా తల్లి తెలంగాణ

కడుపులో దుఃఖాన్ని కళ్ళల్లో
వత్తు కుంటున్నది నా తల్లి

మా ఇంట్లో వండిన వంటంతా
పక్కింట్లో విందు భోజనానికి
తీసుకెళ్తుంటే

గంజి గుడ్డకంటిన అన్నం మెతుకులకోసం
గంతులేస్తున్న బిడ్డల్ని చూసి
కడుపులో దుఃఖాన్ని
వత్తుకుంటున్నది నా తల్లి

కన్నబిడ్డకు స్తన్యమందివ్వలేక
పరాయి కొడుక్కి పాలివ్వడానికి వెళ్తున్న
కిరాయి మనుషుల్లాంటి
కృష్ణా గోదావరుల దుఃఖ ప్రవాహాన్ని చూసి
కడుపులో దుఃఖాన్ని కళ్ళలో
వత్తుకుంటున్నది నా తల్లి

తాను కర్పూరంలా కాలిపోతున్నందుకు ఏడవడం లేదు
ఆ హారతి రాక్షసులకు పడుతున్నారని
కళ్ళు వత్తుకుంటున్నది నా తల్లి
అమ్మ ఏడుపు గురించి అన్నయ్యలు చెపుతుంటే అర్థంకాలేదు
మనింటిమీద పరాయి వాళ్ళ, పెత్తనం ఏమిటని?
తమ్ముడు ఆవేశంగా ప్రశ్నింస్తుంటే
అమ్మ దుఃఖం మరింత ఉధృతమౌతుంది.
ఎంత వత్తుకున్న అమ్మ కంట కన్నీరు ఆగడం లేదు.

కానీ ఇప్పుడు అమ్మ కళ్ళు బడబాగ్నులు వర్షిస్తున్నాయి
ఎన్నడు లేనిది అమ్మకంట్లో నీరు చూసాడో ఏమో?
బాంచన్దొరా కాల్మొక్తా అని, కూలి కెళ్ళిన నాన్న
తనకు జరగాల్సిన న్యాయం కోసం, పోరాటానికి సిద్ధమౌతున్నాడు.
ఎవడన్నడో నీటిలో నుంచి, నిప్పు పుట్టదని వట్టి అబద్ధం.

కడుపులో దుఃఖాన్ని, కళ్ళలో వత్తుకోవడం లేదు
ఇప్పుడు నా తల్లి విల్లు చేత బూనిన వీరవనిత
మేమందరం సంధించిన బాణాలం
నా తల్లి ముఖంలో, ఏడుపు కన్పించడం లేదు.
యుద్ధానికి సిద్ధం అవుతున్న రాణి రుద్రమలా ఉంది నా తల్లి
నా తల్లి తెలంగాణం

# రాళ్ళబండి నరసింహా రాజు

## నీటి చుక్కల్ని కూడేసుకుందాం రండి

అభినవ కాశీంరజ్వీ సేనల కవాతు సాక్షిగా
ప్రాణప్రదమయిన పదవులూడినందుకు
కోర్కెలు తీరని రాజకీయులు
తెలంగాణా దెయ్యాల వేషం కట్టినట్లుంది
ఆక్సిజన్ బార్‌లందే ప్రాణం పోసుకొని
మరో తెలంగాణా శిశువు కోసం
తెగ సంపర్కించుకుంటున్నాయ్.
నిజానికిప్పుడు
తెలంగాణా దారితప్పిన గొర్రెపిల్లయి
కసాయి కత్తి అంచుమీద
నెత్తుటి దెక్కలాటకు సిద్ధం చేయబడుతుంది.
. . . . . . . . . . . . . . .
మన చరిత్ర గనుల్ని తవ్వేకొద్దీ
పొరలు పొరలుగా బయల్పడ్డ
నెత్తుటి నిధుల రహస్యాలు
కాళ్ళకు కత్తుల్ని కట్టుకొని
కోడిపుంజులమై పోరినప్పటి జ్ఞాపకాల్నే వెల్లడిస్తాయ్.
ఐలమ్మెప్పుడూ గుర్తే!
మట్టిపూచిన మనిషి పువ్వు
చేటల్ని దువ్వెన్లు చేసి పంట కళ్ళం పాపిళ్ళు తీసింది
కన్నీళ్ళ కళ్ళాపిచల్లింది
వడిసేల రాళ్ళ వర్షం కోసం
నెత్తుటినదై యింకిపోయింది
నవాబోడి ఆకలికి ఎన్ని గుండెలు కవాబులయ్యాయ్
రాలిన ప్రతి నేత్రం విసిరేసిన విత్తనమయ్యింది
. . . . . . . . . . .

నిజానికి నైజామోడి చేతిన నలిగిన తెలంగాణా పోరి
సోమాలియా గాలిసోకి సొమ్మసిల్లినప్పుడు
గంజికేంద్రాల్లో ప్రాణం పోసుకున్నాం కదా!
నీటి దొంగల కోటికుట్రల్లో గుక్కెడు నీళ్ళు దొరక్క
జలనరాలు తెగి అనీమియా పేషంటయినప్పుడు
మా గుండెల్ని గ్లూకోజ్ సీసాలని చేశాం కదా!

. . . . .

ఏదైనా ఎలా మర్చిపోతాం! పెద్దమనుషుల్లారా
మళ్ళీ మళ్ళీ ఒప్పందాలు చేసుకోండి
1969ని 'క్లోనింగ్' పరీక్షలకి గురిచేయండి
మీ పదవుల దాహానికి మా అవయవాల్ని తాకట్టుపెట్టి
తెలంగాణ జూదమే ఆడండి
మీ యెడబాటు పవన ఖడ్గంతో
తెలంగాణా గుండెమీద మరో గాయం చేయండి.

. . . . . మేమిప్పటికీ
మసిబారిన మా ఇళ్ళ గూళ్ళల్లో
ఐలమ్మ ప్రాణదీపాన్నే వెలిగించుకుంటున్నాం
దొడ్డి కొమరయ్య మా కిచ్చిన ఆయుధాన్ని
గుండెల ఆకురాళ్ళతో పదునుబెడుతూనే వున్నాం
రజాకార్లనురికించిన ఊదర బాంబుల్ని
గడ్డిమోపుల్లోనే దాచుకున్నాం
వీరులొడిసిన నెత్తుటి నదిలో
తెలంగాణా పోరికి ఎదురీతల్ని నేర్పించాం.

. . . .

మమ్ముల్నెందుకిలా కదపటం
మాకెందుకు ప్రత్యేక తెలంగాణం
అది అగ్నివర్షాన్నిచ్చే దావానలం
విభజన పాత్రల్నింకా పోషించనక్కర్లేదు
మానని గాయాల భాషల్నిక రద్దుచేయవలసిందే!

. . . . . . . . .

ఇప్పుడు

కోటి జలవీణల సాగునీటి సంగీతం కావాలి
మేఘాల జడల్ని జలాల మోకుల్తో బంధించి
నెర్రెలిచ్చిన నేల మీదకు లాక్కొచ్చి జలనాట్యం
చేయించాలి
ప్రాజెక్టు రంగస్థలాలపై
అలల సంగీత కచేరీలు పెట్టించాలి
కోటి డొక్కల కూడురాగాన్ని ఆలపించాలి/
చేతయితే
జలసంగీత సాధన చేద్దాం రండి
స్వేదం చిమ్మయినా
నీటి చుక్కల్ని కూడేసుకుందాం

# రేడియం

## పోరగాడు

పసుల పోరగాడు
పొద్దుమూకినదాక గుడిసెకు రాడు
పైటాల దాక
గంజి గట్కతాగడు
సెట్టు, సేమను
పొద్దును జూసుకుంటా
యెద్వబతుకుమాట ఆలోచిస్తడు
అయ్యోరి కొడుక్కు
దొర కొడ్కు
బక్కచిక్కిన బాంచన్ కొడ్కు
బొమ్మలు గీసి
నవ్వుకొంటడు
పొద్దు మూకినాకే కదా!
పొద్దు పొడిసేది
బక్కచిక్కినోళ్ళంత బరిసెలు తీసుకొని నడిస్తే
పొద్దు పొడపుసుక్క తెల్లగైతదని చెప్తది

# లక్నారెడ్డి

## తగలెయ్యాల

ఓరీ
బతికి సచ్చెటోడ
సచ్చెన్న బత్కరాదుర
భగత్‌సింగ్ ఇంకా బతికేవుండు
ఆడిని సంపినోడు ఏనాడో సచ్చిండు -
పురుగుల్బడ్డ పీన్గోలె
ఎన్నాళ్ళుంటవ్?
మంటల్లో పడి మండరాదుర
గొంగట్లో బొచ్చేర్తె
వొడుస్తాదిరా!
గొంగడి దగిలెయ్యాలగని -
గుండె జబ్బుకు
మలాంబెడ్తె బోతాదిర
ఆప్రెషన్ జెయ్యాలగని
కిరాయింట్ల ఎన్నాళ్ళుంటవ్
కొత్తిల్లు కట్టుకోరాదుర
ఓరి బత్కి సచ్చెటోడ,
జర సచ్చెన్న బత్కరాదుర. . . .

# వఝల శివకుమార్

## ఉలిపిరి ఆశ

నా మట్టి నిస్సారమైంది కాదు
రైతూ సోమరి కాదు
గుంటుకలు కొట్టి దుక్కి చేసి
పారకం పెట్టుకోవటమంటే
భూమితో కష్టం సుఖం
కలబోసుకున్నంట్టుండేది

చేతి ఏతానికి అందివచ్చిన జల
రాటబొక్కెనకూ, రిగ్గలకూ అందని ఊటయినాక
పెగులుకుంటున్న వరిగొల్కల గొంతులో
నేలనిట్టూర్పు . . .
పాలింకన తల్లి బిడ్డకు
కన్నీళ్లు తాపిస్తున్నట్టు
చెమ్మకి దూరమైన తండ్లాట
ఏతంపాట గుర్తొస్తే
విచ్చుకుపోయిన మొగులయితుంది ప్రాణం

ఉప్పలంతా చొచ్చుకొచ్చిన
తార్రోడ్డు కోసం
కట్టకాల్వ గొంతునొక్కి
ఊరు పెరుగుతుందని కణీలుపాతి
చెలకల చెక్కిళ్ళ మీద
పొట్లగాట్లు పెట్టిన్నాడే
మా చెరువూ
మామట్టి పొరల్లో ప్రాణధారా.
మీ ప్రణాళికల్లోకి ఇంకిపొయ్యాయి

విత్తనం కొనటం నించి
ఎరువుతెచ్చి మందుకొట్టి
పంటని పురుటిగండాల్నించి పురుగుల్నించి
కాపాడుకొనేదాకా
ఎవుసంపనులమీద
పెట్టుబడి పడగనీడని అనుమతించిన్నాడే
మీా సస్యవిప్లవాలూ
సమగ్రవ్యవసాయాభివృద్ధి పథకాలు
చట్టుబండలయినాయి

పంటబండెక్కేనాటికి
రైతు పాడెక్కే స్థితిలో
గుప్పెడు గింజలేసి
కుంచాలకొద్దీ వడ్లు కొలిచిన చేతులు
ఎక్కడో గంజుదుకాండ్లమధ్య
బస్తాలెత్తుకున్న వీపులయి
పనికోసం పడిగాపులయి
బీవండి కార్ఖానాల్లో
దుబాయి వీసాల వేటల్లో పడి
కమాటిపురా కన్నీటికథలౌతుంటే
ఇక్కడ ఊరు మబ్బులు వదిలేసిన ఆకాశంలా ఉంది
కరువు మా చుట్టం కాదు
అది మీ నిర్వాకాల ఫలితం
నామట్టికి ఎడారి వారసత్వం లేదు
ఒక్క తొలకరి తాకినప్పుడు చూడు
నేలనాదుల్లోంచి అమ్మతనం
పచ్చపచ్చగా ఎలా కమ్ముకుంటుందో

ఆ చెరువుకట్టమీద నుదిటికి చేతినడ్డంపట్టి
మేఘాల్నీ కాలవనీ చూపులతో తడుముతూ
అక్కడింకా మిగిలిఉన్న

ఆ ఒక్క రైతుకళ్ళల్లోకి చూడు
ఇంకా అల్లాడుతున్న ఉలిపిరి ఆశ కనబడుతుంది
దాన్ని ఆరిపోకుండా కాపాడుకుంటున్న
రేపటిమీది నమ్మకమూ కనబడుతుంది.

# సింగరేణి సిచ్చు

మా ర్యాగల్లల్ల కాలువెట్టి మాగల్లల్ల కాలువెట్టి
అటువెట్టి ఇటువెట్టి
బవురూపుల బాగోతాలు గట్టి
నీల్లుదొబ్బి ఊల్లు దొబ్బి
మీరు మా ఎవుసాన్ని
చిల్లులబొక్కన జేసినందుకే
బలిమీటికి బొగ్గుచాయి పొక్కల్లోకి
జారిన బంజరు బతుకలయినం
మట్టికి బాసినపుడే
కాల్లని రాల్లు జేసుకున్నం
కాయం కురుపుజేసుకున్నం
తలకో తలాపు దీపం సిద్దం జేసుకున్నం
సెమ్మసుమీద పెల్లమర్లవడ్డట్టు
తట్టలకు తట్టలు నింపిన టబ్బు
బోర్లవడ్డట్టు
పగవట్టిన పనికింద
పానాలు తెర్లవుతున్నోల్లం
దగ్గుకుంటూ దనుసుసుంటూ
నాగాలకు నాగాలు మింగుతున్న
రోగాలతో ఆగమైతున్నోల్లం
ఎతుకులాడుకుంటు
ఎతల్ని నూకేసుకుంటు
నల్లబంగారమై నడిచచ్చేటోల్లం
ఏలువట్టి నాగరికాల్ని నడిపిచ్చినోల్లం
ఎన్నెలకోన లొతున్నోల్లం.
ఏతమెత్తుకుంటున్న దుక్కం సాచ్చిగా
మాకు సావంటే బయంలేదు
మా మీద మా మమకారాల మీద
గుమాలు వెట్టుకున్న

లత్కోరు కాలమంటే బయం
రాత్రనక పగలన గాయిపెట్టే
రంకుబొంకు రాజ్యాలతోనే పరేషాన్
ఈ బొగ్గు పొక్కలకోసమే గదా
మేం బూములిచ్చుకున్నది జాగలిచ్చుకున్నది
ఎనకముందు సూడక
పానాలూ ఇచ్చుకుంటున్నది
బర్కతిలేని మీ జీతాలు గారడిలో
పుర్సతిలేని పుట్టువడైతున్నది
పొక్లైన్లతోటి డంపర్లతోటి
ఇప్పుడు మా కొలువులకు కొరివెందుకు వెదుతుంద్రు
బుట్టెడు బుట్టెడు లాబాలు దండుకుంటు
బూడ్డి కుప్పల్ల మమ్మల్నెందుకు కుంచుతున్నరు
ఎక్కన్నుంచో వచ్చి మా మీద
మా మట్టిమీద జులుం ఎందుకు జేస్తున్నరు.
ప్రమాదాల అంచుమీద
పదునెక్కినోల్లం
తెలంగాణ గుండెనెత్తురై రగులుతున్నోల్లం
మేం మీ ఎదుగులేని నిర్వాకాన్ని
సవాలుజేత్తున్నం
రొండునాల్కెల లండేసాల మీద
దండెత్తుతున్నం
సింగరేణి సిచ్చై రగులుకుంటున్నం

# వంశీకృష్ణ

## స్లీపింగ్ విత్ ది ఎనిమీ

ఒక్క సంతకం చాలు
నెత్తుటి పూల గంప జారడానికి
దుఃఖ గంగ పొటెత్తడానికి
నా తెలంగాణా మాంగల్యం తెగిపడటానికి

ఒక్క అబద్ధం చాలు
కత్తి మొనతో జీవిత వాక్యం లిఖించడానికి
కళ్ళను పెరికి. . . కలలకు స్వాగతించడానికి
తెరదీసి. . . మళ్లీ. .మళ్లీ. . పాత నాటకం వెయ్యడానికి

స్లీపింగ్ విత్ ది ఎనిమీ
ఒక్క రాత్రి చాలు
చిలుక రెక్కల మీద చిట్లిన వెన్నెల పారిపోవడానికి
ఆకులు పగిలిన శబ్దంలోంచి అడవి వసంతం మూగపోవడానికి
పొంచి వున్న మందుపాతర నుంచి
ఒక్క తుపాకి తూటా పేలడానికి.

గాజు కళ్ల వాకిళ్ళ నిండా
ఎవరో కన్నీటి కళ్లాపి చల్లుతున్న చప్పుడు
భయం. . భయంగా వీచే గాలి గంధాల నిండా
కాల్తున్న మనుషుల వాసన పులుముతున్న చప్పుడు
సంక్షోభ దేహం నిండా. . .
సందేహ అస్తిత్వానికై వెతుకులాడుతున్న చప్పుడు

ఇప్పుడిక అంతా ప్రశాంతమే
గుండె, గుండె నిండా **RED ALERT** తప్పిస్తే

# స్టేట్ డివైడెడ్

కోస్తా ఆంధ్ర. . .
ఒక మారుమూల పల్లెటూరు
ఈ టి.వి. చూస్తూ ఒక చిన్న పిల్లాడు

చాలా చిన్న ప్రశ్న
"బాబు పెద్దాయ్యాక నువ్వేం అవుతావు?"
డాక్టర్,
లాయర్,
ఇంజనీర్
ఫిల్మ్‌స్టార్, క్రికెటర్.
నే తల్చుకుంటే ఏదయినా కాగలను
ఉత్తర తెలంగాణా.
ఒక మారు మూల పల్లెటూరు
పరిగె ఏరుకుంటూ ఒక పాలబుగ్గల జీతగాడు
చాలా పెద్ద ప్రశ్న
"బాబు! పెద్దయ్యాక నువ్వేం అవుతావు?"
నక్సలైట్
యిన్‌ఫార్మర్
కొరియర్
అసలు బతికుండాలి కదా. ..
ఏదయినా కావడానికి.

## 2020

మహమ్మద్‌గూడాలో చచ్చిన శవాన్ని
పారేయడానికి సందయినా దొరకలేదు
కోరంటి దవాఖానాకే జ్వరం వస్తే
కోటొక్క దేవుళ్ళకు మొక్కడంకన్నా
పూటకెళ్ళనోళ్ళకు కంప్యూటర్‌లో తొవ్వ ఉన్నదా?

మురికివాడల్లో ముసలీ ముతకా
పిల్లలూ ముస్లింలూ చస్తే
చావుకూ బతుక్కూ మధ్య
సరిహద్దు రేఖలే లేవు

బంజారాహిల్స్‌లో కూలింది
ప్రహారిగోడ అయినా
చచ్చింది మాత్రం పాలమూరు లేబరు
ఇక్రిశాట్‌లో కొట్టుకపోయిన మహిళలు
దినభత్యానికి పనిచేసే పొట్టకూటి కూలీలు
భవానీనగర్‌లో షహీనాబేగం
రసూల్‌పురాలో పేరులేని బిచ్చగాడు
ఒకరేమిటి అందరూ అనామకులే

కోట్ల ఆస్తుల, లక్షల జనాభాల
ప్రభుత్వ గణాంకాలలో
పదులూ వందలూ పేదల చావులు
పాయింటు జీరో ఎంత పర్సెంటు?
ప్రాణమా నీకెంత విలువ!
చచ్చినవాళ్ళకు లక్షరూపాయలు
బతికినవాళ్ళకు వెయ్యి రూపాయలు
బోళ్ళకు నూరు బట్టలకు నూరు

ఏమైనా చెయ్యి, ఏదైనా ఇయ్యి
ఎదురుతిరిగితే నోళ్ళు ముయ్యి

ఇరవై నాలుగు సెంటిమీటర్ల వాన
ఈ నగరంలో ఇదివరకెన్నడూ కురవలేదు
చంద్రబాబు 'జన్మభూమి' లోను
'ఈనాడు' అన్ని ఎడిషన్లలోను తవ్వించిన
ఇంకుడుగుంతల్లో ఒక్క నీటిచుక్కయినా నిలువలేదు
కూకట్‌పల్లి, బాలనగర్‌లపై
చెరువులుతెగి అచ్చెరువైన వార్త
మూసాపేటలో 'ఈనాడు'కూడా మునిగిపోయింది

సుందరయ్య పార్కు
బాగ్‌లింగంపెల్లి చింతలతోపు బావిగా
తొలి రూపమెత్తి
సుందరయ్య గ్రంథాలయం అక్షరాశ్రుసంద్రమైంది

2

1954 కన్నా అసహాయమై పోయిన
ప్రపంచబ్యాంకు అసహాయశూరుడా
'టైం' మాగజైన్‌కు మిలీనియం
చంద్రునివో ఇంద్రునివో కానీ
మా పాలిట కృష్ణాష్టమినాడే కనిపించిన
చవితి చంద్రునివయ్యావు
మమ్ములను బొందితోపాటు
విజన్ 2020లోకి తీసుకపోయేట్లున్నావు

నువ్వెట్లాగు నేలమీద పాదం మోపకుండా
గాలిలో తిరిగేటి గడుసుదయ్యం వలె
హెలికాప్టర్ నుంచి తిలకిస్తున్నావు
ఆ విండో విజన్‌లో
రెండు చేతులూ తెగిన మా హుస్సేన్‌సాగర్

కడుపులో గుర్రంనాడాల నట్టలసంగతికాదు
వినాయక విగ్రహాల తుప్పు పట్టిన విధ్వస సంచయం

హుస్సేన్‌సాగర్‌కిప్పుడు
దేహం లేదు - అలంకరణే కాని
నెక్లెస్ బిగించిన కంఠం నుంచి
నీళ్ళు నోట్లోకి దిగవు
సాయం చేసుకోవడానికి చేతులేవి
ఒకటి ఎయిర్‌పోర్ట్ మార్గం
ఇంకోటి ఎన్టీఆర్ స్మృతిలో సమాధి

నీళ్ళన్నీ సిమెంటు కాంక్రీటవుతున్న సిటీలో
నీళ్ళొస్తే నువు మాత్రం ఏం జేస్తవు
మూడుజాముల రాత్రి తూములు తెరిపించు
అశోక్‌నగర్ నుంచి కోరంటి దాకా
'వైస్రాయి' వెలుగుతుంది
ఎం.సి.ఎచ్. బతుకుతుంది
ఏ హెచ్చరికా వద్దు ఏ జాగ్రత్తా వద్దు
తూము కాలువల కింద ఇళ్ళన్నీ
తూతూ బతుకులగాళ్ళవే -

ఆ తర్వాత అసెంబ్లీలో అకౌంటు ఇచ్చి
ఆంగ్లంలో సంతాపతీర్మానం ప్రవేశపెట్టు
రెండు దుర్దినాల బీభత్సానికి
నీ రెండు మలినాశ్రువులేమీ వద్దు
రెండు నిముషాల మౌనం చాలు
అసెంబ్లీలో మాటకుసరే, మౌనానికి ప్రజలపై పన్ను ఎన్ని వేలు?

## తెగిపడిన చిటికెనవేలు చెప్పిన ఏడుగురు అక్కచెల్లెళ్ళ కథ

'రాజుకేడుగురు బిడ్డలం
పొన్నపూలకు పోయినం
పులిరాజు బుక్కపెట్టె
జంగమయ్య జోలె కట్టె'

(తెలంగాణ పల్లెల్లో తెలతెలవారతుండగా వచ్చే బాలసంతలు పాడేపాట)

పొన్నపూల కోసం అడవికి పోయిన ఏడుగురు అక్కచెల్లెళ్ళనూ పులి మింగగా ఒక చిటికిన వేలు తెగి నేలమీద పడుతుంది. అటువైపు వచ్చిన జంగమయ్య తన జోలెలో ఆ వేలు వేసుకుంటడు. ఆ వేలుకు ప్రాణం వచ్చి ఏడుగురు అక్కచెల్లెళ్ళ కథ చెప్తుంది.

ఏడుగురు అక్కచెల్లెళ్ళు
పొన్నచెట్ల కింద పూలేరడానికి పోయిన్రు
గోదావరెంబడి తారుపాామువలె రోడ్డు పాకి
పూలచెట్లు పండ్లచెట్లు కూడ కరువై
చెట్లు వెతుకుతూ దట్టమైన అడవిలోనికి పోయిన్రు

జానకి ఒక్కతే కాదు
శ్యామల లత వెన్నెల ముక్కుపచ్చలారని పిల్లలు
వసంత  స్వప్న కొమురక్కలు అరవిచ్చిన మల్లెలు

కూలికోసమైనా కూటికోసమైనా
కోరుట్ల మెట్‌పల్లి జగిత్యాలలకు
బొంబాయి మీంచి దూబాయి దగ్గరయింది
కెనాల్ పంటి రోడ్డు పక్క
కేసెట్లు దొరుకుతయి గాని పూలు దొరుకవు
మన పూలకోసమే మనం
అమెస్టర్ డ్యాం పోలేంగదా

ఆ మంకెనపూలవంటి మంథని పిల్లలు
అందుకోసం అడవికి పోయిన్రు

పెళ్ళి చేసే వయసు
ఒట్లేయించే వయసు
వస్తున్నయి గనుక
ఒంటరిగా కాకుండా విముక్తిసంఘంగా
మనసైన పూలేరుకుంటున్నరు
వాగులో గులకరాళ్ళు ఏరుతూ
స్నానాలు చేస్తూ

చెట్టుకింద అన్నం కుత కుత ఉడుకుతున్నది
ఉమ్మగిల్లే దాకా ప్రవాహంలో ఆడుకునే
ఉత్సాహమూ ఓపికా వాళ్ళకున్నయి

అన్నం ఉడికే వాసన, చప్పుడు
నీళ్ళు ఉరికే స్పర్శ, వెలుగు
బాల్యం లోంచి నవయవ్వనంలోకి
ఏడుగురు కూడినపుడు ఎగిసిపడే కలలు

అడవిలో మృగాలుంటాయని తెలియక కాదు
అన్నలు అక్కలు వచ్చినాంక అవి
ఒదిగి ఉన్నయి లేకుంటే పక్కకు జరిగినయి
ఇంక వస్తే హైవే వెంబడి హైనాలు రావాలి
మంద మీద పడే తోడేళ్ళు

అటు రోడ్డు మీంచి కావలిని మరిపించి
ఇటు భూపాలపెల్లి నుంచి గ్రేహౌండ్స్ వచ్చినవి

ఇపుడక్కడ నీళ్ళచప్పుడు లేదు
పూలేరుతున్న వేళ్ళ చప్పుడు లేదు
వృకోదరుల వేట వికటాట్టహాసం తప్ప
సున్నితమైనవన్నీ ధ్వసంమైనవి

సెలేటి నీళ్ళలో లేఎండ వలె మెరుస్తున్న పిల్లలు
నెత్తుటి చీలికలో
పొయిమీది అన్నం మెతుకులు
మట్టిలో మసైనవి

కోసేసిన నెలవంకల్నించి
ఒలికిన నెత్తురు గడ్డకట్టి
అడవి
సిగ్గుతో చీకటయింది

పొన్నపూల కోసం పోయిన పిల్లలు
ఖండితస్వప్నాలై తిరిగి వచ్చిన్రు

ఒంటిమీద నూలుపోగుల్లేకుండా
కాలిపోయిన పూలదేహాల్ని చూస్తూ
కంటతడి పెట్టిన తల్లుల గుండెల్లో
శోకమే కాదు క్రోధమూ రగిలింది
(ఆ ఏడుగురు ఆడపిల్లల కథ రాయమని
ఎండ్లూరి సుధాకర్ నోరుతెరిచి నన్ను ఎందరి
తరపున అడిగిండో కదా)

# వలిగొండ కాంతారావు

## తప్పెవలది!

మనపూలనెత్తుక పొయి వాడు
గుల్షన్ చేసుకతింటడు.
కావలోడు సూస్తదుగని
సప్పుడుజెయ్యడు,

పువ్వును కాపాడ్తమని ఇమానం
జేసినముండ్లు
రెక్కలను సింపుతాన్నయి
అడిగెటోడులేక.

పొద్దుగాల పిల్లకు తోడేల్ను
కావలుంచి మ్యాతకు బోయిన గొల్లె
మాపటీలి వాపసచ్చి
తోడేలును దిట్ట బట్టె

సోచాయించితె
అంతపగ్లయితాంది
తప్పెవలదొ జర
చెప్పరాదె .

# వలందాస్ వెంకటేష్

## హింస - హింస, హింస

నడిరాతిరి తుపాకి చప్పుడు
కాలింది ఓ కన్నతల్లి కడుపు
ప్రేలింది మిట్ట మద్యాన్నం మందుపాతర
కాలింది ఓ కన్నతల్లి కడుపు
దేహశుద్ధి, టార్చరింగ్ పోటీపడితే
పరిహాస్యం కాధా. . .? ప్రజాస్వామ్యాం
నేను నేనుగా. . .నీవు నీవుగా, మనం మనంగా- -
బ్రతకలేని రాజ్యం ఇది నిరంకుషానికి
పరాకాష్ఠ కాదా. . .?
రాజ్యం, తుపాకి, పోటీ పడితే
పరిహాస్యం కాదా ప్రజాస్వామ్యాం . . ?
కళ్ళుంటె చూడు తెలంగాణా పల్లెలను
చెవులుంటె విను తెలంగాణా రోదణను
నోరుంటె మాటాడు తెలంగాణా బ్రతుకోసం,
నాకెందుకులే అన్నావో. . .
నాకు నవ్వోచ్చేస్తూంది. . ఏడుపోచ్చేస్తూంది
నేనంటాను హింస ప్రతి హింసకు మార్గమని
హింసే లేనప్పుడు ప్రతి హింస శూన్యం
అందుకే – – –
హింసను కాదనే ప్రతి గొంతుకు
నా గొంతు తోడు నా కలం తోడు
హింస రహితం నా పంచ ప్రాణం. . .

## వి.ఆర్.విద్యార్థి

# ఏ యుద్ధం ఎవరి కోసం

ఒక యుద్ధం
బానిసల దండయాత్ర
పీడితుల తిరుగుబాటు
శ్రమజీవుల పోరాటం

ఇంకో యుద్ధం
నియంతల నిలుకడ కోసం
దళారుల రక్షణ కోసం
కిరాయి మూకల అరాచకం

ఒక యుద్ధంలో
బానిస సంకెళ్ళు రాలిపడతాయి
జనకంటకుల పీడ విరగడవుతుంది
నిర్బంధం చీరట్లు విడిపోతాయి

ఇంకో యుద్ధంలో
అన్యాయమైపోతారు అమాయక ప్రజలు
ఎడారులౌతాయి ఊళ్ళకు ఊళ్ళు
నేలగూలుతాయి కలలమేడలు

ఒక యుద్ధంలో
తరతరాలకూ తీరని సమస్యలకు
తిరుగులేని పరిష్కారం
నూతన వ్యవస్థ ఆవిష్కారం

ఇంకో యుద్ధంలో
తరతరాలకూ తీరని సమస్యలు
మానని గాయాల సంధ్యలు

పాతరాతి యుగం జాడలు
ఒక యుద్ధంలో
కవులు జనకంఠమై మోగుతారు
నేలతల్లి చెరవీడే దాకా
త్యాగాల కత్తులమీద నడుస్తారు

ఇంకో యుద్ధంలో కవులు ఏలిన వారి బాకాలు
భూమాత ఉక్కు సంకెళ్ళను
తీరు తీరున వర్ణించే గూబలు

# వేణు సంకోజు

## అటువైపుకి

ఒక ఆవేదన నన్నూ
అనేక ఆవేదనల్ని నేను
వెంటాటుకోవడం తోనే సరిపోతూ వుంటుంది
అంధుడు చూడగల్గిన ప్రపంచాన్ని
నేనింకా చూడలేకపోతున్నాను
బధిరుడు విన్న శబ్దాల్ని - సంగీతాల్ని
నేనింకా వినలేకనే - అనుభవించలేకనేపోతుంటాను.
జీవితాన్ని జీవితంగా మోయలేకనే పోతుంటాను
వందల వేల చెట్లకు - ఆకులకు - పూవులకు
నా శరీరం శిథిలాలయమైన కల కంటూనే వుంటాను
ఒక చిన్న - పెద్ద పాటి పర్వతాన్నైనా నా గుండెమీద
మోస్తున్నట్టుంటాను
చెరియలు చెరియలుగా విరిగి పడుతూ
మానసికంగా తునాతునకలౌతుంటాను
వందల వేల మైళ్ళుగా పేరుకుపోయిన నా లోన ఖాళీని
నిస్పృహతో నింపివేయనే లేక పోతుంటాను
వయస్సొక్కటే మీద బడటం తెలిసీ
గమనించకుండా వుండబోతుంటాను
గదంతా నేనుగానే ప్రతిధ్వనిస్తూవుంటుంది
సొట్టగిన్నెలూ - విరిగిన పళ్ళెంలూ నన్నే పలుకుతుంటాయి
బయట కాకి - సంభాషణకు నన్ను పిలుస్తూనే వుంటుంది
తెలిసిన ఒంటరితనమే అయినా
అనూహ్యంగా ఎప్పటికప్పుడు రూపుకడుతూ వుంటుంది
జీవన యానమంతా భాషచాలని ఆరాటం
వ్యక్తీకరణలకింద అనుభవం నలిగిపోతూనే వుంటుంది
ఎండిన్నదికింద - దరిచేరని సముద్రం కింద అనుభూతి
కరిగి ఆవిరై పోతూనే వుంటుంది

కాలమాగిపోకా - కదిలిపోకా కత్తిలా
నా మీద వేళాడుతూనే వుంటుంది
లోలకంలా నా వివేకం అలా
కొట్టుమిట్టాడుతూనే వుంటుంది
అస్పష్టమైన చూపులూ - అస్పష్టపు వాక్కులూ దొర్లుతుంటాయి
రెండు సమాంతర రేఖలు కలిసే భ్రమ నిజమయ్యే భ్రమ తొలగక
ఉనికి ప్రశ్నార్థకమౌతూనే వుంటుంది
ఆకులూ, పువ్వులూ, అన్ని సందర్భాలూ
నా ఖాళీల్ని పూరించలేక పోతూనే వుంటాయి
నిస్సిగ్గుగా జీవితం నగ్నంగా ఎదుటపడి
అలా నా అణువణువునూ కెలుకుతూనే వుంటుంది
వెయ్యిన్నొక్కసారి ముఖాన్ని అటువైపుకి తిప్పి
జూసుకోబోతూనే వుంటాను!

# ఆకలికోన

తెలంగాణా! తెలంగాణా!
తీగలెత్తెగిన రుద్రవీణా
వ్రణంపై వ్రణమై లోలోపలే
విరుగుతున్నదానా కరుగుతున్నదానా
గుడిసెలూ - రాళ్ళు బాడిసెలూ - దాళ్ళు
చెట్లు కూడ ఎన్‌కౌంటరైన తాన
చావు మీటిన ఆకలికోనా
తెలంగాణా! తెలంగాణా!

చిరకాలపు దాహం - చిరంతన వేదన
ఆకలి పొట్టలోకింకిన
నిరాశాకిరణమై పొగిలిన
ఒకసారి వాలిన పొద్దింకా
పైకెగబాకని పెంజీకటి సోనా
కుతకుత ఉడుకుతున్న దానా
సతతం గొంతెత్తే మైనా
తెలంగాణా! తెలంగాణా!

పేరిన అవాంతరమే నీవై
మేల్కొన్న దుఃఖమే తావై
నిన్నటికీ నిన్న - నేటికీ నిన్న
రేపటికీ నిన్నగానే మిగులుతున్నదానా
ఆత్మహత్యలే దిక్కు దివాణమై
ఇక స్మృతిగానే బతుకుతున్న దానా
ఉద్యమాలూ ఉత్పాతాలూ ఎరిగిన వీరాంగణా
తెలంగాణా తెలంగాణా!

# వేముల వెంకటేశ్వర్లు

## బతుకు పాట

ఏం బతుకులు
ఏం బతుకులు
ఏం బాధలు
యమ బాధలు

రకతాలు చిందించే గుండెలు
మాకన్నీళ్ళతో తడుస్తున్నా మా చెలువులు, గుంటలు
వంకార్లు, కొంకర్లు తిరిగిన రూపులు
నెర్రలు పూసిన నేలలో
ఏరువాక పాటలు
మాకు మిగిలింది బతుకుపండగ
బతుకమ్మ పండుగ
రోజూ ఇంత రక్తం పూసుకోని హోలి ఆట
బతుకును నాపరాయి మీదరుద్ది
దేశపటాన్ని గీస్తున్న పాలమూరు చేయి

ఆంధ్ర దాస్య విమోచనం కోసం
తల్లడిల్లుతున్న నేను నా ప్రజలు
ఏం బతుకులు
ఎట్లా బతుకుడు
గుక్కెడు నీళ్ళు పిరికెడు మెతుకులు
పల్లె పొట్ట నిండని జానెడు బతుకులు

బావులు, వాగులు, ఎండాకాలాలు
ఇక్కడ కన్నీళ్ళు ఊరినట్లు నీళ్ళు ఊరవు,
తెగిన కుల వృత్తుల చేతులు
వాముల్లో కాలుతున్న కుమ్మరులు
కుండలు చేసిన బతుకులు

శవం చుట్టూ తిరుగుళ్ళు
ఇక్కడ కాట్టిన కాచిన చేతులు లెట్టె
సుళ్ళు తీరుగుతున్న కుమ్మరిసారె

చాకలి బండల్ని పగులగొడ్తున్న వాషింగ్‌మిషన్లు
ఇంకా ఎన్నాళ్ళీ ఆశల మేరలు
పగిలిన చాకలిపొయ్యి

విరిగిన మంగలి కత్తి
ఎరుపెక్కుతున్న కసి
హైటెక్కు సెతాల్ననుంచి
జాక్సన్ చావు కేకలు
సింథసైజర్ వాయిద్యాలతో
డోలు, సన్నాయి హతం

చంపండిరా, చంపండి
మమ్మల్ని గ్లోబుల్ కత్తితో
సరళీకరించి పొడచి పొడచి పొడవండి

మాతాటితోపులకు
ఈత ఈకలకు
హైబ్రీడు ఇంజెక్షన్ ఇవ్వండి
మా లేక పాపయ్య నోటికాడ
ఆకుల్లో కల్లును
కటిక దూరం జేయకండి
కాళ్ళాదని మేరోళ్ళు
మె బనీను. చేతుల బనీను
నాపల్లె అంగీ మాయం
పొడుగు లాగు బొందులెక్కడున్నాయో
కుదించుకుపోతున్న కుట్టుమిషన్
బిస్మిల్లా ఖాన్ మీకు తెలుసో లేదో
మా నాయన సిరిపురం నుంచీ

సన్నాయి ఊదక పోతే
ఎక్కడా పెళ్ళి మంటపాలు
నిలబడేవి కాదు
మా నాయన వేళ్ళు
సప్త స్వరాలు రాగాలాపన జేస్తేనే
మూడుముళ్ళ కింద తాళి
నా సన్నాయి ఇప్పుడు
మూల బడ్డ వస్తువు

జూలూరు కొలిమిని కూల్చిందెవరు
బాణాలు కుంపట్లను చల్లార్చింది ఎవరు
బెల్లి యాదయ్య చేతిలో దుడ్డుగఱ్ఱ
కంబలి ముడల్
మావాళ్ళ గొట్టెల వ్యాకరణాన్ని
చెరుపు తుందెవరు?
వేముల ఎల్లయ్య తొలిఅరుపు 'కక్క'
వెంకట్, 'అంబటి వెంకట్ విసిరినవల విసిరినట్టే
ముందుకుసాగని రాజయ్య, గోపీ కథ
మా సీతారాం దుఃఖమే ఇపుడు గుక్కెడు నీళ్ళు
రసూల్ కళ్ళు తగిలించుకున్న సుధాకర్ చెఱుకు
నా గోస పగోనికి కూడా రావద్దన్న జూకంటి
పచ్చినిశారద ఉయ్యాలో ఉయ్యాల
పట్నం వాకిట ముగ్గు ఆశారాజు
భాగ్యనగరం బొమ్మేసిన యస్.వి. నిఖిలేశ్వర్
సిధారెడ్డి, సుంకిరెడ్డి ఎండనిఏర్లు
జీవితం అంతాసంక్లిష్టం ప్రసేన్

మింగుడు పడని వాక్యాలు అఫ్సర్, వంశీ
కలంపట్టు కున్న రావుల కొండ సత్యలక్ష్మి
గుప్పెడు ధైర్యంరజిత
సద్దుజేయకుండా గుర్రుమనే గుడిపాటి

కాసుల గలగలలు
ఉన్నవి ఉన్నట్లు అసుర
అన్నది అన్నట్లు శ్రీనివాస్
పురివిప్పుతున్న పగడాల జగన్‌లు
తమరెండు కళ్లలో నాలుగు గోడల్ని కూల్చుతున్న
స్కైబాబా, షాజహాన
ఇక్కడ నిజాయితీకి కంఠమిస్తున్న అందెశ్రీ
మీకు మీరే, మాకు మేమే
ఎందుకీ నసనస అంటున్న శోభాభట్
కథలల్లుతున్న కాలువ అల్లం
ఏనాడో నవీన్ అంపశయ్య
ఏ తర్కానికైనాసిద్ధం బి.యస్.రాములు
దుమ్మురులు పుతున్న పులుగు శ్రీనివాస్, బోయిజంగయ్యలు

నస ఎందు గ్గని?
"దోపిడీ చేసే ప్రాంతాలను
దూరముదాకా తన్ని తీరుతాం
ప్రాంతం వాడే దోపిడీ చేస్తే ప్రాణం
తోనే పాతరవేస్తాం" అన్న గీ పెద్దన్న
కాళోజన్నమాటే మనందరి గొడవ
కావాలె

పండు వెన్నెలకి రచ్చ బండలు పగులుతున్నయ్
ఎఱ్ఱటి ఎండలు నీల్లెతుక్కుంటున్నయ్
యాది జేసుకున్న నాబాధలన్ని కావ్యాలకె క్కిస్తున్నా
వలసలు తీస్తున్న ప్రాణాలతో ఊపిరిపోసుకుంటున్నా
వలసకు వ్రేళ్ళాడుతున్న నేను నా ఊరు
ఇపుడు నేను నా ఊరు కనిపంచడంలేదు
నన్ను కప్పుకున్న చుట్టు గుడిసె కోడికూత
కరుగుతుంది.
నా ముత్యాలమ్మ, నా మైసమ్మ, నా సమ్మక్క – సారక్క

నా బతుకు మా ఆడోళ్ళ బతుకు పండగ బతుకమ్మను
వేరు జేసే దారులను మూసుకొస్తా
ఇక్కడ పావురాలు హింసపాటను ఎందుకు
ఎలుగెత్తుందో ఎవరు చూశారు?
చెదిరిన పక్షులన్నీ  చెదరకుండా
ఒక్క గూట్లోనే

శ్రీశ్రీ సహస్రవృత్తుల సమస్తం
కవిత్వానికి అలంకారాలు కాదు
ఇక్కడ చస్తున్న బతుకు పాట
తెలంగానం – తెలం'గానం'

ఇది నల్ల నినాదం

నాది తెలంగానం

# వేముగంటి మురళీకృష్ణ

## పాక్కిలైన తెలంగాణ నుంచి

నోట్లోకి దిగాల్సిన సద్దిబువ్వ
మూతికాడే ఆగిపోయింది

మనుషులు నడుస్తున్న నేల పగుళ్ళ నుంచి
ఎంగ్రిడికాయ బయటకొచ్చి ఎగతాళి చేస్తున్నట్టుంది

నీళ్ళను తూర్పు దిక్కు జారగొట్టింగ్రు
ఇప్పుడు ఇక్కడ మిగిలింది మట్టి దుబ్బే

రాళ్ళు తేలిన నేలలో
పంటల జాడెలా ఉంటుంది?

సర్కారు తుమ్మ చెట్టు మీద
నల్లకాకి అప్పుడప్పుడు తెలంగాణా పాట పాడుతుంది
నమ్మడానికి సుతారం ఇష్టం లేదు

మనల్ని అలుసైన మనుషుల్ని చేసి
కార్పోరేట్ యవుసం కోసం విడగొడతరు
అప్పుడు మన అమాయకత్వం
గుంజకు కట్టేసిన లేతలేగ దూడై
ఆగమాగం తిరుగుతుంది

జీవితాల చుట్టూ నీళ్ళ గోళం పెట్టి
ఆటను చూసే కళ్ళు చాలా ఉంటాయి
ఈ నేలకు నీళ్ళు
అక్వేరియంలో అలజడి మాత్రమే

చదువుకునే పోరగాండ్లు
బర్రెలదొడ్ల కాపర్లైనప్పుడు

గుంటూర్ వికాస్ విలాసాల ఆటను
తప్పక ప్రశ్నించాల్సిందే

తెలంగాణా చుట్టూ ముళ్ళకంచె నాటేపనిని
ఆంధ్రావని విజయవంతంగా పూర్తిచేసింది

స్టేట్ రియల్ ఎస్టేట్‌తో మిలాఖత్ అయినపుడే
రెండు చేతుల్లోని రుమాలు నెత్తిమీది కెక్కాల్సింది
అప్పుడు మన అమాయకం పొక్కిలిపొక్కిలైన వాకిలయ్యింది

మన పొలాల్ని ముక్కలు ముక్కలు చేసి
ప్లాట్లు చేస్తున్నప్పుడు దూలం కింది ఉట్టిలోంచి
పాలకుండ జారి పగిలిపోయింది

ఇప్పుడు జనహర్ష కవిగానాలకు
అస్సలమాలేకుం చెప్పాల్సిందే
తెలంగాణా మాటల తడాఖల్ని చూపాల్సిందే
కోరుకోవాల్సిందే
మా నేలను, నీళ్ళను
మమకారాలు చంపుకుని ఇష్టంతో
పొగాకు వాసల్ని పీల్చలేం కదా!

ఇప్పుడు మనం చేయాల్సిందల్లా
మోటబాయి లోతుల్లోకి జారిపోయిన వాళ్ళని
జాగ్రత్తగా పాతాళగరిగెతో పైకితెచ్చి
తెలంగాణా కోసం లడాయి చేయాలి.

# శంకర్‌రావు శెంకేసి

## ఉప్పెన

ఉద్యమం ఉరుముతున్న కొద్దీ
గొంతులు పెగులుతున్న కొద్దీ
దోపిడి గణాలు అదురుతున్నాయ్
రాజకీయ 'గజా'లు బెదురుతున్నాయ్. . .!
అణచివేత, పీడన చాలంటూ
ఆత్మగౌరవ గీతం నినదిస్తూ
చైతన్యం చుక్కానై దూసుకువెళ్తుంటే
పీడకదుర్గాలకు బీటలు పడుతున్నాయ్
పాలకవర్గాలకు చెమటలు పుడుతున్నాయ్. . .!
ఊరూరా తెలం'గానం' పల్లవిస్తుంటే
సమూహాలు 'సై' అంటూ పదం కలుపుతుంటే
హామీలు వరదల్లా ఉరికురికి వస్తున్నాయ్.
'అభివృద్ధే లక్ష్యమంటూ' పాతపాటే జపిస్తున్నాయ్. .!
'శత్రువు' ఇప్పుడు బలహీనుడయ్యాడు. .
ఉద్యమ ఉధృతిని చూస్తు బెంబేలెత్తుతున్నాడు
ఇక ఊళ్ళన్నీ ఉప్పెనలా లేవాలి
ఇక ప్రతి అడుగు ఉద్యమమై కదలాలి.

# శేషం శ్రీరామచంద్రమూర్తి

## నా బా(యా)స

బాస తరచి చూడ తెలుగోయి నా బాస
యాస తెరచి చూడ తెలగాణ నా యాస

నాజూకు లేదాయె ననుగన్న యాసకూ
ఏ చూపుసోకెనో నా బాస తల్లికీ
ఇట్లెందుకుఐతందొ వివరంగ జూడాలె
ఆ కతలు ఆ వెతలు ఏమేమొ జెప్పాలె

ప్రామాణిక భాషంటు పాఠాలు చెప్పారు
తెలగాణ యాసకే పేనాలు తీసారు
తల్లిప్రేమను జెప్పు తియ్యన్ని మాటలకు
నడకలను మార్చారు నాశనం చేశారు

పారిశ్రామిక విప్లవాలు, గ్లోబలైజేషనూ
టెలిఫోను, సెల్ ఫోను, కమ్యునికేషనూ
ఉమ్మడిగ వచ్చాయి ఉరకలేవేశాయి
నాకన్న యాసకూ నాజూకు నేర్పాయి

పిలుపులో ఒక స్టైలు, నడకలో ఒక స్టైలు
నవ్వులో ఒక స్టైలు, లవ్వులో ఒక స్టైలు
కొత్తగా దీర్ఘాలు ఇంపైన రాగాలు
ఏవేవొ వచ్చాయి ఎంతెంతో మార్చాయి

దుక్నాలు పోయాయి “షాపు”లని వెలిసాయి
బుబుజులే పోయాయి ‘సెంటర్లు’ నిలిచాయి
చారాన, బారాన, చుక్కలే పోయాయి
పావలా, అర్ధలై పలకరిస్తున్నాయి

ఎన్నెన్ని జెప్పాలె నా బాస కట్టాలు
ఇంకెన్నొ చెప్పాలె నా యాస నట్టాలు

## శ్రీ దాస్యం లక్ష్మయ్య

### తొవ్వ జూసుకోవాలె

మేం తల్సుకుంటే
మా దండిగనే మట్లాడుతం
మాకు శాని రాదుగాని, సక్కటి బాసనే మాది
దాసుకోవటం మా కాడ లేదు
దోసుకోవడం తెల్వనే తెల్వది
గలగలనే మాట్లాడుతుం
కలుసుకున్న కాడ, ముచ్చటాడుకున్న కాడ, చర్చజేసిన కాడ
ఖుల్లం ఖుల్లగ జెప్పుకుంటం
కడుపుల కల్మసముండది
బంతిల పరపక్షం అస్సల్ కుండది
చెప్పాలనుకున్నది సూటిగనే జెప్తుతం
ఎవలకు, ఎక్కడ తగలాన్నో
గక్కడనే తగిలేటట్లు జేస్తం
మా నాల్కలు తాటిమట్టలు కావు
మనుషుల్లెక్క మెసలుతం
మనసు బెట్టి మాట్లాడుతం
కడుపుల తలవెట్టి కావలిచ్చుకుంటం
అందరిని నమ్ముతం, నమ్మినోల్లకు పాణమిత్తం
నమ్మిచ్చి బొండిగ్గోశేటోల్లను, నరికి పోగులు పెడుతం
రీతిగ మెసలుతం, నీతిని తలుత్తం
పపంచకాన్ని పట్టించుకోం, పాతను రోత జెయ్యం
మా బతుకులు కూల్చినోల్లను
మమ్ముల గోస బుచ్చుకున్నోళ్ళను
అస్సలుకే ఇడిసిపెట్టం
మాది ద్రోహబుద్ధి కానేకాదు
అసోంటిది మాకు రానే రాదు
మాకెవ్వల సొమ్ము అక్కర్లేదు

మాయి మాకు దక్కుతె సాలు
మా ఆరాటంల అలజడి ఉన్నది
అన్నాలమై పోయిన మొత్తుకోలున్నది
బొండిగల నిండా బాధలున్నయి
నడిమిట్ల పెత్తనం దొరికిచ్చుకొని చెలాయిచ్చెటోల్లకాడ
అణిగి మనిగి పడ్డది సాలు
మాకు సోయి లేదనుకోంకుండ్రి
గంగి గోవుల మనుకోకుండ్రి
అనుభవాలు మాకు అన్ని నేర్పినయి
లొల్లిని షురువు జేత్తే
తొవ్వ జూసుకోవాలె
తోక ముడుసుకోవాలె.

# గుండెలపై నదులు - గొంతుల్లో ఎడారులు

బతుకు గోరింటలా పండటానికి
ఇదేం సస్యశ్యామల ధరిత్రి కాదు
ఇక్కడ మనుషులు బాధలే ముళ్ళయి
మొండిగా జీవిస్తున్న ముళ్ళ గోరింటలు. .

ఫ్లోరోసిస్‌లో మునిగి ఎన్ని పిండాలు
ఎన్ని మెలికలు పడ్డాయో
ఇంతమంది అష్టావక్రుల్ని కన్న - కడుపులు
ఎంత కుముల్తున్నాయో
కంప్యూటర్లలో తలదూర్చి
ప్రపంచం తలమున్కలవుతుంటే
వంకర్లు పోతున్న దేహాలు
మండే కొలుముల్లో లోహాలవుతున్నాయి

ఇక్కడ గుండెలపై నదులు ప్రవహిస్తున్నా
గొంతుల్లోకి విస్తరించిన ఎడారులు
బలుల్ని సైతం తాకి రిక్తంగా
పైకొచ్చే తడారిన చూపుల చేదాళ్ళు
బతుకు నిత్య వసంతం కావడానికి
ఇదేం పచ్చలు పొదిగిన మైదానం కాదు
ఇక్కడ మనుషులే నీళ్ళింకిన దేహతిన్నెలు

ఏ నగల బరువులేక ఎగిరే పైట
ప్రతి పనికి అడ్డమొచ్చే పైట
నడుముకు చుడితే
నవ్వితే నవ్విరి గాక
ఎండిన ఎదతో నడిచెళ్ళే ప్రతి ఇల్లాలు
పచ్చటి పైట పంట పీల్చేయబడ్డ తెలంగాణకి

ప్రతిరూపంగా కనపడకపోతే
అది మీ బరిబాతల తనమే!

దేహాకాశంలో ఆర్ద్రతెండి
వట్టిపోయిన కళ్ళమేఘాలతో
గట్లేసుకొని పోయిన పహరా కాసుకుంటున్న
ఏ హరిత వర్ణ ప్రదేశానికి వలస?
ఇక్కడ రైతులే విసిరేసిన రాళ్ళకుప్పలు
జీవన మాధుర్యాల తేమెక్కడ?
తుమ్మలు నిండిన బతుకు బీడులో
మోసపోతున్న నిజాల ముళ్ళు
ఆ దారిలోనే ఇంకా అమాయకంగా
నడిచెళ్తున్న మూగ జీవాలు.

# సబ్బని లక్ష్మీనారాయణ

## తల్లి పిలుస్తుంది

తల్లి పిలుస్తుంది
తెలంగిణ తల్లి పిలుస్తుంది
తెలంగాణ తల్లి పిలుస్తుంది
బస్తర్ అడవుల్లో కొలువై
గోదారి దారుల్లో వెలసిన
తెలంగిణ తల్లి పిలుస్తుంది
తెలంగాణ తల్లి పిలుస్తుంది
తెలంగిణై తెలుగై తెనుగైన
తెలంగాణ తల్లి పిలుస్తుంది
అన్నీ ఉండి, అన్నీ అందరికి ఇచ్చి
ఏమి మిగుల్చుకోక
చిక్కి శల్యమై పోతున్న
తెలంగాణ తల్లి పిలుస్తుంది
మట్టి చరిత్రే మనిషి చరిత్ర
మట్టి మినహా మనిషికి చరిత్ర లేదు
కవుల కలాలకు కావ్య వల్లి తెలంగాణ
చిత్రకారుల కుంచెకు పదును పెట్టింది తెలంగాణ
ప్రపంచ మేధావుల మెప్పుపొందింది తెలంగాణ
శాతవాహన, కాకతీయ
సామ్రాజ్యలక్ష్మి లకు నిలయమైంది తెలంగాణ
భాష ఉంది, చరిత్ర ఉంది, సంస్కృతి ఉంది
సజీవ సాహిత్యముంది, తెలివి ఉంది, నిజాయతీ ఉంది
వనరులన్నీ ఉండి వట్టిపోయిన నేలయ్యింది తెలంగాణ
ఎవర్నయినా మరిచిపో సోదరా!
స్తన్యమిచ్చిన తల్లిని మాత్రం మరిచిపోకు
(బస్తర్ అడవుల్లో కొలువై ఉన్న 'తెలంగిణ' అనే శక్తి దేవత
పేరుతో 'తెలంగాణ' అనే పేరు వచ్చింది.)

## సబ్బని శారద

# గోస ఏం జెప్పుదు

నట్టనడిమి సీమ నడుమ తెలంగాణ
నెత్తురోడుతుంది నేల తెలంగాణ
తల్లడిల్లుతుంది తల్లి తెలంగాణ
బతుకులో చీకట్లు భవిత కష్టమయ్యే
పల్లెపల్లెను జూడు పట్నం వాసం జూడు
కరువులిక్కడచ్చె కష్టాలు వచ్చెనూ
సదవు సందెలిక్కడ సక్కంగ లేకుండె
బంజరు భూముల్తో బతుకు భారమయ్యే
కూలీల బతుకుల్లో కూటికష్టమచ్చె
కన్నీటి కావ్యాల కడలి తెలంగాణ

ఆర్తితో బతుకులూ ఆగమయ్యె సూడు
మంజీర మానేర్లు మూసీలు మున్నేర్లు
ముచ్చటగ పారె గోదారి కృష్ణలూ
గొప్పగాను పారె సింగరేణి గడ్డ
సిరులు ఉన్న గడ్డ
నల్ల బంగారమూ నాణ్యమైన బొగ్గు షాబాద్ రాళ్ళలో
సక్కనీ ఈ సీమ పాడి పంటలందు
పాటైన నేలరా వనరులన్ని ఉన్న
వజ్రాల గడ్డరా అన్ని ఉన్న నేమి
అంతటా కరువాయె

# గాజువాక పోకిరోళ్ళం కాదు . . .!

గాజువాకే పిల్లామాది
గాజులోల్లమే పిల్లామేమని
ఆడపోర లెంటబడి వేధించే
నీచ సంస్కృతి మాకొద్దు. . .

సిరిపురమే పిల్లా మాది
చీరలోల్లమే పిల్లా మేమని
చీరలిప్పే చిత్తకార్తె శునకపు
చేష్టల్నీ మాకంటగట్టొద్దూ. . .

మేం మేడిన్ 'ఆంధ్రా' స్టూడెంట్సో
గాజువాక పోకిరోళ్ళమో కాదు
పట్నం నుండి పల్లెదాక విస్తరిస్తున్న
మీ సామ్రాజ్యవాద సినీ(చ) సంస్కృతికి
చరమగీతం పాడే తెలంగాణ పల్లె తల్లి
మానాల కనుపాపలం

గాజుల గలల వెనుక ఒట్టి పోయిన
వెట్టి జీవితాల్ని
వంటి మీద రైక గుడ్డగ్గతిలేని తల్లి చనుబాల చేవతో
ఆకలి పేగుల్ని నూలుపోగులుగా అతికి
చీరెల్నిస్తున్న సిరిసిల్ల సంస్కృతి మాది. .!

మీ ఒంటి కంపునొదిలించడం కోసం
మా స్వేదాన్ని పరిమళంగా సబ్బుల్లో నింపుతూ
నిత్యం మా వళ్లంతా పెంకుల్తో రుద్దుకుంట్ను వాళ్లం. ..
సబ్బుల్తో ఆడోళ్ళ వీపుల్ని రుద్ది అందాల పోటీల్లో
అంగాగాల్ని దోచే మీ మల్టీనేషన్ క(ప)వర్ కల్చర్‌ని
కొవ్వెక్కిన వంటిపొరల్ని . . .పొగరెక్కిన మీ కంటి తెరల్ని
మా తెలంగాణ శ్రమ సంస్కృతితో శస్త్ర చికిత్స చేయాల్సిందే!!

# మీ ప్రాణ త్యాగాలసలే వద్దు. . .

అప్పుడూ . . .ఇప్పుడూ
తెలంగాణ మీకు ఓటు పాటయ్యింది
మా వెనకబాటుతనం వేర్పాటువాదమైంది
మా ఆకలిదప్పులు ఆర్తనాదాలు మీకెప్పుడూ
శాంతి భద్రతల సమస్యే
ఇన్నేళ్ళు అధికారంలో ఉన్నోళ్ళు
పదవుల్లో కొనసాగుతున్నోళ్ళు
తెలంగాణాను తెగ నమ్మినోళ్ళే
తెలంగాణ కోసం గళమెత్తినప్పుడల్లా
లలిత గేయాల్ని తెగ్గోసినోళ్ళే...
తెలంగాణ వెనుకబాటుకు మేమే కారణమైనట్టు
మా కోసం. . . ప్రాణాలొకరు ప్యాకేజిలొకరిస్తామంటుంద్రు
నమ్ముతూ మోసపోతున్నాం కనుకే
తెలంగాణ పల్లెలన్నీ మీ వాగ్దానాల శిలాఫలకాలతో
ఎండిన బీళ్ళై. . . వల్లకాడు లౌతున్నయ్. ..
ఇక మీరొద్దూ మీ ప్రాణ త్యాగలసలే వద్దు. ..
మూడొందల యాభై మంది తెలంగాణ
అమరవీరుల అమరత్వం సాక్షిగా. . .
మా తెలంగాణను మేమేలుకుంటాం!!

# సుంకర రమేశ్

## రెండు వలసలు

వలస పోవడమంటే
విహార యాత్ర కాదు

నీ వలస
నా వలసా ఒకటి కాదు
ఇక్కడ
మనుషులు వలస వెళ్ళే దృశ్యాన్ని
జలదృశ్యాన్ని చూస్తున్నట్టు చూడలేం
గుండె గుండెంతా కన్నీటి బుగ్గ కావాలి

వస్తువులకు బ్రాండ్ నేమ్‌లున్నట్టే
జనాలకు వలస పేర్లున్నాయి
పాలమూరో వురో ఊరో కావచ్చు కానీ
తెలంగాణా మొత్తమే కదులుతున్న
కుంపటైంది
నిమ్మళం లేదు
సంబరం లేదు
తడిలేని నేలలో
పొడిబారిన చర్మాల్లో
సహజాతి, సహజమైన కాంతి పూయదు
నా నేలకు తడి కావాలి

నా మాటా నీ మటంతా గొప్పదే
పట్టుకుంటే కదా
తెలిసేది జీవం
ఎగతాళి ఎంతకాలం?
నా భాషకు గొంతు కావాలి
నా వలస

నా గడ్డ మీద నన్నే పరాయి వాణ్ణి చేసింది
ఒక్కో
అడుగు మోపుతూ
కేరింతలు వేస్తున్నావ్
వలస మార్కెట్లు వెలిగిపోతున్నాయ్
హోటల్లు, హోటల్లుగా రియల్ ఎస్టేట్లుగా
వైభవోపేతంగా చందనాలు చల్లుతున్నావ్!

ఎక్కడా నా పాట వినబడటం లేదు
గుండెలను తాకిన పాటెక్కడికి వెళ్ళింది
నా పాటెంత పరాయిదయింది
ఒంట్లో సలసలా కాగిన నా పాటను సమాధిచేస్తారా?
నా పాటకు మళ్ళీ ప్రాణం పోయాలి
తెలంగాణం కావాలి

# సి. హెచ్. ఆంజనేయులు

## ఊరు గావాలి మా ఊరుకావాలి

నిన్న రాత్రి కలలో కన్పించిన మావూరు ఎంత బాగుండేది
ఇపుడు మావూరు మా చిన్నప్పటంత గొప్పదికాదు
ఇపుడు మా ఊర్లో మేడలమీద మేడలైనయ్
మొగులును తాకేటట్లు మిద్దెలమీద మిద్దెలుగట్టింద్రు
గంజిలకు బోతే పెద్ద తీర్థంలెక్క ఉండేది
ఇప్పుడు చిన్నప్పటి నా దోస్త్ లెవ్వరు లేరు
అంతా చెట్టుకొక పక్షులోలె చెల్లాచెదురయిపోయింద్రు
ఊరుకాని ఊళ్ళకు, దేశంకాని దేశాలకు
పొట్టం చేత పట్టుకొని వలసపోయిన పక్షులోలె
దేశ సంచారులోలె సాగిపోయింద్రు

ఇప్పటి మావూరు పట్నం గాలిసోకి
కొత్త కొత్త షోకులతోని, కొత్త కొత్త పోకడలతోని
మా వూరి వెనుకటి నిశానేలేదు
ఒకప్పుడు అమ్మలాంటి ఆత్మతో అణవణువు
స్పర్శించి ప్రేమలు పంచేది

ఇపుడు పట్నం కంప్యూటర్ గాలిసోకి
టెక్కులదాని కండ్లకు మనుషులు కనబడతలేరు

ఇప్పుడు మావూరు జాడేమారింది

మా ఊర్లే నేను అడుగుబెడితే పొరుగూరోనిలెక్క
పరదేశోనోలె సూడబట్టిం
అందుకే నాకు నా చిన్నప్పటి ప్యార్ మోహబత్‌తోని
పలకరించే ఊరు గావాలి
నాచిన్నప్పటి మా ఊరు కావాలి

## పసుపుకత్తి

గోనెపెంకల సూరునుండి
చిన్ననాటి కనుగుడ్డొకటి రాలిపడుతున్నట్టు
ఒక్కో లోమూలుగు
ఒక్కో పుండుమొగ్గ
కొత్తగా పూచి మై చూసి
యాదేం. . .యాదేం. . .
నోరు మెదిపితే సాలు
సాలెగూడులాగ కంటిచుట్టూ
అల్లుకుపోతుంది గ్నాపకం
నాల్కెకింద నంజుబుడ్డ సలిపినట్టు
ఇసుర్రాయి కింద గింజను నలిపినట్టు
కడుపులో ఏదో పగిలినట్టు
ఏదో యాదికొచ్చి గుండెమొత్తం మెలితిరిగినట్టు
యాదేం. . . యాదేం . . .
ఇక మనసు మొత్తం
అమ్మ జేసిన కూరల్లోని
ఎలిగారం వాసన
ప్రేమ వాసన
సగమై పెగిలిన మాల్గాడికూత
కొడుకా. . . నా కొడుకా
తుమ్మలవాగు ఎర్రమల్లివాగు
కలగలపి. . . మన్ను గుక్కుకుని
గుడ్లెల వెట్టినయ్ కొడుకా. . .

ఎర్రమన్ను మోసీ మోసీ తట్ట
చెదల పాలయ్యింది
కుమ్మరి నీలమ్మ నవిశి నవిశి

కాటికెక్కింది
కడియాలకు పట్నం పాము సుట్టుకుంది
బొట్టునూ బట్టనూ కాటేసింది
కువార్కంతోని కాలం కుట్రజేసింది
ఏం బతుకయ్యిందిరా కొడుకా
మనమంతా బతికే ఉన్నామా
నీ దర్మంగ జెప్పు

నా బోన్‌గిరి బాలమ్మా
బాలాంజనా. . . ఆడబట్ల సాయిగా
దేవల్ బాలాజీ . . .
ఎక్కడున్నరమ్మా . . .ఎక్కడున్నరే. . .
మీ కెన్ని సెంట్లున్నయ్
ఎన్ని పంటలు మిగిలినయ్
ఎన్ని పండుగలు పాడువడ్డయ్
ఎక్కడున్నరమ్మా. . . ఎక్కడున్నరే. . .
అన్నీ వోయినంక మానమెందుకని
పానమెందుకని
ఎవ్వడో దీసేసిన సత్కలయి పోయింర్రా . . .
అంతట్నీ అమ్ముకొని
తలా ఒక దిక్కుకు జల్లుకున్నరా
మర్మానాలకు వోయింర్రా
పనికి రానోన్ననీ పైస కమాంచలేననీ
ఎప్పుడో ఒకప్పుడు పత్తి మందు తాగి
గోడదూకి పారిపోయేటోన్నేననీ
అగ్వకొచ్చినోన్ననీ
కవిత్వంలదప్ప దేంట్లోనూ వెన్నెముక లేనోన్ననీ
గోడలు దూకింర్రా . . .
మా కవిత్వం బతుకే ఇంత
స్మశాన లాహిరి

చితి బూడిదతో కట్టిన గుట్ట
ఎగిరే సముద్రం
పదమాడే వానపాము
రాత్రిని కామించే పెద్ద పిట్ట
చిందాడే లావా. . . అలావా
కవిత్వం. . .
అందర్నీ ప్రేమించి, అందర్నీ , అందరిచేతా. .
'థూ'
హౌలా వ్యవహారం
గజిబిజి గజిబిజి గజిబిజి
కాంతి. . .

ఏడికి వోయింర్రమ్మా. . . నా ఆడోల్లంతా
కల్వకు వోయింర్రా
కత్తులు నురుతాంర్రా
బోనాలెత్తు తుంర్రా. . .
రాళ్ళు కొడుతుంర్రా. . . రక్తాలమ్ముతుంర్రా. . .
పెద్ద గౌండ్లోడు మా బొమ్మగోని సామి ముందు
బత్కమ్మలై అల్లుకుపోతుంర్రా
ఆల్లకు ఏమయితే . . .ఏంది నాకు
నేనయితే . . . గట్టు దాటిన
మాటదప్పిన బరువు దించిన
దునియా. . నా. . దునియా
అంజనమేసి ఆయువు పట్టు జూసి
తియ్యగ కత్తి గుస్తదే నా దునియా

ఇక ఎవ్వంతోనేం ములాజ నాకు
ఎవ్వంతోనేం సోపతి ,
ఇక గ్నాపకమే గావాలె
గ్నాపకాల్లోని ముసురునే పట్టాలె
మిగిలిందొక్కటే లోకం

వెనుకబడ్డ లోకం
దాహపు లోకం దాహపు లోకం
చీకటి చింతల మోషపు లోకం
దరీదాపు లేని లోకం. . .
కులం నా కుత్కె
ప్రాంతం నా కడుపు
మెదడు లోని మతంల
జెండర్ జెన్‌లన్నీ
కలగలిపి దున్నినోడే. . . నోశిపుట్టినోడే. .
విశ్వ మానవుడు
సలాం కొడుకా సంకెర పుత్రా
నరా కుమారా
నవ్యజాతి చోరా

ఇమానం లేనోన్ననీ
సొదినా ఫాయిద లేదనీ
ఇడిశి పోతున్నార్రా. . .నన్ను. .
ఊళ్లోదలి . . .కొంపలొదిలి
నడిరాత్రి కురిసిన పిడుగుకు
గుడ్డిదయ్యింది పగిడికంటె
పర్రెవాశింది పాట
దీన్ని పెంచినోడు ఎవలు
ఈదినోడు ఎవలు
లోకమా నా లోకమా. . .
దీనికాలం పొడుగాను
దీని యాలి ముండ మొయ్య
తాళ్ళెక్కుతుంటనే . . . దీనికి మొక్కుకున్న
జారి. . . నా పెండ్లాం గుండెల జాపత్రినయ్యిన
కల్లు ముంతల కాడ
చీకినలమ్ముకుంటా. . .
దేహాన్ని తెరుచుకుంటూన్న

నా పెద్ద పెండ్లామే. . .
సమస్త లోక లోలకం
కువార్కం వొదిలిందా లేదా
కల వెలిసి పోయిందా లేదా
నేను మోసపోతందుకే బుట్టిన
మాటను నమ్మి
పెద్ద మనుషులని రానిచ్చినందుకే. . . .
రక్తం గక్కుకుంటున్న
జర్రున జారుతున్న
కనుతెరల ఊయల కాలి
పెద్ద గడపోడా. . . పెద్దబొట్టు దానా. . .
నవ్వుకుంటనే. . . పానం తీస్తరుగదనే. . .
బెల్లా వెంకమ్మా. . .
తియ్యగ మాట్లాడాలె . . . తియ్యగ బట్టలిప్పాలె
తియ్యగ కత్తి గుచ్చాలె
కతలున్నాయమ్మా. . . కతలున్నాయి
పెరుగన్నంలో పురుగల మందు కలిపింర్రు
మంచిగ మాట్లాడుకుంటనే ఆనకట్ట మలిపింర్రు
బొట్టు పెట్టి పిలిశి కుత్కె పిశికింర్రు
అంకెల గుట్టు ఎవనికి తెలుసు
తేనెల్ల ముంచిన మాటలు
రియలెస్టేట్ గువ్వలు
విహారాలు . . . విహారాలు. . .
ఏడికి వోయింర్రమ్మా. . . నా ఆడోల్లంతా
పిలగాల్లంతా. . .
ఇప్పుడెవని గురించి వెతకాలె
కవిత్వమే దిక్కు నాకు

సీంబాసయ్య సీంబాసయ్య
నువ్వు కంపినోనికి చేసిందంతా. . .
డొల్ల సీంబాసయ్య

కంపినోడు లేదు . . . వాని సిటీ లేదు
అందరూ తోకవీకింఱ్రు
నాయనా. . .దండాలే నీకు
నీ బొమ్మగోనోడు లేదు బీగూడ పోట లేటు
బీగూడ పోట లేదు లంబోడు లేదు
అవుషపూరోడు లేదు సోమారపోడు లేదు
గట్కేసారంల కంపెని లేదు
భూమ్మీదెక్కడా కంపెనీ లేదు
గడియాల్ ముల్లుతో సబ్బల్ గుచ్చింఱ్రు
ఒక్కొక్క దీపమే
ఇండ్లల్ల మన్ను వడ్డట్టు
ఒక్కొక్క కంపెనీ కండ్లు మూసుకుంటుంది
ఎవ్వని కెవలు తంఱ్రీ మిగిలున్నరు
తాడు తెంపుకోలేనోడే
పసుపుకత్తై వేలాడుతున్నాడు
పోతురాజుకు
పసుపుకత్తై వేలాడుతున్నాడు
గాలిల . . . గానంల
సఱ్రున పొద్దున్నడు
– – –

"బారెడు మబ్బులతోని
జారెడు మెరుపలతోని
గణగణమని కురవాలె వాన. . .
ఎటువంటి వాననుకున్నలో ఏమో
నిజమయిన వాన
ఇక్కడ్నే మొదలయ్యి
ఇక్కడ్నే అంతమయ్యే వాన
ఇక్కడ నదులల్లనే కురిసి
ఇక్కడి బాయిలల్లనే నిద్రపోయెడి
వానన్నమాట

వాసన రాని మురిగిపోని పాశిపోని
వానన్న మాట
ఈనె గుండ్ల మీద అడవుల్ని స్థలించె. .   వాన
దక్కలి పెంటమ్మనీ మాద్గె పోశక్కనీ
బెస్తంజమ్మనీ. . .
మాటలతో ముంచి తానం జేయించే వాన
వాన . . .పెద్నాయేనా వాన
నీలగిరి రాయిలా. . .కరిగిపోయేటి వాన
తంగేడు పువ్వోలె. . .
కాంతిలాగ పరచుకునేటి వాన
చీకట్ని తెంపి దరువుల్తో ముంచి
పిండాలు మొలిచేవాన
గండాలను తుడిచేవాన
పసుపుకత్తయ్యి నరికి పారేసే వాన
ఏదైనా. . . ఏమైనా
వానగావాలె వానగావాలె
అసలు ఎవ్వని వాన
వానికే గావాలె.

## సీతారాం

# భౌగోళిక భవిత - కొన్ని రాజకీయ ఆకాంక్షలు

శ్రీ బాగ్ నుంచి బషీర్‌బాగ్ దాకా
ముక్కోటి
షట్కోటి
ఒక్కోటి
ఒక్కొక్కటీ
మాకేం మిగిలింది

అవ్వలంతా జొన్నలు దంచిన్రు
అమ్మలంతా సజ్జలు కొట్టింండ్రు
అన్నలంతా పరిగలేరిన్రు
అయ్యలంతా పురుగుల మందు తాగబట్టింండ్రు
పెద్ద మనుషులు మీరు

మోదుగాకులేరి ఇస్తళ్ళు కుట్టిన
అంతమ్మ లేదు ఇప్పుడు
మా ఊళ్ళపేర్లు జూడు ఎట్లున్నయో

గొల్లగూడెం
ఏదులాపురం
కైకొండాగూడెం
బారుగూడెం
మీ ఊర్లు జూడుండ్రి ఎట్లున్నయో

గుడివాడ
విజయవాడ
కాకినాడ
ఇగ జెప్పు నువ్

## భౌ. భ - కొ.రా.ఆ.

నేను రెండు నాల్కలోడ్ని
కొంత ఆంధ్రం
ఇంకొంత తెలంగాణాం
రెండు ప్రాంతాలోడ్ని నేను
కాసేపు అటుంట
కాసేపు ఇటుంట
నా జిల్లాకు
రెండు రాజధాను లివ్వండి
లేదా
నా జిల్లానే
ప్రత్యేక రాష్ట్రం జేయండి

## భౌ. భ - కొ.రా.ఆ.

నిన్న పయిటేల
మొన్న ఎసళ్ళేల
నా కొక కలొచ్చింది.
ఆ కలలో నేనిట్లా మాట్లాడుతున్నాను ;
1310 ఫస్లీ ప్రకారం
610 జీవో ప్రకారం
ముల్కీ నిబంధనల ప్రకారం
కాకతీయ తోరణం సాక్షిగా
సమ్మక్క - సారక్క జాతర్లో
నేనిలా అంటున్నాను
"వలస నక్కకు రాచరికంబు దక్కునే"

**భౌ. భ - కొ.రా.ఆ.**

గుంటూరు మిర్చి
నూజివీడు రసాలు
ఉభయ గోదావరులు
తెలంగాణా కన్నీళులు

## భౌ. భ - కొ.రా.ఆ.

నిజం

నిజం కాదు

నిజాం

విశాలాంధ్ర కాదు

విశాలోంధ్ర పెట్టినా

ఇది నాది

ఇది మాది

ఇదే మాది

ఇదే మాదిరి

స్కైబాబ

# కాలీ చుమ్టీ

ఆ
ఛోటా బడా ఖిలోనాల్లో ఖిలోనానై
రంగుల్ రంగుల బుగ్గల్లో బుగ్గనై. . .
నా చిన్ని చేతిల్నుంచి -
అమ్మీ బుర్ఖా అంచు జారిపోయి. . .
ఘుండీ నుంచి తెగిన ఓ బుగ్గ లేచింది గాల్లోకి. . .
- - -
'భర్దొఝోలి భర్దొఝోలీ భర్దొఝోలీ
మేరీ యా మొహమ్మదూ
లౌట్‌కర్ మైఁ నా జావూంగా ఖాళీ'. . .
ఖవాలీ రికార్డుల ఓలలాటల్లోంచి
మర్ఫా మోత - తాషా ఉత్తుంగ తరంగ హోరు
'అగో - గంధ మొస్తున్నది' - సందల్ సందడి. . .
జనం వరద అలల్లెక్క పొంగుతూ
వెనక్కి నెట్టుకుంట లారీ కరకట్టలు
నన్నెత్తుకున్న మా మొఖ్తార్‌మామ ఈదుకుపోతూ
సందల్ ముట్టుకొని కళ్ళకద్దుకున్న
నా ముఖం చమ్కిన యాద్. . .
రాతిరి ఖవ్వాలీ జాగారం..
పహాడ్‌కా దామన్ - పెంగ్విన్ చుడియోఁకె బీచ్. . .
పహ్‌లా కమాన్‌కాడి మెట్టుని మొక్కి
కన్పించని అల్లాలెక్క కన్పించే ఫకీరు
కష్కోల్ ఘల్‌మనిపించి
మోర్చల్ కట్ట దుఆ - కంతలకు ఊది తోడ్కొని
అట్లా పైకి చూస్తే
నల్లనల్లని గుట్టకు సున్నం కొట్టిన బాటేసినట్లు -
కొత్త పతంగానికి

అతికించిన తోకలా మెట్లు!
ఫకీర్లను పలకరిస్తూ బరువు తగ్గే లాల్చీ జేబు
ఉరికురికి మెట్లుక్కుతూ అలుపొచ్చి ఆగి
వెనక్కి తిర్గితే
ఆ పర్వతమే నేనై భూగోళం మీద
కాలుమోపిన అనుభూతి
పై కెక్కేకొద్ది చిన్నవవుతూ గుట్టచుట్టూ బొమ్మరిళ్ళు
ఖిలోనే నన్నే ముస్వేసే. . .
ముతక గుడ్డలోల్లూ గడ్డాలు బుర్ఖాలూ
గట్టమెట్లెంట నల్లచీమల బారు. . .!
వో దేఖో. .
ఝండా ఎత్తుకు పై కురకుతున్న బచ్‌పనా
ఎర్రని కుచ్చు - హరా త్రికోణం
మజ్లిల మెరుస్తో చాంద్ సితారా. . .
అమ్మీ పిలుస్తున్నది - యాడ పడతనోనని
చాంద్ మా అమ్మీ! నేనే సితారా. . .
తెల్లని షేర్వానీ - ఆకుపచ్చ తలపాగా
దర్పంగా నిలబడి చూస్తుంటది దర్గా!
గుడి అంటని
ఇక్కడి మట్టిబిడ్డల కాడికే
నడిచొచ్చిన దేవుళ్ళు సూఫీలు!
చుట్టూ మూడుసార్లు తిరిగి
లోపల ఫాతెహా లిప్పిచ్చుకొని
మోకాళ్ళపై కూర్చొని మజార్‌పై తల ఆన్చితే
ఓహ్. . .
పూల చాదర్ల ప్రాణవాయువు
లేస్తే కమ్మటి వాసనతో ఊద్
సుదుల్లోంచి బైటనె నిలబడ్డ అమ్మీ రూపం. . . .
పరేశాన్లన్ని దూరమైతే
ఝండా ఎక్కించి న్యాజ్ చేస్తనని

మన్నత్ చేసిందంట భోలీ అమ్మీ!
ఆఖరిసారి ఎక్కించిన ఆకుపచ్చ ఝండా
చీకిపోయింది మా అమ్మీ కలలాగే. . .
ఖరాబై ఎంతకూ పాడని సిటీ - అబ్బాజాన్
బల్లెపీట మీద నడుపుతుంటె విరిగే
జీపుగిల్ల - ఛోటాభాయ్
గోడకు తగలకుండనె రబ్బర్‌దారం తెగిన
లాయిలప్ప - బహెన్
జిందెగీ పిచ్చిబంతాటలో పగిలిన చెండు
- బడే భయ్యా
- - -
గాల్లోకి లేచిన కలలబుగ్గ ఫట్‌మని పగిలింది
ఝట్‌న మళ్ళా బుర్ఖా పట్టుకొని తిరుగుతుంటే
ఆశ్చర్యంగా చూసిన ఆ రెండు చందమామల్లోకి
అనుమానంగా చూస్తూ నా చిట్టి నీలాలు
కౌన్ హై బాబా తుమ్?
నఖాబ్ తొలగిన ప్రశ్నకు
నా బుడ్డ అభిమానం దెబ్బతిని
గిరుక్కున వెనుతిరిగి చూస్తే
అన్నన్ని బుర్ఖాల్లో మా అమ్మీ బుర్ఖా ఏదీ. . .?

## ఎల్లొస్త బిడ్డా!

గీకాలం పాడుగాను
మా ఊల్లనే వానగొట్టి సావదు.
నా చెల్కల ఏస్కొన్న పత్తికాయలు
ఇక ఇక నవ్వుతాండె నా ఎర్రితనాన్ని జూసి,
చెల్క మొత్తంల నాల్గైదు పూచుంటై
ఎక్కడి మొయిలో దాన్నోట్ల మన్నుబడ
యాలగాని యాల నా చేండ్ల నీల్లు జిల్కరించిపోతది -
అవ్వెక్కడి చెయ్యిలో ఇర్గిపోనూ
నా పెయంత పుండు పుండు జేసి సంపుతై -
మా బాయి ఎండి పోయింది.
రోడు పక్కనున్న డబ్బదుకాన్ల
'ప్రిడ్జు' కొక్కాకోలలతోటి నిండిపోయింది.
మా గోలెంనిండ నీల్లెప్పుడు చూల్లే
నా లచ్చి కండ్లల్ల నీల్లెప్పుడు ఆగలే.
టీవీల చూపెట్టే తిండ్లు జూస్తే నోరూరిసత్తది.
నా పోరగాండ్ల కడ్పులు సూత్తె, కడుపు తరుక్కుపోతది -
నా 'లచ్చిమి'!
ఎన్ని ఊసులు, ఎన్ని బాసలు చేస్కొన్నమే!!
నువ్వు మలమలమాడి సత్తాంటే
ఇగ నాకు కాపిస్కెడు నీల్లు సయించవు.
చెల్కనించి నేనొచ్చినంకనే
కడుపునిండ తిన్నంకనే
మిగిలింది గింతంత దిని
పానంగ బెంచుకున్న మా అవ్వక్కాడ
నాల్గు మెతుకులు బెడ్తలేకపోతినీ
నా బతుకుజెడ
నాయినా!

నువ్వెందుకు ఉరిబోస్కోని సచ్చినవో
గిప్పుడు సమజైతాందే -
నా కొడుకా, తండ్రీ!
అవ్వ జాగర్త, చెల్లె జాగర్త!
ఎవ్వలితోటి లొల్లిబెట్టుకోకు నాయినా!
నన్ను ఎండ్రీన్ డబ్బబిల్తాంది
నన్ను మీ అయ్య బిల్తాండు బిడ్డా! నన్ను క్షమించు కిట్టన్న!!
ఎల్లొస్త బిడ్డా!
ఏడ్వకు బిడ్డా!

## హనీఫ్

# వందేళ్ళు వెంటాడే జ్ఞాపకం

మేమెవరమో గుర్తుండకపోవచ్చు,
నెత్తురోడుతున్న నీ కళ్ళకు
ఈ గాయం గుర్తుండే ఉంటుంది.
మా అచూకి కోసం
పులిగుహలాంటి నోరు
ఎన్నిసార్లు ప్రశ్నించి ఉంటుందో. .!?
నీ తుపాకీ తుళ్ళింతకు రాలే పువ్వుకాదు ఆశయం
మేము అతిబాధాకరమైన నొప్పులవల్ల
లెక్కపెట్టడం మర్చి పోయివుంటాం.
నువ్వు నా పల్లెపై దాడి చేసినప్పుడు
చితికేసిన మా భవిష్యత్తుని, కాల్చేసిన కొంపల్ని
నేలపాలయిన అన్నం, కూర కుండల్ని
నాకిపోయిన కుక్క సాక్ష్యం ఇస్తుంది!
ఆకలి తీరని మా కొడుకులు, కూతుళ్ళు
మల మల మాడిన వాళ్ళ పేగులు
ఆకలి త్రేన్పుల తోటి సాక్షమిస్తాయి
నీ కరుకు బూట్లు మెత్తటి భూమిగుండెల్ని త్రొక్కిన సంఘటనల్ని
కఫన్ నెత్తికి చుట్టుకున్న మా పల్లెలు
నీ రాక్షస చేతులనుండి
తప్పించుకోపోయే ప్రయత్నంలో జారవిడిచిన పసికూనల్ని
నువ్వెంత నిర్దయగా తొక్కేశావో మేమెట్లా మర్చిపోతాం.
నువ్వు మరుక్షణంలోనే మర్చిపోవచ్చు.
కానీ – !
నీ మొఖం మాకు వందేళ్ళవరకు గుర్తుండిపోతుంది.
చలి నీళ్ళలో బరిబాతగా పడుకోబెట్టి
మా నుదుళ్ళపై చెమటలు పారించిన నీ చిత్రహింస,
సొలసిన లాఠీ మర్చిపోయివుండవచ్చు

పగిలిన పాదాలు గాయాల్ని మరిచి ఎలా నడుస్తాయి చెప్పు
నియంతలచేత సెహబాష్ అన్పించుకోవాలనే తపన
మా మొఖాలమీద ఉమ్మినప్పుడల్లా కన్పించింది
మాలో మండుతున్న చైతన్యం నెగళ్ళపై నిఘా
వేకువని మా జీవితాల్లోకి ఆహ్వానిస్తున్నాయనేనా. . ?
పైర్లు ఫలాల్నివ్వక ఏం చేస్తాయి చెప్పు
తల్లి స్తన్యం పంచక విషాన్నెట్లా చిమ్ముతుంది చెప్పు
అరణ్యం రహస్యంగా మండక గుండెనెలా విచ్చుతుంది చెప్పు
చివరికి నీ కుర్చీని పదిల పర్చుకోవాలని చూస్తావో. . .
మేం మా స్వేచ్ఛని మా హక్కుల్నీ. . .!

భోంచేస్తున్న మోచేతికి సంకెళ్ళు వేలాడదీసే వుంటాయ్
నిద్రిస్తున్న కనురెప్పలపై లాఠీ కవాతు చేస్తుంది
విన్పిస్తున్నాయో లేవో -
మా గొంతుల మీద తెగుతున్న మెత్తటి చురకత్తుల ప్రవాహం
మా ఆకాశం అంచుల మీద సంకెళ్ళ చిత్రాలు పంపిస్తుంటావు
మేం చెరిపేస్తున్న కొద్దీ
ఇక్కడ నిత్యం
జింకను పులి వేటాడుతున్న దృశ్యం ప్రతి చౌరస్తాలో ప్రదర్శిస్తుంటావు
భయం రక్తనాళాల్లో ఇంకి ప్రవహించేలా - !!
మేం భూమి పొరల్లోకి చొచ్చుకొని పోయి కుతకుతావుడికి
బొగ్గుపెళ్ళలమై బైటికి వస్తాం
ఎండల్లో ఎండి మా దేహం జిట్రేకులా శావతేలి.
నోళ్ళుగంటలు చేసి, కళ్ళు దివిటీల్లా వెలిగించి
ధాన్యరాశుల మౌతాం!
మా రక్తం చిందకుండా ఏ పరిశ్రమ శ్వాసిస్తుందో చూడు
అయినా నీకు మనుషుల్లా కనిపించడం లేదు కదా!
పులిలానో, కరగని చీకటి విద్రోహపు కత్తిలానో చిత్రిస్తావు.
యంత్రంలా అజమాయిషీ చలాయిస్తుంటావు
లాఠీవై, తూటావై విజృంభిస్తుంటావు
నిలబడనీయవు, నిద్రించనీయవూ -
జింకాపులి ఆట ఇద్దరి మధ్య సాగుతూనే వుంటుంది.
నీ కదలికల్తో -
భూకంపంలో కూలి క్షతగాత్రమౌతుంది ఇల్లు
తుఫానులో నేలకూలిన పూలవనమైపోతుంది
ఊరువూరంతా క్రూరకౌగిలిలో నలిగిన జ్ఞాపకాలు వెంటాడు తుంటాయి.
నువ్వు కాలూనిన ప్రతిచోట తుప్పు పట్టిన ఇనుప డెక్కల మరకలే
తెలంగాణా ఏనుగులు తొక్కేసిన పంటచేనైపోతుంది.
ఎప్పటికీ తేరుకోని కలవరింతల భయం కౌగిట్లో మా పసిపిల్లలు
తాళ్ళుతెంచుకుని పారిపోయిన కోడెదూడల, కుక్కపిల్లల జాడలేదు.

ఊళ్ళన్ని భయం చూరుకు వేలాడు తుంటాయి.
మా కదలికను విద్రోహంగా ముద్రించేపుడు మేం ఆరాధిస్తున్న భూమిని
స్పర్శించు.
మేం ప్రేమిస్తున్న పంటల్ని, నిత్యం తింటున్న అంబలినీ – రుచిచూడు
మేం ఏ విద్రోహ శక్తుల్ని శ్వాసిస్తున్నామో, చేరదీస్తున్నామో. . !
తోటి మనిషి ప్రేమించడం నేరం కాదు కదా?
స్వేచ్ఛగా మనిషిలా బ్రతకడం నేరం కాకూడదు మరి!

# ఇక ఊరు నిదురపోదు!

పందుల బెడద నుంచి పంటల్ని కాపాడడం కోసం
మంచెల మీద వెలుగుతున్న నెగళ్ళలా మేం మేల్కొనే ఉంటాం!
కంచంలో అన్నం వడ్డించిన తల్లులు బిడ్డల కోసం
ఎన్నెన్ని రాత్రులు నిద్రకు వెలి అవుతున్నారో – ?
మనం నిద్రిస్తున్న కొద్దీ తరగదీ రాత్రి
నడుస్తూనే నిద్ర నటిస్తుంటాం.
చలిలేదు కానీ
ఇనుపదుప్పట్లో తలదాచుకుంటున్నాం.
నీళ్ళు లేక కాదు కానీ,
నాలుకలు తడారి ఎండిన నూతులవుతున్నాం.
ఊరు పొలిమేరల్లో దుమ్ములేస్తే –
మేం భయంతో కొంకర్లు తిరిగి పోతుంటాం.
తుఫాను విచ్చల విడిగా వీచి మళ్ళీ వస్తానని వెళ్తుంది.
ఊరు, దేగలు తరిమిన పిల్లలకోడై పోతుంది.
దేగలు తన్నుకుపోయిన కూతకువస్తున్న కోడిపిల్లలు,
చెట్లను పెనవేసుకొని అనాధశవాలౌతున్నాయి.
కోళ్ళ కాళ్ళకు గోళ్ళున్నాయని చెప్పనంతకాలం
దేగలు మళ్ళీ దాడి చేస్తూనే వుంటాయి.
ఇనుప దుప్పటి ఇప్పుడిప్పుడే చిరుగులు పడుతోంది.
దేగలకి నిరసనగా వేయికోళ్ళు ఊరేగింపు తీశాయి.
ప్రదర్శన బండెడ్ల మెడలోని గంటల్లా మోగుతూనే వుంటుంది.

